శ్రీనాథభట్టకృతి

# పల్నాటివీరచరిత్ర.

పాఠనిర్ణేతృరచితమైన ద్వితీయభూమిక,
వీరచరిత్రకథాసారం, వీరచరిత్రేతి
హాసం, శ్రీనాథజీవితసంగ్రహం
గచ్ఛదావ్యాఖ్య గలది.

పాఠనిర్ణేత
పండిత శ్రీఉమాకాన్త విద్యాశేఖరులు.

చెన్నపురి:
శ్రీరామ ముద్రాక్షరశాలయందు
ముద్రితం.
క॥ శ॥ 5040.
వెల రు. 2-8-0

ఓం పరమాత్మనే నమః.

కథాశేషులు శ్రీకొవ్వూరి చంద్రారెడ్డి

,, శ్రీకొమర్రాజు లక్ష్మణరావు, యం. ఏ.

,, శ్రీవైద్యరత్నపండిత డి. గోపాలాచార్యులు.

,, శ్రీదివాన్‌బహద్దర్ నెమలి పట్టాభిరామరావు, B. A.

,, ధర్మనిర్ణేత (హైకోర్టుజడ్జీ) శ్రీ టి. వి. శేషగిరి అయ్యరు

వార్లు దేశభాషల్లో విజ్ఞానవర్ధనం విషయమై వహించిన అభిరతిని ఆరా-
ధించడానికి గుర్తుగా ఈకృతిని వారికి సమర్పిస్తున్నాను.

**To**

# THE SACRED MEMORY OF THE DEPARTED SOULS

**of**

SRI KOVVŪRI CANDRĀ REDDI VĀRU,

SRI VYDYA RATNA PANDIT D. GOPĀLĀCĀRYULU ,,

SRI KOMĀRRAJU LAKṢMAṆA RAO ,, M.A.,

SRI DĒWAN BAHADUR NEMALI PATTĀBHI RĀMA RAO ,, B. A.,

SRI JUSTICE T. V. SEṢAGIRI IYER AVL.,

As a token of reverence for their love of the advancement of culture and learning in the Vernaculars.

# అధికారినిరూపణం.

---

కాళిదాసాదుల ఉత్తమకావ్యాలు పఠించి, శాస్త్రపరిచయం, సాహిత్యవిచారణలో ఆవశ్యకప్రజ్ఞ, మహాపురుషారాధనతత్పరత్వం కలిగి ఇతిహాస జిజ్ఞాసువులైనవారు ఈకృతిశ్రవణమందు పూర్ణాధికారులు. తక్కినవారికి ఉపదేశాన్ని అనుసరించి బోధోపలబ్ధి. కేవలం వినోదంకోసం వినేవారు అధమాధికారులు.

# ద్వితీయభూమికలోని సఙ్కేతాక్షరవివరణం.

---

अ = अर्थशास्त्रम्

अष्टा = अष्टाध्यायी

अ = अहोबलपण्डितीयम्

ఆ = ఆదిపర్వం

ఆం = ఆంధ్రకవులచరిత్ర

ఆం. చ = ఆంధ్రులచరిత్ర

ఆ. మ = ఆనందముద్రాలయమను చరిత్ర

उत्तर = उत्तररामचरितम्

ऋ = ऋग्वेदः

ऋ. भा = ऋग्वेदभाष्यम्

ए. ब्रा = एतरेयब्राह्मणम्

క. జీ = కవిజీవితములు

का = काव्यप्रकाशः

का. पू = कादम्बरीपूर्वभागः

का. प्र. व्या = काव्यप्रकाशव्याख्या

కా. ఖ = కాశీఖండం

కృ. వి = కృష్ణరాయవిజయం

का. वि = कामकलाविलासः

కా. చూ = కావ్యాలంకార చూడామణి

कु. त = कुलार्णवतन्त्रम्

క్రీ. రా = క్రీడాభిరామం

क. रा = कलियुगराजवृत्तान्तः

का = कादम्बरी

कथा = कथासरित्सागरः

गी = गीता

च. व्या = चम्पूरामायणव्याख्या

ज. व्या = जयमङ्गलव्याख्या

J. A. O. S = Journal of the American Oriental Society.

त = तन्त्रवार्तिकम्

తి. భా. వి = తిక్కనభారతంలో విరాట పర్వం

तै = तैत्तिरीयब्राह्मणम्

ध्व = ध्वन्यालोकः

ద్రావి = ద్రావిడభాషలు

दश = दशरूपकम्

नै = नैषधीयचरितम्

ని = నిరంకుశోపాఖ్యానం

नागा = नागानन्दम्

प्र. च = प्रबोधचन्द्रोदयम्

प्र. य = प्रतापरुद्रयशोभूषणम्

प्र. बो. च. व्या = प्रबोधचन्द्रोदयव्याख्या

प्र. सा = प्रपञ्चसारतन्त्रम्

పా. జా = పారిజాతాపహరణం

पञ्च = पञ्चदशी

బా. సూ. ప్ర = బాలవ్యాకరణ సూత్రార్థ ప్రకాశిక

भ = भट्टभास्करभाष्यम्

भ. त्रि = भर्तृहरित्रिशती

भा. प्र = भवप्रकाशः

माल = मालविकाग्निमित्रम्

मधु. वि = मधुराविजयम्

మ. చ = మనుచరిత్ర

म. व = महाभारते वनपर्व

म. उ = महाभारते उद्योगपर्व

म = मनुस्मृतिः

महा = महाभाष्यम्

मेघ = मेघदूतम्

म. स = महाभारते सभापर्व

म. वि = महाभारते विष्णुसहस्रनामस्तोत्रम्

मू = मूकपञ्चशती

मालती = मालतीमाधवम्

रत्ना = रत्नावळी

रा. कि = रामायणे किष्किन्धाकाण्डम्

रघु = रघुवंशम्

रा. बा = रामायणे बालकाण्डम्

रा. यु = रामायणे युद्धकाण्डम्

ल. स = ललितासहस्रनामस्तोत्रम्

వ. చ = వసుచరిత్ర

वा. का = वत्स्यायनकामसूत्रम्

వై. వి = వైజయంతీ విలాసం

वै. सि. म = वैयाकरणसिद्धान्तमञ्जूषा

विक्र = विक्रमाङ्कदेवचरितम्

शु = शुक्रनीतिः

शु. य = शुक्लयजुर्वेदः

श. ब्रा = शतपथब्राह्मणम्

श्री. भा = श्रीभागवतम्

श्री. गु = श्रीगुणरत्नकोशः

श्री. भा. न = श्रीभागवते नवमस्कन्धः

సభా = సభాపర్వం

సం. లో = సంస్కృత లోకోక్తులు

सा = साहित्यदर्पणम्

सौ = सौन्दर्यलहरी

हर्ष. च / ह. = हर्षचरित्रम्

ప్ర కా శ కు లు.

వాఙ్మయసమితి.

గుత్తికొండ

పిడుగురాళ్లపోస్టు, గుంటూరుజిల్లా.

(క॥ శ॥ 5040)

రెండవఆవృత్తి. 1500 ప్రతులు.

# బాలచంద్రయుద్ధమునందలి పాత్రలు.



అనుగురాజు:—చేది దేశంనుండి పల్నాటికివచ్చిన రాజు.

అన్నమ్మ:—బాలచంద్రుడి బొంగరాలాటచూడబోయిన వైశ్యభామిని.

అలరాజు:—కొమ్మరాజు కుమారుడు.

ఐతాంబ:—బ్రహ్మనాయుడి భార్య, బాలచంద్రుడి తల్లి.

కన్నమదాసు:—బ్రహ్మనాయుడివరమున పెమ్మసానికి పుట్టినవాడు.

కొమ్మరాజు:—మలిదేవరాజు మరది.

గండుకన్నమనీఁడు:—బాలచంద్రుడి మామ.

తెప్పలినాయుఁడు:—మలిదేవరాజుయోధులలో ఒకడు.

నలగామరాజు:—అనుగురాజుకు మైలమాదేవియందు పుట్టినవాడు.

నరసింగరాజు:—నలగామరాజు సోదరుడు.

నాయకురాలు:—నలగామరాజు మంత్రిణి.

పినమలిదేవరాజు:—మలిదేవరాజు సోదరుడు.

పెమ్మసాని:—తెప్పలినాయుడి భార్య.

బాలమలిదేవుఁడు:—మలిదేవరాజు సోదరుడు

బాదన్న:—బ్రహ్మనాయుడి అన్న.

బాలచంద్రుఁడు:—బ్రహ్మనాయుడి కుమారుడు.

బ్రహ్మనాయుఁడు:—మలిదేవరాజు మంత్రి.

మలిదేవరాజు:—అనుగురాజుకు వీరవిజ్జలదేవియందు జనించినకుమారుడు.

మాంచాల:—బాలచంద్రుడి భార్య.

మాడచి:—మలిదేవరాజుయొక్క రాణివాసం కాపాడే యువతి.

రేఖాంబ:—మాంచాలతల్లి; బాలచంద్రుడి అత్త.

వెంకు:—నలగామరాజు సైనికులలో ఒకడు.

శీలాంబ:—బ్రహ్మనాయుడి తల్లి; దొడ్డనాయుడి భార్య.

శ్యామాంగి:—బాలచంద్రుడి వేశ్య.

| | |
|---|---|
| అనపోతు<br>వెలమలదోర్నీడు<br>చాకలచందు<br>మంగలమల్లు<br>కమ్మరపట్టి<br>కుమ్మరపట్టి<br>కంసాలచందు | బాలచంద్రుడియెడల సోదరభావంకలవారు |
| వెలమనాయుడు<br>మలినీడు<br>పినమలినీడు<br>గోపినాయుడు | మలిదేవరాజు సేనలోనివారు |
| కొండమన్నెమరాజు<br>కోటకేతుడు<br>మాడుగుల వీరారెడ్డి<br>చింతపల్లిరెడ్డి | నలగామరాజు ఆప్తులు. |
| ఆవాలనాయుడు<br>సుంకరరాముడు<br>చెవులనాయకులు<br>జంగిలినాయకులు<br>పెనుమాలవారు<br>సంపెట నారన్న | మలిదేవరాజు యోధులు. |

---

# విషయసూచిక.

ओ३म्.

परमात्मने नमः.

# వీరచరిత్ర ద్వితీయభూమిక.

1. धर्मस्य स्थितये त्याग मपि सर्वस्य कुर्वतः ।
   महावीरस्य तेजांसि वसेयुः पुरतो मम ॥

2. పద్మ, వాణి, మహీధరాత్మజ,
   అని నుతింతురు విబుధులెవ్వరి
   ఆజగచ్చైతన్యదాయిని
   చరణములకు నమస్కృతి.

3. రోహిత ప్రహ్లాదముఖ్యులు
   బాలవీరులు తొల్లి తా నని
   బాలు డాలోకించు వీరుల
   వృత్తిధార గణించెదన్.

4. కామభూపాలసుత, అనపోతుభార్య,
   దుర్గిలక్ష్మి, సతీధర్మమహిమములను
   వ్యక్తమొనరించినట్టి పల్నాటిసీమ
   పుణ్యభూముల వెలుగు వర్ధిల్లుగాక.

5. కావ్యపరీక్షా ప్రజ్ఞావంతుల
   దండి వర్ధనుని అభినవగుప్తుని
   రాజశేఖరుని మమ్మటాద్యులను
   తద్వచోఽర్థబలసిద్ధికి తలతున్.

6. మదినినిల్పి ప్రతాపరుద్రీయకర్త,
   సూరి, వేముల, సింగు, నాదెండ్ల గోపు,
   పేరుభట్టాత్మజుని, పురావిదులనెంచి,
   కూర్తు భూమిక వీరచారిత్రమునకు.

ఇక ఈ వీరచరిత్రను నేను మొదట 25 సంవత్సరాలక్రిందట ప్రకటించాను దీనికి. నాలుగుగ్రంథాలు నాకు లభించినవి. ఒకటి కథాశేషులైన శ్రీఅక్కిరాజు శంకరనారాయణవారు నైజాంనుండి తెప్పించి యిచ్చినది. రెండవది క. శే. శ్రీ జానపాటి వేంకటఅప్పయ్యవారివల్ల లభించినది. మూడవది క. శే. శ్రీ పిడుగు వీరభద్రఅయ్యవారిచ్చినది. వీరు వీరమతపీఠానికి ఆచార్యులు. నాల్గవది క. శే. చల్లగుండ్ల పిచ్చయ్యవారు వ్రాయించి పంపినది. వీట్లో బాలచంద్రయుద్ధం నైజాంగ్రంథంలో మాత్రమే సమగ్రంగా వున్నది. తక్కినవి కథాంశాలు గ్రహించడానికి తోడ్పడ్డవి.

## మార్పులు.

మొదటిసారి ముద్రితమైన పల్నాటివీరచరిత్రలోవున్న అరసున్నాలు, బండిరాలు, భాషాప్రవాహంలో లేని అనావశ్యక గజడదబసలు మొదలైనవి, నేను చేర్చినవేను. ఇవి మూలగ్రంథంలో లేవు. ఇవి లేకుంటే తెలుగుగ్రంథం కాదనుకొనేదశలో ఛాందసమార్గాన్ని అనుసరించి వాటిని చేర్చాను. ఈ అకార్యానికి ప్రాయశ్చిత్తరూపంగా వాటి నిప్పుడు తొలగించాను. మొదటిపీఠికలోను, వ్యాఖ్యలోను, పూర్తిచేసిన పజ్క్తుల్లోను, అప్పటి అరసున్నాలు మొదలైనవి నావి గనుక వాటిని అట్లానే వుంచాను.

## వీరకాలనిర్ణయం.

నేను చేసిన వీరకాలనిర్ణయమే పిమ్మటివారు గ్రహిస్తూ వచ్చారు. ఈవిషయంలో చేయదగిన మార్పేమీ లేదని అనుకొంటున్నాను. మొదటిపీఠికలో నేను ఉదాహరించిన హైహయసంబంధి సంస్కృతశాసనాలు ఇండియన్ ఆంటిక్వెరి పత్రికలోనివి. మాచెర్ల కారెంపూడి శాసనాలు బెజవాడ దుర్గామల్లేశ్వరస్వామి ఆలయంలోని శాసనం నేను స్వయంగా చూచి వ్రాసుకొన్నవి. తక్కిన వస్తి సూయల్ పట్టికనుండి, తాళపత్రపుస్తకాలయంలోని శాసనసంచయం నుండి, తీసుకొన్నాను. అక్కడక్కడ నేను తెలిపిన స్థలనిర్దేశాదులు

సూయల్ పట్టికనుండి, చోళచాళుక్యరాజ్యపరిపాలనాబ్దాలు సూయల్ పట్టికనుండి ఆధునికేతిహాసగ్రంథాలనుండి స్వీకరించాను.

## శ్రీనాథుడిదేశం.

శ్రీనాథుడు కర్ణాటుడు. శ్రీనాథుడు కర్ణాటదేశస్థుడని నేను సకారణంగా ప్రథమపీఠికలో విశదపరచాను. అప్పటినుండి దానికి శ్రీ చిలుకూరి వీరభద్రరావు వారు యింకా మరికొందరు ప్రతికూలత కనబరచారు కాని నేను చూపిన ప్రమాణాలను అన్యథాకరించలేదు. శ్రీ పెద్దిభట్ల వీరయ్యవారు తమ ఓరుగంటివిచారణలో దీన్ని తటస్థులుగా ప్రస్తావించారు. ఉపపత్తులతో ఈఅంశం స్పష్టపరచాను. శ్రీనాథుడు కర్ణాటదేశస్థుడని యిప్పటికీ భావిస్తున్నాను. శ్రీనాథుడితో సంబంధం వున్నా లేకున్నా కన్నడీలని ఒకబ్రాహ్మణశాఖవారు ఇప్పటికీ పల్నాటిసీమలో కరాలపాటిగ్రామంలో వున్నారు.

ఇట్లానే నన్నయకూడా అనాంధ్రుడుగా కనబడుతున్నాడు. ఆంధ్రదేశాన్ని జయించిన చాళుక్యులకు, చోళులకు బంధుత్వమేర్పడినకాలంలో యితడు అరవదేశంనుండి వచ్చి వుండవచ్చును. ఆంధ్రదేశానికి చోళసంబంధం కలిగిన సమయాన ద్రవిడులు కొంత రిక్కడికి వచ్చినట్లు కనబడుతున్నది. తంబళులు (తమిళులు) అట్లాటివారే నని అనుమేయం. అప్పయ్యదీక్షితులవారి తాంత్రికమీమాంసకు విషయమయిన వారిలో వీరుకూడా చేరివుంటారని అనుకొంటున్నాను. యెరకలు లేవిధంగా వచ్చారో ఇప్పటికి అరవమే మాట్లాడుతున్నారు. ఆరామద్రావిడులు మొదలయినవారి సంగతి విదితమేగదా. ఇతడు శ్రీనాథుడివలె దేశంలో చిరకాలనివాసంగల వంశంలోనివాడు కాక అప్పుడప్పుడే వచ్చి చేరినవాడో అట్లా చేరిన ద్రావిడకుటుంబానికి చెందినవాడో అయివుండవచ్చును. కనుకనే తనభాష అయిన అరవంలోని మాటలను అనావశ్యకస్థలాల్లోకూడా తప్పించుకొనజాలని దశలో వుండినట్లు కనబడుతున్నది. ఇతడు వాడిన శబ్దాలు కొన్ని ఆంధ్రదేశపు వ్యవహారంలో లేకపోవడమే కాకుండా తమిళదేశంలో యిప్పటికీ సాధారణజనుల్లోకూడా వాడుకలో వున్నవి.

---

| | శబ్దం | అర్థం | నన్నయరూపం | అరవదేశపు ఇప్పటి వ్యవహారం | తెలుగుదేశపు ఇప్పటి వ్యవహారం |
|---|---|---|---|---|---|
| 1 | యును... | సముచ్చయార్థకం | ఆత్మహానియుఁ విలువిద్యయుంగఱచి. (ఆది) వారిధియుం గలంగె (సభా) | ఎలియుం, పూనైయుం (యెలకా, పిల్లి) | లేదు |
| 2 | ఎల... | లేత... | ఎలజవ్వనంబు (ఆది) | ఎళంగీర (లేతకూర) | లేదు |
| 3 | తొట్టి | మొదలుకొని | హిమకరుదొట్టి యదువుదొట్టి (ఆది) | పొరందదు తొట్టు (పుట్టింది మొదలు) | లేదు |
| 4 | కఱచు | నేర్చు | విలువిద్యగఱచుచుండిరి (ఆది) | ఎనక్కుకర్త్తుడు (నాకు నేర్పు) | లేదు |
| 5 | అరయు | తెలియు | పొరయకుండ నరసి (ఆది) | నన్నా అఱింజి (బాగా తెలిసికొని) | లేదు |
| | ఆరయు | పరిశీలించు | ఆరసి పేలునా (ఆది) | నన్నా ఆరాయ్ (బాగాపరిశీలించు) | లేదు |
| 6 | పేర్మి | గొప్పతనం | మహీశుల పేర్మిఁజేసి (ఆది) | భగవానుడయ పెరుమై కాట్టత్తకు (భగవంతుడి గొప్పతనం చూపడానికి) | లేదు |
| 7 | మనము | మనస్సు | మనమునఁ జెయ్యుల మాటల (ఆది) | ఎనక్ మనం పరాదు (నాకు మనసురాదు) | లేదు |
| 8 | పోలె | వలె | జలకణంబులపోలె(ఆది) | తంగంబోలె యిరికి (బంగారంవలె వున్నది) | లేదు |

ఇక జవంబు, కర్ణుండు, తెనుంగు, జందనగంధి, బ్రభాతము అని యిట్లా నన్నయవుపయోగించినట్టి, యిప్పటి తెలుగు వ్యవహారంలో లేనట్టి పూర్ణబిందువులు, గజడదబలు, ంబులు, ండులు మొదలయినవి అరవభాషలో పాలుంజోరుం (పాలూఅన్నం), మూరుంజాదం (మజ్జిగా అన్నం), పూవుం బళ్ళముం, యెరంగు, పోరందు, తెలుంగు, కరండి, సున్నాంబు, నరంబు, పాంబు, ఒడంబు, నడంది, గూండు, వేండికోండు అని యీతీరున యిప్పటికీ ప్రభూతంగా ప్రసిద్ధంగా వ్యవహృతమవు తున్నవి. ఈతమిళశబ్దాలు నేనుసంభాషణలో గ్రహించినవి.

పైన వుదాహరించబడిన శబ్దాలు స్వల్పరూపభేదంతో ప్రకృతపు కన్నడ వ్యవహారంలోను కనబడుతున్నవి. అందం, గుణ్ణం, వనం, కోపం, అని యిట్లాటిశబ్దాలు తెలుగులో హలంతాలైవుంటే 'క్రమము', 'జనము' 'గణము', 'తీర్థము' అని ఆవర్గంలోని వీటికి నన్నయో క్తిలోవున్న అజంతరూపం 'జలవు' 'బలవు', 'తీర్థవు' అని తద్గణాన్థాలకు కన్నడంలో నేటికీ వ్యవహారంలో వున్నది. "ఫలం" 'జలం' 'ఇహం' లేదా "ఫలమూ" 'జలమూ' 'ఇహమూ'అని వీటికి తెలుగులో సముచ్చయార్థకరూపం వుంటే "మహారవముఁ ............... ఘోషముఁ;" "ఇహముం బరంబు" "మహోత్సవమున్;......... సాంగత్యముఁ " అని ఆకోటిలోనివాటికి ఆఅర్థంలో నన్నయకూర్చిన అనునాసికాంతమైన ఉత్తు "జలముం" "పళ్ళముం", "(నీళ్లూ పండూ)", అని ఆగణంలోనివాట్లో అరవంలో, ఇప్పటికీ వ్యవహృతమవుతున్నది. ఇదివరకు చెప్పినట్లు ఇతడు తమిళుడో చాళుక్యుల ప్రధాన నగరమైన కళ్యాణపు ప్రాంతాలనుండి వచ్చిన కర్ణాటుడో అయివుంటాడని వ్యక్తమవుతున్నది. పైన జూపిన శబ్దాలు, శబ్దరూపాలు నన్నయకాలంలో తెలుగులో వ్యవహృతమై ఇప్పుడు లుప్తమైనవేమో, ఇతడు ఆంధ్రుడే అయి ద్రవిడకర్ణాటభాషలు చదివి వుండడంవల్ల పరిచయవశాన ఆమాటలు వాడినాడేమో అనే యిట్లాటి పూర్వపక్షాలను విచారించక వదలుతున్నాను. ప్రవాహిభాషల్లో కొన్ని శబ్దాలచ్యుతి నిజమే

అయినా అవి మన మనుకొనేటంత తేలికగా నశించడంమాత్రం అస త్యం. దాదాపు వేయిసంవత్సరాలక్రిందటి నన్నయశబ్దాలు, శబ్దరూ పాలు ఇప్పటికీ తమిళభాషలో వుండడమే దీనికి నిదర్శనం. నన్నయ పేరుకూడా అనాంధ్రమేను. నన్నఅంటే అరవంలోను కన్నడంలోను మంచి అని అర్థం. ఇది తెలుగులో లేనేలేదు. ఇతడు ఆంధ్రుడై అరవం, కన్నడం చదివినవాడనుకొంటే తనపేరుకూడా ఆభాషల్లోకి మార్చు కొనడుగదా. ఈతీరుగా శ్రీనాథుడు నన్నయ అనాంధ్రులు కావడం మనకు అగౌరవహేతువని చింతించవలసిన పనిలేదు. ఆంధ్రేతరులు కూడా తెలుగులో గ్రంథకరణానికి యత్నించారనడం ఆంధ్రులకు గర్వహేతువే కాగలదు అనాంధ్రభాషల సంప్రదాయాలు తెలు గులో పెట్టడం, మార్చిమార్చక అనాంధ్రశబ్దాలనువాడడం శబ్దాను శాసనమని యితడు భావించివుంటే అది అసంబద్ధమనిభారతీయవైయా కరణసంప్రదాయవిరుద్ధమని మాత్రం చెప్పి ప్రస్తావవశాన వచ్చిన యీవిచారణ యిక చాలిస్తున్నాను.

## వీరచరిత్ర.

పల్నాటివీరచరిత్ర కొన్ని మహాప్రబంధలక్షణాలుగల మూలల గ్రంథం. నన్నయభారతాదులవలె అనువాదంగాని, హంసవింశత్యాదుల వలె క్షుద్రవృత్తబాహుళ్యంగల పుక్కిటిపురాణంగాని, మనుచరిత్రా దులవలె పూర్వకథావిశిష్టంగాని, కానటువంటి ఒక అపూర్వకృతి.

## ప్రబంధశబ్దం.

మనువసుచరిత్రాదులు ప్రబంధాలని తక్కినవి కావని కావ్యాలు వేరని తెలుగుదేశంలో తెలుగుపుస్తకాలు చదివే మనలో అనేకులు అనుకొంటున్నారు.

> "ఈతఁడే... మొట్టమొదట మనుచరిత్రమును బ్రబంధరూపమున రచియించిన కవియగుటచేత..." (ఆం. క. చ.)

అని శ్రీకందుకూరి వీరేశలింగంవారు.

---

"ఈతనికిఁ బూర్వులగు పురాణకవులును, కావ్యకవులును నొనరింపని ప్రబంధ కవనమునకుఁ గ్రొత్తత్రోవ లీతఁడు కల్పించుటం జేసి" (క. జీ.)

అని శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారు.

"కావ్యప్రబంధ కవిత్వము."

అని ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహకర్త.

మనుచరిత్రతో ఈప్రబంధాలు ఆరంభమైనవని ఒకచోట పిల్లల మర్రి పినవీరన్నతో ఆరంభమైనవని ఒకచోట, యిట్లా ప్రతిపాదిస్తున్నారు. ఇవి సాహిత్యసంప్రదాయం తెలియనిమాటలు. ప్రబంధమంటే కావ్యమే కాని విశేషార్థమేమీ లేదు. రామాయణ భారతాదులు కూడా ప్రబంధాలేను. ప్రబంధాలు మనుచరిత్రాదులతో ఆరంభమైన వనే వారిపక్షాలు కొద్దిమార్పులతో అట్లాటివి మరికొన్ని వాక్యాలు, అమరుడి నిర్వచనం, విద్యానాథాది సాహిత్యవేత్తల వచనాలు, ఆళ్వారులస్తోత్రాలను దివ్యప్రబంధమనడం, అనువాదాలనుండి వేరుచేయడానికి ఇది విశేషనామ మనడం, మనుచరిత్రాదులు కొత్తరకం గనుక వేరే పేరు ఆవశ్యకమనడం, నామైకదేశవాదం, దండిచెప్పిన వర్ణనల విషయం, యివన్నీ పూర్వపక్షసమాధానాలతో ఇక్కడ విచారించక వదలుతున్నాను. ప్రబంధం, కావ్యం, పర్యాయపదాలని, విశేషమేమీ లేదని, రామాయణమహాభారతాదులు, రూపకాలు, ప్రబంధాలే నని, అందుకే

"प्रबन्धे च अङ्गी रस एक एव उपनिबध्यमानोऽर्थविशेषलाभं छाया-तिशयं च पुष्णाति कस्मिन्निवेति चेत् यथा रामायणे यथा वा महाभारते." (ध्व.)

అని ఆనందవర్ధనుడు,

"प्रबन्धेऽप्यर्थशक्तिभूः
यथा गृध्रगोमायुसंवादादौ." (काव्य.)

అని మహాభారతంలోని శాంతిపర్వస్థమైన గృధ్రగోమాయుసంవా
దాన్ని వుదాహరిస్తూ మమ్మటుడు,

"प्रथितयशसां भासकविपुत्रसौमिल्लकादीनां प्रबन्धानतिक्रम्य वर्तमान
कवेः कालिदासस्य क्रियायां कथं परिषदो बहुमानः ॥" (माळ

(ప్రథిత యశస్సుగల భాసకవిపుత్ర సౌమిల్లకాదుల ప్రబంధా
లను అతిక్రమించి వర్తమానకవి అయిన కాళిదాసుడి రూపకమందు
పరిషత్తుకు యెట్లా ఆదరం వుంటుంది?)

అని కాళిదాసు, వాటిప్రబంధత్వం విదితం చేశారని, వ్యవహారము నే
సమీచీనమైతే తప్ప స్థితిమాత్రాననే ఉపాదేయం కాదని, అది అను
చితమైనప్పుడు హేయమని, అనువాదాలను అనువాదాలనే అ
వచ్చునని, కావ్యానికి సాధారణమైన నూతనత్వాన్నిబట్టి మాత్ర వే
విశేషనామ మేర్పరిస్తే కల్పనాగౌరవం సంభవిస్తుందని, రసభావ నిష్పా
దన విధానభేదాన్నిబట్టి విశేషనామం వుండవచ్చునని, అది లేనప్పుడు
కొంత కల్పన, కొంతపూర్వకథగల రఘువంశాదులకు వలెనే మనుచ
త్రాదులకు విశేషనామ మావశ్యకంగాదని, ఒకవేళ ఆవశ్యకమని ఒప్పు
కొన్నా వాటికి ప్రబంధమనే విశేషనామం ఉద్దిష్టార్థాన్ని తెలు
డానికి సమగ్రంగా సమర్థం కాకపోవడమేకాకుండా భ్రాంతిజనకం
కూడా కావడంవల్లను అజ్ఞానసూచకంగా వుండడంవల్లను త్యాజ్య
మని, రామాయణాదులు ప్రబంధాలు కావని అనుకోనడం శబ్దా
వివేకశూన్యత్వద్యోతకమని, సిద్ధాంతంమట్టుకు తెలుపుతున్నాను.

గురిజాలకోడిపోరునుండి చివరవరకు గల ఇతివృత్తం శాఖా
వంతమై విస్తృతమైనది. మహావీరుల ఇతిహాసం కావడంవల్ల ప్రక్లృప్త
గూడా అయివున్నది. దీనికి నాయకుడైన మలిదేవరాజు, ప్రతినాయక
డైన నలగామరాజు, ముద్రారాక్షసమందలి చంద్రగుప్తుడివలె అంతగా
క్రియాపరులు గానివీరులు. ఇట్లాటివారికి సచివాయత్తసిద్ధులని వ్య
దేశం. అనపోతు, బాలచంద్రుడు, బ్రహ్మనాయుడు, అలరాజు, పేరిసీడు

కొమ్మరాజు, వీరందరు ఉదాత్త క్షాత్రధర్మమహితులై అవశ్యకమైన ప్పుడు ప్రాణాన్ని సయితం తృణప్రాయంగా, సమర్పించగలిగిన లోకోత్త రులు. బ్రహ్మనాయుడు, విష్ణువుయొక్క అవతారంగా భావించబడుతు న్నాడు. అయినప్పటికీ ఇతడి మానుషప్రవృత్త్యౌచిత్యాన్ని వీరచరిత్ర కర్త సమంజసంగా ప్రతిపాదించాడు. కుమారుడు రణరంగానికి వీపు చూపినందుకు అతడు చేసిన నింద భారతీయవీరతయొక్క ఉత్కర్షను నిజంగా ప్రకటిస్తున్నది. ఉత్తమ ధర్మపరాయణలైన వీరవనితలు ఇందు ప్రాధాన్యం వహిస్తున్నారు. యుద్ధభూమికి పోకుండా ఆపవద్దని కుమా రికి ఉపదేశించిన రేఖ, పతిచేతికి ఖడ్గమందిచ్చి విజయాశీస్సు లర్పించిన మాంచాల,లోకమందలి వీరవనితలకు ఆరాధ్యులుగా ఉండజాలినవారు. అల్లుణ్ని చంపినందుకు తండ్రిని నిందిస్తూ చితపై శరీరమర్పించి పరలో కంలో సయితం సేవించడానికి పతిని అనుగమించిన రత్నాలపేరిదేవి భారతీయ పత్నీధర్మంయొక్క బలోన్నతిని విదితం చేస్తున్నది. ప్రతి పక్షకోటిలోని నాయకురాలు రామాయణంలో మంథరవలెను, భారతంలో శకునివలెను అనర్థాలకుకారణం. నట్టింటి నాగుబాముని చింతపల్లిరెడ్డి ఆమెనుగురించి చెప్పినమాటలు యథార్థమైనవి. ప్రతి స్పర్ధిలేకపోతే తనరొమ్మును తానే గుద్దుకొంటుందని కథకులు తమా చుగా చెప్పుతూవుంటారు. అయినప్పటికీ యీామెను ఒకగొప్ప మంత్ర పాటవంగల రాజనీతిప్రవీణనుగా వీరచరిత్రకర్త ప్రదర్శించాడు. యుద్ధారంభంలో చేసిన సంధియేర్పాట్లు యీామె నయకౌశలాన్ని తెలుపుతున్నవి. అనర్హులతో స్త్రీలతో యెదుర్కొనవలసివుండడం వీర పురుషులకు దురదృష్టమని చెప్పవచ్చును. ఇట్లాటి దురదృష్టం బ్రహ్మా నాయుడికి సంభవించింది. అయినప్పటికి బ్రహ్మానాయుడు,

"वृद्धो बालो न हन्तव्यो नैव स्त्री केवलो नृपः।(शु. अ ४ प्र ७.)

(వృద్ధుణ్ని, బాలుణ్ని, స్త్రీని, సైన్యాదులు లేనిరాజును చంప కూడదు.)

అనే భారతీయధర్మాన్ని అనుసరించి పరాఙ్ముఖు డయినాడు వీరత్వప్రసక్తి వచ్చినచోట్ల వీరచరిత్రకర్త ఉద్వేగాన్ని కనబరుస్తాడు బాలచంద్రుడికి అతడి తల్లిదండ్రులకు జరిగిన సంవాదంలోను బాల చంద్రుడి తక్కిన సంభాషణల్లోను యీవిషయం వ్యక్తం కాగలదు యుద్ధావసానపురాత్రి, కన్నమనీని అర్ధరాత్రపు రణరంగదర్శనం, ఇట్లాంటి చోట్లవలె అతడు భయానకనిష్పాదనమందుకూడా కొంతకౌశలం కన బరుస్తాడు. తక్కినచోట్ల సాధారణదశను దాటలేదు. అక్షరాలతమా షాలో సగం మానినందువల్ల పోయినసగం వెంటగాక మిగిలిన చెన్నుగ, సగ, చయ్యన, ఒయ్యన, పన్నుగ అనే యిట్లాటిదండగ్గణాం, భూమిగణం, ప్రకాశగణం, మొదలైన చెత్తను తీసివేస్తే కథనం ఆక ర్షకంగాను, స్ఫుటంగాను, పటుత్వవిశిష్టంగాను ఉన్నట్లు విదితం కా గలదు.

ఆరంభంలో జీడినూనెగుడ్డలు ధరించి పాపవిముక్తికై అనుగు రాజాదులు బయలుదేరడం, మధ్యన బాలచంద్రుడి వైరాగ్యోపదేశం, వృత్తావసానమందు ఉభయానికి వినాశం, బ్రహ్మనాయుడి ఉపదేష్టృత్వ ప్రతిపత్తి, వీటిఅన్నిటివల్ల మహాభారతంలోవలె ఇక్కడకూడా ప్రధా నరసం శాంతమని వీరకరుణాదులు అంగరసాలని నిర్ణయించవచ్చును.

వైష్ణవులు నాలాయిరాన్నివలె దీన్ని వీరమతస్థులు ఔర్ధ్వదైహి కాల్లో పఠనానికి వినియోగించడం దీని శాంతరసవత్త్వానికి అనుగుణంగా వున్నది. రామాయణాదులవలె కాక వీరచరిత్ర ఒకచో ద్విపదీపద్యాం లోను, ఒకచోసరణిలోను వున్నది.

ఉగ్రం, ప్రసన్నం, మనోహరం, జుగుప్సితం, అద్భుతం యిట్లా వివిధంగావున్న ఖగోళమహీగోళప్రకృతుల్లోని వివిధరూపాలను రామా యణమహాభారతకుమారసంభవాదుల్లోవలె కథాపురుషులదశకు అను గుణంగా ప్రదర్శించడం వీరచరిత్రలో అరుదు. యుద్ధావసానపు చీకటివర్ణనకూడా ప్రకృతంతో అంతగా సంగతం కాదు. రఘువంశాం

లోని సింహదిలీపసంవాదంవంటి, కుమారసంభవంలోని పార్వతీపర మేశ్వరసంవాదంవంటి సంవాదాలుగాని, రఘువంశంలోని అజవిలాపం వంటి ఆత్మగతసంభాషణలుగాని, ఉదాత్తకోటిలో చేరదగినవి, వీరచరిత్రలో మృగ్యం.

## శ్రీ నా థ కృ తు లు.

### పల్నాటివీరచరిత్ర - తెలుగువాఙ్మయం.

పల్నాటివీరచరిత్రను విచారించడానికి పూర్వం తెలుగువాఙ్మయాన్ని గురించి క్లుప్తంగా తెలుపుతాను. తెలుగువాఙ్మయం నన్నయాదుల భారతసంగ్రహాదులతో ఆరబ్ధమయింది. తరువాత నైషధాదులు ఆవిర్భవించినవి. మరికొంతకాలానికి మనువసుచరిత్రలవంటివి ఉద్భవించినవి. శాకుంతలాదులవలె నన్నయాదులకృతులు స్వసృష్టులు కాకపోవడం విశదం. కొన్నితీసివేతలు, పద్యంలో యిమడకపోతే కొన్ని విశేషణాలు తగ్గడం, అక్షరాల తమూషాకోసం పద్యం నిండకపోతే కొన్ని విశేషణాలు హెచ్చడం, యిట్లానే వర్ణనలు మరికొన్ని చిల్లరమార్పులు, ఉన్నమాత్రాన మూలాపేక్ష చేత అదేకథ, అదేపాత్రవర్గం, అవే కథావయవాలు, అదేకథాక్రమం కలిగి కొన్నిచోట్ల అవేమాటలు, బహుళంగా అవే అభిప్రాయాలు తెలిపే నన్నయాదులకృతులు స్వతంత్రగ్రంథాలు కాజాలవు. ఇక అవి అనువాదాలని చెప్పవలసివున్నది.

మూలంయొక్క స్వరూపం అవికలంగా భాషాంతరంలో తెలపడమే అనువాదానికి పరమప్రయోజనం. నన్నయాదులవి అనుచితానువాదాలు. ముఖ్యమైన అంశాలను కవితాసారంగల ఘట్టాలను వదలితుంచడం మార్చడం మొదలయిన వికారాలతో కలుషితంగా వున్న నన్నయాద్యనువాదమార్గాన్నే శ్రీనాథుడు నైషధాదుల్లో అనుసరించాడు. పల్నాటివీరచరిత్ర మూలగ్రంథమైనాకూడా తెలుగువాఙ్మయంయొక్క యీసాధారణస్థితిని దాటలేదు. కాళిదాసాదుల కావ్యాల్లోవలె ఉదాత్తకవితాస్వరూపం యిందు కానరాదు.

ఆయువుపట్లయిన కథాఘట్టాలను నిర్మించడంలోగాని భావాని ఉన్నతి, వికాసం కలిగించే అభిప్రాయాలను వ్యక్తీకరించడంలో గాని వీరచరిత్రకర్త సాధారణదశను అతిక్రమించలేదు. తెలుగుకృతుల్లో అనేకాల్లోవలెనే దీంట్లోను కథాతంతువే ప్రధానం.

అశ్వఘోషుడి బుద్ధచరిత్రం యితిహాసమైనా కవితావిషయాన వీరచరిత్రకంటె యెంతో ఉత్కృష్టమైనదిగా ఉన్నది. కేవలం తత్త్వ విచారణాసంబంధిఅయినా జ్ఞానవాసిష్ఠంలో విబుధారాధ్యమైన కవితాఘట్టాలెన్నో అక్కడక్కడాదృష్ట మవుతున్నవి. శ్రీనాథాదులు సరియైన అనువాదాలను నిర్వహించలేకపోయినారా అనేసంశయం కలుగుతున్నది. అవి అనౌచిత్యం పాలుగావడం స్పష్టం గనుక సంగ్రహా లనుకొంటే అసంగతప్రసాదులతోకూడిన అనపేక్ష్యసంగ్రహాలని గాని లేదా పైన తెలిపినవిధాన అనుపాదేయమైన అనువాదాలని గాని చెప్పుతూ అవి అట్లాటిదశయం దుండడానికి యీక్రింది హేతువులను నేను సంభావిస్తున్నాను.

## ఉత్తమవిద్యాద్వారం.

తెలుగు యెప్పుడుగాని ఉత్తమవిద్యాద్వారంగా వుండలేదు. నన్నయకాలంనుండి మదరాసు విశ్వవిద్యాలయం వచ్చేవరకు విజ్ఞాన ప్రదమైన ఉత్తమవిద్యఅంతా సంస్కృతంద్వారానే విద్యాపీఠాల్లో అభ్యస్త మవుతూవుండేది. మద్రాసువిశ్వవిద్యాలయం వచ్చినతరువాత మనలో అనేకులు ఇంగ్లీషుద్వారా ఉత్తమవిద్య అభ్యసిస్తున్నారు. కనుక ప్రాచీనకాలంలోగాని యిప్పుడుగాని తెలుగు ఉత్తమవిద్యా ద్వారంగావుండే ఉదాత్తప్రతిపత్తి పొందలేదు. ఉత్తమవిద్య అంటే బుద్ధిపరిణతిహేతువై విచారణాపూర్వకమైన విజ్ఞానం. విద్యాపీఠాల్లో సంస్కృతం ఆతీరున ఉదాత్తాధికారం వహించి వుంటూవుంటే "గాసట బీసటే చదివి" అని యెర్రాప్రెగ్గడ అన్నట్లు సంస్కృతం వచ్చీ రాని వారు, దూడపేడ సంస్కృతంవారు, సంస్కృతం బొత్తిగా రానివారు యిట్లాటి అధమాధికారులకుమాత్రమే నన్నయాదుల కథల కృతులు

పుద్దిష్టమని నేను తలుస్తున్నాను. ఈదశ ఒకతెలుక్కే గాక కొంచెం హెచ్చుతక్కువగా ప్రాకృతభాషలకన్నిటికీ ప్రాచీనభారతవర్షంలో వుండేది. బుద్ధభగవానులు పాలీకి, మతభాషాగౌరవం, విజ్ఞానభాషా గౌరవం యిచ్చినప్పటికీ వైదికులు మాత్రం ఆమార్గాన్ని అంగీకరించ లేదు. మతవిషయాన కొన్నిఅంశాల్లో తమిళం ప్రాకృతంవంటిదని విదితం. ఈతమిళభాష చాలా ప్రాచీన కాలంనుండీ ప్రసిద్ధమైనట్లు కన బడుతున్నది. బాణుడు సయితం తనకాదంబరిలో ద్రవిడధార్మికవర్ణ నలో

" दिवसमेव मशककणितानुकारि किमपि कम्पितोत्तमाङ्गं गायता स्वदेशभाषानिबद्धभागीरथीभक्तिस्तोत्रनर्तकेन ... ... ... ... ... जरद्द्रविडधार्मिकेणाधिष्ठितां ......" (का. पू.)

(పగలంతా తలఆడిస్తూ దోమరాగంవంటిదేదో పాడేవాడు, స్వదేశభా షలో గంగాస్తోత్రం చేస్తూ ఆడేవాడు...అయిన ముసలిద్రవిడధా ర్మికుడు అధిష్ఠించిన...)

అని యీతమిళభాషను ప్రస్తావిస్తాడు. కుమారిల భట్టాచార్యు లీభాషాశబ్దాలను ఉదాహరించారు.

" द्रविडाङ्गनोक्तवाचामिव " (प्र. च.)

(ద్రవిడాంగనల వాక్కులకువలె)

అని కృష్ణమిశ్రు లీభాషను స్మరించారు. పైనచెప్పినట్లు వైది కులు సంస్కృతానికి వుండే గౌరవాధిక్యాలను ప్రాకృతభాషలకు ఇయ్యడానికి సమ్మతించలేదు. పాలీవలె గాక మిత్రంగావచ్చిన తమి ళాన్ని సయితం వారు ఆదరదృష్టితో చూసినట్లు కనబడదు. కూర్మపురాణకర్త

गायन्ति लौकिकैर्गानैः दैवतानि नराधिप ।
वामपाशुपताचारास्तथा वै पाञ्चरात्रिकाः ॥ (कू. अ. ३०.)

(ఓరాజా పాంచరాత్రులు వామపాశుపతాచారులు లౌకికగా నాలతో దేవతలను స్తుతిస్తారు.)

అని దేశభాషాత్మకమైన దైవస్తోత్రాలను కలియుగపు ధర్మవిప్లవాల్లో విచారంతో ఉదాహరిస్తాడు. ఇక్కడ వుద్దిష్టమైన లౌకిక

గానాలు ఆళ్వారుల నాలాయిరప్రబంధం నయనారుల తేవారాలు అయివుంటవని అనుకొంటున్నాను.

नैषां न्याय्य इह द्विजान्वयजुषां भाषाप्रबन्धे श्रमो
वेदे विश्वपुमर्थसाधनविधौ बद्धादरे जाग्रति
तीरं क्षीरपयोनिधेरुपगतो दैत्यारिदीप्त्यावृतं
को वा धावति दुग्धलब्धिचपलो गोपालकस्यालयम् ॥ (वि. द.)

(సమస్తపురుషార్థాలను సాధించడానికి వేదం బద్ధాదరమై వుంటూ వుంటే ఈ బ్రాహ్మణవంశ్యులకు (రామానుజీయులైన వైష్ణవులకు) దేశ్యభాషాప్రబంధాభ్యాసం అన్యాయ్యం. విష్ణుతేజస్సుచేత ఆవరించబడిన పాలసముద్రపుగట్టుకు పోయి యెవడు పాలకోసం సక్తితో గొల్లయింటికి పరుగెత్తుతాడు?)

" मुञ्चन्तः पञ्चयज्ञान् द्रविडभणितिभिर्मोहयन्तोऽनभिज्ञान् ॥"
(वि. द.)

"పంచయజ్ఞాలు విడిచిపెట్టి ద్రవిడభణితులచేత తెలియనివారిని భ్రమపెట్టుతూ."

అని కృశానువుచేత

" उपादेयं प्राज्ञैरुचितविषयं द्राविडवचोऽप्ययुक्तार्थं हेयं भवति वचनं संस्कृतमपि ॥" (वि. द.)

(ఉచితవిషయమైనది ద్రావిడవచస్సుకూడా స్వీకార్యం అయుక్తార్థమైనది, సంస్కృతవచనంకూడా త్యాజ్యం)

स यासां व्याकर्ता चुलुकितसमुद्रो मुनिवरः
प्रबन्धारः प्रौढाः शठमथनमुख्याः शमधनाः
प्रवक्तारः शुद्धाः प्रथितयशसः पूर्वगुरवो
गिराम्पारे तासां जयति गरिमा द्राविडगिराम् ॥ (वि. द.)

(వేటికి సముద్రాన్ని ఆచమనంచేసిన ఆమునిశ్రేష్ఠుడు వ్యాకరణం రచించాడో, వేటికి శమధనులైన శఠకోపముఖ్యులు ప్రౌఢప్రబంధలో,

వేటికి ప్రథితయశస్సుగల శుద్ధులు పూర్వగురువులు(రామానుజాదులు) ప్రవక్తలో ఆద్రావిడవాక్కుల గరిమ వాగగోచరంగా వర్తిస్తున్నది.) అని విశ్వావసుచేత వేంకటాధ్వరి చెప్పించిన వచనాలు ఆకాలంలో సంస్కృతానికి దేశ్యభాషలకు వుండిన సంఘర్షాన్ని తెలుపగలవు. రూపకాలకు సంబంధించిన సాహిత్యగ్రంథాల్లో యీప్రాకృతభాషలు మధ్యమాధమపాత్రలకు యేతీరున వుద్దిష్టమయిందీ స్పష్టంగా తెలుసుకోనవచ్చును. అయితే మతవిజ్ఞానభాషాగౌరవం యియ్యకపోయి నప్పటికీ సంస్కృతం ద్వారా పరిణతబుద్ధులైన విబుధులు కొందరు అనువాదాదుల్లోకి సంగ్రహాల్లోకి దిగకుండా స్వతంత్రంగా ఉత్తరభారతపు ప్రాకృతాల్లో కావ్యాలు రచించారు గనుక కావ్యశాఖ అయినా కొంతవరకు పరిణతులకు గణనీయమైనదిగా యేర్పడ్డది. బాణుడివంటి విద్వాంసుడిచేత

" कीर्तिः प्रवरसेनस्य प्रयाता कुमुदोज्वला ।
सागरस्य परं पारं कपिसेनेव सेतुना ॥" (ह. च.)

అని కీర్తితమై ఆనందవర్ధనుడివంటి సాహిత్యవేత్తలకు ఉదాహరణాలను సమకూర్చదగిన వాఙ్మయం శృంగారబహుళమైనా యేర్పడ్డది. కొందరు స్వతంత్రించి రూపకాలుకూడా రచించారు. ఉపలభ్యమానమైన రాజశేఖరకృతికర్పూరమంజరివంటివి రూపకాలింకా కొన్ని వుండివుంటవి. తెలుగులో యిట్లాటి స్థితిమృగ్యం. అనువాదాలు క్షుద్రంగా వున్నవని తెలిపినాను. స్వతంత్రరచనల్లో ఒకటిరెండు తప్ప తక్కినవి వ్యంగ్యవినాశంతో అన్ని తెలుగుకృతులకూ సమానమైన మురికిపద్యాలకసవుకుప్పలతో నిండి కవితావిషయాన అధమంగా వున్నవి. ప్రాకృతకృతికర్తలు సంస్కృతశబ్దాలను వాడనట్లే తెలుగులో గూడా కొందరు సంస్కృతశబ్దాలను త్యజించి అచ్చతెలుగుగ్రంథరచన ఆరంభించారు. అయితే ఆపని సాధ్యంకాలేదు. కవిత్వందాకా పోవడం యెందుకు? ఇప్పటి టిల్లిగ్రాఫు భాషవలె వారేర్పరుచుకొన్న తిక్క-

మాటల పక్కిభాషలో కథలను పూర్తిగా తెలపడమే ప్రాయికంగా వారిపాలిటికి మహాసర్గమయింది. ఈతీరుగా తెలుగుకృతులు యేరకంలోనూ క్షుద్రదశ దాటలేదు. ఇంతకూ చెప్పదలచినదేమంటే ఆ కొంచెం కావ్యవలయంలో కూడా తెలుగుగ్రంథరచన అధమమై ఉత్తమాధికారులకు అగ్రాహ్యంగా ఉండిందని. నన్నయానువాదం యెంత అధమమై ఉత్తమాధికారులకు యెంత అగ్రాహ్యమైనా అత డారంభించినపద్యం యెంత మురికిలక్షణాలు కలది అయినా తెలుగు గ్రంథమనేదాన్ని మొదట మనకిచ్చాడు గనుక అతడు ఆరాధ్యుడేను. అయితే ఆకాలపు ప్రకృష్టవిద్వాంసులు ఇతడిపనిని గణనీయకోటిలో చేర్చినట్లుగాని తెలుగును సంపన్నం చేయబూనినట్లుగాని కనబడదు. వారు తెలుగుతో సంబంధం పెట్టుకొనివుంటే తెలుగు యీనాటికి అత్యంతం సమృద్ధమైనభాషల్లో ఒకటిగా వుండేదని నే ననుకొంటున్నాను. అహోబలపండితుడివంటివిద్వాంసులు విబుధులదృష్టి తెలుగువంక మరల్చడానికి కొంతపూనుకొన్నా వారియత్నం సఫలం కాలేదు. చివరకు అహోబలపండితుడివంటి విజ్ఞానసంపన్నుడి రచన సంస్కృతంలోనే వుండవలసిరావడం తెలుగుయొక్క భాగ్యహీనత కాక మరేమి కాగలదు? అధమాధికారులకు దుర్గ్రాహ్యమైన భగవద్గీతాదులను భారతంలో వదలిపెట్టడం, "నాటకాంతం కవిత్వం" అని కీర్తితమై కావ్యశిరస్సులని చెప్పదగిన నాటకాలను వారు అనువదించకపోవడం, పరమవిజ్ఞానప్రదమైన న్యాయాదిశాస్త్రాలను శ్రీనాథుడివంటి అహోబలుడివంటి మహావిద్యావంతులు సయితం తెలుగున స్పృశించకపోవడం, సాహిత్యంలో సయితం గణనీయమైన విచారణాగ్రంథాలు లేకపోవడం ఆకాలాన తెలుగుకృతులు అధమాధికారులకే వుద్దిష్టమనిఅవి కథలకూ పద్యవినోదానికీ తప్ప మరే వుదాత్త ప్రయోజనానికీ వారు స్వీకరించలేదని స్పష్టపరుస్తున్నవి. పోతనాదుల భాగవతాదులు కూడా ఈసంగతికే జ్ఞాపకంగా వున్నవి.

సంస్కృతమహాభారతమే శాస్త్రజ్ఞవలయంలో ఒక విధంగా కింది మెట్టున వున్నప్పుడు ఇక తుంచడం మొదలైన అసంబద్ధతలతో కూడిన తెలుగు అనువాదంయొక్క అధమాధికారిగ్రాహ్యత్వం చెప్పవలసినది లేదుగదా.

"संस्कृतपुराणपठनाक्षमाणां तच्छ्रवणेऽप्यलालसानां मुमुक्षूणां शूद्रादीनां प्राधान्येन ज्ञानोपयोगीन्यांध्रपुराणानि भवन्त्येवेति" (अहो)

(సంస్కృతపురాణపఠనం చేతగానివారు, వాటిని చదివిచెప్పుతూవుంటే వినడానికికూడా అలాలసులైనవారుఅయిన శూద్రాదులకు ప్రధానంగా ఆంధ్రపురాణాదులు జ్ఞానోపయోగులవుతున్న వేను) అని అన్న అహోబలపండితుడివచనం వాటి అధమాధికారి గ్రాహ్యత్వాన్ని విశదం చేస్తున్నవి.

తెలుగుకృతుల కిప్పటికికూడా యిదేదశ చాలామట్టుకు దృష్టమవుతున్నది. ఈఅంశాన్నే

"సంస్కృతపండితునిదృష్టి తెలుంగునం దంతఘనంబుగాఁ బోవనేరదు."

(బా. గు. ప్ర. 517.)

అని శ్రీకల్లూరి వేంకటరామశాస్త్రులవారు వ్రాసిన మాటలు విదితం చేస్తున్నవి. మద్రాసు విశ్వవిద్యాలయం వచ్చిన తరువాత తెలుగుయొక్క ఈదుర్దశ మారకపోవడం అట్లా వుండగా మరికొంత నికృష్టస్థితి యేర్పడ్డది. విశ్వవిద్యాలయం వచ్చినప్పటినుండి వెలసిన తెలుగు గ్రంథాలు, నిఘంటువులవద్దనుండి పాఠ్యగ్రంథాలవరకు, ఈ అధమదశను వెల్లడిస్తున్నవి. మచ్చుకు కొన్ని ఉదాహరణాలు చూపి యీ విచారణ ముగిస్తాను.

౧ "మహావీరచరిత్రము...కాళిదాసరచితము అయిన ఒకనాటకము."

౨ "మృచ్ఛకటి. ఇది శూద్రకునిచే రచియింపఁబడిన ఒక నాటకము."

3 "భర్తృహరి...ఈయన ................ వాక్యప్రదీపము అను వ్యాకరణ గ్రంథమును రచియించెను."

(పురాణనామచంద్రిక.)

(1) మహావీరచరిత్రం, కాళిదాసరచితమయిన నాటకం కాదు. భవభూతిరచితం.

(2) శూద్రకుడు రచించినది మృచ్ఛకటిగాని మృత్తుఘటి కాదు.

(3) భర్తృహరి రచితమైనది వాక్యపదీయం. వాక్యప్రదీపం గాదు.

౪ "సఖుఁడు. సం. వి; అ. పు" (శబ్దరత్నాకరం.)

(4) సఖుడు అనేది అకారాంత పుంలింగశబ్దంయొక్క ప్రథమైక వచనరూపమని శబ్దరత్నాకర కర్త అభిప్రాయం. ఇది తప్పు. అకారాంత పుంలింగమైన సఖ శబ్దం లేదు. అది ఇకారాంత పుంలింగం. పరమసఖ, భవత్సఖ అనేవాటిలోవలె సమాసాన్తస్థమై

**राजाहःसखिभ्यष्टच् (अ ५-४-९१)**

(తత్పురుషసమాసాంతమందున్న రాజన్ అహన్, సఖి ఈశబ్దాలకు టచ్ (అ) ప్రత్యయం వస్తుంది.)

అనేపాణిని వచనంప్రకారం టచ్ ప్రత్యయాంతమైన సఖశబ్దాన్ని చూచి యీాయన భ్రమపడివుండవచ్చును. సమాసాంతమందుండనప్పుడు ఇది ఇకారాంతమైన సఖి శబ్దం. అకారాంతంగాదు. అనేకమైన ఆధునికపుస్తకాల్లో బహుళంగా కనబడుతున్న సఖుడు అనేదుష్ట ప్రయోగాలూ శబ్దరత్నాకరకర్తయొక్క పై తప్పు వ్రాతా ఒకటే కోటిలోవి.

ఉ. "అటజనియోసఖా." (ఆంధ్ర మేఘసందేశం. వడ్డాది సుబ్బరాయుడు.)

జనకుండో.సుతుఁడో సఖుండో (ప్రబోధచంద్రోదయం. కందుకూరి వీరేశలింగం.)

"కావఁరుజన్ సహింతువెసఖా" (వేదం వేంకటరాయశాస్త్రి. మాళవికాగ్నిమిత్రం.)

(5) మీామామ సఖుడు నాకు (రఘువంశం. 14. ఆదిపూడి సోమనాథరావు)

సాధారణంగా యెన్నో తెలుగుపుస్తకాల్లో తరుచుగావుండే ఈసఖుడికి ఇంకా ఉదాహరణాలను విస్తరభీతిచేత వదలుతున్నాను సఖునకుఁ (ఆ. 5) అని భోజరాజీయంలోవలె కొన్ని వెనకటి పుస్తకాల్లో వుంటే అంతమాత్రాన అది సాధువుకాజాలదు. గ్రంథకర్త మృతివల్ల దోషం గుణం కానేరదు. జీవద్దశ గుణాన్ని దోషం చేయజాలదు. గ్రంథకర్త గతించినా జీవించివున్నా సాధ్వసాధుతలు మారవు.

"सह खेन वर्तत इति सखः"

అని సఖశబ్దం సిద్ధిస్తున్నదని కొందరు అడ్డం రావచ్చును. ఋజుమార్గంలో మిత్రవాచికాని యీతీరు కృత్రిమ శబ్దాలు శరణం కాజాలవు. ఈరకపు వాటికి పాల్పడితే నిఘంటువులు అవ్యవస్థితాలై స్వరూపాన్ని కోల్పోవడమేకాక భాష అయోమయపుఅసంబద్ధతపాలు కాగలదు. కనుక అట్లాటివాటిని అడ్డం పెట్టుకోనడం అకార్యమని చెప్పి ఈసంగతి ముగిస్తున్నాను. అపునుగాని శబ్దరత్నాకరపు వ్రాత తప్పని ఒప్పుకొంటాము.పుంలింగంలోను స్త్రీలింగంలోను అప్పుడు సఖి అని ఒకటేరూపం యేర్పడుతుంది, అది చిక్కుగదా అంటే చెప్పుతున్నాను. సుమతి, దాక్షి గాంధారి, ఇట్లాటివాటికి పుంలింగంలోను స్త్రీలింగంలోను తెలుగులో ఒకటేరూపంగదా. వాటికేమిచేస్తున్నాము? వాట్లో సుమతి అనేదాన్ని ఆ అర్థంలో సుమతుడు అని అననట్లే సఖి అనేదాన్ని సఖుడు అని అనగూడదని అట్లా అనడం అపభ్రంశమని ప్రకరణాన్ని బట్టి అర్థం జ్ఞేయమని చెప్పి మరియొక అంశానికి వస్తాను.

(6) "పాణిని వ్యాకరణభాష్యము మున్నగు గ్రంథములయందును, గోనర్దీయుఁడు, గోణికాపుత్రుఁడు అను పేరులు పదములు గలవు. ఇవి పాణినికి బేర్లుగను వాడఁబడి యున్నవి." (పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి.) వాత్స్యాయన కామసూత్రవివరణం. 22.

(6) గోనర్దీయుడు గోణికాపుత్రుడు—ఇవి పతంజలి పేరులుగాని పాణిని పేరులుగావు.

"न रत्नमन्विष्यति मृग्यते हि तत्" అని మాఘుము
(మద్రాసు యూనివర్‌సిటీ యింటర్‌మీడియట్ సెలెక్షన్లు 715.)

(7) పై వాక్యం మాఘంలోనిది కాదు. అది కుమారసంభవం లోనిది.

(8) తురగ = గుఱ్ఱములయొక్క, బహువిధ = పలువిధములయిన, ఆరోహకళా = ఎక్కుటయను విద్యయందు, రేవంతునకున్ = అశ్వశిక్షకుఁడయినవానికి.
(ఆనంద. మను)

రేవంతుడంటే అశ్వశిక్షకుడు కాదు. ఇది ఊహించి వ్రాసిన అర్థం. 'అశ్వారోహణకళయందు అశ్వశిక్షకు' డయినవానికి అని అనడం బాలోక్తిగదా. రేవంతుడు అనేది సంజ్ఞావాచి. అతడు సూర్యపుత్రుడు. భార్య సంజ్ఞాదేవి భర్తృతాపాన్ని సహించలేక ఆడగుర్రపురూపం ధరించి వుత్తరకురుభూముల్లో తపస్సుచేస్తూవుంటే మగగుర్రపు రూపంతో సూర్యుడు ఆమెను కలిసినప్పుడు జనించిన పుత్రుడు రేవంతుడు. ఇతడు అశ్వవాహనుడు. ఈకథ మార్కండేయపురాణంలో దృష్టం. వీరచరిత్రపూర్వభాగంలో రేవంతముల్లో రేవంతుడి బయలు అనేచోట్ల ఈశబ్దానికి ఈఅర్థమే అను సందేయం. రేవంతుడంటే అశ్వశిక్షకుడనే అర్థంకాదని ఆశబ్దంజాతివాచికాదని సంజ్ఞావాచి అని స్పష్టపరచాను. పై ఊహింపు అర్థం జూలూరి అప్పయ్యపండితులదిగా కనబడుతున్నది. దీన్నే ఆనందాదిముద్రాలయాల్లో ప్రకటితమైన మను చరిత్రలు పేరు చెప్పకుండా గ్రహించినవని అనుకోనవచ్చును.

9 "మనువునుగురించి మేధాటితి
10 లాత్యాయన" (కామరాజు హనుమంతరావు.) హింజీ 146;47.

(9) మేధాటితి కాదు మేధాతిథి. మేధాతిథి మనువును గురించి యేమీవ్యాసంవ్రాయలేదు. మేధాతిథి మనుస్మృతికి వ్యాఖ్యాన కర్త. ఆవ్యాఖ్యకు మనుభాష్యమని పేరు. Medthatithi on Manu అని మూలంలో వున్న పఙ్క్తిని చూసివ్రాసిన తెలియనిమాటలివి. ఇట్లాంటి

అల్పవ్యుత్పత్తితో Hindu view of life వంటి గొప్ప గ్రంథాలను అనువదించబూనడం దానికి మూలగ్రంథకర్త సమ్మతించడం తెలుగు దురదృష్టంగదా.

(10) లాత్యాయనుడు కాదు లాట్యాయనుడు. ఇంగ్లీషుమూలంలో "Katyana-Latyana" అని ఒకచోట ఉన్నారు. కాత్యాయనుడివలె లాత్యాయనుడుగూడా వుండవచ్చునని అనువాది వూహించాడు. ఇట్లానే మరిఒకచోట చూసి తెలియక అవకతవకలు వ్రాయడం యింకొకపుస్తకంనుండి ఉదాహరిస్తాను.

(11) కుమారిలభట్టు 'పాంబు' అనుదానికి బదులు 'పాంప్' శబ్దము నుదాహరించుటచేతను,

(12) కుమారిలభట్టు 'ఆంధ్రద్రావిడభాష' యనుపదము నుపయోగించెననియు నయ్యది దక్షిణదేశభాషలనుద్దేశించి వాడఁబడినదనియును, తెలియుచున్నది.
(విద్వాన్. జి. జె. సోమయాజి. ఎమ్. ఏ. ఎల్. టి.) ద్రావి. 13;174.

(11) కుమారిలభట్టాచార్యులు పాంప్ అని చెప్పలేదు.

**तद्यथा पाप् शब्दं पकारान्तं**
**सर्पवचनं अकारान्तं कल्पयित्वा।**

(त १-३-१०)

అని అనుసాసికంలేని పాప్‌శబ్దాన్ని ఉదాహరించారు.

(12) ఆంధ్రద్రావిడభాష అని వచించలేదు. **तद्यथा द्रविडादि भाषायामेव** అనేమాటలను వాడినారు. (त १-३-१०)

(13) వ్యాకరణమహాభాష్యము చదువుకోకపోతే శబ్దమంజరివల్ల ప్రయోజనము లేదు.
మహాభాష్యము చదువుకొంటే శబ్దమంజరివల్ల ప్రయోజనములేదు.
(చిలుకూరి నారాయణరావు, ఎమ్. ఏ. ఎల్. టి. పి. హెచ్. డి.) (సం. లో)

ఇవి ఊహింపుమాటలు. మహాభాష్యం చదవకపోతే అర్థంకాదని చెప్పబడినది పదమంజరికాని శబ్దమంజరి కాదు.

"अनधीते महाभाष्ये व्यर्था स्यात् पदमञ्जरी"

అని అన్నచోట పదమంజరి కాశికావృత్తి వ్యాఖ్య. అది హరదత్త విరచితం. శబ్దమంజరి పిల్లల ప్రథమశిక్షాపుస్తకం. శాస్త్రసంప్రదాయం తెలియక వ్రాసిన గాలిమాటలను చూపినాను.

(14) కుమారిలభట్టు............ఇతఁడు జైమినిసూత్రములకు భాష్యమును విర చించెను. (చిలుకూరి వీరభద్రరావు,) ఆం. చ. 218 ప్రథమభాగం.

(14) జైమినిసూత్రాలకు భాష్యం వ్రాసినది శబరస్వామి. కుమారిలభట్టు కాదు. ఆగ్రంథానికి శాబరభాష్యమని పేరు. ఈశాబరభాష్యం మీద కుమారిలభట్టాచార్యులు వార్తికం వ్రాశారు. పైన ఉదాహరించిన పఙ్క్తులదుష్టత విజ్ఞులకు విదితమేగదా అని విస్తరించి వివరించలేదు ఇక రేజీకటి వుజ్జాయింపుసంస్కృతం, దూడవేడ సంస్కృతం, మరియొక చోట పీఠికలో వివరించదలచి యిక్కడ వదలినాను.

పైన చూపిన అసంబద్ధతలవంటివాటిని గుణదోషవిచారానికి కావలసిన బుద్ధిగాని శక్తిగాని లేక యేదిపెట్టినా మింగేఅధిమాంధికాగు లుమాత్రమే పత్తిగింజల బసవన్నలవలె స్వీకరిస్తారని స్పష్టం. అప భ్రంశాలు కనుక్కొని నిరసించగలిగి గుణవిశేషాలకు ఆహ్లాదించగల విద్వచ్ఛ్రేణి దేశంలో బలవిశిష్టంగా వుంటే పైనచూపినరకపు పుట్ట గొడుగుగ్రంథాలుకాక ఉదాత్తకోటిలో చేరదగినవి ఉత్తమాధి కారులకు గ్రాహ్యంకాదగినవి ఉద్భవిల్లడానికి అవకాశం యేర్పడు తుంది. ఆ అవకతవకలపఙ్క్తులకర్తలు వాఙ్మయానికి ఉపకారం చేయ వలెననే సంకల్పంకలవారే పూజ్యులే అయినప్పటికీ, తమగ్రంథాలు పరిణతులైన విద్వాంసులు చూస్తారనేసంజ్ఞానం వారికి ఉండినట్లైతే యింకా కొంచెం హెచ్చుశ్రద్ధవహించి తమగ్రంథాలు నిష్కల్మష దశలో వుండడానికి యత్నించి వుంటారనిమాత్రం చెప్పి యీవిచా రణ ముగిస్తున్నాను.

సర్ రాధాకృష్ణులవంటి పరిణతబుద్ధులు తమ భావాలను తెలుగులో తెలపడంగాని తెలపడానికి యత్నించడంగాని లేకపోవడం విద్వల్లోకంలో పఠనపాఠనాల్లో తెలుక్కువుండే అధమస్థితి ఫలంగాక మరేమికాగలదు? తెలుగుప్రాచీనకాలంనుండి యిప్పటివరకు అధమ దశయందుండడం నిరూపించాను. ఇట్లా అధమాధికారులకు వుద్దిష్టం గనుకనే తుంచడం, మార్చడం మొదలైన అనౌచిత్యాలతో ఇవి వీరికి చాలవా అని సంగ్రహాలను దరువుప్రాధాన్యంతో ప్రాచీనులు రచించారని అనుకోనవచ్చును. ఇక ఇట్లాటి సంగ్రహాలను మాత్రమే చదివి తెలుగులో వ్రాయడం మొదలుపెట్టే వారికృతులు రచనలు అంతకంటే అధమదశలో వున్నవారికిగాని వుపాదేయం కావనడం విదితమేగదా. ఇట్లా అధమాధికారులకు వుద్దిష్టమైన పురాణసంగ్రహాలు అట్లానే క్షుద్రంగా వున్న మరికొన్ని పుస్తకాలు పాఠ్యగ్రంథాలుచేసి విద్వాన్, బి. ఏ. ఆనర్స్, యం. ఏ. మొదలైన పరీక్ష లేర్పరచడంవల్ల స్పృహణీయమైన ప్రయోజన మేమీసిద్ధించదని విజ్ఞులకు వేరుగా చెప్పవలసినది లేదు. కణాదుడు, గౌతముడు, శంకరుడు, ఆనందవర్ధనుడు, అభినవగుప్తపాదుడు మొదలైన మహావిజ్ఞానసంపన్నుల రచనలకు అంధులైపురాణకథలూ అట్లాటివే మరికొన్ని చిల్లరపుస్తకాలూ పఠించడం పరమవిద్యగా వుండే విద్వానుల భాషాప్రవీణుల విజ్ఞానపురకమేమి? అట్లానే అంధతతో పొందిన బి. ఏ; యం. ఏ. మొదలైన ఉపాధులకు భారతీయ విజ్ఞానవిషయంలో విలువయేమి? అనేప్రశ్నలకు నీళ్లు నమలడమే ప్రతివచనం కదా? బి. ఏ; యం. ఏ. మొదలైన ఉపాధుల ముఖ్యవిషయాల కన్నిటికీ లేదా ప్రకృతం "శిరోమణి" "విద్యాప్రవీణ" ఈఉపాధుల విజ్ఞానవిషయాలమట్టుకైనా తెలుగులోనే నిర్బంధంగా పరీక్షజరుగవలెనని యేర్పరచిననిమిషమే ఆంధ్రభాషయొక్క క్షుద్రదశతొలగడానికి ఆరంభకాలం కాగలదు. ఇప్పుడంతగా ప్రయోజనవంతమైనపనిలేక తగినప్రతిఫలం ప్రాపించకుండా ధనాన్ని వ్యయపరు

స్తున్న ఓరియంటల్ రిసర్చి ఇన్స్టిట్యూట్ తెలుగుశాఖను, పైన తెలిపిన పనికి అనుకూలంగా, అనువాదశాఖగామార్చి, యింగ్లీషులోను సంస్కృతంలోను విజ్ఞానవిషయకంగా వున్న ప్రామాణికగ్రంథాలను తెలుగులోకి తర్జుమా చేయించవచ్చును. అంతేగాక శాస్త్రీయవిషయాలను సంస్కృతసాహాయ్యం లేకుండా తెలుగులో తెలపడం అసాధ్యంగనుక, అభిమానశాస్త్రంలోప్రావీణ్యానికీ ఆంధ్రరచనాకౌశలానికీ తోడు సంస్కృతభాషయందు నైపుణ్యం కలిగే విద్యావిధానం యేర్పాటు చేయవలసివున్నది. ఈపని కావలసినంతవరకు జరిగితేనేగాని ఆంధ్రవాఙ్మయేతిహాసులో స్మరణీయదశ యేర్పడి ఆంధ్రభాషాగ్రంథాలకు వుత్తమాధికారి గ్రాహ్యత్వం సిద్ధించదని, అట్లాగాక కొన్ని అసంగతపురాణసంగ్రహాలకు ఆటీరు మరికొన్ని చిల్లరపుస్తకాలకు పరీక్షలు ఉపాధులు యేర్పరిస్తే ఇదంతా ఆంధ్రభాషాభివృద్ధి అని మనము చంకలు కొట్టుకొనడం మిక్కిలి తెలివిమాలినపని అని చెప్పి ఆనుషంగికంగా వచ్చిన యీవిచారం యింతటితో ముగించి ప్రకృతానికి వస్తాను.

నన్నయకాలంమొదలు ఇప్పటివరకు యేర్పడిన తెలుగుకృతుల స్థితి తెలిపినాను. ఈసంగతి పూర్వపక్షపరామర్శ పూర్వకంగా విచారణ చేసి సిద్ధాంతంమట్టుకు యిక్కడ నిరూపించాను. నన్నయాదులకృతుల్లో ఉండేసంస్కృతం వారి ఉద్దేశమైనా అధమాధికారులకు సయితం పనికిరాకపోవడం, తిక్కన విరాటపర్వంలోని అధిక ప్రసంగాలు భగవద్గీతాహానం, ఉద్యోగపర్వంలోని రాయభారపుఘట్టాలు, మనువసుచరిత్రాదుల వర్ణపుకృతులు, వేమనపింగళిసూరనాదులకృతులు, అదివరకు లేక మద్రాసు విశ్వవిద్యాలయం వచ్చిన తర్వాత తెలుగు పండితులు తెలుగు లెక్చరర్లు అని యిట్లా యేర్పడ్డవారివృత్తం, వారిలో అనేకుల వ్యుత్పత్తి, పండితశబ్దంయొక్క అర్థం, తెలుగులో పండితుడు అనే మాటలకు ఇప్పుడుగల అర్థం, తెలుగుపండితులనే వారిలో అనేకులకు దేశవిజ్ఞానంతో యెంతవరకు సంబంధంగలదు అనే అంశం, తెలుగు కృతికర్తలు కొందరు అపభ్రంశాలు వ్రాసి తమ అవ్యుత్పన్నత

కప్పి పుచ్చుకొనడానికి వ్యాకరణాదులు కొంత చూచి వారిని ఆశ్ర యించడం, వారు కొన్ని అవకతవకలు వ్రాసి యియ్యడం, అవి తమ వ్రాతలుగా వీరు ప్రకటించుకొని లోకవంచనా ఆత్మవంచనా కావించడం, దానివల్లకలిగే అజ్ఞానవర్ధనాద్యనర్థాలు, తెలుగుపండితు లనే వారు పాఠశాలలో కాక బయట వుండవలసినవిధాన్ని గురించి కొందరి అభిప్రాయాలు, వ్యాకరణాభ్యాసం లేకుండా బట్లరు ఇంగ్లీషు వంటి దూడపేడ సంస్కృతం తెలుగుపుస్తకాల్లో వాడితే యేమి అనే వారిమాటలు, లౌకికశబ్దాలు వదలి నన్నయాదుల ఛాందస శబ్ద రూపాలతో ఛాందసపు తెలుగుశబ్దాలతో పుస్తకం వ్రాయవద్దా అనే సంగతి, తెలుగువంటి జీవద్భాషలకు వ్యాకరణం లేకుంటే యేమి అనే మాటలు, అష్టావధానమని శతావధానమని కర్తలకు బుద్ధిదుర్వ్యాని యోగాద్యనర్థాల హేతువు, కారయితలకు ఫలరహితం అయినవాటిని ఆచరిస్తూ అక్షరాలతమాషాపద్యాల కుప్పలుచేసి కవులమని అది కవిత్వమని కొందరు ఉప్పొంగడం, విజ్ఞానలబ్ధి లేకుండా కవిత్వం దానంతటఅదే పుట్టుకొని వస్తుంది అని కొందరు అనుకొనడం, భారతీయుల విజ్ఞానలబ్ధికి ప్రకృతదశలో సంస్కృతవిద్య ఆవశ్యకమా కాదా అనే సంగతి, బిరుదులు చేరివున్నమాత్రాన వారికృతులు బాగా వుండవచ్చునని కొందరు తలచడం, కృతిసమర్పణోత్సవాలు చేస్తే కృతులు గొప్పవవుతవని కొందరు ఆసించడం, ఆశువు అని పేరుపెట్టి శ్రీఘ్రంగా పద్యాల కుప్పలుచేస్తే అది కవిత్వమని కొందరు అడావుడిపడడం, పద్యాలపుస్తకం యెంతలావుగావుంటే అంత గొప్ప కవిత్వమని కొందరు తాండవించడం, అట్లా పద్యాలపుస్తకం లావుది తయారుచేయడం మహిమ అని కొందరు నర్తించడం, పద్యాలు గద్యవాక్యాలు వ్రాయడమే పరమవిద్య అయి బుద్ధిపరిపాకంలేని శోచనీయులు కొందరు కృతికర్తలుగా పత్రికల్లో వ్యాసాలకర్తలుగా బయలుదేరడం, అంకితం చేసినవారికి తమకృతి భార్య అని కొందరు

వచించడం, గద్యంపద్యం కలిసిన కృతులకు చంపువనేపేరు ప్రసిద్ధంగా వుంటే దాన్ని మరవడం, గద్యం లేకుండావుంటే అది ఒకవిశేషమను కొనడం, నిరుక్తి అనే అర్థంగల నిర్వచన మనేశబ్దాన్ని తప్పుపేరుగా దానికి పెట్టడం, గర్భకవిత్వమని ఒకపద్యంలో ఇంకొకపద్యం చొప్పించి రెండుమూడుఅర్థాలు చేర్చి, నిరోష్ఠ్యమని ఇంకా యేమోనని కొన్ని అక్షరాలు వదలి కొన్నిమాటలు విడిచి కుస్తీచేస్తే అది నిగ్గు కవిత్వ మని కొందరు తాళాలు కొట్టడం, ఈకాలాన ఒక సభగాని విందుగాని జరిగితే ఒకవూరినుండి మరియొకవూరికి యెవరైనాపోతే, తుమ్మితే దగ్గితే చొప్పదంటుపద్యాలు పోగులు పడడం, యాచించడానికీ ఇయ్యక పోతే తిట్టడానికీ అప్పకవి పద్యాలను సాధనంగా గట్టిపరచడం, ఆసా ధనాన్ని అవలంబించి కొందరు ధనవంతులను వ్యవహారసంబంధులను ఆశ్రయించి వారిని స్తుతించి వారివద్దనుండి కొంతధనాన్ని, పుచ్చు కొంటివాయినం అన్నట్లు, కొన్ని స్తుతులను పొందడంవల్ల, అందులో, బహిరంగంగా ముఖ్యమైన అన్నికులాల తెగల వివిధలక్షణాల మను షులను చేర్చినసభల్లో పొందడంవల్ల, తమకృతులు ఉత్కృష్టమవుతవని కొందరు భావించడం,

"न तच्छास्त्रं न तच्छिल्पं न सा विद्या न सा कला"
यन्न भवेन्न च काव्याङ्गमहो भारो महान् कवेः ॥

(కావ్యాంగం కాకుండావుండే శబ్దంగాని, అర్థంగాని, న్యాయంగాని, కళగాని లేదు, అహా!కవిభారం గొప్పది) అని యిట్లాకవి సామగ్రిప్రతి పాదిత మవుతూవుంటే విద్వత్ కవులమని కొందరు మురియడం,

"अनन्तशास्त्रं बहु वेदितव्यं.........अल्पश्च कालः"

అని విజ్ఞులు పలుకుతూవుంటే రేజీకటి సంస్కృతంతో ఉభయభాషా పారంగతులమని కొందరు ఊరేగడం,

నిను మెచ్చబోవుచుంటిని నను మెచ్చుచు నుంటివీవు"..........." (యేకవీర.)

అని యిట్లా ఒకరినొకరు కొందరు పొగడుకొనడం, నేటికాలపు కవిత్వ మనే గ్రంథంలో తెలిపిన అయోమయం మొదలైనవి ఇప్పటి పద్య కృతుల్లోవలె గద్యకృతుల్లోకూడా అనేకమైనవాట్లో కనబడడం, లోకో త్తరమైన కల్పనలు వూహాలు లేకపోవడం అట్లావుండగా శీలభ్రష్టలైన స్త్రీల, వారికి తగిననాయకుల, ఇట్లాటి మరికొందరి చిల్లరమనుషుల వృత్తం కొన్ని పద్యపుస్తకాల్లోను గద్యపుస్తకాల్లోను ప్రహసనేతరాల్లో బహు ళంగా నిండడం, యెక్కడ దేనిని చెప్పవలెనో ఆవివేకం లేక సందర్భ మున్నా లేకపోయినా తమకు తెలిసినసంగతులన్నీ కొందరు కుక్కడం, విచార్యమాణవిషయంలో ఆవశ్యకమైన ప్రవేశం లేకుండా కొందరు అసంబద్ధాలు రచించడం, అశ్లీల చిత్రాలు పుస్తకాల అట్టలమీద వేసి దానివల్ల కొంత ఆకర్షించవచ్చునని కొందరు ఉత్సహించడం, అనువాదం జేసినమాత్రాన మూలగ్రంథకర్తలతో సమత్వం ఆరోపించుకొని ఆంధ్రగౌతములు, ఆంధ్రకణాదులు, ఆంధ్రశుక్రులు అనేటివన కొందరు అనుచితప్పేర్లతో సంభ్రమించడం, అనువాదంచేసి పద్యాల అనువాది గాని గద్యపు అనువాదిగాని ఉభయపు అనువాదిగాని కాదగి వుంటే ఆ అనువాదమే ప్రధానహేతువుగా కవి చక్రవర్తులమని కవి సమ్రాట్టులమని కొందరు గంతులువేయడం, పేరు చెప్పక చెప్పీ చెప్పక దొంగిలించి యెంగిలివ్రాతలువ్రాసి కాళిదాసు కవిత్వం కొంత అనే సామెతను జ్ఞప్తికితెస్తూ కొందరు మూలగ్రంథాలకు స్వరూప వికృతి కలిగించడం, పాతకాలపువేషంతో వుండేవారికృతులు మంచి వని కొందరు, ఇప్పటికాలపువేషం గలవారివి శ్రేష్ఠంగావుంటవని కొందరు, అటూయిటూ కాక మధ్యరకపువేషంవారివి గొప్పవిగా వుండ వచ్చునని కొందరు, ఇంగ్లీషు చదివిన వారిగ్రంథాలు గణనీయమని కొందరు, ఇంగ్లీషు రానివారి కృతులు ప్రశస్తమని కొందరు, బ్రాహ్మ ణుల కృతులు ఆదరణీయమని కొందరు, నియోగులవి ఉత్తమమని కొందరు, కాదు వైదికులవి శ్లాఘ్యమని కొందరు, వారూ వీరు

కాని మాధ్వులు ద్రావిడులు శ్రీవైష్ణవులు మొదలైనవారివి ఉపాదేయ మని కొందరు, బ్రాహ్మణేతరులవి అంగీకార్యమని కొందరు, యేకులమైనా సరే స్త్రీలగ్రంథాలు సంభావ్యమని కొందరు, నేనెక్కువంటే నేనెక్కువని పద్యాలతో పోట్లాడేవారిగ్రంథాలు గ్రాహ్యంగా వుంటవని కొందరు, తెలుగులో కాక ఇంగ్లీషులో యెవరైనా మెచ్చుకుంటే లేదా ఇంగ్లీషులోకి గ్రంథం అనువదించబడితే అది ఉత్కృష్టంగా వుండవచ్చునని కొందరు, పద్యాలకర్తలు మొదలైనవారివల్ల బహిరంగంగా స్తుతి పొందితే అట్లాటివారికృతులుపొగడదగినవిగా వుండవచ్చుననికొందరు, కర్త మొదలైనవారిచిత్రాలు ప్రకటించేకృతులు గుణవంతంగా వుండవచ్చునని కొందరు, అక్షరాల ఆట (వళిప్రాసలు) ప్రయత్నం లేకుండా పడినట్లు వుంటే అది కవిత్వమని కొందరు మనము మాట్లాడుకొనే సాధారణమైన మాటలు మొదలైనవి, సామెతలు, పద్యంలోవుంటే అదంతా కవిత్వమని కొందరు, తక్కిన విచారంతో మాకు పనిలేదు, అక్షరాల దరువుతోగాని లేకుండాగానిపద్యం వ్రాస్తేచాలును, అది కవిత్వమని కొందరు, సంస్కృతం యెక్కువగా వుంటే జటిలమని రమ్య కవిత్వమని కొందరు, తెలుగు యెక్కువగా వుంటే సొంపు కవిత్వమని కొందరు, అదీ యిదీ సమంగా వుంటే అపేక్ష్యకవిత్వమని కొందరు తలలూచడం, ధార అనర్గళం, శైలి మృదుమధురం, ముద్దులుమూటగట్టుతున్నది అనే యిట్లాటి రోకటిపాటమాటలు, ఈకాలంలో తెలుగులోగురువులని శిష్యులని అనుకొనేవారికి గల విద్యాసంబంధం, వారియెడల వీరి ప్రవృత్తి, ఆధునికమైన మూలగ్రంథాలు అనువాదాలు తదాభాసాలు, శాస్త్రగ్రంథరచనలు వీటి అన్నిటి మీమాంసావిస్తరభీతిచేత వదలుతున్నాను. పీఠికల్లోని ప్రశంసలను యాచితాభిప్రాయాలను గురించి వాఙ్మయపరిశిష్టంలో ద్రష్టవ్యమని చెప్పి ఇక భగవద్గీత వదలిపెట్టడాన్నిగురించి కొంతవిచారిస్తాను. భగవద్గీత వేదాంతానికి సంబంధించినది గనుకను, తెలుగుభారతం కావ్యదృష్టితో రచించబడినది గనుకను, దానిని తిక్కన వదలినాడని కొందరంటున్నారు.

నన్నయాదు లది కావ్యదృష్టి అని వ్యాసు డిది కాదని అనుకో నడం అప్రశ_స్తం.

"కవివృషభులు సహాకావ్యమనియు"

అని నన్నయ్యే సంస్కృతభారతం కవులదృష్టిలో మహాకావ్యమని చెప్పుతున్నాడు.

" प्रबन्धे च अंगी रस एक एव
उपनिबध्यमानोऽर्थविशेषलाभं
छायातिशयं च पुष्णाति कस्मिन्निवेतिचेत्
.........यथावा महाभारते" (ध्व. लो.)

(ప్రబంధంలో ప్రధానరసం ఒకటే ప్రతిపాద్యమవుతూ అర్థ విశేషలాభాన్ని ఛాయాతిశయాన్ని పోషిస్తున్నది. యెట్లానంటే మహా భారంతలోవలె)

అనేకచోట్ల ఆనందవర్ధనుడు మహాభారతం శాంతరసప్రధాన మైన కావ్యమని చెప్పుతున్నాడు. భారతం కావ్యమని భారతంలోనే ఉ_క్తం.

" कृतं मयेदं भगवन् काव्यं परमपूजितम्" (आदि)

(ఓ మహానుభావుడా! పరమపూజితమైన యీకావ్యం నాచే చేయబడినది.)

అని వ్యాసుడే బ్రహ్మతో చెప్పినట్లు విదితమవుతూవుంటే వ్యాసుడికి కావ్యదృష్టి లేదనడం అవివేకం. కాళిదాసాది మహాకవులకు సంశ్రయం కాగలిగిన వ్యాసుడికి కావ్యదృష్టి లేదనడం నిజంగా తెలివి మాలినపని. మాకు పైవాక్యాలు ప్రమాణం కావంటారా, మీ వాక్యాలు ప్రమాణం కాదని అంతకంటే చులకనగా తోసివేయ వచ్చునుగదా! ఇవన్ని సాహిత్యసాంప్రదాయం తెలియని అజ్ఞాన

వచనాలని అంటున్నాను. పోనియ్యండి నన్నయాదులది కావ్యదృష్టి అనే మాట కొంతసేపు ఒప్పుకొని విచారిస్తాను. భగవద్గీత వేదాంతం గనుక దాంట్లో కవిత్వంలేదని తిక్కన మానివేస్తే, శాంతిపర్వం ఆను శాసనికపర్వం యింకా అక్కడక్కడ వచ్చే కణికనీతివంటి రాజనీతులు మార్కండేయుడి ధర్మప్రవచనం యెందుకు తెలిగించారు? భగవద్గీతలో లేని కవిత్వం రాజధర్మమోక్షధర్మాలను ప్రతిపాదించే శాంతిపర్వంలో యేమున్నది? భగవద్గీత వేదాంతమైతేశాంతిపర్వంలోని మోక్షధర్మ ఘట్టాలు సృష్టిక్రమాదులనిర్వచనం వేదాంతం కాదా? కావ్య దృష్టితో రచించాడు గనుక తిక్కన భగవద్గీత వదలిపెట్టినాడనడం తలాతోకాలేని అప్రశస్తపుమాట. తెలుగుభారతం అధమాధికారులకు వుద్దిష్టం. గనుకనే దానిని వదలిపెట్టినాడు. బ్రహ్మవిద్యకు ప్రధానాంగాలైన ప్రస్థానత్రయంలో భగవద్గీత ఒకటిగను, బ్రహ్మవిద్యయందు శూద్రాదులకు అధికారం లేదని బ్రహ్మసూత్రమందలి అపశూద్రాధికరణంలో నిర్ణీతమైనది గనుకను అధమాధికారులకు అది అగ్రాహ్యం కావడంవల్లను శాంతిపర్వాద్యపేక్షచేత అధమాధికారులకు కఠినమైన భగవద్గీతను తిక్కన వదలినాడని స్పష్టం. ఈసంగతినే అహోబలుడి పద్యాలు వ్యక్తం చేస్తున్నవి. కావ్యదృష్టివల్లనని అట్లానని యిట్లానని వ్రాయడం సంప్రదాయవివేకంలేని అజ్ఞానపు మాటలని చెప్పి యీ విచారణముగిస్తాను.

ఇక తిక్కన అధికప్రసంగాలు. తిక్కన విరాటపర్వస్థకీచకవధలోని చేర్పుడాలు గొప్పకవిత్వమని కొందరు తలుస్తున్నారు.

"విరాటపర్వములో దిక్కన్న వ్రాసిన శృంగారవర్ణనము అనన్యసాధ్యమని వేఱుగఁ జెప్పవలయునా? ఔచిత్యశోభితము."

అని శ్రీరామలింగారెడ్డివారు.

"ఇట్టి కీచకవధఘట్టమునకు భీముని నాయకునిఁగాఁజేసి శృంగార వీరరసముల కంగాంగిభావము కల్పించి యనేకవిధములగు నూతన వర్ణనలఁ జేర్చి యీకథ నొక చక్కని ప్రబంధముగా రచించినాఁడు."

అని శ్రీ కోరాడ రామకృష్ణయ్యవారు.

"తిక్కనార్యుని కీచకునియందన్ననో, మానవస్వభావము చక్కఁగఁ బ్రతిబింబించుచున్నది......తిక్కన కీచకుఁడు ఉత్తమనాగరకుఁడు, సరసుఁడు;...... తిక్కన మానవప్రకృతి పొండితిని 'హేమవిద్యం' బోనిదానిని ఎంతని కొనియాడ నగును!"

అని శ్రీ గుఱ్ఱం సుబ్బరామయ్యవారు.

ఇట్లానే మరికొందరు అనుకొంటున్నారు. ఆచేర్పడాలు అధికప్రసంగమని దుష్టమని తెలుపబోతున్నాను.మంచిది ఆసంగతి విచారిస్తాను. సీతావిషయకమైన రావణరతి,ద్రౌపదీవిషయకమైన కీచకరతి, రసాభాసం. అంతేగాక అది హేయం. ఈ హేయత్వాన్ని వివరించవలసిన పనిలేదు. విస్తరం నేటికాలపు కవిత్వమనే కృతిలో శృంగారాధికరణంలోను క్షుద్రకావ్యాధికరణంలోను ద్రష్టవ్యం. సంచారిభావాదిసామగ్రి ఉత్తమనాయకుల రతిసందర్భంలో శోభిస్తవి గాని రత్నాద్యలంకరణం మురుగుడుబురదనీటికుండకువలె దుష్టరతికి హేయం, అత్యంతం అనుచితం. నింద్యత ప్రకటితమయ్యేవిధంగా ఇట్లాటిరతిని తెలుపవలెను గాని చీము పుండుమీద యీగవలె, దానియందు సక్తి కనబరచడం అప్రశస్తం. కనుకనే రామాయణంలో రావణుడు సీతను ప్రార్థించడం ఆమె నిందించడం, తిరిగి అతడు పూలుబుక్కాయి సవరించుకొని మళ్లీ ఆమెనుప్రార్థించడం,తిరిగి ఆమె దూషించడం తప్ప అతడి మన్మథావస్థను సంచార్యాదులచేత విపులీకరించలేదు. అట్లానే మహాభారతంలో కీచకుడు సుదేష్ణతోను ద్రౌపదీతోను గట్టిగా తన కామవికారం తెల్పుకొనడంతప్ప వేరేవిధంగా అతడి విరహతాపాలాపాలు మొదలైనవి వివరించలేదు. యెందుకంటే అవి తుచ్ఛమే కాకుండా అనావశ్యకం కూడా అయివున్నవి. దుర్బలచిత్త అయితే లభించేటట్లు అతడికామప్రార్థనలు కొంతవరకు దీర్ఘంగా ప్రతిపాదితమైనవి. అంతేగాని అతడి శృంగారాన్ని సంచార్యాదులతో వర్ణించలేదు. కాని తిక్కన్న యీ

వివేకం కోల్పోయి కీచకరతిని అనేకమార్గాల విస్తరింపజేసి ఆసక్తితో దాన్ని ప్రతిపాదించి యీగపని చేశాడు. పై అంశాలు కథాభాగాలు కాక ద్రౌపదిని చూచినతరువాత సుదేష్ణతో మాట్లాడకముందు యే కాంత సంభాషణరూపాన కొన్ని సీసపద్యాలు, మరికొన్ని వృత్తాలు మొదలైనవి దండగబెట్టి కీచకుడి రతిని మూలంలో లేనిదానిని పుష్కలంగా మనకు తెలిపినాడు. అక్కడ ఆగలేదు. కల్లు తేవడానికి ద్రౌపదిని సుదేష్ణ పంపుతానన్నతరువాత తిరిగీ కీచకకామాగ్ని అమూలాన్ని. యింకా కొన్నిపద్యాలతో విపులీకరించాడు. ఇంతటితో పూరుకొనలేదు. నర్తనశాలకు రమ్మని ద్రౌపది చెప్పినతరువాత మళ్లీ మూలంలో లేని కీచకవిరహాన్ని సంభ్రమంతో వర్ణించాడు. చిన్నపద్యాలతో తృప్తిలేక కాబోలు

> సీ. ఇయ్యింతి ప్రాపున నయ్యనంగుఁడు పార్వతీశుసైనను దక్కనేలకున్నె
> కేలిమైనొక్కట లీలఁగ్రేళ్ళసఁగెడు వాలుగు సోగలమేలు డించి
> లీలనాముందట నాలేమపాలసినఁ జూడ్కికిఁ జుబ్బనచూఱగాదె
> కనువిచ్చి నన్ను నాతనుమధ్యచూచినఁ దనువున కమృత సేచనముకాదె.
>
> (తి. భా. వి.)

అని సీసాలను అడుగడుగ్గా ఆహ్వానిస్తాడు.

ఈ సీసాలు బాగా వున్నవి గదా అంటే అది కులటావిలాసంవంటిదని చెప్పుతున్నాను. ఈ సంచారివర్ణనలతో పూరుకొనలేదు. అతడి విరహావస్థకు వుద్దీపనంగా వనవిహారాన్ని కల్పించాడు. అంతటితో ఆగలేదు. పొద్దుక్రుంకకపోవడం అతడికి దుస్సహంగా వున్నదని మూలంలో రెండుమాటలు చెప్పితే దానికి సూర్యాస్తమయవర్ణనను చేసి అతడి అనంగదశకు దాన్ని తగిలించాడు. తపుడుతింటూ వయ్యారం అన్నట్లు ఈ పాడుపనిలో దరువులుకూడా వేశాడు. ఇదంతా మురుగుడు బురదకుండకు రత్నాలద్యలంకరణం వంటిదని అది తుచ్ఛమని దానియందు సక్తి

ఈగపని అని తెలిపినాను. అదిగాక రసాభాసం కావ్యంలో అంగంగా వుండదగినది. దాన్ని అనుచితంగా విపులీకరించడం అంగవిస్తరమనే రసదోషానికి హేతువని సాహిత్యవేత్తలు చెప్పుతున్నారు.

"अंगस्याप्रधानस्यातिविस्तरेण वर्णनम्" (का. प्र.)

[అతివిస్తరంగా అంగంయొక్క, అంటే ప్రతినాయకాదుల, వర్ణనం (రసదోషం)]

అని మమ్మటుడు.

"तथा च तद्गत एव रसः प्राधान्येनास्वाद्येत न तु नायकगतः प्रधानो-रस इति दोषः" (का. प्र. व्या.)

[అట్లా (అయితే) ప్రతినాయకగతరసమే ప్రధానంగా ఆస్వాదిత మవుతుంది. కాని నాయకగతప్రధానరసం ఆస్వాదితం కాదు. కనుక దోషం]

అని వామనాచార్యులు.

హేయరసాభాసం అంగంగాక ప్రధానమైతే కావ్యం భ్రష్టమై దూష్యకోటిలో చేరగలదు. గనుక అవశ్యకమైనచోట అది అంగంగా మాత్రమే వుండడం వుచితం.

"प्रतिषिद्धविषयत्वादिरूपं सामाजिकसंवेद्यं" (का. प्र. व्या.)

(సామాజికులకు ప్రతిషిద్ధవిషయత్వాదిరూపంగా సంవేద్యమయ్యేది) అని ఈ ఆభాససందర్భంలో న్యాయరత్నమహేశచంద్రులవా రన్నారు.

అంగమైన ప్రతినాయకవృత్తంలో వనవిహారజలక్రీడాదులు ఒక గ్రంథకర్త ప్రతిపాదిస్తే అది దుష్టమని

"हयग्रीवस्य जलकेलिवनविहाररतोत्सवादेर्नायकापेक्षया विस्तरेण वर्णनं हयग्रीवस्य नायकत्वमेव प्रत्याययते न तु प्रतिनायकत्वमितिदोषः।"

न च "वंशवीर्यश्रुतादीनि वर्णयित्वा रिपोरपि ।" इत्यादिना विरोध इति वाच्यं ।

"यद्गुणत्वेन रिपोर्वर्णनेन नायकोत्कर्षप्रतिपादनं तत्रैवास्य तात्पर्यात् न तु वनविहारादावपि ।" (का. प्र. व्या.)

[హయగ్రీవుడియొక్క జలకేళి వనవిహారం, రతోత్సవం మొదలైనవాటిని నాయకుణ్ణి మించి అధికంగా వర్ణించడంవల్ల హయగ్రీవుడే నాయకుడని ప్రతీత మవుతుంది. (కాని అతడి) ప్రతినాయకత్వం (ప్రతీతం) కాదు. కనుక దోషం......శత్రువుయొక్క వంశవీర్య శ్రుతాదులను వర్ణించి,అంటే వర్ణించడంవల్ల, కూడా (నాయకోత్కర్ష ప్రతిపాదనం మనకు ప్రీతికరం.) అనే(దండి)మాటలచేత విరోధం సంభవిస్తుంది అని అనరాదు. యెందువల్లనంటే శత్రువు యేగుణాలుగలవాడని వర్ణిస్తే నాయకోత్కర్షం ప్రతిపాదితమవుతుందో అక్కడనే పై వాక్యానికి తాత్పర్యం గాని వనవిహారాదులందు కూడా కాదు.]

అనేపట్టుల్లో సారబోధినీకారులు నిరాకరించారు.

ఇక అంగమైన హేయరసాభాసంలో ఆత్మభాషణ వనవిహార సూర్యాస్తమయాది వర్ణనల విస్తరం దుష్టమని చెప్పవలసిన పనిలేదు గదా! కనుక ఈ హేయమైన ఆభాసమంతా గొప్పకవిత్వమని గంతులు వేయడం అజ్ఞానం.

ఉత్తరభారతపాఠాంతరాలు మొదలైనవి యీ విచారణలో అప్రధానం గనుక వదలినాను. అవునయ్యా, నన్నయాదుల కృతులు అధమాధికారులకు వుద్దిష్టమని మీరే చెప్పినారు వారికి రుచించే మాదిరి తిక్కన మార్పుచేసినాడు, కనుక వుచితమేనంటారా అసంగతం. అధమాధికారులు ఉత్తమమార్గానికి వచ్చేతీరున రచించవలెను గాని వారిని యింకా అధోగతికి తీసుకొని పొయ్యేసరణి అత్యంతం నింద్యం గదా! కనుక, అధమాధికారులకు హేయం ఉచితమనడం నిల్వజాలదు. ఇట్లాటి తుచ్ఛశృంగారం తెలుగుదేశపు తెలుగుకృతుల్లో

ఇప్పుడు మితిమీరడం విదితమని చెప్పి ఈచర్చ ముగిస్తాను. తిక్కన విరాటపర్వమందలి అధిక ప్రసంగాలను వాటి దూష్యతను నిరూపించాను.

పైన తెలిపినట్లు తక్కిన వాటిని విచారించక వదలుతున్నాను. నన్నయాదుల భారతం, నైషధం, మొదలైన అనువాదాలు తుంచడం మార్చడడం చేర్చడం మొదలైన అనౌచిత్యాలపాలై అధమమై ఉత్తమాధికారులకు అగ్రాహ్యంగా వుండడం స్పష్టం గనుక నిర్వివాదమని, ఈసంగతి కాదని యెవ్వరైనా ఋజువుపరచితే ఆమాటలు ప్రామాణికంగా వుంటే నాసిద్ధాంతాన్ని వదులుకొంటానని లేకపోతే ఆమాటలను ఉపేక్షిస్తానని మనవిచేస్తూ యిక ప్రకృతవిషయానికి వస్తాను. నన్నయ మొదలు ఇప్పటివరకు తెలుగు వాఙ్మయపు సాధారణదశ తెలిపినాను. పల్నాటి వీరచరిత్ర ఇందుకు అపవాదం కాజాలదు. కాళిదాసీయాదుల్లోవలె ఉదాత్తభావోన్మీలనాదులు దీంట్లో కనుగొనలేము కనుక కవితావిషయంలో ఇది ఉత్తమత్వప్రతిపత్తిని పొందజాలదంటున్నాను.

## శ్రీనాథవైలక్షణ్యం.

ఈవీరచరిత్ర కర్తయైన శ్రీనాథుడు ప్రాచీనాంధ్రగ్రంథకర్తల్లో విశిష్టుడు. ఇతడి వైదుష్యం అన్యదీయాపేక్షచేత అసాధారణమైనదిగా కనబడుతున్నది. కాళిదాసాదులకు భారతవర్షంవలె ఇతడికి ఆంధ్రదేశం అఖండరూపంతో గోచరించినట్లు విదితమవుతున్నది.

ప్రతాపరుద్రీయంలో విద్యానాథుణ్ణివలె త్రైలింగశూరతేజస్సు ఇతణ్ణి పరవశుణ్ణి చేసినట్లు కనబడుతున్నది. "చిత్తముప్పొంగి" అని వీరచరిత్రంలో ఇతడు చెప్పినమాటలు ఈవిషయాన్ని సూచిస్తున్నవని అనుకొంటాను. పద్యానికి నన్నయాదుల యతిభ్రంశాన్ని ఇతడు అనేక స్థలాల్లో తొలిగించడం స్పష్టం.

తెలుగుభూమి అని ఆంధ్రభూమి అని తనకృతుల్లో పలుచోట్ల ప్రస్తావిస్తూ వచ్చాడు. ఆంధ్రదేశానికి సంబంధించిన భీమఖండాన్ని

సంస్కృతంలో కూడా శ్రీనాథుడే రచించాడేమోనని నేనప్పుడప్పుడు అనుకొంటూ వుంటాను. నైషధం కాశీఖండం మొదలైన గ్రంథాల యందలి గద్యాల్లో, కొన్నిచోట్ల పద్యాల్లో ఒకవిధమైన వాక్యశిల్పం కనబడుతుంది. వేమన స్ఫుటబలోక్తి, పింగళి సూరన మృదుభావనిరతి, శ్రీనాథుడి వాక్యశిల్పం, ప్రాచీనాంధ్రవాఙ్మయంలో గణనీయమైనవని భావిస్తాను. ఆయువుపట్లయిన ఘట్టాల్లో తేలవేసినా అపూర్వభావాలేమీ తెల్పకున్నా సూరన లలితరీతిప్రియత్వం విశుద్ధమనోజ్ఞతాప్రీతి శ్లాఘ్యం. నన్నయాదుల యతిభ్రంశదోషాన్ని శ్రీనాథుడు చాలావరకు తొలగించాడు. కనుక ఇతడిపద్యాలకు శ్రావ్యత్వాదులుదృష్టమవుతున్నవి. ఆకాలాన తెలుగు ఉత్తమవిద్యాద్వారంగావుండి తెలుగుపద్యం కసువు లక్షణాలకు దూరమైవుంటే శ్రీనాథుడు పింగళిసూరన, వేమన వీరివల్ల ఇంకా యెంతవుత్కృష్టమైన కృతులు తెలుగుదేశానికి లభించివుండేవో నని ఉత్ప్రేక్షిస్తుంటాను.

వక్ష్యమాణవిధాన నన్నయాదుల వాటివలె అమార్గగాములైన అనువాదాలనే కావించినా ఉదాత్తభావోన్మీలనాదులు లేకున్నా వున్నంతవరకు పొల్లుమాటల వెంటకుప్పలకింద అణిగేటట్లు చేయక వివక్షితార్థం ప్రసాదగుణంతో స్ఫుటంగా రుజువుగా తెలపడం శ్రీనాథుడి రచనల యందలి విశేషం. ఒకరిద్దరిలో తప్ప తక్కిన తెలుగు కృతికర్తల్లో యీలక్షణం మిక్కిలి అరుదు.

## వీరచరిత్ర విశేషం.

కాళిదాసీయాదుల్లోవలె ఉత్తమకవితాస్వరూపం వీరచరిత్రలో లేకున్నప్పటికీ అది శ్రీనాథుడి కృతుల్లోనే కాక తెలుగువాఙ్మయమంతటిలో విశిష్టమైనదిగా కనబడుతున్నది. దీంట్లో ద్వితీయాక్షరపు ఆటలేకపోవడంవల్ల సగం తుక్కువదలడం మొదటివిశేషం. ఇది తెలుగు సంప్రదాయానికి సరిపడని సంస్కృత వృత్తాలైన శార్దూల మత్తేభాదుల్లోకాక దేశ్యపద్యంలో బసవపురాణాదులవలె వుండడం

రెండవ విశేషం. అనువాదం కాక మూలగ్రంథంగా వుండడం మూడవ విశేషం. మనకు సన్నిహితమైన స్థలాలు మహాశూరనిల యాలై నిద్రించే ఆంధ్రుల్లో వీరత్వాదులను ప్రబోధిస్తూ ఇందు కార్యరంగాలుగా వుండడం నాల్గవ విశేషం. వీరగీతాలనే వాఙ్మయశాఖ యందిది ప్రథమగణ్యమై వుండడం ఐదవవిశేషం.

## పల్నాటివీరచరిత్ర—వీరగీతాలు.

కాటయవేమారెడ్డి కోమటివేమారెడ్డివంటి విజ్ఞులు ప్రభువులుగా వున్న రోజుల్లోకూడా తెలుగులో శ్రీనాథుడివంటి విద్యావంతులు న్యాయాది శాస్త్రగ్రంథాలను సాహిత్యవిచారణాగ్రంథాలను వ్యక్తి ప్రధానమైన స్వతంత్రకావ్యాలను తలపెట్టక సాధారణపు తుక్కు అనువాదాలు చేయడం, ఆకాలాన విద్వాంసులుగాని పండితులైన ప్రభువులుగాని ఉదాత్తగ్రంథరచన తెలుగులో ప్రోత్సాహపరచి వుండలేదని విదితం చేస్తున్నదని తెలిపి యింకో అంశానికి వస్తాను. పల్నాటివీరచరిత్ర వీరగీతాల్లో ముఖ్యమైనదిగా కనబడుతున్నది. వెన్నెలరాత్రుల్లో జనసమూహాలకు వీటిని కథకులు వినిపిస్తుంటారు. సాధారణంగా పిచ్చికుంటజాతివారు ఈ వీరకథలను కీర్తిస్తుంటారు. పంబజోడూ, తిత్తీ సహాయపడుతుండగా కత్తిపట్టుకొని భావానుగుణంగా ఆడుతూ ఈ వీరవృత్తాలను కథకుడు చెప్పుతుంటాడు. భారతీయరూపకానికి బీజాలనదగి భరతుడిచేత ప్రస్తావింపబడిన వృత్తులను ఈకథకప్రవృత్తి పోలివుంటుంది.

సాధారణజనుల్లో ఉద్రేకం కలిగించి వారికి ఆవీరులమీద సద్యః ప్రేరితమైన భక్తివిశేషాన్ని ఆవిర్భవించచేయడం కొంతపరిణతిగలవారికి వీరత్వాదులందు తత్పరత్వం కలిగించడం వీటి ముఖ్యలక్షణం.

ఇట్లాటి శాఖ అరవం మొదలైన దక్షిణభారత భాషల్లోగాని బంగాళీవంటి ఉత్తరభారతభాషల్లోగాని వున్నదేమో నేను చెప్ప

జాలను. వీటి కథనం ద్రవిడదేశంలో వర్ధితమైన హరికథారూపానికి సమీపంగా వుటుందని యెంచవచ్చును. దేశ్యమైన యక్షగానాలను కొంత అనుకరించి నారాయణతీర్థులు కృష్ణలీలాతరంగిణి నిర్మించినట్లు వీరగీతాలను కొంతవరకైనా అనుసరించి సంస్కృతంలో యెవరు రచించి నట్లు కనబడదు.

ఋక్కుల్లో వీరగీతబీజాలు కనుగొనవచ్చును. సంస్కృతం వ్యవహారభాషగా వుండిన కాలంలో వీరగీతాలవంటివి యేవైనా యెప్పడి వుండినవేమో.

ఉదయన విక్రమార్కాదుల ఇతిహాసాలు సంస్కృతభాషలో ఉద్బోధకంగా కీర్తితమయినా అవి ప్రస్తుతవీరగీతమార్గాన లేవు. అయితే సాహిత్యవిషయాన ఈవీరగీతవాఙ్మయం ఉత్తమకవితాశాఖగా పరిగణించ వీలులేదు. కాళిదాసాదుల కావ్యాల్లో వ్యక్తమయ్యే ప్రకృతిశోభలు ఉదాత్తభావవ్యక్తి, పరిణతచిత్త వృత్త్యున్మీలనం మొదలైనవి దీంట్లో కనుగొనలేము. కనుకనే కవితావిషయాన ఉత్తమ శాఖను చెందదని చెప్పినాను. అయితే యిది దేశీయచ్ఛందస్సులో ద్వితీయాక్షరక్రీడతుక్కు సగంపోయి రచితంకావడంవల్లను అక్కడక్కడ వ్యక్తమయ్యే కవితాచ్ఛాయలవల్లను ఇదిమనువసుచరిత్రాదులకంటె మేలైనదేనని చెప్పవచ్చును. ఇదివరకు తెలిపినట్లు అనువాదపుకోటిలో యిది చేరని మూలగ్రంథమని, చాలామట్టుకు వ్యంగ్యవినాశమే కాక క్షుద్రశృంగారాదులతో నిండిన హంసవింశత్యాదుల సాధారణమార్గంనుండి చీలి మహాభారతంవలె శాంత ప్రధానమై వీరాదులను అంగంగా కలిగినదని, బొబ్బిలికథ మొదలైన వాటివలె సల్లధోరణిలో కాక కావ్యమార్గంలో వుండడానికి యత్నిస్తున్నదని, తెలుక్కు మతభాషాగౌరవమేర్పడ్డది ఈ వీరచరిత్రయందే నని, ఇప్పటికీ ఔర్ధ్వదైహికక్రియల్లో బ్రాహ్మణేతరులనేకులు, వైష్ణవులు నాలాయిరాన్నివలె పితృప్రీతి నుద్దేశించి వీరచరిత్రగానం చేయిస్తారని చెప్పి యీ విచారణయింతటితో ముగిస్తున్నాను.

## వీరచరిత్ర—ఆంధ్రులు.

హైహాయములైన అనుగురాజాదులు ఆంధ్రులు కాకపోయినప్పటికీ వీరచరిత్ర ఆంధ్రులకు కొంతవరకు గర్వహేతువేను.

## పూర్వపక్షం.

అనుగురాజాదులు హైహాయులయినప్పటికీ ఆంధ్రులుగానే మనము భావించవలెను. ఈతీరుగా ఒక్కొక్కరిని ఆంధ్రులు కారంటే యిక మనకు మిగిలే ఆంధ్రులెవరు? మనము ఆంధ్రులని చెప్పేవారు కూడా ఐతరేయబ్రాహ్మణకథ ననుసరించి వుత్తరభారతంనుండి యీ దేశానికి వచ్చినవారే. కనుక వారినికూడా అన్యదేశస్థులనే అనవలసి వుంటుంది. కనుక యిట్లా ఒక్కొక్కరిని వైదేశికులని తోసివేస్తే దేశంలో భూమిదప్ప మరేమీ మిగలదు. అనుగురాజాదులు ఆంధ్ర దేశానికి వచ్చి అక్కడవుండినారు గనుక వారిని ఆంధ్రులుగానే భావించవచ్చును.

## తటస్థాక్షేపం.

అట్లా అనాంధ్రులను ఆంధ్రులుగా భావించడం మిక్కిలి అనర్థ హేతువు. ఇది ఆంధ్రులదాస్యబుద్ధిని ప్రకటిస్తున్నది. దేశం ఆంధ్ర దేశమని దేశస్థులు ఆంధ్రులని చెప్పడం ఒకవ్యవస్థ. వారుమాత్రం కొత్తవారు కారా అంటే ఆసలు మనిషే భూమికి కొత్త అని అనవలసి వస్తుంది.అదంతా తత్త్వజిజ్ఞాస. లోకధర్మ నిర్వహణార్థం వ్యవహారంలో అప్రతర్క్యమైన హేతువులవల్ల యిది ఆంధ్రదేశం యిది అరవదేశం యిది వంగదేశం అని యిట్లా వ్యవస్థిత మవుతున్నది. ఆవ్యవస్థ ఆధారంగా యిది మనదేశం యిది కాదు అని దృష్టియేర్పడి దాని రక్షణ యందు తత్పరత దృఢపడుతున్నది. ఈతీరుగా ఒక్కొక్కదేశం తద్దేశస్థులచే రక్షితమయి విశిష్టవిజ్ఞాన సంప్రదాయాలను కలిగివుండడం లోక శ్రేయోహేతువే గనుక యీ వ్యవస్థ ఉపాదేయమని అంటున్నాను. ఒక దేశస్థులు మరియొక దేశస్థులచేత పరాజితులయి ఉదాత్తగుణ విశేషాదులను కోల్పోవడం లోకానికి అనర్థమేను. ఆరామద్రావిడులు

మొదలైనవారు జేతృవర్గస్థులు కారు గనుక తద్విచారణ ఇక్కడ అప్రసక్తం.

ఆంధ్రులు స్మృతికందరాని సందిగ్ధేతిహాసపు పౌరాణికశాత వాహనుల పిమ్మట పరదేశస్థుల అధీనమయి దీనదశ పాలైనారు.

ఆంధ్రదేశస్థులు కొంతకాలం పల్లవులచేతికింద వుండినారు. వారి తరువాత చాళుక్యులవశమయినారు. అప్పటికే ఆంధ్రులకు దాస్యబుద్ధి స్థిరపడినట్లు కనబడుతున్నది. ఒక ఆంధ్రగ్రంథకర్త

"ఆంధ్రదళదానవోపేంద్రుడగు నుపేంద్ర [ఆంధ్రసేనలనే రాక్షసులకు విష్ణువునంటివాడైన ఉపేంద్రుడు] (పిన్న కోటపెద్దన. కా. చూ.)

అని అన్నాడు. తమకు తాము రాక్షసులుగాను, తమ శత్రువు విష్ణువుగాను కనబడినప్పుడు ఆంధ్రులెంత దీనదశకువచ్చినదీ స్పష్టం కాగలదు. చాళుక్యులమని, చోళులమని, వారు గౌరవం ప్రకటించు కొంటూవుంటే బ్రాహ్మణశ్రమణకన్యాయంగాని మరి యేన్యాయంగాని వర్తించని స్థితిలో ఆంధ్రచాళుక్యులని ఆంధ్రచోళులని, చేతులు నలుపుకొనడం మన దైన్యాన్ని తెలుపుతునే వున్నది.

ఆంధ్రుల శోచనీయదాస్యాన్ని తొలిగించడానికి ఓరుగంటి ఆంధ్రరాజులు కాకతీయులు యత్నించారు. చాళుక్యులను వెలనాటి చోడులను అణచి ఆంధ్రసామ్రాజ్యాన్ని తిరిగీ ప్రతిష్ఠించారు. విజ్ఞానాన్ని దేశంలో ప్రసరింపజేశారు.

వీరికాలంలోనే ఆంధ్రుల ఉత్కర్షను వ్యక్తీకరించిన విజ్ఞుడు విద్యానాథుడు, స్వర్ణాభిషేకప్రథగల మొదటి మల్లినాథుడు, ఆంధ్ర దేశంలో వెలయ గలిగినారు.

మందడగ్రామభోక్త అయి దక్షిణరాఢానుండి వచ్చిన కాలాముఖుల తోడ్పాటుతో వెలగపూడి మఠాదుల్లో విద్యాశాలలు సాగించి ఆంధ్రదేశంలో విజ్ఞానాన్ని వ్యాపింపజేసిన విశ్వేశ్వర శైవాచార్యులవంటి విద్యాసంపన్నులు ఈకాకతీయుల కాలంలోనే వర్ధిల్ల గలిగినారు.

కాకతీయగణపతిదేవుడు గణపేశ్వరదేవాలయం కట్టించి అక్కడ అనేకులను విద్వాంసులను స్థాపించాడని కుమారస్వామి తెలుపుతున్నాడు. వీరినే

"राजन्नेते गणपेश्वरसूरयः" [प्र. य.]

అనేచోట గణపేశ్వరసూరులని విద్యానాథుడు పేర్కొన్నాడు.

ఆకాలపు ఆంధ్రుల ఔన్నత్యం అప్పటి ప్రతాపరుద్రీయపు పుటలయందు విదిత మవుతున్నది.

"खेलन्त्यन्ध्रचमूभटाः सवपुषो रौद्रप्रकारा इव"

(శరీరంధరించిన రౌద్రభేదాలవలె వున్న ఆంధ్రసైన్యభటులు క్రీడిస్తున్నారు.)

"अहो तुरङ्गतरङ्गास्त्रिलिङ्गाधिपतेः"

(అహో త్రిలింగాధిపతియొక్క గుర్రాలనే అలలు)

"शृण्वन्तो मुहुरन्ध्रसैन्यपतयः प्राप्ता दिशं दक्षिणाम्"

(మాటికి వింటూ ఆంధ్రసేనాపతులు దక్షిణదిక్కు చేరినారు.)

रेरे सेवण कस्तवायमनिदंपूर्वोऽद्य गर्वो महा
नुत्तीर्णा किल येन गौतमनदी प्राप्तोऽसि मृत्योर्मुखम् ।
एषा काकतिवीररुद्र इति किं नाश्रावि सप्ताक्षरी
प्रक्षुभ्यत्प्रतिपक्षपार्थिवमहाभूतग्रहोच्चाटनी ? ॥

[ఓరీ ఓరీ సేవణుడా ఇదివరకులేని నీయీ మహాగర్వం యేమిటి? దానితో (ఆగర్వంతో) గౌతమనది దాటినావన్న మాటేగాని మృత్యుముఖం చేరినావు. కలతపొందుతున్న శత్రురాజులనే మహాభూతగ్రహాలకు ఉచ్చాటని అయిన "కాకతివీరరుద్ర" అనే ఈ సప్తాక్షరీమంత్రం వినలేదా యేమి ?]

पादच्छायान्ध्रनाथस्य विन्ध्याद्रेर्वा निषेव्यताम्

[(ఓ రాజులారా) ఆంధ్రనాథుడి పాదచ్ఛాయనైనా వింధ్యాద్రి పాదచ్ఛాయనైనా సేవించండి. (ప్రతాపరుద్రుణ్ణి ఆశ్రయించండి లేదా వింధ్యాద్రిసమీపమందలి గుట్టలనీడల్లో దాక్కొనండి.)]

**रेरे घूर्जर! जर्जरोऽसि समरे! लम्पाक! किं कम्पसे?**
**वङ्ग! त्वङ्गसि किं मुधा? बलरजः काणोऽसि किं कोङ्कण?।**
**हूण! प्राणपरायणो भव महाराष्ट्रापराष्ट्रोऽस्यमी**
**योद्धारो वयमित्यरीनभिभवन्त्यन्ध्रक्षमाभृद्भटाः ॥**

[ఓరీ ఓరీ గుజరాతిరాజా! యుద్ధంలో శిథిలగాత్రుడ వైనావు. ఓ లంపాకుడా వణుకుతున్నా వేమి? ఓ బంగాళీ యెందుకు వ్యర్థంగా యెగురుతున్నావు? ఓ కొంకణుడా సైన్యపుదుమ్ము చేత గుడ్డివాడ వైనావా? హూణుడా ప్రాణాలు కాపాడుకో. ఓ మహారాష్ట్రుడా అపరాష్ట్రుడ వయినావు. (నీరాష్ట్రం పోయింది.) ఈమేము యోద్ధలము అని ఆంధ్రరాజభటులు శత్రువులను పరాభవిస్తున్నారు.]

**"नीराजयन्त्यन्ध्रपुरीरमण्यः प्रदीपजालैर्वरवीररुद्रम्"**
ఆంధ్రపురీరమణులు వీరరుద్రభూపతికి నీరాజన మిస్తున్నారు.)
**"स्वामिंस्त्रिलिङ्गदेशपरमेश्वर!"** **[प्र. य.]**

(స్వామీ! త్రిలింగదేశపరమేశ్వరుడా)

అని యిట్లా ఆగ్రంథంలోని పద్యాలు ఆంధ్రులమైన మనకు ఉచితగర్వహేతువుగా వుంటున్నవి. కాని మహమ్మదీయ కఠినహస్తాలు ఓరుగంటి కోటపై బడినవి. ఆంధ్రసామ్రాజ్య మంతరించింది. కాకతీయుల అనుచరులైన రెడ్డివీరులు తిరిగీ చిన్నచిన్న రాజ్యాలను అక్కడక్కడా స్థాపించి మహమ్మదీయసంక్షోభాన్ని నివారించడానికీ ఆంధ్రసామ్రాజ్యాన్ని వుద్ధరించడానికీ యత్నించారు.

**"उद्धृत्य भूमिं यवनाब्धिमग्नाम्"**
అని ఒక రెడ్డిరాజు కీర్తితు డయినాడు. ప్రఖ్యాతమైన 'కాటయవేమ'

మాళవికాగ్నిమిత్ర వ్యాఖ్యాదులు యీకాలంలోనే ఆంధ్రదేశంలోకా నికి సమర్పించింది. రెడ్డిరాజులతో సంబంధం ఉన్నా లేకున్నా వారి కాలంలోనే రఘువంశాదికావ్యాలకు, విద్యాధరుడి యేకావళికి, కుమారిలతంత్రవార్తికం ప్రశస్తపాదభాష్యం మొదలైన శాస్త్రగ్రంథాలకు, వ్యాఖ్యాత అయి విశ్వారాధ్యమైన ఖ్యాతిగల మల్లినాథుడు, పితృసదృశుడైన కుమారస్వామి ఆంధ్రదేశంలో ఉద్భవిల్లినారు. కాని చిరకాలం ఆంధ్రులకు యీదశ వుండలేదు. తిరిగీ దాస్యంపాలయినారు. దేశం చివరకు విజయనగర కర్ణాటరాజుల అధీనమయింది. విజయనగరపు రాజులు ఆంధ్రులు కారా అంటే కారని సమాధానం. ఆకాలపు ప్రమాణాలు వారు కర్ణాటులనే విదితం చేస్తున్నవి.

కర్ణాటక్షితినాథమౌక్తికసభాగారాంతరాకల్పిత. (కా. ఖ.)

అని విజయనగరరాజైన ప్రౌఢదేవరాయల విషయమై శ్రీనాథుడు.

శ్రీమతు కర్ణాటసింహాసనాధ్యక్షుండగు కృష్ణరాయ ధరాధినాథుఁడు.
(కృ. వి.)

అని కుమార ధూర్జటి.

సకలకర్ణాట రక్షా విచక్షణుండు. (రా. శే. చ.)

అని కృష్ణరాయమంత్రి తిమ్మరుసును గురించి మాదయ్యగారిమల్లన.

జీర్ణకర్ణాట పునఃసృష్టి సెవ్వాని. (వ. చ.)

అని విజయనగరరాజైన తిరుమలదేవరాయల నుద్దేశించి భట్టుమూర్తి. ఆంధ్ర, కర్ణాట, అనేవి యేకార్థవాచకాలు కావని, అవిరెండు వేరువేరని ప్రథమభూమికలో నిరూపితం. విజయనగరరాజులు కర్ణాటులు గనుకనే వారివద్దచేరిన తిమ్మమంత్రి తిమ్మరుసు అయినాడు. అరుసు అంటే కన్నడభాషలో రాజు అని అర్థం. కర్ణాటులైన మైసూరు మహారాజవంశస్థుల్లో ఇప్పటికీ అరుసుశబ్దం వ్యవహారంలో వున్నది. ఉ॥ చామరాజ అరస్. ఆంధ్రక్షమావల్లభ అనే యిట్లాటివాక్యాలు అతడి ఆంధ్రదేశాక్రాంతినే తెలుపుతున్నవి.

కొన్ని గ్రంథాలను ఆదరించిన మాత్రానగాని కొన్ని ఆంధ్రగ్రంథాలు రచించిన మాత్రానగాని ఆంధ్రులు కాజాలరు. మల్కిభరాం, చితాపుఖానుడు ఆంధ్రగ్రంథాలను ఆదరించారు. బ్రౌనువిరచితమైన నిఘంటువు కలదు. వీరాంధ్రులని గంతులు వేయడంఅవివేకం గదా.

"स केरलप्राणमरुद्भुजङ्गान्.........
आन्ध्रान्धकारक्षयतिग्मभासः" [म. वि.]

[కేరళ ప్రాణవాయువులకు పాములు ... ... ... ఆంధ్రాంధకారవినాశానికి సూర్యులు (అయిన బాణాలను యవనుడి మీద వేశాడు)]

అనేచోట గంగాదేవి విజయనగరరాజూ, తనభర్తా అయిన కంపరాయల ఆంధ్రదేశవిజయాన్ని ప్రకటించింది. విజయనగరకర్ణాటుల కాలంలో ఆంధ్రులపైన దాస్యతమస్సు పూర్తిగా ఆవరించింది. ఆంధ్రరాక్షసవిష్ణువని ఒక ఆంధ్రుడు తమశత్రువును గొప్పగా పొగడిన దశవంటి నీచదశ తిరిగీ ఆంధ్రులకు సంప్రాప్తమయింది. తిమ్మన్నవంటి మహాసచివుడికిగాని లోకవిదితప్రబోధచంద్రోదయవ్యాఖ్యకు కర్త కాగలిగిన నాదెండ్ల గోపమంత్రివంటి విద్వాంసుడికి గాని ఆంధ్రదేశంలో ఉచిత స్థానం లేక కర్ణాటానికి పోవలసి వుండడం ఆంధ్రదేశపు దుర్గతి గాక మరేమిటి? ఇట్లానే జగన్నాథపండితరాయలు వల్లభాచార్యులు మొదలైనవారి ప్రతిభ ఆంధ్రేతరదేశాల్లోనే వికసించవలసి వచ్చింది.

అవునుగాని నిర్ణయసాగర ముద్రాలయంలో ప్రకటితమైన ప్రబోధచంద్రోదయంలో, నాండిల్ల గోపమంత్రి అని వున్నది. అత డాంధ్రుడని వ్యాఖ్యలోగాని, పీఠికాకర్తృవాక్యాల్లోగాని, కానరాదు. కనుక అత డాంధ్రుడంటే మే మొప్పుకోము అని అంటారా చెప్తున్నాను.

నిర్ణయసాగరముద్రాలయపుప్రబోధచంద్రోదయంలో నాండిల్ల అని వున్నమాట సత్యం.

దీన్ని చూసే కాబోలును తక్కిన భారతీయులు నాండిల్ల అనే వాడు తున్నారు. లాహూరు మొదలైనచోట్ల సంస్కృత పుస్తకవిక్రేతలు నాండిల్ల అని వ్రాస్తున్నారు. పాశ్చాత్యులుకూడా నాండిల్ల అనే వ్యవహరిస్తున్నారు.

"only Nandillagopa actually quotes one rule for Paiśāci, but implies clearly that in his opinion this one rule was the only one which differentiated Paiśāci from Māgadhi."

(J. A. O. S. Vol. 44. Page 118)

(నాండిల్లగోపుడు ఒక్కసూత్రాన్ని మాత్రమే పైశాచికి ఉదాహరిస్తూ పైశాచిని మాగధినుండి వేరుపరచేది తన అభిప్రాయప్రకారం ఆ ఒక్కసూత్రమే నని విశదంగా వ్యక్తపరుస్తున్నాడు.)

అనేచోట Walter Eugene Clark అమెరికా ఓరియింటల్ సొసైటీపత్రికలో నాండిల్ల అని వ్రాశాడు. అయితే నిర్ణయసాగర పుస్తకంలోని నాండిల్ల అనేపాఠం తప్పు.

ఇతడు నాండిల్ల గోపమంత్రి కాడు. నాదెండ్ల గోపమంత్రి. ఇతడాంధ్రుడు. ప్రబోధచంద్రోదయ వ్యాఖ్యానపీఠికలో తెలిపిన గోపమంత్రివంశవర్ణనం, మాదయ్యగారి మల్లన రాజశేఖరచరిత్రలో తెలిపిన గోపమంత్రి వంశవర్ణనం, ఒక్కటిగా వున్నవి. ఈ గోపమంత్రి రాజశేఖరచరిత్రయందలి అప్పదండనాథుడి సోదరుడు. వీరు ఆరువేలనియోగిబ్రాహ్మణులు. కృష్ణరాయలవద్ద మంత్రిగా వుండిన తిమ్మనకు గోపమంత్రి మేనల్లుడు. ఈసంగతి ప్రబోధచంద్రోదయవ్యాఖ్యాపీఠికవల్లను రాజశేఖరచరిత్రవల్లనుకూడా విశదమవుతున్నది.

" तस्य श्रीकृष्णरायस्य प्राज्यराज्यधुरन्धरः ।
कुलक्रमागतो मन्त्री साल्वतिम्मचमूपतिः ॥"

(శ్రీకృష్ణరాయడికి ప్రాజ్యసామ్రాజ్య ధురంధరుడైన, కులక్రమాగత మంత్రి సాల్వతిమ్మసేనాని).

"तद्भागिनेयौ तरणिप्रतापौ नाण्डिल्लयप्यप्रभुगोपवर्यौ।"

(అతడి మేనల్లుండ్లు సూర్యప్రతాపుడైన నాండిల్ల యప్యప్రభువు గోపవర్యుడు).

[प्र. भो. च.]

అని గోపమంత్రి.

సాళువతిమ్మ ప్రధానజామాతకు. (రా. శే. చ.)

ఆఱువేలవంశవార్ధి పూర్ణచంద్రమా. (రా. శే. చ.)

అని పద్యాంతాల్లోను ఆశ్వాసాంతంలోను నాదెండ్ల అప్పదండనాథుణ్ణిగురించి మల్లన్న. పైపద్యాల్లో అప్పయ్య యప్య అయి నాదిండ్ల నాండిల్ల అయినట్లు విశదం. గోపమంత్రి ఆంధ్రుడని స్పష్టం. నాదెండ్ల యల్లమంత్రి అనే యుద్ధవీరుడు ఈ నాదెండ్ల వంశస్థుడొకరు వుండినట్లు ముప్పైయిద్దరు మంత్రుల పద్యంవల్ల విదితం. నిర్ణయసాగర పుస్తకంలో పైవిధంగానే వినుకొండ, కొండవీడు అనేపేర్లుకూడా వికృతమై వున్నవి.

"यः कोण्डवीडुनगरीं विनिकोण्डुमुख्यै।
दुर्गैः समं समधिगम्य महामहिम्ना॥"
"प्रादान्मुदा निखिलभूसुरपुङ्गवेभ्यः।
श्रीरामचन्द्रपुरमुख्यमहाग्रहारान्॥" [प्र. भो. च. ६या.]

(మహామహిమతో యెవ్వరు విని కొండు మొదలైన దుర్గాలతోపాటు కొండువీడు నగరం పొంది సంతోషంతో బ్రాహ్మణశ్రేష్ఠులకు రామచంద్రపురం మొదలైన మహాగ్రహారా లిచ్చాడో)

ఈతీరుగా ప్రసిద్ధాంధ్రపురుషుల, పట్టణాల, పేర్లు యెవరయినదీ యేమైనదీ తెలియకుండా ఆంధ్రేతరులు తారుమారుచేయడం ఆంధ్రులకు చింతాకరం కాకమానదు. దీన్ని శుద్ధపాఠాలతో ప్రకటించవలసిన భారం మనదై ఉన్నది. రాజశేఖరచరిత్రలో వున్న నాదిండ్ల అనే పాఠం లేఖకదోషంవల్ల యేర్పడివుండవచ్చును. లేదా ఆకాలాన నా

దిండ్ల అని వ్యవహారం వుండివుండవచ్చును. నాండిల్ల అనే పేరుమాత్రం అపభ్రంశం. ఇప్పటికీ నాదెండ్ల అని వ్యవహారం వుంటూవుంటే సమకాలపువాడైన మల్లన్న నాదెండ్లఅని చెప్పుతూవుంటే నాండిల్ల అని వ్యవహారం వుండిన దనుకొనడం అసంభావ్యంగదా. కొండవీటికి సమీపాన గుంటూరులో ఒకపేటగావున్న రామచంద్రపురాగ్రహారం గోపమంత్రి దత్తమే నని అనుకొనవచ్చును. గోపమంత్రి గృహనామానికి కారణమైన నాదెండ్ల కూడా కొండవీటిప్రాంతంలో చిలకలూరిపేటకు దగ్గరగా వున్నది.

ఇప్పటి యూరోపులో ప్రసిద్ధప్రభువులు,నైజాంలో మహారాజా సర్ కిషన్ ప్రసాద్ బహద్దరు, మొదలైనవారి కుటుంబాలవలె దండనాయకులు మంత్రులు మహావిద్వాంసులు వెలసిన ఈగోపమంత్రివంశం ఆకాలంలో అత్యంతం ప్రఖ్యాతం అయివుంటుంది. నాదెండ్లలో ఇప్పటి మిరాశిదారులు అన్నాప్రగడవారు. కాని కౌశికగోత్రులైన నాదెండ్ల వంశ్యులు లేరు. బహుశః ఆవంశం నశించి వుండవచ్చును.

మంత్రి అనేమాట ఆరువేల నియోగి బ్రాహ్మణులకు ప్రాచీన కాలంనుండి బహుళంగా నామాంతమైనట్లు కనబడుతున్నది. వారు రాజకార్యదురంధరులై వుండడంవల్ల ఇది యేర్పడి వుండవచ్చును. లేదా మంత్రవిద్యానిష్ఠత్వంవల్ల యేర్పడి ఉండవచ్చును. మంత్రదీక్షను పొందినవారికి మంత్రి అనికూడా వ్యవహారం దృష్టం

प्राणायामः पवित्रीकृततनुरथ मन्त्री । [प्र. सा. ९]
मेधावी भवति च वत्सरेण मन्त्री । [प्र. सा. १२]
त्रिलक्षमेनं प्रजपेच्च मन्त्री । [प्र. सा. १२]

(ప్రాణాయామాలచేత శరీరాన్ని పవిత్రపరచి పిమ్మట మంత్రి.)
(సంవత్సరంలో మంత్రి మేధావి కాగలడు.)
(మూడులక్షలు దీనిని మంత్రి జపించవలెను.)

అని శ్రీశంకరాచార్యులు. ఇట్లా అనేకస్థలాల్లో దృష్టం. ఉపనిషత్తుల్లో పర్యంకవిద్య, పంచాగ్నివిద్య, అని ఈతీరున ఉపాసనావిధానానికి విద్య అని ప్రతీతిగలదు. మంత్రశాస్త్రంలో శ్రీచక్రోపాసనాత్మకమైన దానికి శ్రీవిద్య అని వ్యవహారం ప్రఖ్యాతం. కాదివిద్య, హాదివిద్య, అగస్త్యవిద్య, లోపాముద్రావిద్య, కామకళావిద్య అని ఇట్లా ఉపాసనాక్రమం వ్యవహృతమవుతున్నది. నిరుపాధికంగా ఇది విద్య అని కూడా ఉక్తం.

"षट्त्रिंशत्तत्त्वात्मा तत्त्वातीताच केवला विद्या ॥"

"आसीनः श्रीपीठे कृतयुगकाले गुरुः शिवो विद्याम् ॥" [का. वि.]

[విద్య (పఞ్చదశాక్షరి) షట్త్రింశత్తత్త్వాత్మా (శివాదిక్షిత్యన్త విగ్రహా) తత్త్వోత్తీర్ణా యేకాకినీ అయివున్నది].

[కృతయుగకాలంలో గురువు శివుడు శ్రీపీఠమందు ఆసీనుడై విద్యను (స్వశక్తీ విమర్శరూపిణీ అయిన ఆకామేశ్వరికి వుపదేశించాడు).]

అని పుణ్యానందులు. కాకతీయులకాలంలో ఈవిద్య ఆంధ్రదేశంలో యెక్కువగా వర్ధిల్లినట్లు కనబడుతున్నది. కాకతీయులకాలంలోనివాడైన మొదటి మల్లినాథుడి పుత్రుడు కపర్ది విషయమై

"मल्लिनाथात्मजः श्रीमान् कपर्दी मन्त्रकोविदः ॥"

[चं. व्या. ప్రతాపరుద్రీయపీఠికలో త్రివేదిచే ఉదాహృతం]

అని వున్నచోట మంత్రశబ్దం మంత్రవిద్యాపరమని చెప్పవచ్చును. ప్రతాపరుద్రీయకర్త విద్యానాథుడు, వేదభాష్యప్రణేతా మహావిజ్ఞానసంపన్నులూ అయిన విద్యారణ్యులు, వీరి యీ నామాల్లోవున్న విద్యాశబ్దానికి మంత్రవిద్యాపరత్వంకూడా వాచ్యమని విదితం.విద్యానాథుడు మంత్రవిద్యాబలంతో ప్రతాపరుద్రుడికి శ్రేయశ్చింతకుడుగా, విద్యారణ్యులు మంత్రవిద్యాపటువులై విజయనగరపు రాజులకు మంత్రిగా

---

రహస్యరాయణుడుగా వుండినట్లు విశ్రుతమవుతున్నది. నాదెండ్ల గోపమంత్రి సయితం తంత్రగ్రంథాలనుండి ఉదాహరించకపోయినా ఇడ, పింగళ, సుషుమ్న, మూలాధారం, సహస్రారం మొదలైన ముఖ్యవిషయాలను ద్వితీయనాందీపద్యవ్యాఖ్యలో ప్రస్తావించాడు. వ్యాఖ్యాంతంలోకూడా ఇతడి ఉపాసకత్వం వ్యక్తం.

ఆంధ్రదేశంలో మంత్రిశబ్దంవలెనే కాశ్మీరదేశంలో "కౌల" అనేది కొందరికి నామాంతరంగా వుంటున్నది. ఉదా.—పండితమధుసూదన కౌలశాస్త్రి, తంత్రాలోక టిప్పణకర్త. కైలాసనాధకౌల, ఆనంద కౌల అని. శాక్తోపాసకుల్లో సమయిభిన్నులైనవారికి కౌలులని ప్రతీతి కలదు.

"उत्पादयन्ति चानन्दं मत्प्रिये कौलिकाश्च ते ॥"
अप्रबुद्धा पशोः शक्तिः प्रबुद्धा कौलिकस्य च ॥ [कु. त.]

ఆనందాన్ని కలిగిస్తారు. ఓ నాప్రియురాలా, వారు కౌలికులు. పశువుశక్తి అప్రబుద్ధం. కౌలుడిశక్తి ప్రబుద్ధం.

అని కులార్ణవ తంత్రకారుడు.

కాశ్మీరంలో కౌలశబ్దంవలెనే ఆంధ్రదేశంలో మంత్రి అనేది వాడబడి వుండవచ్చును. రూఢమైనపిమ్మట దానిపర్యాయపదాలైన అమాత్యాదిశబ్దాలు వాడుకలోకి వచ్చివుండవచ్చును. లేదా మొదట చెప్పినట్లు రాజనీతిధురంధరులై మంత్రులుగా వుండడంవల్లయేర్పడి వుండవచ్చును. అనుషంగికంగా వచ్చిన ఈవిచారణ ఇంతటితోముగించి ప్రకృతానికి వస్తాను.

సాళ్వతిమ్మమంత్రి, నాదెండ్ల గోపమంత్రివంటి విద్వాంసులకు ఆంధ్రదేశంలో ఉచితస్థానంలేక కర్ణాటానికి పోవలసివచ్చిన దుర్దశ యేర్పడినదన్నాను.

ఆంధ్రదేశపుదుర్గాలను యీ కర్ణాటులుజయిస్తే,

(1) "కొండవీడగలించె"
(2) "వినుకొండ మాటమాత్రనె హరించె."
(3) "బెల్లముకొండ అచ్చెల్లఁ జెరిచె." (ముక్కుతిమ్మన. పా. జా.)

అని ఒక ఆంధ్రగ్రంథకర్త ఆసంగతి సంతోషిస్తూ స్తుతించాడు. కర్ణాట రాజు తెలుగుదేశపు గ్రామాలను అల్లకల్లోలం చేస్తే

"వడ్డాదిమసి యొనర్చె" "కనకగిరి స్ఫూర్తిఁగరఁచె" "గౌతమిఁ గ్రాఁచె. ఔరాతోక చిచ్చున." [పెద్దన. మ. చ.]

అని మరియొక ఆంధ్రుడు ఆపనిని కీర్తించాడు. ఇంతకంటె ఆంధ్రులకు నికృష్టస్థితి మరియేమి సంభవించగలదు ?

ఇప్పటికీ యీ నికృష్టదాస్యందశలోనే వున్నాము. అంతటా ఉద్వేగంతో ఆంధ్రుల ఉత్కృష్టతను ప్రకటించే ప్రతాపరుద్రీయాన్ని విస్మరించాము. ప్రతాపరుద్రీయపు ప్రతిని కాశ్మీరంనుండి సయితం ప్రతిని తెప్పించి పాఠనిర్ణయంచేసి టీకచేర్చి బొంబాయి ప్రభుత్వంవారితోడ్పాటుతో ప్రకటించడానికి అనాంధ్రుడు త్రివేది వహించిన శ్రద్ధలో సూక్ష్మాంశమైనా ఆగ్రంథంయొక్క అవగమనానికిగాని, ప్రచారానికిగాని ఆంధ్రులమైన మనము కనబరచడం లేదు.

ఆంధ్రుల వీరత్వాలను ప్రకటించి ఆంధ్రసామ్రాజ్యాన్ని ప్రతిష్ఠితంజేసిన కాకతీయాంధ్రరాజులను మరచినాము. విజ్ఞానోజ్జీవనం చేసి ఆంధ్రులకు ఆరాధ్యులై యశోభ్యుదయాలు సమకూర్చిన గణపతిదేవుణ్ణిగాని రుద్రదేవినిగాని ప్రతాపరుద్రుణ్ణిగాని మనవారని విశిష్టబుద్ధితో జ్ఞప్తికి తెచ్చుకొనము. పైగా ఆంధ్రుల అపజయాన్ని ప్రకటించే కథను వ్రాసుకొని దానికి ప్రతాపరుద్రీయమని పేరుపెట్టి దాన్ని ఆడుతుంటే చూసి మురుస్తూ చప్పట్లు కొట్టుకుంటున్నాము. రెడ్డిరాజులను వేమనకాటయవేమ మొదలైన విద్వాంసులను అస్మదీయులని విలక్షణదృష్టితో తలంపునకు తేము కాని ఆంధ్రులను రాకసులుగా హతంజేసిన చాళుక్యవంశ్యులలోని రాజులకు పట్టాభిషే

సభలు చేస్తున్నాము. ఆయన పేర సంచికలు ప్రకటిస్తున్నాము. కాకతీయ సంచిక అని యేమో కొంత ఇతరులతో కలిపి ఆచరించినమాత్రాన వారి యందు స్వత్వబుద్ధి ప్రకటించినట్లు కాదుగదా. చోళుడైన నల్లసిద్ధదేవు డికి ఆంధ్రుడైన కాటమరాజుకు, కలహం సంభవిస్తే చోళుడిపక్షాన ఆంధ్రుడు రణతిక్కన చేరి ఆంధ్రుడైన కాటమరాజుమీద పోట్లాడితే అదంతా ఒక విశేషమని మనము బుజాలు తట్టుకొంటున్నాము. ఆంధ్ర గ్రామాలను తగలబెట్టి ఆంధ్రుల దుర్గాలను పాడుబెట్టిన కర్ణాటరాజుకు సంవత్సరోత్సవాలు చేస్తున్నాము.

ఆంధ్రోత్కలాంశాలతో కళింగమనేది వేరుగా వ్యవహరించ బడినా భాషాదులచేత ఆంధ్రుల్లోనివాడనే అనదగి

"असौ महेन्द्राद्रिसमानसारः पतिर्महेन्द्रस्य महोदधेश्च ।
यस्य क्षरत्सैन्यगजच्छलेन यात्रासु यातीव पुरो महेन्द्रः ॥"

(ఇతడు మహేంద్రాద్రితో సమానమైన బలంగలవాడు మహేం ద్రానికి, మహోదధికి అధిపతి. మదధారలు కారే సైన్యగజాలనే వ్యాజంతో ఇతడియాత్రలయందు మహేంద్రపర్వతం ముందు నడు స్తున్నట్లుంటుంది.)

అని గజసంపదకు కాళిదాసుచేత సయితం ప్రశంసితుడైన కళింగభూపతిపరంపరలో చేరిన గజపతిని అనాంధ్రరాజు అవమాన పరచి అతడిపుత్రికను పెండ్లాడితే ఆవృత్తాంతాన్ని నవలలుగా పద్య పుస్తకాలుగా వ్రాసుకొని మురుస్తున్నాము.

విజయనగరరాజుల పూర్వులు కాకతీయులవద్ద వుండినారు గనుక ఆంధ్రులు కావచ్చునేమో నంటారా? ఒకవేళ అయినాగూడా పేర్లు, బిరుదులు మొదలైన సంప్రదాయాల్లో కర్ణాటీకృతులై ఆంధ్ర త్వం కోల్పోయి వాఙ్మయంలో కర్ణాటులుగా విదితులవుతున్నారు.

గనుక ప్రకృతవిచారణలో కర్ణాటులనే గృహీతులు.అందువల్ల పైవాదం ఇక్కడ ప్రసక్తం కాదు.

అవునుగాని వైదికవాఙ్మయాన్ని అనేకవిధాల వర్ధిల్లజేసి మహమ్మదీయులపైన ప్రతిక్రియనడపిన విజయనగరరాజులు మనవాండ్లు కారనుకోనడం అసంభావ్యం గదా అంటే చెప్పుతున్నాను.

" परैः परिभवे प्राप्ते वयं पञ्चोत्तरं शतम् ॥ [म. व. २९४]

(పరులపరిభవంప్రాప్తిస్తే మేము 105 మందిమి) అని ధర్మరాజన్నట్లు భారతీయేతరులసందర్భంలో కృష్ణరాయాదులు మనవార లనుకోనడం అత్యంతం వాంఛనీయమేను. కాని ఆంధ్రులు ఆంధ్రేతరులు అనే విచారణలోమాత్రం వారు అనాంధ్రులు అనక తప్పదంటున్నాను. ఇట్లా అనాంధ్రులైన జేతల శత్రువులపేర్లు దేశంలో కొన్ని భాగాలకు పెట్టి రాయలసీమ చాళుక్యసీమ అని బుజాలు కొట్టుకుంటున్నాము. రాజరాజనరేంద్రగ్రంథాలయమని కృష్ణదేవరాయాంధ్రగ్రంథనిలయమని కృష్ణరాయగ్రంథమాల అని యిట్లా వీరిపేర్లు గ్రంథాలయాలకు గ్రంథమాలలకు తగిలిస్తున్నాము.

ఇంతకంటె మనదాస్యవృత్తి హెచ్చజాలదు. ఈదాస్య చిత్తవృత్తితోనే బంగాళీగాని, మరాటీగాని, పంజాబీగాని, గుజరాతీగాని, లేదా ద్రావిడుడుగాని యేదైనా చెప్పితే దానికి తాళంవేయడమే గొప్పపని అని అనుకోనవలసిన దశలో వున్నాము.

అధికులైనవారు యేదైనా ఉపదేశిస్తే వినగూడదని కాదుగాని మనగుణదోషాలేవో మనము తెలుసుకొని వాటివర్ధనానికి హానానికి యత్నించడం లేకుండా అనాంధ్రులు చెప్పితేనేగాని అడుగు కదలించలేనిస్థితిలో వుండడం అత్యంతం తుచ్ఛలక్షణ మంటున్నాను. చివరకు అనాంధ్రులతో మాట్లాడడమే ఒక గొప్పఅని అనుకొంటున్నాము.

ఆంధ్రదేశపు సరిహద్దులు దాటితే నోరు విప్పలేము. ఒకవేళ విప్పితే అక్కడివారిని అనుసరించి వారికి అనుగుణంగా నాలుక ఆడించడం

తప్ప ఆంధ్రేతరులకు ప్రసాదించే స్వీయమైన ఉత్తమవిజ్ఞాన సంప్రదాయాలబలం లేక అధోగతిలో వున్నాము. సర్ రాధా కృష్ణులవంటివారు యెవరైనా వున్నా ఆంధ్రుల ఈ దుర్దశాఫలంగా కాబోలు వారి ఆంధ్రత్వాన్ని తెలియకుండాచేసేమార్గాలను నా మాంతాలు మొదలైనవాటిలో అవలంబించవలసినవా రవుతున్నారు. ఆంధ్రుల విశిష్టసంప్రదాయా లేవైనా వుత్తమమైనవి వుంటే వాటిని కనుగొనడం లోకానికి ప్రసాదించడం మృగ్యం. ఆంధ్రేతరులప్రసక్తి లేక మనలో మనమైతే అధికార్యనధికారిభేదం లేకుండా నోటికి వచ్చినదంతా మాట్లాడి చేతికివచ్చినదంతా వ్రాసి పత్రికలు పుస్తకాలు నింపి అజ్ఞానివంచనచేస్తూ ఆత్మవంచనపాలవుతున్నాము. చివరకు గుణదోషవివేకానికి కావలసిన విజ్ఞానంగాని యత్నంగాని స్వపరపరి మాణవిచారణగాని మాని నేనంటేనేనని బోలుగౌరవాలకు పరమా నందాయశిష్యులవలె కీచులాడుతున్నాము. ఇట్లాటిదాస్యచిత్తవృత్తిలో వున్న ఆంధ్రులకు మనకు, అనాంధ్రులు ఆంధ్రులపై రాజ్యం చేసిన వారు, అయిన హైహాయుల వృత్తం, పల్నాటివీరచరిత్ర మన బాని సతనాన్నే గట్టిపరుస్తుంది కనుక ఇది అభిమానికంగా మనకు వుపా దేయం కాదు. లోకేతిహాసంలో ఒక భాగంగా గ్రహిస్తే గ్రహించ వచ్చునే గాని మనకు అభిమానికవిషయం కాజాలదు అంటే

సమాధానం

చెప్పుతున్నాను. తటస్థాక్షేపవాదాన్ని కాదనజాలను గాని ముద్రా రాక్షసంలోని చంద్రగుప్తుడివలె హైహాయరాజులు సచివాయత్త సిద్ధులై ప్రతిమాతుల్యులుగా వున్నారు గనుకను బ్రహ్మనాయుడు, బాలచంద్రుడు, నాయకురాలు, కన్నమనీడు మొదలయిన ప్రధాన కార్యపురుషులందరు ఆంధ్రులే గనుకను కొంతవరకైనా మనకు అభి మానవిషయంగా వుండగలదని మాత్రం చెప్పుతాను.

## వీరచరిత్రయందలి కొన్ని అంశాల సంక్షిప్తవిచారణ.

### ఐ తాం బ.

ఐత, బాలచంద్రుడి ప్రాణాలవిషయమై చూపిన ఆతురత భార తీయ క్షాత్రధర్మానికి విరుద్ధంగావున్నది.

"यदर्थं क्षत्रिया सूते तस्य कालोऽयमागतः" [म. उ. १०-७५]
"काले हि समनुप्राप्ते त्यक्तव्यमपि जीवनम्" [७६]

(దేనికొరకు క్షత్రియస్త్రీ సంతతిని కంటున్నదో దానికి సమయ మిప్పుడు వచ్చింది.

సమయం సంప్రాప్త మయినప్పుడు జీవనంకూడా వదలవల వుంటుంది కదా)

అని శ్రీకృష్ణుడిద్వారా భీమార్జునులకు

"विक्रमेणार्जितान्भोगान्वृणीतं जीवितादपि" [७८]

(జీవితం కంటె కూడా యెక్కువగా విక్రమార్జితాలైన భోగా లను వరించండి) అని నకులసహదేవులకు చెప్పిపంపగలిగిన భారతీయ వీరమాత కుంతికి యీమె ప్రతియోగినిగా కనబడుతుంది. బహుశః కృతికర్త యిక్కడ స్త్రీఅధీరతను ప్రదర్శించదలచి వుండవచ్చును. వ్యాసుడు కూడా ఒకసందర్భంలో

"न मां माधव वैधव्य नार्थनाशो न वैरिता ।
तथा शोकाय दहति यथा पुत्रैर्विना भवः ॥" [म. उ. १०-६१]

(పుత్రులు లేని బ్రతుకువలె మాధవుడా వైధవ్యంగాని అర్థ నాశంగాని విరోధంగాని నన్ను దుఃఖపడేటట్లు దహించదు)

అని కుంతిచేత చెప్పిస్తాడు.

## వేశ్య.

---

యుద్ధానికి వెంటపిలుచుకొని పోయ్యేమిషతో బాలచంద్రుడు వేశ్యను సందర్శించి కామవశుడు కావడం యీకాలపు మనకు కొంత రోతగా కనబడుతుంది. అయితే ఆకాలపువారు అట్లా తలచినట్లు కనబడదు. ప్రాచీన భరతవర్షంలో ఒకప్పుడు వేశ్యలకు గౌరవప్రతిపత్తి వుండినట్లు గోచరిస్తున్నది. పురాణవాఙ్మయంలో వీరివృత్తం విస్తరించి కలదు. భరతవంశపు జనని దేవవేశ్యయొక్క కూతురు. ఇంకా పురాణాల్లోవున్న వేశ్యాకథలను విస్తరభీతిచేత వివరించక వదలుతున్నాను. ఇప్పటివలె గదహేతువులుగాకూడా గాక

> "जात्यन्धाय च दुर्मुखायच जराजीर्णाखिलाङ्गाय च ।
> ग्रामीणाय च दुष्कुलाय च गलत्कुष्ठाभिभूताय च ।
> यच्छन्तीषु मनोहरं निजवपुर्लक्ष्मीलवश्रद्धया ।
> पण्यास्त्रीषु विवेककल्पलतिकाशस्त्रीषु रज्येत कः ॥"
> "वेश्यासौ मदनज्वाला रूपेन्धनविवर्धिता ।
> कामिभिर्यत्र हूयन्ते यौवनानि धनानि च ॥" [भ.]

(వివేకమనే కల్పలతకు శస్త్రంవంటివారై పుట్టుగుడ్డికి, దుర్ముఖుడికి, ముసలితనంచేత జీర్ణించిన అంగాలుగలవాడికి, పల్లెటూరి మోటువాడికి, కుష్ఠరోగికి, మనోహరమైన తన శరీరాన్ని కొద్దిడబ్బుకాశపడి సమర్పించే వేశ్యలయందు యెవడు అనురాగం పొందుతాడు?)

(వేశ్య యీమె రూపమనే కట్టెలచేత ప్రజ్వరిల్లిన మదనజ్వాల; దాంట్లో ధనాలను యౌవనాన్ని కామిపురుషులు హుతంచేస్తున్నారు.)

అని భర్తృహరి, ఇట్లానే మరికొందరు విజ్ఞులు వీరిని ఒకవైపున నిందిస్తూ వుండినప్పటికీ దేశంలో వీరు సుప్రతిష్ఠితలై వుండినట్లు గోచరిస్తున్నది. అదిగాక వీరు రూపసౌష్ఠవంకూడా కలిగివున్నట్లు విదితమవు

తున్నది. "రూపాజీవ" "రూపేన్ధనవివర్ధిత" అనే యిట్లాటిమాటలు ఆ సంగతినే వ్యక్తం చేస్తున్నవి.

శ్రుతి వాఙ్మయంలోకూడా వేశ్యావర్గపుస్త్రీల ప్రస్తావన కనబడుతున్నది.

"ब्रह्मचारीत्वरीरतम्" [नै. १७]

అని మహావ్రతమనే యజ్ఞంలో జరుగవలసిన బ్రహ్మచారీత్వరీరతాన్ని శ్రీహర్షుడు పూర్వపక్షవాదిచేత ఆక్షేపింపజేసిన సందర్భంవంటి చోట్ల ఇత్వరి పుంశ్చలీపర్యాయనామంగా గృహీతమైనా అది వేశ్యావర్గపుస్త్రీలకు అన్వయిస్తుందని

"इदावत्सरायातीत्वरीम्" [शु. य. ३०-१५]

అని ఇట్లాటి శ్రుతివాక్యాలవల్ల తెలుసుకొనవచ్చును.

"अधिपेशांसि वपते नृतूरिव" [ऋ. १-९२-४]

అనే ఋక్కులో నృతూ అనేశబ్దానికి నర్తకి అనేఅర్థాన్ని పాఠకంగా విద్యారణ్యులవారు ప్రతిపాదిస్తున్నారు. దేవవేశ్య అయిన ఊర్వశికి పురూరవుడికి జరిగినసంవాదం ఋక్సంహితలో విశ్రుత మవుతున్నది.

"हये जाये मनसा तिष्ठ घोरो वचांसि मिश्रा कृणवा है नु"
[ऋ. १०-९५-१]

అని ఋక్కు.

"ఓఘోరాకారిణీ ప్రియురాలా! (ఊర్వశీ) నామీద అనురాగం గలిగిన మనస్సుతో సమీపాన వుండు. ఉక్తి ప్రత్యుక్తి రూపమైన సంవాదాన్ని ఇప్పుడు చేస్తాము."

అని విద్యారణ్యభాష్యాన్ని అనుసరించి పైవాక్యాలకు అర్థం. ఈసందర్భంలో ఊర్వశీ పురూరవుల కథను పద్యరూపాన తెలిపి

విద్యారణ్యులు ఈక్రింది శతపథబ్రాహ్మణవాక్యాలను ఉదాహరించారు.

“अत्र वाजसनेयकं

ऊर्वशीहाप्सराः पुरूरवसमैल चकमते । तं ह विन्दमानोवाच” ।

[श. ब्रा. ११-५-१]

[ఊర్వశి అనే అప్సర ఇలాపుత్రుణ్ని పురూరవుణ్ణి కామించింది అతణ్ని చేపట్టి (యిట్లా) అన్నది....]

వేశ్యావర్గపుస్త్రీలు శ్రుతివాఙ్మయంలో ప్రస్తుతులయినవిధం తెలిపినాను.

వేశ్యాసంపర్కం విహితంగాని, నిషిద్ధంగాని కాకపోవడంవల్ల పాపహేతువు కాదని

“अवरवर्णास्वनिरवसितासु वेश्यासु पुनर्भूषु च न शिष्टो न प्रतिषिद्धः सुखार्थत्वात्”                [वा. का. १-५-३]

[నిరవసితలు కాని తక్కువజాతిస్త్రీలయందు, వేశ్యలయందు పునర్భువు (మారుమనుముస్త్రీ)లయందు ప్రయుజ్యమానమైనకామం సుఖార్థమైనది గనుక విహితం కాదు. నిషిద్ధం కాదు.]

అనే పఙ్క్తుల్లో వాత్స్యాయనుడు తెలుపుతున్నాడు.

ప్రతాపరుద్రీయంలో కుమారస్వామి ఉదాహరించిన వచనంలో **चारुयोषिति** అని వున్నా వేశ్య యెదురైతే కూడా శుభమని నిమిత్తజ్ఞుల అభిప్రాయం. వర్షపుమానమైన ఆఢకంయొక్క సాంకేతికస్థితుల్లో ఒకదానికి గణికాహస్తాన్ని నిర్దేశించి

“आढको गणिकाहस्तं गतः सस्याभिवृद्धिकृत्”

అని ఆగణికాహస్తస్థితి శ్రేయఃఫలకమని చెప్తున్నారు.

కొన్ని చోట్ల రూపకంలో సంస్కృతం వుపయోగించవలసినపాత్రలను చెప్తూ

"मन्त्रिजावेश्ययोः क्वचित्" [द. रू.]

అని మహాదేవీమంత్రిపుత్రికలతోపాటు వేశ్యనుకూడా ధనంజయుడు చేర్చాడు. సాహిత్యదర్పణకర్తకూడా యీసంగతినే తెలిపినాడు. ఒకరిఅధీనంలో ఉన్న వేశ్యను మరియొకడు పొందినట్లైతే

"रूपाजीवामन्योपरुद्ध गच्छतः" [अ. ३-२० प्र]

అని దండంవిధించి కౌటిల్యుడు వేశ్యాసంబంధానికి రాజరక్షణ కూడా కల్పించాడు.

వాత్స్యాయనుడిచేత ఉచితానురాగ విషయంగా గృహీత అయిన పునర్భువును ఉపేక్షించినట్టి సాహిత్యవేత్తలు వేశ్యను, ఉత్తమ కోటిలో చేర్చకపోయినా,

"अथ नायिका त्रिविधा स्वान्या साधारणस्त्रीति" [सा. ३]

అని కావ్యనాయికగా వుండడానికి అంగీకరించారు. ఆవేశ్యకుల కాంతవలె స్థిరానురాగవతి అయితే మృచ్ఛకటికలో వసంతసేనవలె ఉత్తమ కార్యంలోకూడా నాయికగా ఉండవచ్చునని వారి అభిప్రాయం. కాళిదాసు

"पादन्यासैः क्वणितरशनास्तत्रलीलावधूतै
रत्नच्छायाखचितवलिभिश्चामरैः क्लान्तहस्ताः ।
वेश्यास्त्वत्तो नखपदसुखान् प्राप्य वर्षाग्रबिन्दू
नामोक्ष्यन्ते त्वयि मधुकरश्रेणिदीर्घान् कटाक्षान् ॥

[ఆవుజ్జయినిలో నృత్తపు అడుగులచేత మ్రోగుతున్న వడ్డాణంతోను విలాసంగా కదలించబడి కంకణరత్నకాంతి ఖచితమైన దండాలు గల చామరాలచేత అలసినహస్తాలతోను వున్న వేశ్యలు నీవల్ల నఖక్షత సుఖహేతువులైనవానతొలిచినుకులనుపొంది తుమ్మెదపఙ్క్తివలె దీర్ఘమైన కడగంటిచూపులను నీయందు ప్రసరింపజేస్తారు.]

అని ఉజ్జయిని వేశ్యల విలాసాలను ప్రతిపాదించి వారిని మేఘుడికి సుఖహేతుకోటిలో చేర్చాడు.

(కామినీదర్శనీయత్వం పుణ్యఫలమని అభిప్రాయమని మల్లినాథుడు.)

" श्रुत्वा त्वत्परिवारवारवनितागीतानि भृङ्गाङ्गना
लीयन्ते कुसुमान्तरेषु......" [रत्ना]

[నీపరివారవారవనితల గీతాలను విని ఆడతుమ్మెదలు (లజ్జితలైనట్లు) కుసుమాంతరాల్లో లీనమవుతున్నవి.]

అని వాసవదత్తయొక్క పరివారవేశ్యలగీతాలశ్లాఘను శ్రీహర్షుడు వత్సరాజు చేతనే చేయించాడు.

" कर्णाटीदशनाङ्कितः शितमहाराष्ट्रीकटाक्षाहतः
प्रौढान्ध्रीस्तनपीडितः प्रणयिनीभ्रूभन्ङगवित्रासितः ।
लाटीबाहुविवेष्टितश्च मलयस्त्रीतर्जनीभर्जितः
सोऽयं सम्प्रति राजशेखरकविर्वाराणसीं वाञ्छति ॥ "

(కర్ణాటి పంటిచేత నొక్కబడి, మహారాష్ట్రి కడగంటిచూపుచేత కొట్టబడి, ప్రౌఢాంధ్రి స్తనాలచేత పీడించబడి, ప్రణయిని బొమముడిచేత భయపెట్టబడి, లాటిచేతులచేత ఆవరించబడి, మలయస్త్రీతర్జనిచేత వేచబడిన ఆ ఈరాజశేఖరకవి యిప్పుడు కాశీని కోరుతున్నాడు.)

అనే అభియుక్తోక్తి యథార్థమైతే రాజశేఖరుడు బహుదేశస్త్రీలతో సుఖించానని ప్రకటించుకొనడం గౌరవాపాదకంగానే భావించివుండవచ్చును.

ఈ వేశ్యలలో కొందరు విద్యావతులుగా ధనవతులుగా ఉండేవారు. గణిక అనేసంజ్ఞ ఇట్లాటి వేశ్యలకే నని విదితం.

" कुम्भदासी परिचारिका कुलटा स्वैरिणी नटी शिल्पकारिका प्रकाश-बिनष्टा रूपाजीवा गणिकाचेति वेश्या विशेषाः । [वा. का. ६-६-५४]

[కుంభదాసి (అంట్లుతోమడం మొదలైనపనులవల్ల జీవించే దాసి) పరిచారిక, కులట (భర్తకానకుండా వ్యభిచరించేస్త్రీ), స్వైరిణి (భర్తను తిరస్కరించి వ్యభిచరించేది), నటి (రంగస్త్రీ), శిల్పకారిక (రజకతంతువాయాది భార్య), ప్రకాశవినష్ట (భర్త బ్రతికివున్నా గతించినా అతనిని వదలి బహిరంగంగా అన్యసంగత అయినది), రూపాజీవ (రూపంమీద ఆధారపడి జీవించేవేశ్య), గణిక (రూపవతి కళాప్రవీణ అయినవేశ్య) అని (పైన ఉదాహృతలైనస్త్రీలు) వేశ్యావిశేషాలు.]

అని వాత్స్యాయనుడు

కుంభదాసి, రూపాజీవ, గణిక, కాక తక్కినఆర్గురు అవలంబించేది వేశ్యావృత్తంవంటిదే గనుక వారుకూడా వేశ్యలలోనే చేర్చబడినారు.

"रूपादिभिर्नायिकागुणैः कलादिभि
श्चान्विता उत्तमगणिकाः गुणानाञ्च
कलानां च पादार्थाभ्यां शून्या
मध्यमाधमाः ॥" [६-५-२५ ज. व्या]

(నాయికాగుణాలైన రూపాదులు, గుణాదులు, కలిగిన వేశ్యలు ఉత్తమగణికలు. ఈగుణాల్లో నాలుగవవంతు తక్కువైతే మధ్యమగణికలు. సగం తక్కువైతే అధమగణికలు.)

అని జయమంగళుడు.

కౌటిల్యమతాన్ని అనుసరించి వేతనాలిచ్చి వేశ్యలను రాజసేవయందు స్థాపిస్తుండినట్లు వారివ్యవహారాలను గణికాధ్యక్షులు పరిపాలిస్తుండినట్లును, అర్థశాస్త్రంవల్ల విదితమవుతున్నది. గణికలకు గీతాది విద్యలను నేర్పే ఆచార్యుడికి రాజమండలంనుండి వృత్తిని యేర్పరచవలెనని కౌటిల్యుడు చెప్పుతున్నాడు.

"गीतवाद्यपाठ्यनृत्तनाट्याक्षरचित्रवीणावेणुपरचित्तज्ञानगन्धमाल्यसंयूहनसम्पादनसंवाहनवैशिककलाज्ञानानि गणिका दासी रङ्गोपजीविनीश्च ग्राहयतो राजमण्डलादाजीवंकुर्यात् ॥" [अ. २-२७]

[గణికలకు దాసీలకు నటాదిస్త్రీలకు గీతవాద్యాలు, నృత్తం, నాట్యం, లిపి, చిత్రం, (చిత్రాలుగీయడం,) వీణ, వేణువు, మృదంగం, పరచిత్తజ్ఞానం, గంధయుక్తి, మాల్యసంపాదనం, అంగమర్దనం, వైశికం (వేశ్యావృత్తం) ఇంకా కళలునేర్పే అచార్యుడికి రాజమండలంనుండి వృత్తిని కల్పించవలెను.]

అని కౌటిల్యుడు.

**तस्य षष्ठं वैशिकमधिकरणं पाटलिपुत्रिकाणां गणिकानां नियोगाद्दत्तकः पृथक्चकार ॥** [वा. का. १-१-११]

అనేవాక్యాల్లో వీరసేన మొదలైన పాటలీపుత్ర గణికల నియోగంవల్ల దత్తకుడనే విద్వాంసుడు బాభ్రవ్యగ్రంథమందలి వైశికాధికరణాన్ని (వేశ్యల పురుషరంజన విధానాన్ని) పృథక్కరించాడని వాత్స్యాయనుడు తెలుపుతున్నాడు.

ఇతడు తనకామసూత్రంలో ఒక అధికరణం అధికరణం వేశ్యా విషయకథనానికి వినియోగించాడు. దేశాధీశ్వరులంతటివారికికూడా వేశ్యామైత్రి న్యూనతగా వుండినట్లు కనబడదు. మణిమేఖల అనే వేశ్యాపుత్రిని పొందడానికి రాజకుమారుడంతటివాడు యత్నించాడని తమిళవాఙ్మయజ్ఞులు చెప్పుతున్నారు.

**रतियोगे हि कीलया गणिकां चित्रसेनां चोलराजो जघान ॥**

[वा. २-७-२०]

(రతియోగమందు కీల అనే ప్రహణనవిశేషంచేత చిత్రసేన అనే గణికను చోళరాజు చంపినాడు.) అని చిత్రసేన అనే వేశ్యతోడి చోళ రాజమైత్రిని వాత్స్యాయనుడు విశదం చేస్తున్నాడు. ఈతీరుగా వేశ్యా మైత్రి ఆకాలంలో న్యూనతకు హేతువు కాలేదు.

అయినప్పటికీ బాలచంద్రయుద్ధంలోని వేశ్యాఘట్టమంతా అప్ర సక్తంగా కనబడుతుంది. సత్యభామ శ్రీకృష్ణుని అనుసరించినట్లు బాల

చంద్రుడితో ఈమె యుద్ధభూమికి పోయివుంటే ఈ ఘట్టం సంగతంగా వుండేది; కాని ఆమె అట్లాపోక వారిసంగతి శృంగారంతోటే సమాప్తం కావడంవల్ల కృతికర్త దీనిని వదలివేయడమే వుచితంగా వుండేది.

## వేశ్యమాత

---

వేశ్యాప్రసక్తి వచ్చినచోట వేశ్యమాతను ప్రదర్శించడం చాలామట్టుకు తెలుగుగ్రంథకర్తల ఆచారంగా కనబడుతున్నది. నిరంకుశోపాఖ్యానం మొదలయినవి ఉదాహరణం. వాత్స్యాయన కాలం నుండి యీ వేశ్యమాత వాఙ్మయంలో ప్రసక్తి వహించింది.

**मातरि च क्रूरशीलायां अर्थपरायां च आयत्ता स्यात्तदभावे मातृकायाम् ॥**
**[वा. का. ६-२-२]**

(క్రూరశీల, అర్థాసక్త, అయిన తల్లిఅధీనంలో ఉండవలసినది. తల్లి లేకపోతే కృతకమాత అధీనంలో ఉండవలసినది.)

అని వాత్స్యాయనుడు.

**"सौभाग्यभङ्गे मातृकां कुर्यात्"** **[अ. २-२७]**

[(ముసలితనంచేత రూపయౌవనాలు చెడినప్పుడు (ఆమెను భోగ్యగణికకు) మాతృకగా చేయవలెను. అంటే తల్లిలేని భోగ్య వేశ్యకు మాతృస్థానీయనుగా ఆమెను చేయవలెను.]

అని కౌటిల్యుడు

వేశ్యకూతురును బలాత్కరించినందుకు దండం విధిస్తూ దానికి పదహారురెట్లు వేశ్యమాతకు భోగశుల్కంగా ఇప్పించవలెనని

**"गणिकादुहितरं प्रकुर्वतश्चतुष्पञ्चाशत्पणो दण्डः ।**
**शुल्कं मातुर्भोगः षोडशगुणः ॥"**

అనే వాక్యాల్లో కౌటిల్యుడు చెప్పుతున్నాడు. సామాన్య నాయికావృత్తం నిర్దేసిస్తూ ఈమెనాయకుణ్ని నిర్ధనుణ్ని చేసి చివరకు పునస్సంధాన కాంక్షతో తల్లి చేత వెళ్లగొట్టించవలెనని సాహిత్య వేత్తలు తెలుపుతున్నారు.

"काममङ्गीकृतमपि परिक्षीणधनं नरम् ।
मात्रा निष्कासयेदेषा पुनः सन्धानकाङ्क्षया ॥" [सा. ३]

(బాగా అంగీకృతు డయినప్పటికీ క్షీణధనుణ్ని వేశ్య పునః సంధానకాంక్షతో తల్లి చేత వెళ్లగొట్టించవలెను.)

అని విశ్వనాథుడు.

"निस्वान्मात्रा विवासयेत्" [दश. ३]

(ధనంలేనివాండ్లను తల్లి చేత పంపించివేయవలెను.)

అని ధనంజయుడు.

ఈవేశ్యమాత ప్రస్తావన తెలుగుకృతికర్తల స్వమార్గం కాక పూర్వసంప్రదాయానుసారిగా వున్నట్లు స్పష్టపడుతున్నది. ఈమెను వెగటుగా వర్ణిస్తూవచ్చారు.

"విటసమూహావిలంఘ్యమాననానావచోఝల్లి దాని తల్లి
వేశ్యమాత విషమువేము విషము.

పైశాచసమితిలోపలి వికాంబెల్లఁగపికోటిలోనుండు కాంక్ష............
.........................................................................లెల్ల
దీసి.........నిర్మించెబ్రహ్మ......లంజ తల్లిగాఁగ"

(ని. 2)

అని కంసాలిరుద్రయ్య.

"సూనశరభుక్తనిర్ముక్త శుష్కపత్రభాజనములైన వృద్ధవేశ్యాజనములు.
..........................................................................
కాచుజాగిలములువోలెఁ గాచియుంద్రు

వేశ్యమాతలు తద్ద్వారవేదికలను,

..........................................................................

వివిధమాయాప్రభూత యవ్వేశ్యమాత"

అని సారంగు తమ్మయ. (వై. వి)

"తల్లిగలుగు సానితగులుటరోతరా." (వే. శ.)

అని వేమన.

వైమార్గాన్ని అనుసరించే వీరచరిత్రకర్త వేశ్యమాతను మిక్కిలి విశారంగా ప్రదర్శించాడు. అది ముందుపుటల్లో ద్రష్టవ్యం.

భార్యాసమాగమం.

---

యుద్ధానికి బయలుదేరబోయే సమయంలో వేణీసంహారంలో

**द्रौ—नाथ—असुरसमराभिमुखस्य हरेरिव मङ्गलं युष्माकं भवतु ।**
**यच्चाम्बा कुन्त्याशास्ते तद्युष्माकं भवतु ॥"** **[छाया]**

(కన్నీరు ఆపుకొంటూ) నాథా అసురయుద్ధాభిముఖుడైన విష్ణు వుకువలెమీకు మంగళమగుగాక. అంబ కుంతి ఆశాసిస్తున్నది మీకు కలుగును గాక.)

అనేచోట భీమసేనుడివలె బాలచంద్రుడు భార్య ఆశీస్సులను స్వీకరిస్తాడు. ఇంతటితో వూరుకొంటే వుచితంగా వుండేది. కాని ఆమెను చూడగానే బాలచంద్రుడు కామపరవశు డవుతాడు. రణదీక్షి తుడు ఇట్లా కామవశుడు కావడం భారతీయ వీరధర్మానికి విరుద్ధం. అనార్యుడై పరాజయం పొందబోతున్న వాలికి వాల్మీకి

**तं तु तारा परिष्वज्य वालिनं प्रियवादिनी ।**
**चकार रुदती मन्दं दक्षिणा सा प्रदक्षिणम् ॥** **[रा. कि]**

(దక్షిణ ప్రియవాదిని అయిన తార ఆవాలిని కౌగిలించుకొని విలపిస్తూ తిన్నగా ప్రదక్షిణంచేసింది.)

అని భార్యాపరిష్వంగం ప్రతి పాదిస్తాడు.

విజయనగరరాజ్యంనాటి పారిజాతాపహరణ కర్త తమ శత్రువులను మహమ్మదీయులను మనస్సులో పెట్టుకొని కాబోలు అభాగ్యుడైన కృష్ణశత్రువు యుద్ధానికి పోతూ తనభార్యను కౌగిలించుకొన్నాడని చెప్పినాడు. ఇట్లా యుద్ధానికిపోతూ భార్యలను స్పృశించడం అనార్యుల ఆచారమై వుండవచ్చును. రావణుడికిసైతం యీకార్యం వాల్మీకి కనబరచలేదు. యుద్ధమాసన్నమై వున్నప్పుడు దుర్యోధనుడు భార్యనుచూసి మదనచేష్టలను ఆరంభించినట్లు భట్టనారాయణుడు వేణీసంహారంలో చెప్పితే అది అనుచితమని ఆకాండంలో ప్రథనమనే దోషమని

**अकाण्डे प्रथनं यथा—वेणीसंहारे द्वितीयेऽङ्केऽनेकवीरक्षये प्रवृत्ते भानुमत्या सह दुर्योधनस्य शृङ्गारवर्णनम् ॥ [का. प्र. ७]**

(అనవసరమందు వర్ణనానికి ఉదాహరణం—వేణీసంహారనాటకంలో ద్వితీయాంకంలో అనేకవీరక్షయం ప్రవృత్తమైనప్పుడు భానుమతితో దుర్యోధనుడి శృంగారంయొక్క వర్ణనం.)

అనేపట్కుల్లో మమ్మటుడు నిరసించాడు. భార్యను కలిసికొనడానికి అదేచివరసారి గనుకను తల్లికోరింది గనుకను బాలచంద్రుడట్లా చేశాడేమో నంటారా, చెప్పుతున్నాను. పరలోకానికికూడా భార్య తనను అనుసరించబోతున్నదని సంప్రదాయం ప్రబోధిస్తూవుంటే తన క్షాత్రధర్మంకోసం ప్రాణాలనుసైతం సమర్పించబోయ్యేవీరుడు సర్వత్యాగదీక్ష వహించవలసిన ఆసమయంలో యేకారణంచేతగాని యింద్రియవశుడు కావడం దీక్షాభంజకంగదా. కోడి మొదలైన ప్రాణులతో ఆడే జూదానికి సమాహ్వాయమని పేరు. ప్రాణంలేనిపాచికలు మొదలైనవాటితో ఆడేదానికి ద్యూతమని పేరు. ద్యూతసమాహ్వయాలకు ధర్మశాస్త్రంలోగల నిషేధం, రాజ్యవ్యవహారంలో కౌటిల్యమతాన్ని అనుసరించి

వాటినియతత్వం ధర్మరాజు ద్యూతంలోవలె బ్రహ్మనాయుడు సమాహ్వాంయలో ప్రవర్తించడంయొక్క ఉచితానుచితత్వం, కార్యంపూడిలో అడివరకుజరిగిన యుద్ధాలు, అర్ధరాత్రంలోకన్నమనీడి యుద్ధరంగ దర్శనం, యుద్ధరంగశుద్ధి, అక్కడి యెరుకలసాని, పిశాచాదులు, నీళ్లపైన తేలుతూవచ్చి నవ్విన తలపుర్రె, జలధిసోముడు, సాక్షిగా నిల్పబెట్టిన యుద్ధస్తంభం, శివపురి, రమపురి, అప్పటి ఇప్పటి స్త్రీపురుష వస్త్రధారణ రీతులవివేకం, తెలుగుదేశంలో శైవవైష్ణవమతవ్యాప్తి, మహాకాళి ఆరాధన, తాంత్రికమతాభిరతి మొదలైన వాటినిగురించి చర్చించవల చాను గాని కొన్ని కారణాలచేత ఆవిచారణ ఇప్పుడు మానుతున్నాను.

## వీరమతం.

వీరత్వం మిక్కిలి ప్రాచీనకాలంనుండి ఆరాధ్యంగా సంభావిత మవుతున్నది. ఋగ్వేదంలో పూజ్యుడైన ఇంద్రుడికి వీర అని సంబోధనం కలదు.

"सुप्रवाचनं तव वीर......" [२-१३-११]

అని ఋక్కు.

"वीर वलवन् हे इन्द्र" [ऋ. भा.]

అని శ్రీవిద్యారణ్యులు. శ్రుతుల్లో అగ్నికికూడా వీరుడని ప్రశంస కలదు. వీరహత్య ఒకగొప్పపాపంగా పరిగణిత మవుతూవుండేది.

"वीरहा वा एष देहिनां योऽग्निमुद्वासयते न वा एतस्य ब्राह्मणा ऋतायवः पुरान्नमक्षन्" [कृ. य. ५-१-२]

అని కృష్ణయజుస్సు. వేదభాష్యంలో

"देवानां मध्ये वीरोऽग्निः तद्वधकारिणः यजमानस्यान्नं ऋतायवः सत्यमिच्छन्तो ब्राह्मणाः पुरा नैवाक्षन् नैव भुक्तवन्तः"

(దేవతలమధ్య అగ్ని వీరుడు. అగ్ని నివధించిన యజమానుడి అన్నాన్ని సత్యాభిలాషులైన బ్రాహ్మణులు పూర్వం తినలేదు.)

అని శ్రీవిద్యారణ్యులు వివరించారు. వీరశబ్దం శ్రుతుల్లో కొన్ని చోట్లపుత్రపరంగాకూడా వ్యాఖ్యాతం.

తైత్తిరీయ బ్రాహ్మణంలో

"वीरहा ब्रह्महणि" [तै. ब्रा. ३-८]

అనేచోట వీరశబ్దం క్షత్రియవాచి అని కొందరంటారని అది పుత్రవాచకమని

"वीरहा गर्भघाती क्षत्रियवाचीत्येके" [भ.]

అనేపఙ్క్తుల్లో భట్టభాస్కరులు తెలుపుతున్నారు. ఋగ్వేదభాష్యంలో కొన్నిచోట్ల వీరశబ్దానికి శ్రీవిద్యారణ్యులు పుత్రపరంగా వ్యాఖ్య చేశారు.

"अवीरायाश्च योषितः" [म. ४-२१३]

అని వీరభార్యఅయినా వీరమాత అయినా కానటువంటి స్త్రీచేతి అన్నం తినగూడదనిమనువు నిషేధిస్తున్నాడు. ఇక్కడ వీరశబ్దం పుత్రవాచిగాకూడా వ్యాఖ్యాతం. దుర్బలులైన శిశువులు త్యక్తులై, దేశరక్షకులు కాగల దృఢకాయులైన శిశువులుమాత్రం రక్షితులుగా వుండిన పురాతనపుగ్రీసుదేశంలోవలె, ఇప్పుడు ఇటలీవంటి దేశాల్లో వలె, ఒకప్పుడు భారతవర్షపు ఆర్యుల్లో వర్ధిల్లిన పురుషులందరూ చాలా మట్టుకు వీరులుగానే వుండిన కాలాన్ని పై శ్రుతిస్మృతి పఙ్క్తులు సూచించగలవేమో నని అనుకొంటున్నాను. పౌత్రప్రతిపత్తిలో పుత్త్రుడు వీరుడు కనుకనే

"वीरप्रसवा भूयाः" [उत्तर]

"अपरा वीरमजीजनत् सुतम्" [रघु]

అని వీరపుత్రుణ్ణే భావిస్తూ వచ్చారు. మహాభాష్యంలో అనేక స్థలాల్లో వీరశబ్దం ప్రస్తావించబడింది. శాస్త్రంలో మంగళార్థకశబ్ద ప్రయోగాన్ని ప్రశంసిస్తూ

"मङ्गलादीनि मङ्गलमध्यानि मङ्गलान्तानि च शास्त्राणि प्रथन्ते वीरपुरुषकाण्यायुष्मत्पुरुषकाणि च भवन्ति" [महा]

[(మంగళాదులు, మంగళమధ్యాలు, మంగళాంతాలు, అయిన శాస్త్రాలు ప్రసిద్ధి చెందుతున్నవి. ఆయుష్మత్పురుషకాలు, వీరపురుషకాలు అవుతున్నవి. (వాటిని చదివినవారు ఆయుష్మంతులు వీరులు అవుతున్నారు.)]

అని పతంజలి వీరత్వాన్ని సంభావించాడు.

మంత్రశాస్త్రంలో కూడా

"निस्सङ्गो निर्भयो वीरो निर्द्वन्द्वो निष्कुतूहलः" [कु

(వీతరాగుడు నిర్భయుడు నిర్ద్వంద్వుడు నిష్కుతూహలుడు ............అయి వీరుడు)

అని వీరశబ్దం సాధకపరంగా అర్థిత మవుతున్నది. ఇట్లానే మరికొన్ని చోట్ల కలదు. యోగశాస్త్రంలో కూడా ఈవీరశబ్దాన్ని స్వీకరించి వీరాసనమనే ఒకఆసనాన్ని ప్రతిపాదించారు. దీన్నే

"वीरासनैर्ध्यानजुषामृषीणां" [र]

(వీరాసనాలతో కూర్చుండి ధ్యానించే ఋషులయొక్క)

అనేచోట కాళిదాసు ప్రస్తావించాడు. శృంగారసందర్భంలో కూడా

"मनसि नः स्मरं वीर यच्छसि" [श्री. भा. १०]

[ఓ వీరుడా (కృష్ణుడా) మామనస్సులో మన్మథుణ్ణి ప్రభవించచేస్తున్నావు]

అని గోపికలచేత శ్రీభాగవతకారుడు వీరశబ్దాన్ని ప్రయోగించ జేశాడు. రామాయణంలో

"वीर्यशुल्केति मे कन्या स्थापितेयमयोनिजा" [रा. बा]

అని జనకుడు తనపుత్రిక వీర్యశుల్క అని ప్రకటించాడు. ఈ వీర్యశుల్క అనేమాటలనే కాళిదాసు

"दृष्टसारमथ रुद्रकार्मुके, वीर्यशुल्कमभिनन्द्य मैथिलः" [र. ११]

(పిమ్మట జనకుడు రుద్రకార్ముకమందు కనబడ్డ సారంకల వీర్యశుల్కానికి సంతోషించి) అనేచోట స్వీకరించి గౌరవాన్ని తెలిపినాడు. వీరమాతృత్వం, వీరపత్నీత్వం, మిక్కిలి ఆరాధ్యమైనవిగా ప్రాచీనకాలంలో సంభావిత మవుతూవుండేవి.

"वीरसूर्वीरपत्नी त्वं" [म. उ. ९०-९२]

(ఓకుంతీ, నీవు వీరజననివి వీరభార్యవు) అని శ్రీకృష్ణుడు కుంతిని అభినందిస్తాడు.

"भर्त्रासि वीरपत्नीनां श्लाघ्यानां स्थापिता धुरि ।
वीरसूरिति शब्दोऽयं तनयात्त्वामुपस्थितः ॥" [मा. ५]

[శ్లాఘ్యులైన వీరపత్నుల అగ్రాన భర్తచేత నిల్పబడ్డావు. (ఇక) వీరజనని అనే ఈశబ్దం (బిరుదం) కుమారుడివల్ల నిన్ను చేరింది.] అని కాళిదాసు ఈధర్మాలపూజ్యతను విశదం చేస్తాడు. శివోద్భూతుడైన వీరభద్రుడి వీరత్వం ప్రసిద్ధమయ్యే వున్నది. తదారాధకులు ఇప్పటికీ వీరాంగాన్ని ఉద్బోధకంగా వెలయిస్తున్నారు. విష్ణువుయొక్క పది అవతారాల్లో నృసింహుడు, శ్రీరాముడు, పరశురాముడు, బలరాముడు యుద్ధవీరులే అయివున్నారు. వైదికమతరక్షణాదులు విశేషలక్షణాలు వారికివున్నా వారు యుద్ధవీరుల్లో చేరినసంగతి నిర్వివాదం. బుద్ధుడు దయావీరుడు.

भो लङ्केश्वर दीयतां जनकजा रामः स्वयं याचते ।
कोऽयं ते मतिविभ्रमः स्मर नयं नाद्यापि किंचिद्गतम् ॥
नैवं चेत् खरदूषणत्रिशिरसां कण्ठासृजा पङ्किलः ।
पत्त्री नैष सहिष्यते मम धनुर्ज्याबन्धबन्धूकृतः ॥

(ఓ రావణా! సీత నియ్యవలసినది. రాముడు స్వయంగా యాచిస్తున్నాడు. నీకీ మతివిభ్రమ మేమిటి? నీతినిస్మరించు. ఇంకా యేమీమించిపోలేదు. అట్లాకాదా, ఖరదూషణత్రిశిరుల కంఠరక్తం చేత పంకిలమైన యీబాణంనా ధనుర్జ్యాబంధానికి సంధించబడి సహించదుసుమా) అనే వాక్యాలను సాహిత్యదర్పణకర్త యుద్ధవీరుడైన శ్రీరాముడికి వుదాహరణంగా చూపినాడు. శ్రీరాముడికి వీరరాఘవత్వప్రతీతివిదితం. భవభూతికృతిలో శ్రీరాముడు మహావీరుడుగా ప్రసిద్ధుడు. అవతార వీరుల్లో నృసింహ శ్రీరాముల కిప్పటికీ ఆలయాల్లో పూజలు జరుగుతున్నవి. ఇంతకూ చెప్పదలచిం దేమంటే వీరారాధనం భారతవర్షానికి నూతనంకాదని. అయితే "భవిష్యద్రాజేతిహాసం" అని పురాణాల్లో ప్రదర్శితులైన రాజులకాలానికి పిమ్మట పల్నాటి వీరులవలెదైవత్వ మారోపించి పూజితులవుతున్న యుద్ధవీరులు ఇంతవరకు భారతవర్షంలో మృగ్యులు. భారతవర్షమందలి యితర దేశాల్లో యిట్లాటివీరారాధనం నాకు తెలిసినంతవరకు వున్నట్లు తోచదు. నేను కలకత్తాలో వుండేరోజుల్లో "Birbhum" (వీరభూమి) అనేపేరుగలఒక ప్రదేశం వంగదేశంలో వున్నట్లు విన్నాను. కాని యిట్లాటి వీరమతప్రతిపత్తి అక్కడవున్నట్లు నేను వినలేదు. ఇటీవల పరాక్రమప్రధానమైన సిక్కు జాతిలోకూడా ఈరీతులు కనబడవు. మహమ్మదీయులు "మొహరం" సమయంలో ఆచరించే ఆరాధన కొంతవరకు దీన్ని పోలివున్నది. కార్లైలు వీరపూజను గురించి యూరపుఖండంలో యెక్కువప్రచారం చేశాడు. పల్నాటి వీరారాధనంవంటి మతప్రస్థాన మెక్కడా యేర్పడివుండలేదు. స్కాన్

డి సేవియాయందలి నార్సుమతం జపాన్‌నందలి షింటోమతం యుద్ధ వీరారాధనతో సంబంధం కలవని తెలుస్తున్నది. ఈవీరమతం ఆంధ్ర దేశపు గొప్పవిశేషంగా కనపడుతున్నది.

బుద్ధభగవానుడిచేత ఆరబ్ధమై పిమ్మట రామానుజాదులు కొంత వరకు అనుసరించిన వర్ణాధికారసామ్యం యిందు ప్రతిపాదితం గనుక లోకతంత్రంలో సయిత మిది ప్రస్ఫుటస్థాన మాక్రమిస్తున్నది. దీంట్లో జాతిభేదం లేదు. బ్రాహ్మణుడు మొదలు చండాలుడిపర్యంతం అందరికీ దీంట్లో ప్రవేశం కలదు. చండాలుడైన కన్నమనీడు బ్రహ్మనాయుడి పుత్రుడుగా భావింపబడ్డాడు. దక్షిణదేశమందు బ్రాహ్మణేతరులైన కొందరు ఆళ్వారులవలె ఇతడు పూజనీయుడుగా వున్నాడు.

బ్రహ్మనాయుడి సైన్యంలో అన్నిజాతులవీరులు వుండేవారు. అందులో పంచములకు గోసంగులని పేరు. బ్రాహ్మణుడు చాకలి మంగలి కుమ్మరి మొదలైన నానాజాతియోధులు బాలచంద్రుడికి సోదరతుల్యులైన పరమమిత్రులు. వీరభక్తులైన యిద్దరు మహమ్మదీయుల గోరీలు కూడా వీరాలయంలో వున్నవి.

प्रद्योतस्य प्रियदुहितरं वत्सराजोऽत्र जह्रे ।
हैमं तालद्रुमवनमभूदत्र तस्यैव राज्ञः ॥
अत्रोद्भ्रान्तः किल नलगिरिः स्तम्भमुत्पाट्य दर्पा ।
दित्यागन्तून् रमयति जनो यत्र बन्धूनभिज्ञः ॥ [मेघ]

[ప్రద్యోతుడి ప్రియపుత్రికను వత్సరాజిక్కడ హరించాడు, ఆరాజుకే (ప్రద్యోతుడికే) ఇక్కడ బంగారుతాటితోపు వుండినది, ఇక్కడ స్తంభంపెరికి నలగిరి (యేనుగు) దర్పంతో పైకెగిసింది గదా, అని ఆగంతులైన బంధువులను అభిజ్ఞజనుడు అక్కడ (ఉజ్జయినిలో) వినోదపరుస్తుంటాడు.]

అనే కాళిదాసోక్తులను పోలి

> ఇచ్చోట భుజియించి రేకకార్యస్థులై
> సామంతనృపతులు చాపకూడు
> ఇచ్చోటఁ జింతించె నిచ్చను పాయంబు
> నళినాక్షి యార్వెల్లి నాయురాలు
> నిజమనశ్శుద్ధికై నిప్పులయేటిలో
> నోలాడె నిచ్చోట బీ(శీ)లసాని
> యిచ్చోట బోరినారిలపణంబుగఁ గొల్ల
> సవతితల్లుల బిడ్డ లవనిపతులు
> ధీరులగువార లేవురు వీరపురుషు
> లై మహోద్ధతినిచ్చోట నాజిఁబడిరి
> అనుచుఁ జెప్పుదు రైతిహ్యా మచటనచటఁ
> జనుప పెద్దలు పల్లెదేశములయందు. (క్రీ. రా.)

అని వీరచరిత్రవిషయాలను తిక్కిరిబిక్కిరిగా తెలిపే క్రీడాభి రామపద్యంలోని చాపకూడు నానాజాతుల యేకపఙ్క్తి భోజనంవంటి దిగా తోస్తున్నది. ఈ వీరమతస్థులందరికీ పాంగ్యం అని పారిభాషిక వ్యపదేశం. అన్ని అవైదికమతాలవలెనే ఈవీరమతంకూడా వైదికమతం ముందు తలవంచింది. ఉత్సవదినాలు గడచిపోగానే పాంగ్యం వారు సాధారణమతమార్గాల్లోనే వర్తిస్తున్నారు. దీనికి ఆచార్యులు బ్రాహ్మ ణులైన పిడుగువారు. వీరోత్సవంలో ఆచార్యప్రవృత్తిని చూచి నప్పుడు కృపుడు, అశ్వత్థామ, ద్రోణుడు, పరశురాముడు ఇట్లాంటి మహా వీరుల సంప్రదాయాలు చిహ్నమాత్రంగానైనా ఆంధ్రదేశమందు నిల్చివున్నవి గదా అని సంతృప్తి చిత్తోన్నతి కలుగకమానవు. మహ మ్మదీయులు దేశంవెంట దేశం అన్నిదేశాలను గ్రసిస్తూ ఉత్తరభారత వర్షాన్ని సంక్షోభపరుస్తుండినసమయాన విజృంభించిన భారతీయ ప్రతా పాగ్నియొక్క ఒక్కకణమే ఆంధ్రదేశంలో పల్నాటియందు బ్రాహ్మ యుద్ధరూపాన వెలిగింది. ఆవశ్యకసమయంలో దేశాన్ని రక్షించగ

వీరత్వం దైవతాంశగా పరిణమింపజేసి జాతిమతాభేదప్రతిపత్తితో దేశప్రజలను యేకవర్గస్థులనుగా చేయయత్నించిన ఈవీరమతాచార్యులు మనకు అవశ్యం స్మరణీయు లవుతున్నారు.

ఇట్లా ఆచార్యులు సర్వవర్ణసామరస్యంతో యుద్ధక్రతుదీక్ష వహించడం దేశేతిహాసంలో గణించదగిన అంశం.

## భారతవర్షేతిహాసంలో వీరచరిత్రప్రాధాన్యం.

కలిశకం 43-వ శతాబ్దిలో చేదిదేశపు హైహాయులు ఉత్తర భారతంలో అదృశ్యులైనారని వారేతీరుగా అదృశ్యులైనారో తెలియడం లేదని ఆధునికుడైన పాశ్చాత్యైతిహాసికుడు విన్సెంట్ స్మిత్తు చెప్పుతున్నాడు. ఈతీరుగా ఐతిహాసికులకు అగోచరమైన హైహాయాదర్శనాన్ని, ఇంకా కల్యాణమేలిన పశ్చిమచాళుక్యవంశపుక్షయాన్ని ఈ పల్నాటివీరచరిత్ర వ్యక్తపరుస్తున్నది. క. 43-వ శతాబ్ది భారతవర్షేతిహాసంలో పూర్వోత్తరాలనుకలిపే ప్రముఖమైన ఒకగణుపుగా పల్నాటివీరచరిత్ర కనబడుతున్నది.

## హై హ యు లు.

ఈహైహాయరాజవంశాలు ఇప్పుడే రూపాన యెక్కడవున్నవో చెప్పజాలను. భారతవర్షపు హైహాయక్షత్రియుల మహాసభ యీనడుమ అలహాబాదులో జరిగినదని విన్నాను. పూర్వం వీరికి నర్మదాతీరమందలి మాహిష్మతిరాజధానిగా ఉండినట్లు విదిత మవుతున్నది. వీరికి మిక్కిలి ప్రాచీనకాలంనుండి ఒకవిధమైనవక్రత వాఙ్మయంలో విశ్రుతం. మాహిష్మతీస్త్రీలు స్వైరిణులుగా ఉండినారని భారతం చెప్పుతున్నది.

> “ एवमग्निर्वरं प्रादात् स्त्रीणामप्रतिवारणम्
> स्वैरिण्यस्तत्र नार्यो हि यथेष्टं प्रचरन्त्युत ”
>
> [म. स. २७ ३९]

(ఇట్లా అగ్ని దేవుడు స్త్రీలకు అప్రతివారణమైన వరమిచ్చాడు. అక్కడ స్త్రీలు స్వైరిణులై యథేష్టంగా సంచరిస్తారు).

శ్రీకృష్ణవిరోధి శిశుపాలుడు ఈచేదిదేశపురాజే. జమదగ్నిని చంపి బహుక్షత్రియవినాశకారణమైన పరశురామకోపాన్ని ప్రజ్వలింప జేసినది ఈ హైహయవంశమేను. వీరులకాలంలో అనుగురాజాదులు తమపూర్వులు చేసినపాపాలు తొలగించుకొనడానికి దేశభ్రష్టు లయినారని వీరచరిత్రకర్త చెప్పినవిషయం హైహయుల అనుస్యూతమైన చరిత్రకు అనుగుణంగానే ఉన్నది. వీరభద్రరావుగారు వివరించిన కోనసీమహైహయులు ఈపల్నాటివీరుల వర్గంలోనివారే అయి వుండవచ్చును.

వీరులకాలంనాటికి చేదిదేశపురాజధాని త్రిపుర అయినట్లు తెలుస్తున్నది. త్రిపుర రేవానదీసమీపంలో ఉన్నట్లు రేవామాహాత్మ్యంలో ఉక్తం. తమరాజధాని త్రిపురను స్మరించడానికి కాబోలు ఈ హైహయులే పల్నాటిప్రాంతాల్లో త్రిపురాపురం, త్రిపురాంతకం అనేగ్రామాలను నిర్మించి ఉంటారని అనుకొంటున్నాను. త్రిపురా పూర్ణిమ వచ్చే కార్తికమాసంలోనే పల్నాటివీరుల ఉత్సవంకూడా జరుగుతున్నది.

పల్నాటివీరచరిత్రలో హైహయులు పాలమాచాపురినుండి వచ్చినారని చెప్పబడినది. ఈపాలమాచాపురికి చేదిదేశంలో అవికృతనామమేదో నేను చెప్పజాలను. మత్స్యపురి అని వూహిస్తే అది చేదిదేశంలో ఉన్నదో లేదో నిశ్చయించలేను. త్రిపురకాక పాలమాచాపురికి ప్రకృతి అయిన పేరుగల మరివొకస్థలంలో కూడా వారు నివసించి వుండవచ్చును. జంభనాపురి అని వీరచరిత్రలోనే మరియొకచోట కలదు. అది జబ్బల్పురమై వుండవచ్చునని అనుకొంటున్నాను. వీరచరిత్ర చంపువుగా వ్రాసిన వీరభద్రుడు జబలాపురమనే చెప్పినాడు.

ఇప్పుడు వేంకటగిరిరాజవంశానికి బ్రహ్మనాయుడిసంబంధం ఉక్త మవుతున్నది. పల్నాటియుద్ధంలో బ్రహ్మనాయుడు మొదలైనవారు ఆవిష్కరింపజేసిన శౌర్యానలం పిమ్మటకాలాన అణగి తిరిగి తద్వంశ్యులైన బొబ్బిలివీరుల్లో ప్రజ్వరిల్లింది.

## వెలమ—నాయుడు—రావు.

---

తెలుగుదేశంలో క్షాత్రసంప్రదాయాలను నిలవబెట్టిన నియోగి, వెలమ, రెడ్డి, కమ్మ, శాఖలవారిలో మనకు సన్నిహితకాలంలో శౌర్యధైర్యాదులను లోకోత్తరంగా వెలయించినది వెలమవారేను. ఈ వెలమలు హైహయులతో తెలుగుదేశంలో ప్రవేశించిన క్షాత్రధర్మ పరాయణులని, అందువల్ల వైదేశికులని, భావిస్తే బ్రహ్మనాయుడితండ్రి దొడ్డనాయుడని దక్షిణదేశపు పేరుతో ఉండడం ప్రతిబంధకం. అనుగు రాజపుత్రుల్లో ఒకరు పెరుమాళ్లరాజని పేరు వహించడం కూడా విచారణీయం. అవకాశం లేక ఆచర్చ వదలుతున్నాను. పల్నాటివీరుల కాలంలో వెలమవారికి నాయుడు, నీడు అని నామాంతాలు కనబడుతున్నవి. సంస్కృతంలోని నాయ అనే శబ్దంనుండి నాయుడు అని యేర్పడి ఉండవచ్చును.

"श्रिणीभुवोऽनुपसर्गे (३-३-२४)

అనే సూత్రంప్రకారం నీధాతువునుండి నాయశబ్దం ఉత్పన్నమైనది. నాయ అనగా నీతి. అదిగలవాడు **नायः** అని, **'भुक्ता ब्राह्मणाः'** అన్నచోట భుక్తశబ్దంవలె అది అచ్ ప్రత్యయాంతమని, భావించవచ్చును. లేదా నాయడు అనేది కేవలం దేశ్యమై ఉండవచ్చును. ఈ నాయుడుశబ్దానికి ఆకాలంలో గల గౌరవాన్ని బట్టి కమ్మ, ఈడిగ, చాకలి, మంగలి, మొదలైనశాఖలవా రెందరో దాన్ని తరువాతకాలంలో తమకు చేర్చుకొన్నట్లు అనుమేయం. అయితే

ఆంధ్రులకు అలవాటైన అనుచితానుకరణధోరణిలో కర్ణాటరాజులను మహారాష్ట్రులను చూసి మంత్రి, అమాత్య, భట్ట, వర్మలు, మొదలైనవాటిని విడిచి బ్రాహ్మణులు రాయులు, రావులు, పంతుళ్లు, అయినదశలో వెలమలు సయితం, తమ నాయుడుశబ్దాన్ని వదలి రావులు, నాయనింగారు అనేదాన్ని వదలి రాయనింగార్లు, అయినట్లు కనబడుతున్నది. రెడ్డిరాజులకాలంలోనే ఇది ఆరంభమైనట్లు విదితమవుతున్నా రెడ్లుమటుకు అనేకులు ఈఅనౌచిత్యానికి పాల్పడి రావులైనట్లు గోచరించదు. రెండు జేకులుజేకి మూడుసాకులు సాకమన్నట్లు అదీకావలె యిదీకావలెనని కొందరు రావుపంతుళ్లు, అయ్యపంతుళ్లు, అయినవిధాన ఈవెలమలలో కొందరు రావునాయుళ్లు కూడా అయినారని విదితం. ఈరావు అనేది యిప్పుడు మిక్కిలి దుర్వినియోగం చేయబడుతున్నది. కొన్నివంశవర్గాలను వేరుపరచి తెలపడమే నామాంతాలయొక్క ప్రయోజనం. కనుకనే ఇంగ్లాండు మొదలైన అభారతీయదేశాల్లోసయితం నామాంతాలు వంశవర్గాలనే తెలుపుతున్నవి. పిళ్ల, మొదలియార్, అయ్యర్, అయ్యంగార్, మొదలైననామాంతాలు దక్షిణదేశంలోను,సర్కార్, బెనర్జి,ముఖర్జి, మొదలైనవి వుత్తరభారతంలోను శాఖలను తెలపడంవల్ల ప్రయోజనవంతమై చరితార్థ మవుతున్నవి. లేదా వీటికి ఫలమేలేక అజాగళస్తనాలు కాగలవు. బ్రాహ్మణులు, కోమటి, కమ్మ, వెలమ, చాకలి, కుమ్మరి, మంగలి, బోయ, యానాది మొదలైనశాఖలవా రందరు తోచినట్లు రావుశబ్దం అనాలోచితంగా తగిలించుకొంటున్నారు. కనుక రావు ఇప్పుడు అర్థంలేనిదై పనికిమాలినదై పోయినది. ఇది తెలుగుదేశపు అవివేకాల్లో ఒకటి అని భావిస్తున్నాను. తెలుగుదేశంలో సర్వవర్ణసాధారణమైన అయ్య, అన్నలవలె, యీరావునుకూడా అంగీకరించగూడదా అని అంటే దేశీయమైన అయ్య, అన్నలు ఉండగా పరదేశస్థులరావును స్వీకరించడం అప్రశస్తమని, ప్రయోజనం లేకుండా స్వీయంవదలి పరకీయానికి చేతులు

చాచడం చిల్లరపని అని, వాటికితోడు ఇది ఒకటి అని చెప్పితే అనావశ్యకం, గనుక కల్పనాగౌరవ మనేదోషం సంభవిస్తుందని, అయ్య అన్నలలోకంటె రావులో విశేష మేమిలేదని చెప్పుతున్నాను. వేంకటరామన్ సూర్యనారాయణ భాగవతర్ రాధాకృష్ణన్ అని ఈతీరున ఆంధ్రుల అరవనామాంతాల అనుచితత్వం కూడా ఇట్లానే వ్యాఖ్యేయమని చెప్పుతున్నాను. తెలుగుదేశంలో చాలాకాలంనుండి కొన్ని దురాచారాలు ఉన్నమాట యథార్థం. అయ్య, అన్న, అమ్మ, అక్కలకు అసమంజసంగా ఇకారాంతాలమీద, త్ర్యధికాక్షర సంస్కృతశబ్దాల మీదకూడా, సంధిచేసి ఆపేర్లను చప్పబడవేయడం, గోరుచుట్టుపైన రోకటిపో టన్నట్లు పురుషులు సీతయ్య, లక్ష్మయ్య, అంబయ్య, అని ఈ తీరున ఆడపేర్లు పెట్టుకొనడం; స్త్రీలు రామమ్మ, హనుమమ్మ, శంకరమ్మ, సూరమ్మ, రాఘువమ్మ,అని ఈతీరున మగపేర్లు పెట్టుకొనడం; రామనాథం విశ్వనాథం ఇట్లా కొన్నిపేర్లు ద్వితీయాంతంగా ఉండడం తరుచుగా వుపలబ్ధ మవుతున్నవి. అయ్య,అమ్మ, మొదలైనవాటికి దాక్షిణాత్యుల్లో వలె గౌరవార్థం గారు వారు అని చేర్చి వాటిని పేర్లతో కలపకుండా మీనాక్షి అమ్మగారు మీనాక్షి అమ్మవారు విశ్వనాథ అయ్యగారు, రామస్వామిఅయ్యవారు అని యిట్లా ఈతీరున ప్రయోగించడం వుచితం. దురాచారాలు తొలగించుకొనడం సదాచారాలు స్వీకరించడం ఆవశ్యకమే అయినా వివిధదేశసంప్రదాయాల పరిజ్ఞానం,స్వసంప్రదాయానుభవం వుండి వివేకంతో ఆపని చేయవలసివుంటుంది. గాంధి, గోక్లే, తిలక్, మొదలైనపేర్లవలె వంశసూచకంగా వుండడం వుచితమని కాబోలు కొందరు పేర్లను పొడి అక్షరాలుచేసి పేప్రభృతుల వలె యింటిపేర్లతో వ్యవహరింపబడుతున్నారు. వంశసంప్రదాయాభిరతిని తెలిపే యీమార్గం ఉపాదేయమేను. ఇంటిపేర్లను పొడి అక్షరాలుచేసి పేర్లకు అయోమయత్వం కల్పించడంకంటె ఈ మార్గం ప్రశస్తం. తిక్కనాదులవలె యింటిపేరు పూర్తిగా మాని

వేస్తే మానివేయవచ్చును. పొడిఅక్షరాలు చేయదలిస్తే పేర్లను మట్టుకే క్లిష్టంచేయడం మంచిది. లేదా పేరు ఇంటిపేరు అన్ని వుదాహరిస్తే మేలేను. అనపాయమై గౌరవసూచకమైన పూర్వసంప్రదాయాలను వదలిపెట్టడం యేదేశంలోనైనా అవివేకసూచకం అనర్థహేతువు కాగలదు. ఒక్కొక్కశాఖ, ఒక్కొకవంశం తన వుపాదేయసంప్రదాయాలను,ఆజాతి నాగరకతారాశికి కొంతచేర్చి లోకకల్యాణ హేతువగుతున్నది. ఆనుషంగికంగా వచ్చిన యీవిచారణ యిక చాలిస్తాను.

బ్రహ్మనాయుడికి ఇతడితల్లిపేర శీలం బ్రహ్మనాయుడని పల్నాటిలో వ్యవహారం కలదు. కాని శీలం అనే యింటిపేరు వెలమశాఖకు చెందని నాయుడుశబ్దవాచ్యుల్లో కూడా కనబడుతున్నది. గౌరవార్థం పేరియింటిపేరు స్వీకరించారని అనుకొనవచ్చును. మతదీక్షకోసం మీరాబాయివలె అనేకక్లేశాలకోర్చి యిష్టదైవమైన మద్దులేటిస్వామికి అధీన అయి చివరకు బాధపెట్టిన అత్తమామ మొదలైనవారినికూడా తనపక్షానికి తిప్పుకొనగలిగిన చిన్నఅమ్మవారు శీలంవారియింటి ఆడబిడ్డేను.

ప్రస్తావవశానవచ్చిన యీ అంశాలనువదలి ప్రకృతానికి వస్తాను. పల్నాటివీరచరిత్రవంటివే కాటంరాజుకథ మొదలైన వీరగీతాలు ఇతిహాససంబంధాలు మరికొన్ని కలవు. కాటంరాజుకథకూడా శ్రీనాథ రచితమని ప్రతీతి కలదు. ఇవి దేశప్రభువులకు వారితో సంపర్కంగల వీరపురుషులకు సంబంధించిన యుద్ధాదులను తెలుపుతున్నవి. అవి ఇతిహాసజ్ఞానానికి సాధనమైన మూలగ్రంథాల్లో చేరినవైవున్నవి.

"आन्ध्राणामेव काले तु वहवो म्लेच्छवंशजाः
सिन्धुतीर्त्वाभियास्यन्ति भारतश्रीजिघृक्षया"

(क. रा.)

(అంధ్రులకాలాన్నే అనేకులు మ్లేచ్ఛవంశజులు భారతశ్రీని ఆపేక్షించి సింధునదిని దాటివస్తారు.) అని పురాణకర్త ఖేదపడ్డట్లు మ్లేచ్ఛజాతులు భారతవర్షాన్ని ఆక్రమించినకాలంలో అస్తమించే సూర్యుడివలె భారతీయపరాక్రమం ఒక్కసారి దిక్తటాలను మహాతేజః ప్రదీప్తం జేసింది. ఆపరాక్ర మావిష్కరణంలో యేసందర్భంలో నైతేనేమి ఆంధ్రదేశం తక్కిన దేశాలకు తీసిపోనివిధాన ప్రవర్తించింది. కాటంరాజు చరిత్రం వంటివి వీరగీతాలు ఆవృత్తాంతాన్ని వ్యక్తపరుస్తున్నవి. జిజ్ఞాసువులైన ఇతిహాసికులకు విజ్ఞానసాధనాలై భారతీయవీరత్వప్రవృత్తి విశేషాలను ప్రదర్శించే ఈ వీరగీతాలు ఉపాదేయమని చెప్పి ఈవిచారణ విస్తర భీతిచేత ముగిస్తున్నాను. నృత్త (లాస్యతాండవ) ప్రాముఖ్యం కలిగి జంపె, త్రిపుట, రగడ, చంద్రిక మొదలైన దేశ్యగీతవైఖరులతో అర్థోక్తులతో సముదాయ గానవిధానంతో, అత్యంతం వినోద హేతువులైన యక్ష గానప్రయోగాలను విస్మరించడంవల్ల ఆంధ్రుల ఒకవిశిష్ట సంప్రదాయానికి క్షతియే గాక అపేక్ష్యవినోదక్రమవినాశమనే అనర్థం కూడా ఆపతిత మవుతున్నది గనుక విక్రమోత్తేజకాలైన వీరగీతాల తోపాటు అవికూడా మనకు రక్షణీయమని ఆనుషంగికంగా చెప్పి వేరేఅంశానికి వస్తాను.

## మాచర్ల చెన్నకేశవస్వామి ఆలయం.

---

దీనిని బ్రహ్మనాయుడు నిర్మించాడని పరంపరంగా చెప్తూ న్నారు. దీనికి దానంచేసినవారిలో వెంకటగిరి వెలుగోటి రాజవంశపు స్త్రీ ఒకరని అక్కడి శాసనంవల్ల తెలుస్తున్నది. ఇది ఒకప్పుడు బహు భాగవతమహితమై వుండవచ్చును. కాని యిప్పుడు ఉత్సవసమయాల్లో తప్ప తక్కిన రోజుల్లో పూజాదర్శనాలకు వచ్చేజనులసంఖ్య మిక్కిలి స్వల్పం.

## మతం—దేవాలయం.

---

దేవుడొకడున్నాడని ప్రత్యయంలేని తత్త్వజిజ్ఞాసువులు కొందరుండవచ్చును. వారు సాధారణంగా శమదమాది సంపత్తిగలవారై ఆత్మవంతులై వుంటారు గనుక వారివల్ల లోకధర్మవిప్లవం సంభవించజాలదు. అయితే అట్లాటిస్పృహణీయగుణసంపద మామూలుప్రజల్లో వుండగలగడం అరుదు గనుక నాస్తికత సాధారణజనుల్లో హింసలు, కలహాలు, పరధనాపహరణాదులు, విషయలోలత మొదలయిన హేయలక్షణాలకే ప్రేరకంకాగలదు. కనుక నాస్తికత యేదేశంలోగాని సాధారణజనులకు మతంగా వుండడానికి అర్హమయినది కాదు. తత్త్వజిజ్ఞాస లేతీరుగా ప్రవర్తిల్లినా రష్యా మొదలయినదేశాల్లో నాస్తికత యేమార్గంలో నడుస్తున్నా దైవభక్తి ముఖ్యలక్షణంగా గలమతంయొక్క ఆవశ్యకత లోకసంగ్రహానికి అనివార్య మవుతున్నది. మానవులయందలి హేయగుణాలను చంపి అభ్యుదయప్రదమయిన కల్యాణగుణాలు వర్ధిల్లజేసి అందు గుప్తమయివున్న దైవత్వాన్ని ప్రస్ఫుటంజేయడమే మతంయొక్క ప్రకృష్టప్రయోజనం. చిహ్నధారణాదిబాహ్యలక్షణాలే మతంకావు గాని యేమీలేకుండా వుండడంకంటె అవి కొంత మేలనవచ్చును. యేదశయందైనా యెప్పటికైనా అవి వాటికి సమీపానవున్న శ్రేయః పథాన్ని చూపించవచ్చును. కొందరు తమ దుష్టచిత్తవృత్తులను కప్పిపుచ్చి లోకాన్ని వంచించడానికి బాహ్యలక్షణాలను ధరిస్తుండడం సత్యం. అయితే అది మతంయొక్క మిథ్యాయోగం. అంతమాత్రంచేత మతం దుష్టం కాజాలదు. మిథ్యాయోగంయొక్క నింద్యతను వస్తువునకు ఆరోపించడం అనుచితం గదా. ఈ దేవాలయాలు ప్రజలకు సమాగమస్థానాలని నేను భావిస్తున్నాను. ధనాదులచేత ప్రవేశం నియమితమై ప్రాకృతక్రీడాసుఖాలకోసం చేరే పాశ్చాత్యుల క్లబ్బులవలె గాక మన దేవాలయాలు నిర్ధనులకు నైతం నిరవధికంగా ప్రవేశం ప్రసాదిస్తున్నవి.

" निरवधिजनताविश्रमार्हावकाशं............
युवयोराहुरास्थानरत्नम्"　　[श्री. गु]

మీ ఆస్థానరత్నం మితిలేని జనసమూహంయొక్క విశ్రమానికి అర్హమైన అవకాశంగలది అని అంటారు.) అని పరాశరభట్టు శ్రీవిష్ణుసభను వర్ణిస్తూ చెప్పినమాటల్లో పై అభిప్రాయంకూడా గర్భితమని వ్యాఖ్య చేయవచ్చును.

ఈ ఆలయాలు అక్కడ కొంచెంసేపైనా కూర్చుండవలెనని ఉత్తమధర్మాలను గురించి చింతించవలెనని వినేయులను ఉన్ముఖులను చేస్తున్నవి. భారతీయదేవాలయాల్లో ఆనందం, వినోదం, జిహ్వాతృప్తికూడా ఉపలబ్ధ మవుతున్నవి. అయితే అవి దైవనివేదితం కావడంవల్ల వాటికి ఉండగల మాలిన్యాన్ని వదలుతున్నవి. దేవాలయం మతానికి ప్రధానావాసం. మతంయొక్క సింహాసనాస్థానంగాను తత్త్వజిజ్ఞాసాచోదకంగాను ఉండడమే కాక దేవాలయం సౌందర్యం గానం శిల్పం కవిత మొదలైనవాటికి సమావేశస్థానంగా కనబడుతున్నది. లోకంయొక్క సర్వసమృద్ధి, కమనీయత, శ్రీ, లక్ష్మి అనేనామాలతో లోకస్థితికారకుడైన విష్ణువుకు హృదయాసాదితంగా ఆరాధించబడడం, మాన్యత, శుభత, సాధ్వీత, ఆర్య, సర్వమంగళ, సతి, అనేపేర్లతో పరమశివుడి దేహంలో ఒకభాగంగా అర్పితం కావడం, భావకచేతస్సులకు వికాసం కలిగించక మానవు. ధనుర్దాసుడికి తన నత్యంతం ఆకర్షించినభార్యకంటె భగవంతు డెక్కువ మనోజ్ఞతతో గోచరించడం, ఆముక్తమాల్యద (గోదఆండాళ్), వేదవల్లి, పాదుషాపుత్రి మనుష్యాకృతులు నిరసించి భగవంతుడి వదనానికి మాధ్యంతో పరతంత్రలు కావడం, వైష్ణవుల దివ్యసౌందర్యభావనయొక్క స్వరూపాన్ని కొంతవరకైనా తెలుపగలవు. మధురసమీపంలోవున్న స్వర్ణమయవిష్ణువు సుందరరాజు (అళగర్). सुन्दरः, मनोहरः [म. वि] అని

సాధకులు విష్ణువును ఆరాధిస్తున్నారు. శైవుల్లో కూడా ఇట్లాటి భావన ప్రసిద్ధం. శాక్తుల్లో ఒక ప్రధానశాఖకు దేవత త్రిపురసుందరి. మధురలో మీనాక్షీప్రియుడైన శివుడు సుందరేశ్వరుడు. తామ్రపర్ణి తీరాన కైలాసనాథుడు సౌందర్యవల్లీవల్లభుడు. కామాక్షి, కోమలవల్లి, సుగంధికుంతల, కాంతిమతి అని ఈతీరున దక్షిణదేశంలో వెలసిన మాంగల్యదేవతలు ఈసౌందర్యాంశను వ్యక్తం చేస్తున్నారు.

"त्वदीयं सौन्दर्यं तुहिनगिरिकन्ये तुलयितुम्"

(ఓ తుహినగిరికన్యా నీసౌందర్యాన్ని పోల్చడానికి)

అని

"तनोतु क्षेमं नस्तव वदनसौन्दर्यलहरीपरीवाहस्रोतस्सरणिरिव सीमन्तसरणिः ।"

(నీవదనసౌందర్యప్రవాహంయొక్క అలుగుకు కాల్వవలె ఉన్న సీమంతమార్గం మాకు క్షేమంకలిగించును గాక) అని శంకరాచార్యులు శ్రీచక్రాధిదేవతయందు,

1 "श्रीरङ्गहर्म्याङ्गणकनकलते"

2 "श्रीरङ्गेश्वरगेहलक्ष्मि"

3 "सौन्दर्यामृतसेकशीतलमिदं लावण्यसूत्रार्पितम्"

4 "प्रकृतिमधुरं गात्रं जागर्ति मुग्धविभूषणैः"

5 "श्रीरङ्गधाममणिमञ्जरि"

1. శ్రీరంగవిమానాంగణమందలి కనకలతా.

2. శ్రీరంగేశ్వరగేహలక్ష్మీ.

3. సౌందర్యామృతం చల్లడంచేత శీతలమైనది లావణ్యసూత్రార్పితమైనది అయి నీకోమలాంగకుసుమాల కూర్పు శ్రీరంగేశ్వరీ.

4. స్వభావమధురమైనగాత్రం (ఓరంగనాయికా) మనోజ్ఞ భూష ణాలచేత ప్రకాశిస్తున్నది.

5. ఓశ్రీరంగవిమానమణిమంజరీ.

అని పరాశరభట్టు శ్రీరంగనాయికయందు,

या सौन्दर्यधुनीतरङ्गततिषु व्यालोलहंसायते ॥ [मू]

[సౌందర్యనదీతరంగాలయందు హంసవలె ఉండే (స్మితం)]

అని పంచశతికారుడు కామాక్షియందు

सहस्ररतिसौन्दर्यशरीरीरायै ॥

[సహస్రరతి సౌందర్యశరీర అయినదేవికి (నమస్సు)]

అని ఉపాసకులు లలితయందు విషయాస్పృష్టమైన ఈ దివ్య సౌందర్యాన్నే దర్శించారని వ్యక్తం. దక్షిణదేశపు శైవవైష్ణవమత సంప్రదాయాల్లో దివ్యసౌందర్యం స్ఫుటాంశంగా పరిగణిత మవుతున్న దని స్పష్టం. శాక్తుల్లో ఇది ప్రసిద్ధమే గనుక వివరించవలసినపని లేదు. ఇంతేకాక దేవాలయాల్లో శిల్పాలంకరణాల ప్రత్యక్షసౌందర్యం ప్రకటం. దేవాలయంలో స్త్రీచిత్రాన్ని యతి కౌగిలించుకొన్నాడని కళాపూర్ణోదయాష్టమాశ్వాసంలో చెప్పిన పింగళిసూరన ఈ శిల్ప మనోజ్ఞతనే తెలిపినాడు. ప్రఖ్యాతగాయనులు తమకౌశలాన్ని దేవా లయాల్లో పవిత్రపరుస్తుండినట్లు విదిత మవుతున్నది.

ततः प्रविशति वीणां वादयन्ती ॥ [नागा]

[అంతట వీణవాయిస్తూ (మలయవతి) ప్రవేశిస్తున్నది.]

అనే పఙ్క్తుల్లో మలయవతి మలయపర్వతమందలి దేవాల యంలో గానం చేస్తుండినదని శ్రీహర్షుడు తెలుపుతున్నాడు.

గోకర్ణనిలయుడైన శివుణ్ణి వీణాగానంతో సేవించడానికి నారదుడు పోతుండినట్లు

अथ रोधसि दक्षिणोदधेः श्रितगोकर्णनिकेतमीश्वरम्
उपवीणयितुं ययौ...... [रघु]

(గోకర్ణక్షేత్రంలోవున్న యీశ్వరుణ్ణి వీణతో కీర్తించడానికి నారదుడు పోయినాడు.)

అనేవాక్యాల్లో కాళిదాసు తెలుపుతున్నాడు. దేవాలయాల్లో వున్న సీతారామాదుల ప్రతిమలు మూర్తమైన వాల్మీకి భావసృష్టే నని అనవచ్చును. గీతాదాత పార్థసారథి, వ్యాసుడు చిత్రించినట్లే గోచరిస్తున్నాడు. సర్వాంకుశ అయిన, జగన్నియంత్రియొక్క కరాళ స్వరూపానికి దృష్టినిమరల్చి మానుషచిత్తవృత్తులకు ఒకవిధంగా పరిణతి కలిగించే భీభత్సభయానకాల నిష్పత్తికి సాధనాలైన కొన్ని దేవాలయాలు కలవు. దివ్యకవితాప్రయోగస్థానాలుగా కూడా దేవాలయాలు నాకు గోచరిస్తుంటవి.

दयावत्या दत्तं द्रविडशिशुरास्वाद्य तव यत् ।
कवीनां प्रौढानामजनि कमनीयः कवयिता ॥ [सौं]

[దయావతివి నీవిచ్చిన స్తన్యం తాగి ద్రవిడశిశువు ప్రౌఢకవుల్లో కమనీయకవి అయినాడు.]

అని శ్రీశంకరాచార్యులు,

त्वत्प्रेयसः श्रवणयोरमृतायमानां तुल्यां त्वदीयमणिनूपुरशिञ्जितेन ।
गोदे त्वमेव जननि त्वदभिष्टवार्हां वाचं प्रसन्नमधुरां मम संविधेहि ॥
[गो]

(ఓ గోదాదేవీ! తల్లీ! నీప్రియుడిచెవులకు అమృతంవంటిది, నీమణినూపురశింజితంతో సమానమైనది, ప్రసన్నమధురమైనది, నిన్ను స్తుతిం

చడానికి అర్హమైనది అయిన వాక్కును నీవే నాకు కలిగేటట్లు చేయవలసినది.)

అని వేదాంతదేశికులును

कवित्वश्रीकन्दः [मू]

[కవిత్వవైభవకందం (అయిన కామాక్షి)]

అని మూకుడూ

सूक्तिं समग्रयतु नस्स्वयमेव लक्ष्मीः ।
श्रीरङ्गराजमहिषी मधुरैः कटाक्षैः ॥

(శ్రీరంగరాజమహిషి లక్ష్మి స్వయంగానే మధురకటాక్షాలచేత మంచివాక్కును మాకు సమగ్రం చేయునుగాక)

అని శ్రీ గుణరత్నకోశకారులు ఈదివ్యకవితను స్మరిస్తున్నారు.

कलानिधिः काव्यकला रसज्ञा रसशेवधिः ॥ [ल. स]

(కళానిధి, కావ్యకళ, రసజ్ఞ, రసనిధి)

అని లలితను కావ్యకళగా ఉపాసించేసాధకులు ఈ దివ్యకవితనే సూచిస్తున్నారు.

పద్మపురాణకర్త దుఃఖించినట్లు ఆశ్రమాలు యవనధ్వస్తాలు కాగా మీమాంసకుల కర్మవాదపాటవం దేశంలో క్షీణించగా విజ్ఞానపీఠం అరణ్యాలను వదలి ఆలయాలకు మరలినట్లు కనబడుతున్నది. ఇంతేకాక భారతవర్షమందలి మతసంరక్షకు లెందరో దేవాలయాలతో సంబంధించివున్నారు.

వ్యాసుడు అగస్త్యుడు దేవాలయాలతో సంబద్ధులై ఉన్నారని కాశీఖండం చెప్పుతున్నది. మహాభాష్యకర్త పతంజలి చిదంబరక్షేత్రంలో ప్రవచించినట్లు వృద్ధవ్యవహారం కలదు. శ్రీరామానుజా

చార్యుల ఆవిర్భావానికి తిరువల్లిక్కేణి పార్థసారథి కృపావిశేషం ప్రే
కమని సంప్రదాయజ్ఞులు చెప్పుతున్నారు. బౌద్ధతర్కాలకు అడ్డుకట్ట
వేసి వైదికమతాన్ని కాపాడిన మహావిజ్ఞానసంపన్నుడు కుసుమాంజలి
కర్త ఉదయనాచార్యులు పురుషోత్తమ (జగన్నాథ) క్షేత్రాన్ని సేవి
స్తుండినట్లు విదిత మవుతున్నది.

ऐश्वर्यमदमत्तोऽसि मामवज्ञाय वर्तसे ।
उपस्थितेषु बौद्धेषु मदधीना तव स्थितिः ॥

[ఐశ్వర్యమదమత్తుడవై నన్నవమానపరచి వర్తిస్తున్నావు.
బౌద్ధులు దగ్గరకు వచ్చినప్పుడు నీస్థితి నాచేతులో వుంటుంది. (అంటే
నాస్తికులవాదాలను నాతర్కంతో ఖండించి ఈశ్వరసద్భావాన్ని నేను
సమర్థించవలసి ఉంటుంది).

అని ఒకప్పుడు ఉదయనాచార్యులవారు పురుషోత్తమదేవుణ్ణి
ఉద్దేశించి పలికినట్లు ప్రతీతి కలదు.

श्रीरङ्गे शरदश्शतं...युष्मत्पादसरोरुहान्तररजः स्याम ॥ [श्रीगु]

[శ్రీరంగక్షేత్రంలో నూరేండ్లు (దాస్యరసికమైన ఉత్కృష్టసమృద్ధిని
అనుభవించి) నీపాదాలనే కమలాలమధ్య రేణువు అగుదుము గాక]
అని శ్రీరంగంలో నూరుసంవత్సరాలవునికిని పరాశరభట్టు అభిలషిం
చాడు.

మాచర్ల చెన్నకేశవస్వామి అనుగ్రహం బాలచంద్రజన్మకారణ
మని వీరచరిత్ర తెలుపుతున్నది.

శ్రీరంగం శ్రీవిల్లిపుత్తూరువంటిచోట్ల దేవాలయాల్లో వైష్ణవ
సంప్రదాయాలు వికసించినవి. కులశేఖరుడు విష్ణుచిత్తుడు మొదలైన
మునిశ్రేష్ఠులు విద్వాంసులు ఆక్షేత్రాల్లో వర్ధిల్లినారు.

దేవాలయాలయొక్క జీవద్దశ, సమృద్ధి, దేశమందలి ప్రజలమత పరాయణత్వదార్ఢ్యానికి చిహ్నాలని చెప్పవచ్చును. మతమంటే పట్టీపట్టక అది యెప్పుడో ఒకప్పుడు యెదటివాండ్ల తృప్తికై అవలంబించే లాంఛనంగా మారిన మనుష్యుల్లో లఘుచేతస్కత్వం, భీరుత్వంతో కూడిన అధర్మలాలసత్వం, జీవితవిధానమందు పశుతుల్యత, ఆపతితం గాక మానవు. తెలుగుదేశంలో కొన్నిచోట్ల దేవాలయాలు పిల్లకాయలకు క్రీడాభూములుగాను తుంటరులకు సమావేశస్థలాలుగాను మారడం నే నెరుగుదును.

దక్షిణభారతంలో ఆళ్వారులు నయినారులు యామున రామానుజులు మొదలైనవారివలె, ఉత్తరభారతంలో చైతన్యప్రభృతులవలె ప్రజలమధ్య మతధర్మాలను ప్రవచించి ప్రత్యక్షంగా ఆచరణాదులచేత ఉద్బోధం కలిగించిన ఆచార్యులు అంతగా లేకపోవడమే ఈదుర్దశకు హేతువై ఉండవచ్చును. వల్లభనింబార్కులవంటి ఉత్కృష్టపురుషులు పుట్టికూడా తమతేజః ప్రవచనాలను మనకు ప్రసాదించక ఆంధ్రేతర దేశాల్లో తమజీవితం గడపడం మనదురదృష్టమే నని అనుకోనవచ్చును. కాకతీయులకాలానవచ్చిన కాలాముఖశైవాచార్యులు, విజయనగర కర్ణాటరాజులు పంపిన వైష్ణవాచార్యులు, ఆవశ్యకమయినంతగా మతవిజ్ఞానాన్ని ప్రజల్లో ప్రతిష్ఠితం చేయలేదు. అక్కడక్కడ అప్పుడప్పుడూ వున్న ఒకరిద్దరు రామదాస నారాయణతీర్థులంటి భక్తులవల్ల తగినంతపని జరుగలేదు. ఆంధ్రదేశపు హద్దులలోవున్న వేంకటాచలాలయంకూడా అనాంధ్రులైన మహాంతులచేతుల్లో వున్నది.

అదిగాక ద్రావిడుల ప్రాబల్యంవల్ల తిరుమల తిరుపతి అనే అరవ పేర్లు దానికి ప్రధానంగా యేర్పడినవి. అహోబలక్షేత్రంలోగూడా ద్రావిడుల ప్రాబల్యమే దృష్టమవుతున్నది. పురాణాల్లోనేకాక భవభూతి బాణుడు, శ్రీహర్షుడు ఇట్లాటి ప్రాచీనభారతీయ విజ్ఞులకృతుల్లో సైతం

ప్రస్తావించబడిన మన శ్రీశైలక్షేత్రాన్ని గురించి తగినంత శ్రద్ధవహించక పుదాసీనులంగా వున్నాము. ప్రస్తుతదీనస్థితికి కారణాలేవైనా మేలు కొని మనదేవాలయాల శోచనీయదశను తెలిసికోవడం మనకు కర్తవ్య మని చెప్పి ఈవిచారణ ముగిస్తాను.

మాచర్ల చెన్నకేశవస్వామి ఆలయపు ప్రాకారంలోపల శివుని గుడివున్నది. ఇది ఉత్తరహరివంశాదుల్లో ప్రతిపాదితమైన శంకరాచార్యుల చేతఅనుష్ఠించబడి స్మార్తులకు అపేక్ష్యమైన హరిహరారాధనకు ద్యోతక మని తోచవచ్చును గాని నెల్లూరు మొదలైనచోట్లను దక్షిణాంలో కొన్నిస్థలాల్లోనువలె హరిహరాలయాలు వేరుగా ఉండడండంవల్ల విప్ర తిపత్తి కనబడుతున్నది.

विष्णोर्नाभेस्समुद्भूतो वेधाः कमलजस्ततः ।
विष्णुरेवेश इत्याहुर्लोके भागवता जनाः ॥
शिवस्य पादावन्वेष्टुं शार्ङ्ग्यशक्तस्ततश्शिवः ।
ईशो न विष्णुरित्याहुश्शैवा अगममानिनः ॥ [पञ्च

(విష్ణువుయొక్క నాభియందు బ్రహ్మపుట్టినాడు కనుక విష్ణువే దేవుడు అని లోకంలో భాగవతు లంటారు.)

(శివుడిపాదాలను వెతకడానికి విష్ణువు అశక్తుడైనాడు కనుక శివుడు దేవుడు, విష్ణువు కాడు అని ఆగమమానులైన శైవులు చెప్తా తారు.)

అని శ్రీవిద్యారణ్యులు తెలిపినట్లు విష్ణువుకు విముఖులయ్యే శైవులు శివనామం చెవులబడనీయని వీరవైష్ణవులు ప్రబలినకాలంలో వైష్ణవులు శివుణ్ణి శైవులు విష్ణువును అంగంగా ఆరాధించే స్మార్త మార్గానికి ఇది చిహ్నమని అనుమానించవచ్చును. శైవుడైన [illegible] కుడు హరిప్రియుడుకావడం, ఇల్లాటి ప్రవృత్తియొక్క ఫలమే అనుకోవచ్చును.

శరీరాన్ని బుద్ధిని దహించి జాడ్యం, మాంద్యం, మొదలయిన తమోగుణాలను పెంచే కారపుముద్దలు అధికంగా తినడంలో గాని, ఆరోగ్యప్రదం కాక కేశాదులకు పారుష్యం గలిగించే కటికిస్నానం సాధారణంగా ఆచరించడంలో గాని, అంతఃకచ్ఛం లేకుండా, ఒక్కొక్కప్పుడు కటిప్రదేశాలనుకూడా కనబరుస్తూ వీథుల్లో వెంట అప్పుడప్పుడూ నాకుతూ ఉండే గోచీలతో, వస్త్రం ధరించడంలో గాని పల్నాడు తక్కిన ఆంధ్రదేశంవలెనే వున్నా

कक्षाबन्धं विदधति न ये सर्वदैवाविशुद्धाः ।    [विक्र १८–९७]

మొలతాడుధరించక యెప్పుడూ అశుచిగా వుంటారు

అని బిల్హణుడు గుజరాతీలను దూషించినట్లు పల్నాటిసీమ వారిని శ్రీనాథుడు విశేషించి నిందించాడు. జొన్నల సజ్జల అన్నం, తేళ్లు, పాములు, రాళ్లు, మొదలయినవి యితడినిందకు విషయాలని విదితం. పాములేమో కాని తేళ్లుమటుకు పిన్నలి (అప్పకవి పింగళి) వంటిచోట్ల యెక్కువగా వున్నమాట వాస్తవం. జొన్నలు సజ్జలు దార్ఢ్యప్రదం గనుక దూష్యం కావు. సారవంతమయి శరీరపాటవం కలిగించి దేశానికి బలసమృద్ధిని సమకూర్చే ఆహారం దూష్య మనుకోవడం గొప్ప అవివేకం. అందులో మరబియ్యపు అన్నం తిని నీరసులయివున్న యిప్పటివా రెవరయినా ఆమాటలు విని సంతోషిస్తే అది అత్యంతం మతిమాలినపనే కాగలదు. తక్కినవి అసంగతాలు పాటించదగనివి కనుక విచారించక వదలుతున్నాను. కొన్ని శ్రీనాథుడివి వుంటే మరి కొన్ని బహుశః పిమ్మటివారు రచించి అతడికి తగిలించి వుండవచ్చును. ఇతడి విద్యాప్రావీణ్యాన్ని కనుగొని ఆదరించగలిగిన ప్రభువులు, విద్వాంసులు అక్కడ అంతగా లేకపోవడం కారణమై ఉండవచ్చును. లేదా

యిప్పటికంటె కొంచె మెక్కువ దుర్దశలో వుండివుండవచ్చును. ఆ పద్యాలు ప్రథమభూమికలో ద్రష్టవ్యం.

## పల్నాడు.

...समासादिताश्चर्यमन्त्रसिद्धिप्रभावा श्रीपर्वते कापालिकव्रतं धारयति ।
[मालती]

[(ఆసౌదామిని) ఆశ్చర్యమంత్రసిద్ధిప్రభావం పొంది (ఇప్పుడు) శ్రీశైలంలో కాపాలికవ్రతం ధరిస్తున్నది.)]

అని భవభూతిచేత

सकलप्रणयिमनोरथसिद्धिश्रीपर्वतो हर्षः । [हर्ष]

श्रीपर्वताश्चर्यवार्तासहस्राभिज्ञेन । [का]

[సకలార్థుల మనోరథసిద్ధికి శ్రీశైలం (మల్లికార్జున నివాసభూమి) అయిన హర్షుడు.]

అని

(శ్రీశైలాన్ని గురించి అనేకాశ్చర్యవార్తలను తెలిసిన)

అని బాణుడిచేత

अद्य किल भर्ता श्रीपर्वतादागतस्य श्रीखण्डदासनामधेयस्य धार्मिकस्य सकाशात् । [रत्ना]

(ఈనాడు రాజు శ్రీశైలంనుండి వచ్చిన శ్రీఖండదాసుడనే ధార్మికుడి వద్దనుండి)

అని హర్షుడిచేత ప్రస్తావించబడి

శైవులు పవిత్రంగా గణించే కాశి, ఉజ్జయిని, కేదారం మొదలైన ద్వాదశమహాక్షేత్రాల్లో అన్యతమమైన శ్రీశైలాన్ని ఆనుకొని

కృష్ణానదీతీరాన ఈపల్నాడు ఉన్నది. భారతవర్షేతిహాసంలో ప్రసిద్ధుడై సాతవాహనమంత్రి అయిన గుణాఢ్యుడు కథాసరిత్సాగరంలో

तस्य नागार्जुनो नाम बोधिसत्त्वांशसम्भवः
दयालुर्दानशीलश्च मन्त्री विज्ञानवानभूत् ।
यः सर्वौषधियुक्तिज्ञश्चक्रे सिद्धरसायनं
आत्मानं च राजानं विजरंचिरजीवितम् ॥ [कथा. रत्न ७]

[అతడికి (చిరాయువనే రాజుకు) నాగార్జునుడని బోధిసత్త్వాంశ సంభవుడైన మంత్రి వుండినాడు. ఆయన దయాళువు, దానశీలుడు, విజ్ఞానవంతుడు. అతడు సర్వౌషధియోగజ్ఞుడై రసాయనమహిమచేత తనను ఆరాజును ముసలితనంలేకుండా చిరాయువులుగా వుండేటట్లు చేశాడు.]

అనే పఙ్క్తుల్లో ప్రశంసించిన బౌద్ధమతాచార్యుడు నాగార్జునుడు నివసిస్తుండబట్టి కాబోలు నాగార్జునకొండ అని పేరువహించిన ప్రదేశం పల్నాటిసీమలోనే వున్నది. నాగార్జునకొండ ఉన్న ప్రదేశం ఇప్పుడు రాజకీయులు తవ్విస్తున్నారు. అక్కడ పురాతనవస్తువిశేషాలు గణనీయమైనవి కొన్ని కనపడ్డట్లు తెలుస్తున్నది. విశ్వబ్రాహ్మణులను యాచించే దుంజలవారి ప్రశంసలవలన విదితమయ్యే ఆంధ్రశిల్పనివాస భూమి పెందోట పల్నాటిలోనే ఉన్నది.

ఒకప్పుడు మహావీరులకు క్షేత్రమైన పల్నాడు ఈ మధ్యకాలంలో లక్ష్మీ అమ్మవారి మహత్త్వాన్ని ప్రదర్శించగలిగింది. కటికకుటుంబపు కోడలిక్లేశాలన్నీ అనుభవించి ప్రాణాలు విడిచేసమయంలోకూడా చంపుతున్న భర్తహస్తపు కరుణాస్పర్శను అభిలషించిన యీ సాధ్వీస్థానం దుర్గి. ఈమె కమ్మవంశానికి చెందినది. తండ్రి దిగుమర్తి ముసలప్పనాయుడు. ఆంగ్లకవిఒథెల్లోను స్మరింపజేసే చిరుమామిళ్ల వెంకా

నాయుడు లింగాపురనివాసి ఈమె భర్త. ధర్మపరతంత్ర అయిన ఉదాత్త భారతీయగృహిణికి సర్వకాలాల్లో ఉదాహరణంగా ఉండ గలిగిన యీమె యిప్పటికీ పూజిత అవుతున్నది. ఈమె ఇతిహాసం సంచారికథకులు బొబ్బిలికథాదులవలె ఇప్పటికీ కీర్తిస్తున్నారు.

## పల్నాటివీరచరిత్ర.

పల్నాడు+వీరులు = పల్నాటివీరులు. పల్నాడు అనే ప్రదేశానికి సంబంధించిన వీరులు పల్నాటివీరులు. షష్ఠీతత్పురుషం. ఇక్కడ షష్ఠి సంబంధసామాన్యాన్ని తెలుపుతుంది. టాదేశం సమాసాశ్రయకార్యం. వివరణం భాషావ్యాకరణంలో చూడవలెను. పల్నాటివీరులయొక్క చరిత్ర పల్నాటివీరచరిత్ర. షష్ఠీతత్పురుషం. పల్నాడు అనేశబ్దం ప్రథమ భూమికలో వ్యాఖ్యాతం. వీరశబ్దం ఇందే వ్యాఖ్యాతపూర్వం.

## चर्+इत्र=चरित्रम्

"**चरेर्वृत्ते**" అనే సూత్రంచేత "**णित्रन्**" ప్రత్యయం వచ్చి చారిత్రం అనికూడా రూపమేర్పడుతుంది. "ఇత్ర ణిత్రన్" ప్రత్యయాలు ఔణాదికాలు. చరిత్రశబ్దానికి '**अण्**' ప్రత్యయం చేరిస్తేకూడా 'చారిత్రం' అని రూపమేర్పడుతుంది. అయితే స్వరంలోమాత్రం భేదం. 'చరిత్ర' శబ్దం వృత్తవాచకం.

## పల్నాటివీరచరిత్రప్రకటనం.

దీనిని మొదట నేను ప్రకటించి ద్వితీయభూమికారంభకాలానికి 23 సంవత్సరాలైనదని ఉక్తం. ప్రకటించిన కొద్దికాలానికి తక్కినభాగాలను ముద్రింపించవలసినదని దానికి శ్రీమహారాజువారి తోడ్పాటు లభించగలదని శ్రీపిఠాపురం మహారాజువారి ఆత్మీయ కార్యసచివశిఖాశేషులూ అయిన శ్రీ మొక్కపాటి సుబ్బారాయుడువారు నాకు పత్త్రం వ్రాశారు. తక్కినభాగాల్లో శ్రీనాథరచన అంతగా లేదని అక్కడక్కడ ద్విపదీఖండాలతో చాలామట్టుకు సళ్లుమాటలతో నిండివున్నదని ఇదే

శ్రీవీరభద్రఅయ్యవారిగ్రంథమని ఇట్లాటి అంశాలు సూచిస్తూ వున్నది పున్నట్లు ప్రకటించడం గాని క్రమమైనగద్యంలో తిరగవ్రాసి ప్రకటించడం గాని మీకు సమ్మతమైతే ఆపని చేస్తానని నేను ప్రతివచనం వ్రాశాను. పిమ్మట కొంతకాలానికి వీరచరిత్ర తక్కినభాగాలను శ్రీ జయంతి రామయ్యవారు ప్రకటించబోతున్నారని సాహిత్యపరిషత్పత్రికలో వెల్లడించారు. ఆంధ్రపత్రికలో యీసంగతినిగురించి నేను క. శ. 5015 వైశాఖ బ. షll శుక్రవారం ఒక ఉత్తరం, జ్యేష్ఠ శు. విll బుధవారం మరివొక ఉత్తరం, రెండుత్తరాలు ప్రకటించాను. రెంటిలోను విషయమొక్కటే గనుక ఒకదానిని ఉదాహరిస్తున్నాను.

"పల్నాటివీరచరిత్రలో నొకభాగమైన బాలచంద్రయుద్ధమును బ్రకటించి యుంటిని. దీనిని నైజాముదేశమునుండి తెప్పించితిని. మఱి రెండు మా పల్నాటిసీమలో దొరికినవి. ఈభాగము కాక తక్కినది పల్నాడుతాలూకా కారెంపూడి నివాసులగు పిడుగు వీరభద్రయ్యగారివద్ద నున్నదని తెలిసికొని వారిగ్రంథమున కొకప్రతిని వ్రాసితిని. చెన్నపురి లిఖితపుస్తకాగారములోఁ గొన్నిప్రతు లున్నవిగాని వాని కర్తలు కొండయ్య ప్రభృతులు. ఈవిషయ మా పుస్తకములలోనే వ్రాయఁబడి యున్నది. వీరభద్రయ్యగారి ప్రతియొక్క ధోరణి చూడఁగా యతి గణ జ్ఞానముకూడ లేని సామాన్యుఁడు అపభ్రంశము లతో వ్రాసినట్లు కన్పడెను. ఏల యిట్లున్నదని యడుగఁగాఁ బిచ్చుకుంటవాండ్రు చెప్పఁగా విని వ్రాసిరనియు, నిది యిటీవలిప్రతియే యనియు వీరభద్రయ్యగారు నాకుఁ జెప్పిరి. కొండయ్యప్రభృతుల గ్రంథములు దీనికంటె ననేకభంగుల శ్రేష్ఠములుగా నున్నవి.

అచ్చుఖర్చులను మే మొసఁగెదము. పల్నాటివీరచరిత్ర తక్కిన భాగమును బ్రకటింపవలసినది అని శ్రీపిఠాపురము రాజాగారు నాకుఁ దెలిపినప్పుడు, ఉన్నస్థితి వివరించి చివరకు శ్రీనాథకృతగ్రంథము దొరకలేదనియుఁ దప్పుల తడకగా వ్యర్థపదములతోఁ గూడియున్న

ప్రతి (వీరభద్రయ్య ప్రతి) యున్నదనియు, దానిని సవరించి ప్రచురింపుటకంటె క్రొత్తది వచనముగా వ్రాసి ప్రకటించుట మేలు. లేదా, కొండయ్యగ్రంథమును బ్రకటించుట మేలు అనియు నేను వ్రాసితిని. శ్రీనాథకృతమే కావలెననియు, దదితర మక్కఱలేదనియు వారు చెప్పిరి. వీరభద్రయ్యప్రతినే నేను సంపాదించితినని జయంతి రామయ్యపంతులుగారు నాతో నొకపర్యాయము చెప్పియుండిరి. దానినే పరిషత్తు ప్రకటింపఁ బోవుచున్నట్లు...సంవత్సర కార్యనివేదనమువలన నాకు సూచనగాఁ దెలియుచున్నది.

పరిషత్తు ప్రకటింపఁబోవునది, వీరభద్రయ్యప్రతియే యైనయెడల నే నిదివఱకు రాజాగారికిఁ దెలిపినగ్రంథమే కాని యది వేఱు కాదనియు, దీనికిని నేను బ్రకటించిన బాలచంద్రయుద్ధమునకును ఎట్టి సంబంధము లేదనియు, బాలచంద్రయుద్ధము దీనితోఁ జేరినభాగమని తలఁచుట భ్రమ యనియు, బరిషత్కార్యనిర్వాహకులకు విన్నవించుచున్నాఁడను ... ... ... ... ...

రాయవాచకమునువలె దీని నున్నదున్నట్లు ముద్రించినను ఒక విధమున మేలె. పల్నాటిసీమమాటల వ్యవహారము కొంతవఱకుఁ దెలియును. కథకొఱకైనయెడల దీనినిబట్టి వచనము వ్రాసి ప్రకటించుట మంచిది. ఇదివఱ కెందఱో వ్రాసి, వ్రాయనున్న భారతరామాయణవచనములకంటె నిది యెక్కువ యుపయోగకరమైనది."

—: ముగింపు. :—

వీరచరిత్రను రెండవపర్యాయం ముద్రితం చేయడానికి కలియుగం ౫౦౬౪-వ సంవత్సరంలో ఆరంభించాను. మద్రాసు విశ్వవిద్యాల

యంలో 5035-వ సంవత్సరపు బి. యే. పరీక్షకు ఇది పాఠ్యగ్రంథంగా నిర్ణీతమైనది. దీని ప్రథమభూమికాసంస్కరణం ద్వితీయభూమికారచన 5032 లో ప్రవేశించిన కుజమహాదశలో ఆరంభించాను. ఇంతకు పూర్వం మొదలుపెట్టిన రఘువంశఖండకావ్యప్రకాశ వివరణాలప్రకటనం చాలాకాలం క్రిందటనే ఆగిపోయింది. ఈ ఉద్యమానికి అనారోగ్యం మొదలైనవిఘ్నాలు అడ్డుపడుతూ పడుతూ ఉంటే వాటిని నెట్టుకుంటూ నెట్టుకుంటూ ఇప్పటికి ముగించగలిగినాను. 5027-వ సంవత్సరంనాటికే వీరచరిత్రప్రతులు అయిపోయినవి. అందుకే ఈగ్రంథం కావలెనని నాకు వ్రాసినవారికి పంపజాలక పోయినాను. దీనిని తిరిగి ప్రకటించడం ఆవశ్యకమని నేననుకొంటూ ఉన్నసమయంలో శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు ప్రకటననుగురించి ప్రస్తావించి దానిభారం దయతో అంగీకరించారు. అందుకు వారికి అనేకనమస్కృతు లర్పిస్తున్నాను. అచ్చుచిత్తులు దిద్ది పంపడానికి జరిగిన ఆలస్యాన్ని సహించడంలో శ్రీ వావిళ్ల ముద్రాశాలాధికారులు చూపినక్షమకు దయకు నేను కృతజ్ఞతాబద్ధుడనని విన్నవిస్తున్నాను.

ఈ ద్వితీయభూమికను సిద్ధపరచడంలో నాకు తోడ్పడిన విద్యార్థుల్లో శ్రీమాన్ ఆలంపూరు కృష్ణస్వామి బి. యే., శ్రీమాన్ కొమరవోలు చంద్రశేఖరమంత్రి శ్రీమాన్ మదనగోపాల్, ముఖ్యంగా గణించదగినవారు. కుశాగ్రబుద్ధి, విద్యాపరతంత్రుడు అయిన శ్రీమాన్ కృష్ణస్వామి దీని సమాప్తి చూడకముందే కథాశేషు డయినందుకు మిక్కిలి చింతపడుతున్నాను. తత్కృతమయిన రఘువంశైకదేశానువాదం శ్రీమాన్ చంద్రశేఖరమంత్రి సమాహరించిన లక్ష్యఖండంలో ప్రకటితం. కృష్ణస్వామిమృతివల్ల సేవాపరతంత్రుల్లో, విజ్ఞానోజ్జీవనాభిలాషుల్లో ఒకరిని తెలుగుదేశం కోలుపోయింది. ఈసందర్భంలో ఉపకరించిన శ్రీమాన్ గుణభూషణ, బి. యే, సుదర్శనలాల్, చలపతి

మొదలైన తక్కిన విద్యార్థులను మిత్రులను సక్తితో స్మరిస్తున్నాను. లేఖనాదుల్లో, అందులో ముఖ్యంగా అనారోగ్యదశల్లో ఈ విజ్ఞాన కాంక్షులతోడ్పాటు లేకుండా యీ ద్వితీయప్రకటనం ఇంతత్వరలో ముగిసివుండేది కాదు. కనుక, కావ్యసిద్ధి హేతువుల్లో వీరి వ్యాపృతి ప్రధానమైనదని నేనెప్పుడూ అత్యంతం అనురక్తితో భావిస్తుంటాను.

చెన్నపట్టణం,
క॥ 5033, వైశాఖ బ॥ పం॥ ఆదివారం.

ఉమాకాన్తుడు.

# Preface to the 2nd Edition.

Palnati Veeracharitra is the history of the fratricidal war, that took place during the latter part of the 42nd century Kali Era (12th century A. D.) between two princes of the Hyhaya family that had migrated into Palnad from Chedi, throwing side lights on the great socialistic movement led by Brahma Naidu, supposed to be the ancestor of the family of the Maharajah of Venkatagiri. The Chapakudu of Palnad heroes mentioned by the author of Kreedabhiramam may be taken as something like cosmopolitan dinner of the present day. The army of Brahma Naidu includes people from all classes irrespective of caste, from Brahmin to Panchama. Kannama, a Panchama hero considered as the son of Brahma Naidu, has a temple at Karampudi even to this day. The ballad also gives an account of the heroism of our people of those ages and also their religious readiness to lay down even their lives at the call of what they considered their Dharma. The military prowess which shone with splendour in Brahma Naidu and Balachandra eight hundred years ago at Karyamapudi again manifested itself in their distant kinsmen, the Velama heroes of Bobbili like Vengalaraya.

**Palnati Veera Charitra.**

Palnati Veera Charitra may be considered as an important, original Telugu work fulfilling a few of the conditions of an epic poem. (महाप्रबन्धः). The subject matter viewed as a whole from Gurzala Kodipor to the end is extensive and grand with some episodes, and the characters also are to some extent varied in type. Mallidevaraj and

his opponent Nalagamaraj are inactive heroes like Chandragupta of Mudrarakshasa, and Indian literary critics name such a hero as सचिवायत्तसिद्धिः (one whose purpose is achieved by his assistants). Anapotu, Balachandra, Brahma Nayudu, Alaraju, Perneedu and Kommaraj are all noble heroes for whom life was not an end in itself but only a means to Dharma to which it could be sacrificed if necessary at any moment. Of them Brahma Nayudu is treated as an incarnation of Vishnu but his human side is more prominent throughout the poem. His rebuke of his son for having shown the back to the battlefied, is befitting a true Indian hero. The female characters also are chaste and heroic. Rekhamba's pursuasion of her daughter not to prevent Balachandra from marching to battlefield, and Manchala's blessing to her husband when handing over the sword to him, cannot but stand before us for all time as noble examples of Indian womanhood. Rathnala Peridevi, reproaching her father for his wicked act and performing Sahagamana with her husband shows the high phase of the life of a Hindu wife. Nayakuralu is the abode of evil like Satan in Paradise Lost, Ravana in Ramayana and Sakuni in Mahabharata. Inspite of her vicious nature, she is represented here and there as a thoughtful diplomat and her negotiations for peace before the commencement of war show her diplomacy. It is the misfortune of great heroes to have a rival in women. Brahma Naidu had it. Bhishma actually withdrew from the field at the sight of Sikhandi. Brahma Naidu avoided Nayakural in battle in accordance with the Indian military traditions. In places of heroism the author rises to the occasion, and exhibits high fervour as in the dialogue between Balachandra and his parents and his other speeches.

He shows some tendency and also skill for portraying scenes of awe as Kannama's midnight visit to the battle field and the ecstasy of the devils during the night after the close of the war. In other situations he is quite common-place, and does not rise above the ordinary level. Setting aside the waste trash such as పరగ, సరగున, చయ్యన, ఒయ్యన, the narration is on the whole impressive and in some places vigorous.

As in Mahabharata, the end is disastrous to both parties and the predominant Rasa may be taken as Shanta, the auxiliary Rasas being Veera, Karuna etc. Unlike other classics, Palnati Veera Charitra is written in one continuous Dwipadee metre and in one strain.

Palnati Veera Charitra is deficient in graphic descriptions of even relevant naturesceneries in their picturesqueness and grandeur as in Ramayana, Mahabharata, Kumarasambhava etc. It also lacks in conversational or non-conversational utterances of importance like Ajavilapa in Raghuvamsa.

Palnati Veera Charitra cannot claim a very high place from a literary point of view according to the *canons* of advanced literary criticism. When I say that, I do not mean that it is inferior to other Telugu works. It is as good as any other Telugu work. It is even superior to many of them. I only intend to point out that it is not an exception to the general order of Telugu works, and does not exhibit any extraordinary high merit.

### Telugu works and Palnati Veera Charitra.

Before actually taking up Palnati Veera Charitra, I shall mention briefly some points about the general state of Telugu works. Telugu literature began with Puranic

briefs and other such things. Later, some other works of the Manu and Vasu Charitra type and similar productions sprang up.

Translations are mutilated and deformed, and important poetic details are left off. Srinadha's Nishadha belongs to the same group. Palnati Veera Charitra too as said before is not of high literary excellence. Either in bringing out striking situations or in expressing illuminating and lofty sentiments, its author does not generally rise above the ordinary level. As will be shown presently, it was intended for the lower order of people as other Telugu works. Aswaghosha's Buddha Charitra, though history, is of a far superior poetic interest.

In ancient and mediaeval times, Telugu was not the medium of instruction in the higher courses of study. All higher learning was received through Sanskrit, and Sanskrit was the cultural language of the country. Great scholars did not choose to write in Telugu on cultural subjects in several departments of knowledge, including literary criticisms. Telugu was thus relegated to an unimportant position, and had no place in academical courses. This backward position was not special to Telugu. It was common with all the Prakrit languages. The characters to whom Prakrit is allotted in Sanskrit Drama also to some extent indicate the position which they held in the academic circles. Perhaps, Pali, which was raised to the dignity of cultural and religious language by Bhagavan Buddha, was an exception to the general order of Prakrits. It is truly said that Tamil holds the same place in Southern India as Pali in the North. But the champions of Vedic culture had not recognised Buddha's step and had not allowed Pali to take the place of Sanskrit Even Tamil which rose up as an

ally and not as an enemy was not looked upon with favour by them. Some of them went even a step further, and prohibited the adaptation ot Vernacular words into Sanskrit and denounced them as incorrect. So says Nagesa, the great Grammarian, in his Manjusha,

देशभाषानुसारेण कृतानां कुञ्चीमञ्ची आप्यकोण्डेत्यादि नाम्नामसाधुत्वमेव [वै.सि.म.]
(Substantives formed according to the Vernaculars like 'Kunchi' 'Manchi' and 'Apyakonda' are verily incorrect.)

The progress of Pali stopped with the decay of Buddhism. The other non-religious Vernaculars of India were in their undeveloped condition, and Telugu was one of them. Leaving aside the departments of learning, in poetry, Prakrits made same mark, though mostly in love sentiment. Men of cultural attainments wrote original works in Prakrits some of which drew the attention of great scholars like Bana, and provided examples for the celebrated literary critics like Anandavardhana in their treatment of poetic charm.

As Prakrits were taken up by such eminent scholars, even original Prakrit dramas, transgressing in some details some of the Sanskrit Dramatic conventions, rose up like the Karpuramanjari of Rajasekhara which is now available. But even in this field, Telugu did not emerge out of its infant state on account of the crudeness of its verse and also other causes which will be explained below. Telugu works were intended for people of a lower status who had not access to the treasures of Sanskrit lore. They were intended to give an idea of the Puranas to the lower order of people for the guidance of their social and religious conduct. The leaving out of Bhagavadgita and other important portions by the translators of Mahabharatha ; the avoidance of writing Dramas, the highest form of poetry according to

Indian tradition and original poems and sastraic works in Telugu by famous scholars like Sreenatha, under the patronage of Ruling chiefs like Komati Vema Reddy, Kataya Vema and Kumaragiri Reddy who were themselves outstanding men of letters and commentators on classical works; and the very mutilated forms of translations like Telugu Naishadha, seem definitely to point out to the above fact. I do not propose here to enter into a detailed discussion on the additions and contractions in Mahabharata, writings of authors like Vemana and Pingali Suranna, the works of Manu and Vasu charitra type which do not generally present high thought or subtler feelings of human heart or relevant imagery of endless charam. I do not also give a full account of how these Telugu works and poems are not useful even to the lower type of people and how they misguide the intermediate class of quacks. The misfortune of Telugu always stands strikingly before my eyes whenever I ponder over the fact that a person like Ahobala Pandita, deeply interested in Telugu, had to leave some of his extremely valuable writings in Sanskrit only.

Perhaps such measures were the attempts, though unsuccessful, of people like him to attract real scholars to Telugu. Whatever it may be, it is plain that Telugu was not the medium of higher culture, and that Telugu works were intended only for people of inferior order. Ahobala Panditha, the commentator of Andhrasabda Chinthamani, in his scholarly discussion on Telugu observes thus.

"संस्कृतपुराणपठनाक्षमाणां तच्छ्रवणेऽप्यलालसानां मुमुक्षूणां शूद्रादीनां प्राधान्येन ज्ञानोपयोगीन्यान्ध्रपुराणानि भवन्त्येवेति"

(The Telugu Puranic works are essentially useful to Sudras etc., who aspire for liberation (Moksha) and who

are not capable of reading Sanskrit Puranas and who are not anxious even to hear them)

The situation has not altered after the advent of the Madras University.

English has taken the place of Sanskrit. On the one hand, the majority of educated Telugus have been cut off from touch with Sanskrit in which the invaluable treasures of Indian culture are stored up. On the other hand, they have not been able to properly assimilate alien culture, the customs, traditions and sentiments being different in many respects. To-day the majority of educated people in the Telugu country receive higher education through English, and some still through Sanskrit.

For further details on this topic my preface to Kavyaprakasa may be consulted. Then I come to scholars. Mature thinkers of the stamp of Sir S. Radhakrishna do not choose or try to express their thoughts in Telugu. This is evidently due to the fact that Telugu has no proper place in the realm of higher culture or thought at present. It is not the medium of higher education in collegiate courses in the Madras or Andhra University, and all higher knowledge is received, and imparted through English and also Sanskrit though in a limited atmosphere. Our ancients though great scholars, did not give us valuable works in Telugu as they intended Telugu only for the lower order of people. Our present authors, equipped with the study of the trivial works of ancients, are capable only of producing similar or still more trivial works in Telugu. Perhaps the majority of our present Telugu writers are the worst sinners in India today in using quack Sanskrit. This guess language always reminds me of the famous story of the Sanskrit of the crack-brained daughter-in-law of a Somapeethin.

The works that have sprung up after the advent of the University education, from Lexicon down to the story books and other works that are prescribed for the University examinations, clearly point out to the above fact. Details are shown in the Telugu Preface. People study trivial works, and produce in their turn still more futile writings. Matters are thus moving in a vicious circle which ends no where unless the course of education is changed. It should be so modified that the Telugu youths would find their way to the original treasures of learning and not merely to the briefs and other similar works which alone Telugu now can offer. Under these circumstances, I think that the conferring of B. A. (Hons.), M.A., and other degrees for the study of existing briefs and other such works in Telugu which have little cultural value does not serve any useful purpose at the present stage. This situation always reminds me of the statement of Lord Macaulay in this connection.

"Had they (our ancestors) neglected the language of Cicero and Tacitus; had they confined their attention to the old dialects of our own island; had they printed nothing and taught nothing at the Universities but chronicles in Anglo-saxon and romances in Norman-French, would England have been what she now is?"

Now I ask this question following Lord Macaulay. Having neglected the works of Gautama, Kanada and Sankara etc, and having confined ourselves to the Puranic briefs and other works of similar type, what is the worth of our Vidwans, Bhashapravinas or Ubhayabhashapravinas? Or what is the range and value of the oriental scholarship of our degree holders in Telugu?

The memorable transition in the history of Telugu begins, in my opinion, on the day when it is made the compulsory medium of examinations in all non-language subjects for Telugu students for arts and science degrees or at least Siromani and Vidya Praveena titles. As a first step to this the University may transform the Telugu Research section, in which there is no adequate return for the expenditure incurred, into a translation department, and get as many outstanding works as possible translated into Telugu from English and Sanskrit at the present stage. As a step for this, the University should make provision for the rise of scholars who, in addition to their proficiency in their special subjects and practice in Telugu composition, will be equipped with sufficient knowledge of Sanskrit in which the treasures of Indian culture are stored up and without a strong control over which, expression of scientific, abstract and subtle ideas in Telugu is almost impossible.

I close this topic which has come up as a side issue, and proceed to the subject proper. I pointed out that Telugu was thus relegated to an inferior position and that Telugu writings were intended for people only of lower cultural status. There was no scope for works of high order to arise, and Palnati Veera Charitra was no exception. Moreover it does not belong to the section of Kavya or Rupaka, and therefore we cannot apply to it cannons of advanced literary criticism.

When I say that we cannot expect high literary excellence as in Valmiki, Kalidas etc., I do not mean as alredy stated that it is inferior to other Telugu works. On the other hand it is far better than many of them. All that I want to point out is that it is not of exceptional poetic merit and is not an exception when the general

condition of Telugu works is taken into consideration. Palnati Veera Charitra is an unique work in many respects in Telugu literature. The subject matter, unlike that of the general mass of Telugu works which are mostly Puranic briefs or Puranic fictions or stories, with some descriptions, is the history of local heroes. The prominent characters are indigenous and exhibit the valourous life of the Andhras of those times in its brightest form. The treatment of the subject matter also is different from that of others where futile word-profusion, with scanty meaning and mere story skeletons, is predominant or speculations based on mythological details and hereditary similies form the important poetic element. It is written in verse which is half free from trash resulting from letter adjustment (వళి, ప్రాస) which is common with almost all the Telugu verse productions. It is different from works of the Bobbilikatha type as it, unlike the latter, attempts to maintain classic touch here and there.

**Ballad Literature.**

Palnati Veera Charitra comes under the Veera Gita (Ballad) group. The ballad is a special branch of Telugu literature and I have no information whether such a branch exists in the other Vernaculars of India or not. Whatever may be the reason, such a branch does not evidently exist in Sanskrit although episodes of Vatsaraja and Vikramarka etc., are sufficiently inspiring. These ballads are recited before big audiences generally during moon-lit-nights with the necessary accompaniments and gestures and are semi-dramatic in nature. They resemble the Vrittis mentioned by Bharata which may be considered as the germs of the developed Indian drama. Generally the purpose of the ballads is to create mainly reverence and admiration to-

wards the heroic souls by a sort of narration appealing to the popular imagination and emotions. It is why poetic sublimity of high thought cannot be expected in it. The function of the Ballad above mentioned, Palnati Veera Charitra amply fulfills in a manner in which few others of this class do.

**Brief review of some points in Palnativeeracharitra.**

It shows anxiety for the life of her son Balachandra and tries to prevent him from going to battle. This appears some what derogatory to the Indian Kshatra (Military) traditions. She stands in strong contrast to Kunti, who sends word through Sri Krishna to her sons to fight to the end. Perhaps the author wished to show here feminine weakness. Even Vyasa makes Kunti express once that life without sons would be distressing.

**Balachandra's visit to his damsel.**

Under the pretence of taking her to battle field when he was about to start to Karempudi he meets his damsel in her house though he never took her there. This is somewhat repulsive to us of the present age. It was not so in ancient India. The Vesyas appear to be an important section of society in those days. All know how much Hindu mythology is interwoven with the stories of these damsels. The mother of the great Bharata race is the daughter of a divine damsel. Other episodes are too numerous to be mentioned. In spite of condemnation by thinkers like Bhartrihari they seem to have kept up their position even in historical times. Vatsyayana thinks that contact with a damsel is not sinful as it is neither enjoined nor prohibited in Dharma Sastras. Omen-experts state that the sight of a Vesya in

front for a man starting for some purpose is auspicous. Kautilya recognises conjugal contract with a damsel and imposes fine upon the intruder. The Literary theorists like Dhananjaya, while ignoring the widow mentioned by Vatsyayana as a fitting object for making love, recognised Vesya as a heroine in a poetical composition though as of lower type.

If she is firm and constant in love like a duly wedded woman, she certainly rises above the level of ordinary Vesyas and can find a place in a dignified literary composition as Vasantasena in Mrichchakati.

Perhaps Rajasekhara thought it a compliment to himself when he declared as tradition goes, that he had love dealings with women of several parts of India. Some of these Vesyas were very rich. Some were learned especially in fine arts and they were called Ganikas as different from other ordinary Vesyas. The Ganikas of Pataliputra are said to have deputed a scholar by name Dattaka to prepare a treatise for their guidance Vatsyayana devotes a special Adhikarana in his Erotic Science to the affairs of these Vesyas. Even kings and men of status did not think it degrading to keep these Vesyas as their consorts. Vatsyayana refers to the amorous sports of a Chola (Tamil) king with his damsel Chitrasena. Though we thus see that intimacy with a Vesya was not considered a social stigma in those days, the whole of the damsel scene in Palnati Veeracharitra is quite irrelevant and the author ought to have omitted it at least for artistic considerations. It would have been different had he taken her to the battle field as Sri Krishna did Satyabhama.

**Harlot-Mother.**

It has been a practice with authors in our country to bring in the old harlot-mother where a Vesya is concerned as in Nirankusopakhyana etc.

These damsel-mothers seem to be notorious from even early times. Vatsyayana lays down that the damsel should be under the guidance of either her old mother who is cruel and greedy or choose another woman in her absence possessing the above qualities to take her place. Kautilya also refers to the damsel-mother and provides compensation for her if any one forcibly meddles with her daughter. Literary critics also take note of this *Vesyamata* in prescribing the conduct of the Vesya Heroine.

Palnati Veera Charitra gives an interesting description of the old, contemptible Vesyamata.

### Balachandra's indulgence with his wife.

Balachandra, before going to war, meets his wife and takes her blessings as Bhimasena in Venisamhara. But he also engages himself in love affairs with his wife. Embracing or sporting in any other way with a woman when marching to battle field is certainly in-appropriate and implies a kind of laxity on the part of the hero. That is why such a custom did not find favour with the famous heroes of ancient India. It is not said even of Ravana. Valmiki maintains it in the case of the ill-fated Vali. The author of Parijatapaharana, a Telugu work of the Vizayanagaram period, attributes it to Krishna's enemies who were going to be defeated. Bhatta Narayana presents a scene in Venisamhara in which the doomed Duryodhana amorously deals with his wife. Mammata, the author of Kavyaprakasa finds fault with him even for that. Balachandra's love affairs with his wife, when marching to war are not only out of place but also reflect upon his heroic character. If he did so as it was the first and the last time to meet her, it is no excuse for a hero who has to sacrifice everything for his noble purpose, especially when the wife

was also to follow him to the other world. If he did so under the advice of his mother, it must be stated that her anxiety for her son's wife was carried to the extreme. If it is merely a statement of the fact of history, then we must admit that Balachandra has no place in the galaxy of the noble type of Indian heroes to whom Kshatra Dharma was higher than anything else. The author for the sake of propriety, ought to have avoided this in the case of Balachandara, the prominent hero of the present portion of the ballad.

### Historical Importance of the Veeracharitra.

The time of Palnati Veeracharitra seems to be an important period in Indian History. It was the time when Mohamed Ghori was creating great havoc besieging place after place in Northern India and the fate of the Hindu Royal dynasties was hanging in the balance. The influence of Ramanuja's preachings and Basaveswara's religious overhauling were being strongly felt and the cross currents of Veerasaivism, Vaishnavism, Jainism and Buddhism were causing agitation in Southern India. It is thus we find in Palnati Veeracharitra an interesting blending of the heroic fervour of the military families of the North and the religious reformation of the spiritual preceptors of the South. More over, Palnati Veeracharitra seems to be an important link in Indian History. It throws light on the extinction of two ruling dyanasties Hyhayas and Western Chalukyas. Mr. Vincent Smith in his "Early History of India" observes thus. "The Kalachuri or Haihaya Rajas of Chedi are last mentioned in an inscription of the year 1181 A.D and the manner of their disappearance is not exactly known; but there is reason to believe that they were supplanted by the Bhugels of Rewa."

Palnati Veeracharitra reveals how the Hyhayas migrated from Chedi to Palnad and settled there never to return to their original homes. The reason of their migration is said to be somewhat religious in Palnati Veeracharitra. Perphaps the political incident was given a religious colouring. The migration might most probably be due to the inroads of the Mahomedan invaders or the pressure of the Bhugels of Rewa mentioned by Mr. Smith to be the successors of Hyhayas. Palnati Veera Charitra also shows how the Western Chalukya dynasty of Kalyan came to an end with the last prince dying in the Karempudi battle.

### Veera Cult of Palnad.

To-day Palnad Heroes are worshipped as divinities and every year a big festival is held at Karempudi in their memory on the new moon day of Kartika roughly corresponding to November and important scenes of the episode are enacted there. There is no distinction of caste in the Veera cult and all have equal religious status. Balachandra's brothers come from different castes including a barber, a washerman and a Brahmin. A Brahmin is the Acharya of the Veera group and a Panchama hero by name Kannama has a temple at Karampudi. But as all non-vedic heterodoxical religions, Veera cult also yeilded to the Vedic influence. Followers of this cult return to their old religious ways after the festivities are over.

### Veera Worship.

Veera worship is not new to India. In Rig Veda, Indra is addressed as Veera. Agni is also called Veera. Veerahatya was looked upon as a great sin, and abandoning Agni was compared to hero murder. In some

పౌరాణికుఁడు. తర్క వ్యాకరణాదుల పరిచయమితడు తన గ్రంథములలోఁ గనబరచెను. భీమఖండకృతినాయక వంశవర్ణనములోని

"కంసాసురధ్వంసిచరణపల్లవంబులు దనకుఁబుట్టినిల్లు కావునఁ గారణగుణసంక్రమణంబునంబోలెఁ జామరచ్ఛత్రధనుఃఖడ్గాది చిహ్నోపశోభితంబై"

యను వాక్యములును

సీ. "ముక్కంటిదరహాసమున కనుప్రాసంబు మిన్నేటిపేటికి మిక్కుటంబు
శారదాజ్యోత్స్నప్రసాదంబునకు పిష్టనలుంపశుద్ధాంతమ్మునకనుభాష
కల్పకారామ లేఖకుఁ బ్రతిచ్ఛందంబు త్రిదశేంద్రు కరటికామ్రేడితంబు
పుండరీకారణ్యమునకు నధ్యాహారమమృతాంబునిధికభిధాంతరంబు."

అనువాక్యములును శ్రీనాథుని తర్కవ్యాకరణజ్ఞానమును దిఙ్మాత్రము సూచించుచున్నవి. తర్కపరిభాషాపదములైన "ప్రధ్వంసాభావము, ప్రాగభావము" అనునవి వాడఁబడిన పద్యమొకటి వీథిలోఁ గలదు గాని యది యశ్లీలముగ నుంటచే నుదాహరింపఁజాలను. ఈ పద్యము శ్రీనాథరచితమో కాదో కూడ విచారింపవలసియున్నది. శ్రీనాథుఁ డాంధ్రీకరించిన కాశీఖండము నైషధము "కాశీఖండమయఃపిండం, నైషధం విద్వదౌషధం" అని ప్రతీతిగన్న గ్రంథములు. ఇంద్రియలోలత్వ మీయన కారోపించి యనేక కథలు చెప్పుచున్నారు. యౌవనమున స్వేచ్ఛగాఁ దిరిగినమాట వాస్తవమైనట్లే తెలియుచున్నది. ఇది యితనికిఁగల కళంకమని చెప్పక తప్పదు. కాని కాశీఖండము రచించునాఁటి కితని మనోవృత్తియందును బ్రవర్తనమునందును సంపూర్ణమైన మార్పు కలిగినట్లు కాన్పించుచున్నది. శ్రీనాథుఁడు రచించిన గ్రంథములు మరుద్రాజచరిత్రము, శాలివాహన సప్తశతి, పండితారాధ్య చరిత్రము, భీమఖండము, కాశీఖండము, వీథి, హరవిలాసము, పల్నాటివీరచరిత్రము. నందనందన శతకముకూడ రచించినట్లు తెలియవచ్చుచున్నది. వీనిలో మరుద్రాజచరిత్రము, శాలివాహనసప్తశతి, పండితారాధ్య చరిత్రము నిప్పుడు కానరావు. వీథి అనఁబడు చిన్నపుస్తకమొకటి ఇప్పుడున్నది కాని యది శ్రీనాథకృతమో కాదో సందేహముగ నున్నది. వీథి దశవిధరూపకములలో నొకటి. దీనికి లక్షణము దశరూపకమునం దీక్రిందివిధమునఁ జెప్పఁబడినది:—

'वीथी तु कैशिकीवृत्तौ सन्ध्यङ्गाङ्गैस्तु भाणवत्
रसः सूच्यस्तु श्रृङ्गारः स्पृशेदपि रसान्तरम् ।
युक्ता प्रस्तवनाख्यातैरङ्गैरुद्घात्यकादिभिः
एवं वीथी विधातव्या ह्येकपात्रप्रयोजिता' ॥

దీనిలోఁ బ్రధానరసము శృంగారము. సంధ్యంగాంకములు భాణములోరీతి నుండును. ప్రస్తావనలో నుద్ఘాత్యకాద్యంగము లుండవలయును. మహావిద్వాంసుఁడైన శ్రీనాథుఁడు పూర్వోక్తలక్షణ లక్షితంబగు వీథీరచన కారంభించి యసందర్భములైన వెట్టితొట్టిపద్యములతో గ్రంథము నింపియుండుట సంభవింపనేరదు. శ్రీనాథుఁడు సలక్షణమైన వీథి రచించియుండును. అది యేకారణముచేతనో నశింపఁగఁ గొన్ని శ్రీనాథ రచిత చాటుపద్యములను గొన్నియన్య వికృతములను గైకొని గ్రంథ మీరూపమును దాల్చియుండును. దీనిలోఁ గొన్నిపద్యములు గౌరవహీనులైన వ్యర్థులు వ్రాసినవిగాఁ గనఁబడుచున్నవి.

లెస్లిస్టిఫెన్ (Leslie stephen) అనునతఁడు జార్జి ఎలియట్ (George Eliot) జీవచరిత్రములో "A strong imaginative genius is developed early; it is an overmastering faculty which forces its possession into activity often before knowledge or serious thought has accumulated; draws romances, epic poems, and dramas from children in their teens; and suggests that not only the material surroundings, but even the storage of intellectual accomplishments is but an accidental stimulus to the innate creative power" అనిచెప్పినట్లు శ్రీనాథుఁడు బాల్యమునుండి పద్యాలు రచించుచుండెడువాఁడు. బుద్ధివిజ్ఞానయుతము కాకముందే యపూర్వ మేధావంతుల నిర్భరశక్తి పొంగి పొరలి బయటికివచ్చుచుండుట సహజము. సీ. "చిన్నారి పొన్నారి చిఱుతకూకటినాఁడు రచియించితిని మరుత్రాజచరిత" అనుపాదమువలన నీయనపిల్లజుట్టునాఁడే మరుత్రాజచరిత్రము వ్రాసెనని తెలియఁగలదు. భీమఖండములోని "భాషించినాఁడవు బహుదేశబుధులతో విద్యాపరీక్షణవేళలందు" అనువాక్యమువలన గృహమునో లేక తన్నాదరించు సంస్థానమునో కనిపెట్టికొనియుండు తక్కిన వారివలెఁ గాక యంధ్రదేశమంతయుఁ గలయఁ దిరిగినట్లు కాన్పించుచున్నది. రెడ్డిరాజాస్థానమందు విద్యాధికారిగానుండి అనేకదేశపండితులను పరీక్షించెనని తెలియుచున్నది. వాస్తవముగా శ్రీనాథుఁడు తెలుగుదేశములో పుట్టిన మహావిద్వాంసులలో ఒకఁడు. వేంకటగిరి ప్రభువగు సర్వజ్ఞసింగమనాయుని యాస్థానమునకుఁ బోయినప్పుడు "గోలకొండ, మాలముండ, పూలదండ, కొత్తకుండ" యను పదములనుంచి భారతార్థమువచ్చునట్లు పద్యము చెప్పుమని యడుగ నీక్రిందివిధమునఁ జెప్పెనని వాడుకగలదు—

గీ. "ఓయిధృతరాష్ట్ర నీ కొడుకుత్తగోల
కొండ విధ మాలముండఁ గృష్ణుండు కాచి
పాండుసూనుల గెల్పించు నండయగుచు
నుదరమునఁ బూలదండ రే కొత్తకుండ."

[ఉత్తగోల=పట్టి యవివేకి; కొండవిధము = కొండవలె నభేద్యమై; ఆలము = యుద్ధము; ఉండన్=ఉండఁగా; ఉదరమున = మెడలో వేసికొనినసుదరము పైఁబడి యుండు; పూలదండరేకు = పువ్వులదండరేకు; ఒత్తకుండ = ఒత్తుకొనకుండ ననఁగా నలఁగకుండ; మెడలో వేసికొన్న పూలదండయొక్క రేకైన నలఁగకుండు నంతభద్రముగా రక్షించి కృష్ణుఁడు పాండవుల గెలిపించునని యర్థము].

మఱియు నితని చాటుపద్యములని యీ క్రిందివి వాడుకలో నున్నవి :—

సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి దక్షిణాధీశు ముత్యాలశాలఁ
బలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య నైషధగ్రంథ సందర్భమందుఁ
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టుకంచుఢక్క
చంద్రశేఖరక్రియాశక్తిరాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుద
మొటుల మెప్పించెదో నన్ను నింక మీఁద, రావుసింగమహీపాలుఁ డీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండినీవు, సరససద్గుణ నికురుంబ శారదాంబ. 1

సీ. కవిరాజుకంఠంబు కౌఁగిలించెనుగదా పురవీథి నెదురెండ పొగడదండ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా నగరివాకిటనుండు నల్లగుండు
ఆంధ్రనైషధకర్తయంఘ్రియుగ్మంబునఁ దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత వియ్యమందెనుగదా వెదురుగొడియ
కృష్ణవేణమ్మకొనిపోయె నింతఫలము, బిలబిలాక్షులుతినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేఱి మోసపోతి, నెట్లు చెల్లింతుఁ దంకంబు లేడునూళ్లు. 2

సీ. కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి రత్నాంబరంబు లేరాయఁ డిచ్చుఁ
గైలాసగిరిఁ బండె మైలారువిభుఁ డేగె దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు
రంభఁగూడెఁ దెనుంగురాయరాహుత్తుండు కస్తురికేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మఱి హేమపాత్రాన్న మెవ్వనిపఙ్క్తిఁ గలదు
భాస్కరుఁడు మున్నె దేవునిపాలికరిగెఁ, గలియుగంబున నింకనుండఁ గష్టమనుచు
దివిజకవివరుగుండియల్ దిగ్గురనఁగ, నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి. 3

శా. అక్షయ్యంబుగ సాంపరాయని తెలంగాధీశ కస్తూరికా
భిక్షాదానము చేయురా సుకవిరాడ్బృందారక శ్రేణికిన్
దాక్షారామచళుక్యభీమవర గంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించునవ్వాసనల్. 4

వీనిలోని 1, 4 పద్యములు వీథినాటకమునఁ గానవచ్చుచున్నవి.

ఈయన దేశసంచారము చేసెను గావుననే తెలుఁగు దేశమందలి యాచారములను నడవడికలను సంపూర్ణముగ గ్రహించెను. వివిధదేశములం దిరుగునప్పుడు నానావిధ జనులతోఁ గలియుట సంభవించునుగదా. ఈతనికృతులకు వైశిష్ట్యము కలిగించిన కారణములలో బహుదేశసంచారమే ముఖ్యమైనదని చెప్పవచ్చును.

శ్రీనాథుఁడు మొదటఁ బల్నాటిసీమకుఁబోయినప్పు డతనివైదుష్యము నచ్చటి ప్రజలదివర కెఱుఁగమిచేఁగాఁబో లంత గౌరవము చూపఁబడినట్లు కాన్పింపదు. అతఁడును దనకుఁ గలిగిన యనాదరణ సూచకముగఁ గొన్ని గ్రామముల మీదఁ బద్యములు చెప్పినాఁడని జనులిప్పటికి వాడుకొనుచున్నారు. వానిలోఁ గొన్ని పద్యముల నిం దుదాహరించెదను.—

క. సెమలిపురి యమపురంబుగ, యముఁడాయెను బసివిరెడ్డి యంతకుమిగులన్
యమదూతలైరి కాపులు, క్రమ మెఱుఁగని దున్నలైరి కరణాలెల్లన్.

క. గుడిమీదికోతిచేతను, గుడిలోపలినంబివారి కోడలిచేతన్
నడివీథిలంజచేతను, నడిగొప్పులయూరుగాలి నణఁగితినుమీ.

క. జొన్నకలి జొన్నయంబలి, జొన్నన్నము జొన్నపిసరు జొన్నలెతప్పన్
సన్నన్నము సున్నసుమీ, పన్నుగఁబల్నాటిసీమ ప్రజలందఱకున్.

క. తేళులమందై బోనము, పాలాయెను మంచినీళ్ళుపడియుండుటకే
నేలేక అవైపోయెను, గాలినగుర్జాలనిష్టకా మేశహరా.

గీ. ఊరు వ్యాఘ్రనగర (పులిపాడు) మురగంబు (శేషయ్య) కరణంబు
కాపుకపివరుండు (హనుమయ్య) కసవు (పుల్లయ్య)నీఁడు
గుంపుగాఁగఁజేరె గురిజాలసీమలో
నోగులంతగూడి యొక్కచోట.

కార్యమపూడిని శ్లాఘించుచు నీక్రిందిపద్యమును జెప్పెనఁట:—

ఉ. "వీరులుదివ్యలింగములు, విష్ణువునాయకుఁడు, కల్లిపోతరా
జారయభైరవుండు (తుహినాద్రిజయంకమ, నిర్మలాంబువై)
కేరెడు గంగధారమడుగేమణి కన్యక యన్నిభంగులం
గారెమపూడిపట్టణము కాశిసుమీ కనుఁగొన్నవారికిన్."

ప్రథమమున గౌరవము వడయకపోయినను రానురాను శ్రీనాథుఁడు పల్నాటి వారితో మిక్కిలి మైత్రి వాటించి తనవార్ధకమునంతయు నచ్చటనే గడపెను. పల్నాటి వీరచరిత్ర మచ్చటనుండియే వ్రాసినాఁడు. ఇప్పుడు కానవచ్చుచున్న గ్రంథములలో నితఁడు మొదట రచించినది శృంగారనైషధము. ఇతనికిఁ బూర్వము కృతికర్తలందరు విస్తారముగఁ బురాణములఁ దెనిఁగించిరి. క్రొత్తమార్గ మవలంబించి యితఁడు శ్రీహర్ష రచిత నైషధకావ్యము నాంధ్రీకరించి కొండవీటి వేమారెడ్డి మంత్రియైన మామిడిసింగన కంకిత మొనర్చెను. మామిడిసింగన కొండవీటిసీమలోని బలిజేపల్లి నివాసి. బలిజేపల్లిలో నిప్పటికి మామిడివారు గలరు. నైషధమునఁ దనయాంధ్రీకరణపద్ధతిని గూర్చి యిట్లు చెప్పికొనినాఁడు.—

"భట్టహర్ష మహాకవీశ్వరుండు కవికులాదృష్టాధ్వపాంథుం డొనర్చిన * నైషధ శృంగార కావ్యంబాంధ్ర భాషావిశేషంబున నశేషమనీషి హృదయంగమంబుగ శయ్యానను సరించియు నభిప్రాయంబు గుఱించియుం భావం బుపలక్షించియు రసంబుపోషించియు నలంకారంబు భూషించియు నౌచిత్యం బాదరించియు ననౌచిత్యంబు పరిహరించియుం మాతృకానుసారంబుగఁ జెప్పఁబడిన యీభాషా నైషధకావ్యంబు"

ఇతఁడు చాలాశ్లోకాలను సరిగా తెనిగించలేదు.

---

* కావ్యాస్వాదానికి అనుకూలమై రసప్రలుబ్ధమైన బుద్ధియొక్క వినాశం అధికంగా తెలుగు దేశంలో తెలుగుపద్యకర్తల్లో నన్నయకాలంనుండీ ఆరంభమై శ్రీనాథుడిసమయంవరకు సమగ్రతను సమీపించినట్లు కనబడుతున్నది. కనుకనే కాళిదాసు రఘువంశాది కావ్యాలుండగా వాటిను పేక్షించి తదపేక్షచేత, అధమకావ్యమనదగిన నైషధంమీదికి అతడిదృష్టిపోయి "కవికులాదృష్టాధ్వపాంథుండు" అని శ్రీహర్షుణ్ణి పొగడివుంటాడు. కుమారసంభవంలోని కొన్నిశ్లోకాల నితడు తెలిగించినా దాన్ని ప్రధానంగా పాటించలేదు. విస్తరంనైషధ తత్త్వజిజ్ఞాసలో ద్రష్టవ్యం. ఇట్లానే పింగళి సూరన్న శుష్కమైన శ్లేషపద్యరచనకు ఆశపడ్డాడు. ఈతీరుగా కాల ప్రభావం, నన్నయ్యపద్యంయొక్క దుర్లక్షణాలైన వళిప్రాసలచేత్త, అణచివేస్తున్నప్ప

శ్లో॥ तव रूपमिदं तया विना विफलं पुष्पमिवावकेशिनः ।
इयमृद्धधनावृथावनी स्ववनी सम्प्रवदत्पिकाऽपि का ॥ स २ ॥

దీనిని.—

గీ. "సౌరభములేనియట్టి పుష్పంబువోలె
గండుఁగోయిలవెలియైన కానవోలె
నధిప దమయంతితోడ సఖ్యంబులేని
నీదుసౌందర్య విభవంబు నిష్ఫలంబు."

అని తెలిఁగించెను. సంస్కృతమున "అవకేశినః విఫలంపుష్పమివ (వంధ్యావృక్షము యొక్క ఫలరహితమైన పుష్పమువలె)" అనియుండ 'సౌరభములేని యట్టి పుష్పంబు వోలె' నని తప్పుగా తెలిగించినాడు. "ఇయమృద్ధధనావృథావనీ" అనునది విడిచిపెట్టినాఁడు. "స్వవనీ సంప్రవదత్పికాపి కా (కూయుచున్నకోకిలలుగల స్వోద్యానవనము నిరర్థకము)" అనియుండ దీనిభావము పరిత్యజించి "గండుఁగోయిలవెలియైన కాన వోలె" నని అపానువాదం చేసినాడు.

శ్లో॥ तरुमूलयुगेन सुन्दरी किमु रम्भां परिणाहिना परं ।
तरुणीमपि जिष्णुरेव तां धनदापत्यतपःफलस्तनीम् ॥ स २ ॥

దీనిని.—

మ. వనజాతేక్షణ యూరుయుగ్మమున లావణ్యంబునం గేలికా
ననసంక్రందన పట్టణప్రకటజన్మస్థానలన్ రంభలన్
ధనదాపత్యతపఃఫలస్తనుల నత్యంతాభిరామాంగులన్
మనుజాధీశ యధఃకరించుఁ బొగడన్ మాబోంట్లకున్ శక్యమే.

అని యాంధ్రీకరించినాఁడు. దీనిలో మూలమునలేని 'కేలికాననసంక్రందన పట్టణ ప్రకటజన్మస్థానలన్" అను క్రొత్తవిశేషణము చేర్చినాఁడు. మూలములోని "ధనదాపత్య తపఃఫలస్తనీం" అనునది తరుణీపరమైన రంభాశబ్దమునకు విశేషణముకాని తరుపరమైన రంభాశబ్దమునకు విశేషణముకాదు. ఈతఁడీ విశేషణము రెంటికిఁ జేర్చినాఁడు.

---

టిక: శ్రీనాథుడు పింగళి సూరన అక్కడక్కడ వాటిని అతిక్రమించి నిసర్గకవితాపరత్వాన్ని ప్రదర్శిస్తున్నారు. వీరిద్దరిలో భావసౌకుమార్యాదుల్లో పింగళి సూరన్న మేలన వచ్చును. ముక్తపద్యాలకు వీరుబలిగాకుంటే వీరివల్ల తెలుగుదేశాని కెంత ప్రశస్తమైన కృతులు లభించి ఉండేవో అని సంభావిస్తుంటాను.

మూలములోఁ దరుతరుణీవాచకములైన రంభాశబ్దములకు రెంటికి వేఱు వేఱువిశేషణము లుండ నితఁడు విశేషణములన్నియు రెంటికిఁ గలిపిచెప్పెను. పద్యమునకు శ్లోకమునకు నర్థములోఁగూడఁ గొంత భేదము కన్పట్టుచున్నది. ఇట్లే యెన్నోచోట్ల తప్పుత్రోవ ననుసరించి దోషవంతమైన అనువాదములు చేసినాడు. మూలములోనున్న శ్లోక ముల నొకదానివెంట నొకటిని క్రమముగఁ దెనిఁగింపలేదు. "నిపీయయస్య క్షితిరక్షిణఃకథాః" అను ప్రథమశ్లోకము బొత్తిగ వదలిపెట్టి "సువర్ణదండైకసితాతపత్రిత జ్వలత్ప్రతాపవళికీర్తిమండలః" అను రెండవశ్లోకములోని భాగమును, "పవిత్రమ త్రాతనుతేజగద్యుగే స్మృతారసక్షాళనయేవతత్కథా" అను మూఁడవ శ్లోకభాగమును "అముష్యవిద్యారసనాగ్రనర్తకీ" అను నైదవశ్లోకములోని భాగమును "స్ఫురద్ధను ర్నిస్వనతద్ఘనాశుగ ప్రగల్భవృష్టిర్వ్యయితస్యసంగరే" అను తొమ్మిదవశ్లోకములోని భాగమునుజేర్చి కథాప్రారంభమందలి మొదటిపద్యము చెప్పినాఁడు. ప్రథమసర్గ మును ప్రథమాశ్వాసముగ నాంధ్రీకరించి ద్వితీయ తృతీయ చతుర్థసర్గముల ద్వితీ యాశ్వాసమందును; 5, 6, 7 సర్గములఁ దృతీయాశ్వాసమందును; 8, 9 సర్గము లను 10-వ సర్గములోని 87 శ్లోకములను జతుర్థాశ్వాసమందును; 10-వ సర్గ ములో మిగిలినశ్లోకములను, 11, 12, 13 సర్గములను, 14-వ సర్గములోని 47 శ్లోక ములను పంచమాశ్వాసమందును; 14-వ సర్గములో మిగిలిన శ్లోకములను, 15-వ సర్గ మును, 16-వ సర్గములోని 113 శ్లోకములను, షష్ఠాశ్వాసమందును; 16-వ సర్గములో మిగిలిన శ్లోకములను, 17, 18 సర్గములను సప్తమాశ్వాసమందును; 19, 20, 21, 22 సర్గముల నష్టమాశ్వాసమందును నిమిడ్చినాఁడు. సంస్కృతములోని నైషధము నిట్లు తుంచికూర్చి వికృతం చేసినాడు." సంస్కృతమునయున్న స్వయంవర సమయమున సరస్వతీ వచనానుసారముగ దమయంతీదేవి నలునికంఠమున మధూకదామమును వేసిన తరువాత, ననఁగా నలవరణానంతరమున, నింద్రాదులు స్వస్వరూపములఁ దాల్చినట్లు సంస్కృత నైషధమునఁ జతుర్దశ సర్గమునందుఁ జెప్పఁబడియుండ నలుని కంఠమున దమయంతి పుష్పమాల వేయకముందే యింద్రాదులు నలాకారము విడిచిరని యాంధ్రనైషధ పంచమాశ్వాసమున నున్నది. కాలక్రమము మఱచిపోయి "పాకశాసనుండు, పావ కుండు, పరేతపతి, పాశహస్తుండు, పంచముండనైన నేను నియ్యేవురమును బాండవులు పాంచాలింబోలెఁ బంచికొని యనుభవింతము" అని కలి పలికినట్లు సప్తమాశ్వాసమునఁ జెప్పినాఁడు. రాజతరంగిణి యనుగ్రంథములో

శ్లో 'शतेषु षट्सु सार्धेषु त्र्यधिकेषु च भूतले।
कलेर्गतेषु वर्षेषु प्राभवन् कुरुपाण्डवाः' ॥

అని కలియుగమునఁ గొన్ని సంవత్సరములు గడచినతరువాతఁ గురుపాండవు లున్నట్లు చెప్పఁబడినది. ఇదిగాక బృహదశ్వుఁడు నలోపాఖ్యానము ధర్మజునకుఁ జెప్పుట పురాణసిద్ధము. కనుకఁ బాండవులకంటెను నలుఁడు మిక్కిలి పూర్వుఁడనుట నిర్వివాదాంశము. ఈ పొరపాటు శ్రీనాథునిది కాదు. శ్రీహర్షుఁడే

శ్లో 'यतध्वं सहकर्तुं मां पाञ्चाली पाण्डवैरिव ।
सापि पञ्चभिरस्माभिः संविभिज्यैव भुज्यताम्' ॥

అని సప్తదశసర్గమునఁ జెప్పెను. దీనినే శ్రీనాథుఁ డాంధ్రీకరించెను.

నైషధమునకు వ్యాఖ్యానము వ్రాసిన నారాయణ పండితుఁ డీ విషయము నిట్లు సమర్థించినాఁడు:—

"पाण्डवानामग्रभावित्वात्तदानीं दृष्टान्तत्वेन
कलेर्योगित्वाद्भविष्यदर्थज्ञानसामर्थ्याद्वचनं युक्तम्" ॥

"जगत्प्रवाहानादितया पाण्डवपाञ्चालीवृत्तान्ताना
मतीतत्वात्तदुदाहरणीकृत्यैतदुक्तमितिवा ॥" (పాండవుల యగ్రభావిత్వము (ముందుండుట) వలన నప్పటి దృష్టాంతత్వముచేఁ గలియొక్క యోగిత్వ భవిష్యదర్థజ్ఞాన సామర్థ్యకారణమున వచనము యుక్తము. లేదా, జగత్ప్రవాహముయొక్క యనాదితచేతఁ బాండవపాంచాలీ వృత్తాంతముల యతీతత్వమువలన నది యుదాహరణము చేసి చెప్పఁబడినది.)

ఇతఁడు శ్రీహర్షునియందలి గౌరవాతిశయముచే నెటులైన సమర్థింపవలెనని యత్నించెఁగాని జ్ఞానదృష్టితోఁ జూచినయెడల నీసమర్థనము యుక్తియుక్తముగఁ గాన్పింపదు. కవి ప్రమాదమునొందెననుటయే సమంజసముగా నుండును. బహుశః రచనావేగమున నీ పొరపాటతఁడు కనుఁగొని యుండకపోవచ్చును. "ప్రమాదో ధీమతామపి" యను నార్యోక్తి కలదుగదా.

నైషధమునందు నలచరిత్ర సంపూర్ణముగ లేదు. నలుఁడు దమయంతిని బెండ్లాడి స్వనగరము ప్రవేశించిన తరువాతఁ గలి యచ్చటికివచ్చి మందిరోద్యానమునందలి పొదలోని తాండ్రచెట్టు తొఱ్ఱలోనుండి నలునియందు రంధ్రాన్వేషణము చేయుచుండ నూతన దంపతు లిష్టోపభోగములఁ బొందునప్పుడు ప్రాద్దుగ్రుంకఁగా నుదయించిన చంద్రుని వర్ణనముతో గ్రంథము సమాప్తి గావించినాఁడు. శ్రీహర్షుఁడు నైషధము సంపూర్ణముగ నలువది సర్గములలో రచించెనని కొంద అందురుగాని యది యవిశ్వాస్యము.

ఈవిషయమై నైషధమునకు వ్యాఖ్యానము వ్రాసిన నారాయణ పండితుఁ డిట్లు నుడువుచున్నాఁడు:—

"महाभारतादौ वर्णितस्याप्युत्तरनलचरित्रस्य नीरसत्वान्नायकानुदयवर्णनेन रसभङ्गसद्भावाच्च काव्यस्य च सहृदयाह्लादनफलत्वच्चात्रोत्तरनलचरित्रं श्रीहर्षेण न वर्णित मित्यादि ज्ञातव्यम् "

(మహాభారతాదులయందు వర్ణింపఁబడినప్పటికి నుత్తర నలచరిత్రయొక్క నీరసత్వమువలనను, నాయకానుదయ వర్ణనముచే రసభంగము గలుగుటవలనను సహృదయాహ్లాదము కావ్యమునకు ఫలమగుటవలనను నీనైషధకావ్యమునం దుత్తరనలచరిత్రము శ్రీహర్షునిచేత వర్ణింపఁబడలేదని యెఱుఁగఁదగినది.)"

శ్రీహర్షుఁడు వర్ణించినమట్టుకు శ్రీనాథుఁ డాంధ్రీకరింప నెంచెను.

* ఇతడు సరిగా తెలిగించయత్నించిన కొన్ని సంస్కృతపద్యములు వాని అనువాదపద్యములు ఉదాహరించెదను.

---

* సరిగా తెలిగించయత్నించినప్పటికీ కృతార్థుడుకాలేదు. నన్నయపద్యం యొక్క దుష్టలక్షణాలైన వళిప్రాసలదరువు, ఉచితపద్యనిర్ణయం లేకపోవడం, దండగ మాటలకు అధికవిశేషణాలకు కారణమైనందువల్ల మూలంలోని అంశాలు యథాతహాన్ని కోలుపోయినవి. ఇక అపానువాదాలు మొదలయినవి అధమాధికారుల కెట్లావుంటే నేమి విచారించే దెవరని చేసివుంటాడు. "అశేషమనీషిహృదయంగమంబుగ" అన్నచోటి మనీషులు, తెలుగుకృతులు అధిమాధికారులకే ననేకోటిలోని వారే అయి వుంటారు. కాకుంటే ఇట్లాటి అనుచితానువాదాలు హృదయంగమంకాజాలవుకదా. అల్పబుద్ధులకోసం భారతాదులను పూర్వులు సంగ్రహాలుగా తోచినట్లు రచిస్తే రచించవచ్చును గాని సర్వకాలం సర్వదశలందూ అవే పరమగ్రంథాలని మనము గంతులువేస్తుండడంమాత్రం వివేకం మాలినపనే కాగలదు. పైపద్యాల్లో గీతలుగీసినవి మూలంలోలేని అధికప్రసంగం. ఇట్లానే దండగచెత్త అనేకపద్యాలలో దృష్టమవుతున్నది. ఇక తీసివేతలు మార్పులు ప్రస్ఫుటమేను. నన్నయపద్యంలో రచనచేస్తే ఊహాపోహాలు, కావ్యాత్మ అయిన వ్యంగ్యంయొక్క వినాశం, యెవరికైనా తప్పవు. మూలభాష తెలియనివారికి మూలంలోని అంశాలు ఉన్నవి ఉన్నట్లు అవికృతంగా తెలపడమే అనువాదం యొక్క పరమప్రయోజనం. మూలంలోవున్నది తీసివేయక లేనిది కుక్కకచేసిన అనువాదాలకు లక్ష్యఖండంలోని రఘువంశానువాదం, గీతానువాదం మొదలైనవి చూడనగును.

1. శ్లో. అయం దరిద్రో భవితేతి వైధసీం
లిపింలలాటేఽర్థిజనస్య జాగ్రతీం,
మృషాం న చక్రే ఽల్పితకల్పపాదపః
ప్రణీయ దారిద్ర్యదరిద్రతాం నృపః. స. ౧.

చ. ఇతఁడు దరిద్రుఁ డౌననుచు నేర్పడనర్థిలలాటపట్టికన్
శతధృతి వ్రాసినట్టి లిపిజాలమనర్థముకానియట్లుగా
వితరణఖేలనాభిభవవిభ్రమనిర్జితకల్పభూరుహుం
డతఁడు దరిద్రతాగుణమునందు దరిద్రుని జేయునాతనిన్. ఆ ౧.

2. శ్లో. సరసీః పరిశీలితుం మయా గమికర్మీకృతనైకనీవృతా
అతిథిత్వమనాయిసాదృశోః సదసత్సంశయగోచరోదరీ. స. ౨.

మ. కమలేందీవర షండమండితలసత్కాసారసేవారతిన్
గమికర్మీకృతనైకనీవృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్
సమపీనస్తన నస్తినాస్తి విచికిత్సాహేతు శాతోదరిన్. ఆ. ౨.

1. శ్లో. విరహిణో విముఖస్య విధూదయే
శమనదిక్పవనస్సన దక్షిణః
సుమనసో నమయన్నటనౌ ధను
స్తవతుబాహురసౌ యది దక్షిణః. స. ४.

ఉ. రాకసుధాంశుమండలమురాకకు మాఱుమొగంబు సేయుచో
దీకొనివచ్చు దండధరదిక్పవమానమ దక్షిణంబగుం
గాక వియోగికిం గుసుమకార్ముకశృంగము వంగఁజేయు నీ
యాకరపంకజాతము రతీశ్వరదక్షిణమైననాఁటికిన్. ఆ. ౨.

4. శ్లో. దృశౌ కిమస్యాశ్చపలస్వభావే
నదూరమాక్రమ్య మిథోమిలేతాం
న చేత్కృతః స్యాదనయోః ప్రయాణే
విఘ్నః శ్రవఃకూపనిపాతభీత్యా. ఆ. ౭.

గీ. శ్రవణపుటకూపవినిపాతసాధ్వసమున
నిగిడి యవ్వలికటుపోక నిల్చెఁగాక
యధికచపలస్వభావంబు లైనయట్టి
దీనికన్నులు తలచుట్టు తిరిగిరావె. ఆ. 3.

5. శ్లో. వృథాపరీహాస ఇతి ప్రగల్భతా
న నేతిచ త్వాదృశి వాగ్విగర్హణా
భవత్యవజ్ఞా చ భవత్యనుత్తరా
దతః ప్రదత్స్వః ప్రతివాచమస్మి తే. స. ౯.

గీ. కలికినవ్వ ప్రగల్భతాకారణంబు
కాదుకాదంటవాచావిగర్హణంబు
పలుకకుంట తిరస్కారకలనముద్ర
గాన ప్రత్యుత్తరంబిచ్చుదాన నీకు. ఆ. ౪.

6. శ్లో. నిస్త్రింశత్రుటితారివారణఘటాకుంభాస్థికూటావట
స్థానస్థాయుక మౌక్తికోత్కరకిరః కేరస్య నాయంకరః
ఉన్నీతశ్చతురంగసైన్యసమరత్వంగత్తురంగక్షురా
క్షుణ్ణాసు క్షితిషు క్షిపన్నివ యశః క్షోణీజబీజవ్రజం. స. ౧౨.

శా. క్రూరాసిత్రుటితారివారణఘటాకుంభస్థకూటస్థలీ
రారాజన్నవమౌక్తికోత్కరకరారంభక్రమోజ్జృంభియై
యీరాజన్యుకరంబు పోరులఁ గరం బేపారు సత్కీర్తిబీ
జారోపం బొనరించుభంగి హయరింఖాగ్రక్షతక్షోణులన్. ఆ. ౫.

7. శ్లో. అహర్నిశావేతిరతాయపృచ్ఛతి
క్రమోష్ణశీతాన్నకరార్పణాద్విటే
హ్రియా విదగ్ధా కిల తన్నిషేధినీ
న్యధత్త సంధ్యామధురేఽధరేఽంగుళిం. స. ౧౬.

గీ. ఉష్ణశీతాన్నకబళంబులొకఁడుసూపఁ
బవలొ రాత్రియొ యొదఁగూడనవసరమని
దానికుత్తరమొకలతాతన్వియిచ్చె
నధరబింబంబు విటిచి సంధ్యాగమమని. ఆ. ౬.

8. శ్లో. నిజాదనువ్రజ్య సమండలావధే
ర్నలం నివృత్తౌ చటులాపతాం గతః
తడాగకల్లోల ఇవానిలం తటా
ద్ధ్రుతానతిర్వ్యావవృతే వరాటరాట్. స. ౧౯.

గీ. ఆత్మమండలమవధిగా ననుసరించి
అవనినాథుఁడు జామాతననిపి మరలె
నాప్రతీరంబు గంధవాహంబు ననిచి
మరలివచ్చు తటాకంపుతరఁగవోలె. ఆ. ౭.

9. శ్లో. పితాత్మనః పుణ్యమనాపదః క్షమా
ధనం మనస్తుష్టిరథాఖిలం నలః
అతఃపరం పుత్రి న కోపి తేహమి
త్యుదస్రురేష వ్యసృజన్నిజౌరసీం. స. ౧౯.

మ. గురువన్నన్ ధనమన్నఁ బుణ్యమనినన్ గోత్రోదయంబన్న దే
వరయన్నన్ మనమన్నఁ దుష్టియనినన్ వాత్సల్యమన్నన్ నిజే
శ్వరుఁడన్నన్ బరమోపకారమనినన్ సర్వంబునన్నన్ దలో
దరి నీకున్ నిషధాధినాథుఁడె సుమీ తథ్యంబుగాఁ జెప్పితిన్. ఆ. ౭.

10. శ్లో. విశ్వరూప కృతవిశ్వ కియత్తే
వైభవాద్భుతమణౌ హృది కుర్వే
హేమ నహ్యతి కియన్నిజచీరే
కాంచనాద్రి మధిగత్య దరిద్రః. స. ౨౧.

గీ. విశ్వరూప భవద్భూరివిభవమహిమ
యెంత వర్ణింపఁజాలునీ యీమనంబు
ప్రాంతపైచీరచెఱఁగున బడుఁగువాఁడు
హేమశైలంబు చిదిపి రాలెన్ని ముడుచు. ఆ. ౮.

11. శ్లో. స్వధాకృతం యత్తనయైః పితృభ్యః
శ్రద్ధాపవిత్రం తిలచిత్రమంభః
చంద్రం పితృస్థానతయోపతస్థే
తదంకరోచిః ఖచితాన్వైవ.

గీ. చంద్రమండలమిది పితృస్థానమగుట
జనసమావర్జితస్వధాసలిలతిలలు
మంత్రబలమున నెక్కె నీమధ్యమునకుఁ
జంద్రబింబాస్యలాంఛన చ్ఛాయగాదు.

నైషధము తరువాత నితఁడు రచించినది *భీమేశ్వరపురాణము. సంస్కృతమున 32 అధ్యాయములలోనున్న భీమఖండము తెలుఁగున నాఱాశ్వాసములుగ రచించెను. ద్వితీయాశ్వాసములోఁ బీఠికాపురవర్ణనము స్వేచ్ఛగఁ జేసినాఁడు. సూర్యాస్తమయ చంద్రోదయ సూర్యోదయవర్ణనముల నధికముగఁ జేర్చినాఁడు. మూలమననుసరించి ఇత డనువదింపఁ దలపెట్టిన కొన్నిశ్లోకములు వాని అనువాదవాక్యములు ఈక్రింద ఉదాహరింపబడినవి.

శ్లో. అహో కిమేతన్మే బ్రూహి వైవర్ణ్యం వదనే తవ
దృశ్యతే నేత్రయోర్దైన్యం మానసవ్యథయానఘ
కచ్చిన్న జాతో వాగ్వాదో లోలార్కేణ సమం తవ
ఢుంఠివిఘ్నేశ్వరః కచ్చిన్న త్వాం ధిక్కృతవాన్ రుషా
కచిత్త్వం క్షుధితః కాలే విశాలాక్ష్యా న వంచితః
న కచ్చిత్త్వయ్యనుచితం భైరవేణ కృతం ముధా
కథం త్యక్తం త్వయా గంగావాహినీసైకతస్థలం
కథం తత్పరమం స్థానం వ్యసృజః కోశపంచకం
కథం త్వం ముక్తవాన్ ప్రాప్యామవిముక్తవసుంధరాం
కథం విశ్వేశ్వరం దేవం సతాముజ్ఝితవాన్ ధనం.

గీ. ఆననమునందు వైవర్ణ్య మగ్గలించెఁ
గన్నుగవయందు దైన్యంబు గానఁబడియె
నార్తి యేదేని యొకటి నీయంతరంగ
మూనియున్నది యిది యెట్టులొక్కొ యనఘ.

సీ. లోలార్కునకు నీకులోలోన నేమేనిఁబోటిపుట్టదుగదా మాటమాట
వెనకయ్య శ్రీఢుంఠివిఘ్నేశరస్వామి ధిక్కరింపఁడు గదా తెగువ నిన్ను
నాఁకొన్న నిన్ను మధ్యాహ్నకాలంబున నరయకుండదు గదా యన్నపూర్ణ
నెపమేమియును లేక నీయెడాటమ్మునఁ బొటిదప్పఁడు గదా భైరవుండు

* తుంచడం కూర్చడం మొదలైనవాటితో భీమఖండంకూడా దూషితమైనది.

ఎట్టు పాసితి మిన్నేటి యిసుకతిప్ప
ఎట్టు పాసితి వాస్థలంబేసుకొను
లెట్టు పాసితి వవిముక్తహట్టభూమి
ఎట్టు పాసితి విశ్వేశు నిందుధరుని.

1. శ్లో. అథ క్రోధస్సముద్భూతః క్షుధార్త్యా హృదయే మమ
తేన క్రోధాంధకారేణ ప్రవృద్ధే నాహముద్ధతః
కిమప్యదృష్ట్వా సహసా భిక్షాపాత్రాణ్యపాతయం
శిలాయాం శతధా భిన్నం శిష్యేషు భయకంపిషు. అధ్యా. ౧౫.

శా. కుక్షిప్రోద్భవనిష్ఠురక్షుధితదుష్క్రోధాంధకారంబునం
జక్షుల్ రెండును జిమ్మచీకటులుగా సంరంభశుంభద్గతిం
బ్రేక్షచ్ఛాత్రులు భీతినొందఁ కడునుద్రేకించి హట్టంబునన్
భిక్షాపాత్రలు రాతిమీద శతధాభిన్నంబుగా వైచితిన్. ఆ. ౨.

2. శ్లో. సర్వే తద్వాక్యమాకర్ణ్య తమవోచన్నిదం వచః
న నివర్తయితుం శక్యమమోఘం నో వచోఽనఘ
తస్మాదన్యేన మార్గేణ కరిష్యామశ్శివం వయం. అధ్యా. ౨౧.

గీ. అనుటయును వారలామాట లాదరించి
క్రమ్మఱుపరాదు పలుకమోఘమ్ము మాకు
నీవ యిప్పుడు చెప్పినహితమునూది
వేఱుచందాన మేలు గావింతుమింక. ఆ. ౪.

3. శ్లో. సముచ్చలత్పయోవీచీమాలికాపరిశోభితా
దూరీకృతేశ గోవిందధామ సిద్ధవసుంధరా
జవాతిశయశీర్ణాద్రిధామరేణుచయావిలా
వివేశ గౌతమీగంగా దక్షవాటమహాపురీం.

చ. మలఁగిమలంగిభీమపతి మందిరమండలసిద్ధభూమికిన్
దొలఁగితొలంగి యుచ్చలితతోయతరంగపరంపరోద్ధతిన్
జెలఁగిచెలంగి యారభటిశీర్ణధరాధర ధాతురేణులం
గలగికలంగి పాఱె వడిగౌతమకన్యకదక్షవాటికన్. ఆ. ౪

శ్లో. తిష్ఠన్మాత్రోఽపి వాసిష్ఠో వసిష్ఠసదృశోఽపి వా
దక్షవాటీ పురస్థాతా మోక్షం యాతి న సంశయః. అధ్యా. 32.

క. తిష్ఠన్మాత్రుని కైన వ, సిష్ఠప్రతిమానుఁడైన శిష్టున కైనన్
నిష్ఠాత్మ గలిగెనేనియు, నిష్ఠాకాలంబుముక్తినియమం బచటన్. ఆ. ౬.

సంస్కృతమున 32-వ అధ్యాయములో ముగింపువాక్యమైన "యజ్ఞావసాన సమయే భీమేశం వీక్షితుం యయుః" అనుదానిని "యజ్ఞావసానసమయంబున శ్రీమన్మహాదేవుని సందర్శింపంజనిరి" అని తెనిఁగించి కథముగించి తరువాత సంస్కృతములో నున్నట్లే తాను గూడ ఫలశ్రుతి చెప్పి గ్రంథము సమాప్తికావించినాఁడు. దీని పిమ్మట నతఁడు రచించినది *కాశీఖండము.

మూలానుసారముగా నితఁడు తెలుఁగు చేయఁబూనిన కొన్ని మూలశ్లోకాలను వాని అనువాదపద్యాలను చూపుచున్నాను.

1. శ్లో. అరుంధతీం ధ్రువం చైవ విష్ణోస్త్రీణి పదాని చ
ఆసన్నమృత్యుర్నో పశ్యేచ్చతుర్థం మాతృమండలం.

ఉ. కానఁడరుంధతిన్ ధ్రువునిఁ గానఁడు విష్ణుపదత్రయంబునుం
గానఁడు మాతృమండలము కానఁడు కన్నులు కల్గియేని యే
మానవుఁ డమ్మనుష్యునకు మాసములాఱు విరామమొందఁగాఁ
గానఁగవచ్చుఁ గుంభభవ! కాలునిబంధురసౌధవీథికల్. ఆ. ౫.

2. శ్లో. మృదు విజ్ఞాపనం చక్రుః పాకశాలాధికారిణః
నజానామో వయం నాథ త్వత్ర ప్రతాపభయార్దితః
కుస్వత్వ్యాచకయాచిద్వా నష్టో వైశ్వానరః పురాత్
తథాపి సూర్యపాకేన సిద్ధా పఙ్క్తిర్హి కాచన.

గీ. అవధరింపుము నీ ప్రతాపాతిశయము
గరిమమున కోపటించియో కాక వహ్ని

* సంస్కృతంతో పరిచూడకుండా గుడ్డిగా చదివినప్పు డెట్లావున్నా మూలాపేక్షచేత ఇదికూడా నైషధంవలెనే ఉటంకులతో మార్పుడాలతో అక్షరవినోదపుదోషాలతోనిండి మూలంలోని అంశాలు నైషధభీమఖండాల్లోకంటె అధికంగా స్వరూపాన్ని కోల్పోయినవి.

కాశికాపట్టణమున నివేశమునకుఁ
బదిలమైయుండనోపక పాఱిపోయె.

ఉ. అంబుజబాంధవాన్వయనృపాగ్రణిబోనము నేఁడు సూర్యపా
కంబున నాయితంబయిన ఖజ్జము భోజనశాలలోనఁ బ
ళ్యంబిడినారు పంకజదళాక్షులు రెండవజాముగంట ప్రే
యంబడెనారగింప సమయంబని చెచ్చెర విన్నవించినన్.

3. శ్లో. కస్మై దేయా మయా కన్యా సురమ్యేయం సులక్షణా
అస్యా అనుగుణో లభ్యః క్వ మయా వర ఉత్తమః.
కులేన వయసా చాపి శీలేనాపి శ్రుతేన చ
రూపేణార్థేన సంయుక్తః కస్మై దత్వా సుఖం లభే.
ఇతి చింతయతస్తస్య జ్వరోఽభూదతిదారుణః.
యశ్చింతాఖ్యో జ్వరో పుంసామౌషధైర్నోపశామ్యతి
తస్మాలర్క విపాకేన చింతాఖ్యేన జ్వరేణ చ
స విప్రః పంచతాం ప్రాప్తస్త్యక్త్వా సర్వం గృహాదికం.

గీ. తగినవరుఁ డెవ్వఁడొక్కొ యీతలిరుఁబోడి
కనుగుణుం డెవ్వఁడొకో విశుద్ధాభిజాత్య
పరమసౌభాగ్యభాగ్యసంపదలకనుచు
నిత్యమును దండ్రి యాత్మఁ జింతించుచుండె.

గీ. మూలనక్షత్రమునయందు మొదలికాలఁ
గన్యగండానఁ బుట్టిన కారణమునఁ
గర్మతుఁడు విప్రుఁడానందకాననమునఁ
జచ్చెఁ జింతాజ్వరముపైని జ్వరముతాఁకి.

100-వ అధ్యాయములో 87-వ శ్లోకమువఱకుఁ దెనిఁగించి తక్కిన 59 శ్లోకముల నొక్క పద్యములో నిమిడ్చినాఁడు. కాశీఖండము తరువాత నితఁడు రచించినది హారవిలాసము. కాశీఖండమందలి "చిన్నారిపొన్నారి" యనుపద్యమున హారవిలాసముదాహరింపఁబడక పోవుటచేతను నీకృతిపతియై శ్రీనాథునికి బాలసఖుఁడైన తిప్పఁడు "మంటి బహువత్సరంబులు" అని చెప్పియుండుటవలనను నిది కాశీఖండము రచించిన తరువాతనే వృద్ధత్వమున రచించెనని భావింపవలసియున్నది. శైలికూడ నీవిషయమునే

బలపఱచుచున్నది. ఈగ్రంథములోని చిఱుతొండనంబి చరిత్రము పాల్కురికి సోమనారాధ్యుని బసవపురాణమునుండి గైకొనఁబడినది. శ్రీనాథుఁడు పేర్లు మార్చినాఁడు. బసవపురాణమునుబట్టి కొడుకును జంపి మాయజోగి కాహారము పెట్టినవాఁడు సిరియాలుఁడు. సిరియాలునికే మఱియొక పేరు చిఱుతొండనంబి. కొడుకుపేరు లేదు. సిరియాలుని భార్య తిరువెంగాణి. కర్ణాటభాషలో భీమకవిరచించిన బసవపురాణములోని పేర్లకు సోమనారాధ్యుని బసవపురాణములోని వానికి వ్యత్యాసము కలదు. హరవిలాసమునుబట్టి చిఱుతొండనంబి కుమారుఁడు సిరియాలుఁడు. సిరియాలుని తల్లి తిరువెంగనాచి. బసవపురాణములో నున్న చిఱుతొండనంబి చరిత్రము పూర్తిగ శ్రీనాథుఁడు హరవిలాసమునఁ జెప్పలేదు. కైలాసమున కేగినతరువాత సిరియాలుఁడు తనంతటిభక్తుఁడు లేఁడని విఱ్ఱవీగఁగా శివుఁడతనిని భూలోకమునకు మరలఁ దీసికొనివచ్చి నిమ్మవ్వహాలాయుధుల వృత్తాంతములు చూపి గర్వభంగము కావించి తిరిగి కైలాసమునకుఁ గొంపోయిన కథ విడిచిపెట్టినాఁడు. ద్వితీయవిలాసంబైన గౌరీకల్యాణము చాలవఱకుఁ గాళిదాసుని కుమారసంభవమునకుఁ దెనుఁగు. హరవిలాసము స్వకల్పితముగా రచింపఁబూని నడుమ నిట్లుచేయుట కాళిదాసుని కవితయందుఁగల గౌరవము వలననని తోఁచెడిని. తారకాసురుని వధవనుకఁ గుమారసంభవము 17 సర్గములుగా నున్నది. శ్రీనాథుఁడు కుమారసంభవములోని ఉపోత్తమ శ్లోకమైన

> శ్లో. అథ విబుధగణాంస్తానిందుమౌళిర్విసృజ్య
> క్షితిధరపతికన్యా మాదదానః కరేణ
> కనకకలశయుక్తం భక్తిశోభాసనాథం
> క్షితివిరచితశయ్యం కౌతుకాగారమాగాత్.

అనుదానిని—

> గీ. "కనకకలశాది భక్త్యలంకారయుతము
> నైనకౌతుకరత్నగేహంబు సొచ్చి
> పార్వతియుఁ దాను నీహారభానుమౌళి
> పవ్వళించెను ముదమునఁ బాన్పుమీద."

అని తెనిఁగించి మిగిలిన 10 సర్గములలో వర్ణింపఁబడిన కుమారజనన మాదిగఁ దారకాసురవధవఱకుఁగల కథనంత యెనిమిది గద్యపద్యములలోఁ జెప్పినాఁడు. 8-వ సర్గములో సంభోగవర్ణనము మిక్కిలి విస్తారముగనున్నది. శృంగారవర్ణనమన్న ముందంజవేయు శ్రీనాథుఁడు సంభోగవర్ణనము తెనిఁగింపక కొద్ది వాక్యములలో ముగించుట

చూడఁగ హరవిలాసమును రచించునాఁటికేండ్లు గడచినవాఁడై మనోవృత్తియందు గొప్పమార్పుచెందినట్లు కానంబడుచున్నది. ఏండ్లు గడచినను స్వాభావికచాపలము బొత్తిగఁ బోదనియెడు పక్షమున నేడవసర్గము తరువాతఁగల గ్రంథ మతనికి లభింపక పోయియుండును. 8-వ సర్గములోని సంభోగవర్ణనము చాలవఱకశ్లీలముగను నసుచి ముగ నుండుటచే నేడుసర్గములే కాళిదాసుఁడు రచించెననియు మిగిలిన 10 సర్గము లతని పిమ్మట నెవ్వరో రచించి కాళిదాసుపేరు పెట్టిరనియుఁ గొంతమంది పండితు యభిప్రాయము. కాని పూర్వమునుండి 8-వ సర్గముకూడఁ గాళిదాసునిదేయని భావింప బడినట్లు దృష్టాంతములు గలవు. విశ్వనాథకవి సాహిత్యదర్పణమను నలంకార గ్రంథము నందు నాయికాప్రణయమానమునకు "నాయికాయాయథా కుమారసంభవే సంధ్యా వర్ణనావసరే" యని నుడివినాఁడు. ఈసంధ్యావర్ణన మెనిమిదవ సర్గములోనున్నది. మఱియు దోషభేద సందర్భమునఁ బ్రకృతివిపర్యయమునుగూర్చి వ్రాయునప్పుడు "ప్రకృతయో దివ్యా అదివ్యాదివ్యాది వ్యశ్చేతి, తేషాం ధీరోదాత్తాదితా, తేషాం పున్త్తమాధమమధ్యత్వం, తేషుచ యోయథా భూతస్తస్యాయథావర్ణనే ప్రకృతివి ర్యయోదోషః, ధీరోదాత్తస్య ధీరోద్ధతవత్ ఛద్మనావాలివధః, యథా వాకుమా సంభవే ఉత్తమదేవతయోః పార్వతీపరమేశ్వరయోః సంభోగశృంగారవర్ణనం" అని చెప్పినాఁడు. ఈ సంభోగశృంగారవర్ణనము 8-వ సర్గములోనిదే. ధనంజయుఁడు దశ రూపకమునందు వ్యభిచారిభావముల లక్షణలక్ష్యములు చెప్పుచో జడతకు లక్ష్యము

శ్లో. "ఏవమాలినిగృహీతసాధ్వసం శంకరో రహసి సేవ్యతామితి
సా సఖీభిరుపదిష్ట మాకులా నాస్మరత్ప్రముఖవర్తిని ప్రియే."

అను శ్లోకము నుదాహరించినాఁడు. ఇది కుమారసంభవాష్టమ సర్గములోని 1-వ శ్లోకమైయున్నది. ఈ నిదర్శనములవలనఁ గొందఱనునట్లు 7-వ సర్గము తరువాతఁ గల గ్రంథము మఱియెవ్వరో కాక కాళిదాసుఁడే రచించెనని పూర్వమునుండి భావింపఁబడు చుండుట విశదమగుచున్నది. ఇతఁడు మూలమునకు సరిగా ఆంధ్రీకరింపబూనిన కొన్ని కుమారసంభవశ్లోకములను వాని అనువాదపద్యముల నుదాహరించుచున్నాను.

1. శ్లో. తయా దుహిత్రా సుతరాం సవిత్రీ
స్ఫురత్ప్రభామండలయా చకాశే
విదూరభూమి ర్నవమేఘశబ్దా
దుద్భిన్నయా రత్నశలాకయేవ. స. ౧.

గీ. జననివిద్యుల్లతాభమా చాయగలిగి
క్రొత్తయుదయించినట్టి యాహూఁతువలనఁ
గారుకాలంబు మణిశలాకయునుబోలె
నొప్పెడు విదూరభూమిని యుద్దియయ్యె. ఆ. 3.

శ్లో. పురేతావంతమేవాస్య తనోతి రవిరాతపం
దీర్ఘికాకములోన్మేషః యావన్మాత్రేణ సాధ్యతే. స. ౨.

గీ. దానవునిపీటిలోన మార్తాండుఁడెండ
యంతమాత్రంబకాని కాయంగవెఱచు
నెంతమాత్రముకాసిన నెలమిఁబొందుఁ
గేళిదీర్ఘికలందుఁ బంకేరుహములు. ఆ. 3.

శ్లో. కామేకపత్నీ వ్రతదుఃఖశీలాం
లోలం మనశ్చారుతయా ప్రవిష్టాం
నితంబినీమిచ్ఛసి ముక్తలజ్జాం
కంఠేస్వయంగ్రాహనిషక్తబాహుం. స. 3.

గీ. ఏకభర్తృవ్రతస్థయై యేలతాంగి
నీకుఁజేయాడు ధర్మంబునిలువరించె
నదివినిర్ముక్తలజ్జయై యమరరాజుఁ
జేయుఁగాత స్వయంగ్రహాశ్లేషణంబు. ఆ. 3.

శ్లో. హృదయేవససీతి మత్ప్రియం యదవోచస్తదవైమి కైతవం
ఉపచారపదం న చేదిదం త్వమనంగః కథమక్షతారతిః. స. ౮.

గీ. హృదయమునుండి యెప్పుడు హృదయనాథ
ప్రియముచెప్పెదవనుటెట్ల భేషజంబు
హృదయముననుంట నిజమేని మదనయెట్లు
భస్మమైతివి నేనెట్లు బ్రతుకఁగంటి. ఆ. 3.

శ్లో. అపి క్రియార్థం సులభం సమిత్కుశం జలాన్యపి స్నానవిధిక్షమాణి తే
అపి స్వశక్త్యా తపసి ప్రవర్తసే శరీరమాద్యం ఖలు ధర్మసాధనం.

సీ. సలిలంబు త్రిషవణస్నానక్షమంబాయె యంభోజపత్ర దీర్ఘాయతాక్షి
కుసుమంబులును నిధ్మకుశపల్లవంబులు సులభంబులై యున్నె సుందరాంగి
సత్వంబులన్యోన్య జాతివైరముదక్కి శాంతిగైకొనియున్నె చంద్రవదన
యనుదినంబును దేహయాత్ర కాయితమాయె నీవారపాకాది పూపుఁబోడి

గీ. శక్తికొలఁది తపశ్చర్య సంఘటింతె, ఫలముపై నాసనాగ్రహబంధముడిగి
తామ్రబింబోష్ఠి ధర్మసాధనములందు, నాద్యమగు సాధనంబు దేహంబ కాదె.

6. శ్లో. తామగౌరవభేదేన మునీంశ్చాపశ్యదీశ్వరః
స్త్రీపుమానిత్యనాస్థైషా వృత్తం హిమహితం సతాం. స. ౬.

గీ. అంధకారి యరుంధతినాదరించె, గౌరవంబున భేదంబు కలుగకుండఁ
బెద్దవారికి స్త్రీపుంవిభేదమేల, మాననీయంబు పుణ్యకర్మంబుగాక. ఆ. ౪.

దారుకావనివిహారము, హాలాహలభక్షణము, కిరాతార్జునీయమునను, మిగిలిన భాగములు పురాణకథల ననుసరించి స్వయముగ రచించినాఁడు. భారవికృత కిరాతార్జునీయములోని యీ ఆవసర్గ మునందలి

శ్లో. మనసాజపైః ప్రణతిభిస్సముపేయివా నధిపతింసదివః
సహజేతరాజయశమాదధతీబిభరాంబభూవ యుగపన్మహసీ

ఆను శ్లోకములోని యుత్తరార్థమును, హరవిలాసకిరాతార్జునీయకథయందలి

గీ. "వీరరసగర్భితంబయ్యు విస్తరిల్లె, శాంతరసమెంతయును సవ్యసాచియందు"

౹ను వాక్యములలోని భావము నొకటిగనున్నవి కాని యీ భావము శ్రీనాథుఁడు రవినుండి గైకొనెనని చెప్పఁబసిలేదు. హ్యాంలెట్ (Hamlet) అను నాటకమునఁ మరునికిఁ బొలోనియసు (Polonius) చెప్పినట్లుగా షేక్స్పియరు (Shakespeare) వచించిన

" .... .... .... Beware
of entrance to a quarrel, but being in,
Bear it that the oppossed may beware of thee."

అను వాక్యములలోని భావమును గాశీఖండమందలి

క. "ఎవ్వనితోసెచ్చొచ్చుటం, జివ్వకుఁ జేఁజాపవలదు చేఁజాచినచో
నివ్వలనవ్వలసెవ్వరు, నవ్వకయుండంగఁబగసనందీర్పఁదగున్."

అను వాక్యములలోని భావము నొకటిగానున్నది. షేక్స్పియరు కాశీఖండములో జూచిగాని, కాశీఖండకర్త షేక్స్పియరు గ్రంథములోఁ జూచిగాని వ్రాసెననిచెప్పుటకు వీలులేదుగదా. ఒకటేయూహ అనేకులకుఁ దట్టుచుండుట సహజము.

హరవిలాసము తరువాత నితఁడు రచించినది పల్నాటివీరచరిత్రము. వీరచరిత్రము యొక్క పౌర్వాపర్యము తెలిసికొనుట కా గ్రంథమున నాధారములు కన్పట్టుచున్నవి. బాలచంద్రుని యుద్ధఘట్టమున

ద్వి. "ఎనఁగెడు శివకంచి యేకామ్రపతికిఁ
జిఱుతొండభక్తుఁడు చెలఁగుమాతండ్రి
సెంకెలసిరువను చెలువమాతల్లి
సిరియాళుఁడనఁబుట్టి చెన్నొందినాఁడ"

అని తన హరవిలాసములోని చిఱుతొండనంబి కథను సూచించి యున్నాఁడు. కనుకఁ బల్నాటి వీరచరిత్రమే యితఁడు రచించిన గ్రంథములలో నెల్లఁ జివరగ్రంథమని చెప్పవలయును. శైలినిఁబట్టికూడ నిట్లే తలంపవలసియున్నది. వీరచరిత్రము తరువాత నేమియు రచించినట్టు కన్పట్టదు. ఇతఁడు వీరచరిత్ర రచనకుఁ గడంగుటనుగూర్చి యనేక కథలు గలవు. నారికుఱుపుచే బాధపడుచు శోకభరమున నీ సుద్దులు చెప్పెనని కొందఱందురు. ఈ క్రిందికథకూడ వాడుకలోఁ గలదు. ఇతఁడు యౌవనప్రాయమందు స్వేచ్ఛగఁ దిరుగుటచే శరీరముచెడిపోయియుండెనఁట. పల్నాటికిఁ బోయి గ్రామంబుల సంచారముచేయుచుఁ జంద్రవంక నదీతీరమందున్న మాచెర్లకు జని యానదియందు స్నానముచేసి చెన్నకేశవుని సందర్శింపఁగ రోగము కొంత యుపశమించెనఁట. ఆ దినమే రాత్రి చెన్నకేశవుఁడు స్వప్నమున సాక్షాత్కరించి యతనితో మత్సేవారతులు నఖండపరాక్రములునైన పల్నాటివీరుల చరిత్రము రచించి మా కంకిత మొనర్పుమని చెప్పి యంతర్హితుం డయ్యెనఁట. శ్రీనాథుఁడును మేల్కాంచి స్వప్న వృత్తాంతమునకు సంతసించి పల్నాటివారి హృదయసీమలయం దచిరకాలవిజృంభముతో నాటియుండిన ఇతిహాసాంశములఁ జక్కఁగ గ్రహించి గ్రంథరచనకుఁ దొడఁగి తాను రోగపీడితుఁడు వయసుమీఱినవాఁడు నగుటచే వ్రాయుటకు శక్తి లేక యేడుగురు శిష్యులలేఖకులుగా నియోగించి చెన్నకేశవుని యాలయములోఁ గూర్చుండి చెప్పుచు దాదాపు భారతమంత పెద్దదిగానున్న యీ గ్రంథమును రెండు మాసములలోఁ బూర్తిగావించెనఁట. గ్రంథము సమాప్తియగువఱకు రోగముకూడఁ బూర్ణముగఁ గుదిరెనఁట. గ్రంథము పూర్తియైన తరువాత నేకారణముననో మనస్సు

చలించి తొంటియట్ల విషయప్రవృత్తుండుకాఁగాఁ జెన్నకేశవుఁడు కోపించి ప్రతిదినము పగలే శ్రీనాథునికిఁ బ్రత్యక్షమగువాఁ డారోజతనికి దర్శనమీాక స్వప్నమునం దగుపడి నీవు పతితుఁడవైతివిగాన నీ గ్రంథము నేను బరిగ్రహింపఁజాల నది మాలమాదిగలపాలౌ గాక యని వాక్రుచ్చి యదృశ్యుండయ్యెనఁట. మఱునాఁడు శ్రీనాథుఁడు మేల్కాంచి యశుభస్వప్నంబునకు వగచి యెంతయోకష్టముతో రచించిన యమ్మహాగ్రంథము భగవంతుఁడు చేకొననిచో దాన ఫలమేమియని దుఃఖావేశంబునఁ జేతనున్న తాళపత్ర సంపుటము చింపి చిందఱవందఱగాఁ బాఱవేసెనఁట. మాలలు మాదిగలు మొదలైనవా రెవరికి దొరకిన పత్రములు వా రేఱికొనిరఁట. ఈకథయొక్క సత్యమెట్లున్నను గ్రంథ మొకచోటను సంపూర్ణముగ లేక శకలములుగా నొకరివద్దఁ గొంత మఱియొకరివద్దఁ గొంతగఁ జాలమట్టుకుఁ బిచ్చుకుంటులు మాలలు మొదలగు నిమ్నకులుల యధీనము లోనే యున్నమాట వాస్తవము. అట్టివారిచేతులలో నున్నందువలన నస్పృశ్యమనియు, నశ్రావ్యమనియు, నగ్రాహ్యమనియుఁ దలఁచి, జ్ఞానశూన్యులై విద్యాగంధము లేక పోయినప్పటికి నగ్రజన్ములమని గర్వముమాత్రము వదలని పండితంమన్యులు చూపిన యనాదరణమే గ్రంథ మిన్నిదినముల దనుక దుఃస్థితిలో నుండుటకుఁ గారణమై యుండును. జనసామాన్యమునకు వీరులయందుఁగల భక్తితాత్పర్యములచేనేమి, గ్రంథము యొక్క ఉత్కృష్టతవలననేమి యాదరణానాదరణములకు లోనుగాక నేఁటివఱకు జీవముతోడ నున్నది. శ్రీనాథుఁడు రచింపకముం దీకథ గద్యరూపముననో గేయరూపము ననో యుండియుండును. ఇతఁడు దీనిని ద్విపదిలో రచించెను. శ్రీనాథునికిఁ బూర్వము రంగనాథాదులు ద్విపదీకృతుల రచించిరి.

సీ. ''కందభేదములాఱుగాక యుత్సాహంబు తరువోజ మధ్యమాక్కరలునైదు
దీపించుమంజరీ ద్విపదత్రిపద చతుష్పద పంచపాద షట్పదవిధములు
తొమ్మిదివిధములతో నొప్పు రగడలు కళికలు నుత్కళికలునుగూడ
జాతులు నవవిధగీతంబులును సీసస ప్తకంబును నుపజాతులయ్యె

ననుచు నన్నయభట్టు భీమనయుఁ బెద్ద
సచివుఁడును మూర్తితాత నొజ్జయుననంత
మంత్రియును దిమ్మరాజు నిమ్మాడిఁ జెప్పి
రందముగ వారుచేసిన ఛందములను.''

అని యప్పకవిచెప్పినదానినిఁబట్టి నన్నయభట్టునకుఁ బూర్వమునుండి ద్విపది యున్నట్లే కాన్పించుచున్నది. తరువోజ, అక్కరమొదలగు తక్కినజాతులనువలె ద్విపదీ

కృతులలో మిశ్రముగా నచ్చటచ్చటఁ జెప్పుటలేదు. నన్నయభట్టారకుఁడు భారతము నందుఁ దరువోజ, మధ్యాక్కర, అక్కర, మధురాక్కర, ఉత్సాహము, కందము నుపయోగించెనుగాని ద్విపదను జెప్పలేదు. సోమయాజులు నెఱ్ఱాప్రెగ్గడ యీఫక్కికనే యవలంబించిరి. అల్లసాని పెద్దన మనుచరిత్రమునందు రగడను జెప్పినాఁడుగాని ద్విపది నుపయోగింపలేదు. యక్షగానములలోమాత్రము ద్విపది నచ్చటచ్చట వాడుదురు. వీనినిఁ బట్టిచూడ వివిధపద్య మిశ్రములైన కావ్యములలో ద్విపదిని జేర్పక ద్విపదీకావ్యములఁ వేరుగా రచించుచువచ్చినట్లు నిశ్చయమగుచున్నది. మనలోనున్న కావ్యములన్నియు చాలామట్టుకు చంపువులేకాని పద్యకృతులు (నిర్గద్యములు) మిక్కిలి తక్కువగా నున్నది. సంస్కృతమునందుఁ బద్యకావ్యములే మెండు. చంపువులు తక్కువ. సంస్కృత పద్యకృతులకుఁ దెలుఁగు పద్యకృతులకు భేదముకలదు. సంస్కృతకవులొక్కొక సర్గమును సామాన్యముగా నేకవిధశ్లోకముతో రచించుచు వచ్చిరి. సర్గాంతమందు మాత్రము వృత్తముల మార్చిరి. కాళిదాసుఁడు మేఘసందేశమంతయు నేకవిధశ్లోకముతో రచించెను. ఆంగ్లేయ కవులుకూడఁ జాలవఱకీ నియమమునే పాటించిరి. తెలుఁగువారట్లుగాక యొక యాశ్వాసముననే బహువిధవృత్తములు, జాతులు నుపజాతులు వ్రాయు దురభ్యాసము కలిగియున్నారు. సర్గమంతయుఁ బలువిధవృత్తములతో రచించినవారు సంస్కృతకవులలోఁగూడఁ గలరు గాని యీ విషయమునఁ దెలుఁగు వారివలె వెర్రి లోనికి దిగలేదు. విశ్వనాథు డేకవృత్తమయపద్యములతోనే సర్గరచన అని ఉన్నాడు. ఆశ్వాసాంతమునందు గాక తక్కినచోట ఇట్టి వృత్తసాంకర్య మనుచితము. పద్యకావ్యములయందు బహువిధపద్యముల గలుపుట దోషమనుభావ మరిస్టాటిల్ (Aristotle) అను గ్రీకువిద్వాంసుఁడుకూడ నీ క్రిందివాక్యములలోఁ గనఁబఱచి యున్నాఁడు. "Still more absurd would it be to mix different metres as was done by Charemon" తెలుఁగునఁ బద్యకృతులు (నిర్గద్యములు) లేని లోపమును నివారింపఁ బూనియే కాబోలు తిక్కనసోమయాజి ఉత్తరరామాయణమును బద్యమయముగ రచించెను. కాని బహువిధపద్యములతో రచించు దురభ్యాసముమాత్రము మానలేదు. అచలజిహ్వోక్తి, నిరోష్ఠ్య, శుద్ధాంధ్రప్రముఖ నిరర్థక నియమములలో నిర్గద్య మొకనియమముగాఁ బాటించి పెద్దపెద్ద బిరుదనామములు పెట్టి డంబమునకు రచించుచు వచ్చిరి గాని సాధారణముగఁ బద్యగ్రంథములన్నియు నట్లురచించినవారు కారు. గ్రంథమంతయు నొకటేవిధమైన పద్యములుండుటవలనఁ జదువువారికి విసుగుగాదాయనికొంద అందురుగాని యయ్యది విచారితంబు. సంస్కృతమున మేఘసందేశాది కావ్యములఁ జదివి యానం

దించు రసజ్ఞులు విసుగునొందుదురా? సుప్రసిద్ధులగు నాంగ్లేయకవులకావ్యములఁ బఠించి పరవశులగు పండితులు విసుగునొందుదురా? మన యంధ్రభాషయందుఁ గలకృతులఁ బరిశోధింపఁగాఁ బై నుదాహరింపఁబడిన దోషములులేనివి ద్విపదలు శతకములు గన్పట్టుచున్నవి. తెలుఁగులో శార్దూలాది పద్యములకంటె చిన్నపాదములు గల ద్విపద్యాదులె యెక్కువ మనోజ్ఞముగా నుండును. మాదిరికొక యుదాహరణము చూపెదను. వాల్మీకిరామాయణ బాలకాండమునందలి 34-వ సర్గములోని

శ్లో. "గతోర్ధరాత్రిః కాకుత్స్థ కథాః కథయ తో మమ
నిద్రామ భ్యేహి భద్రంతే మాభూద్విఘ్నోఽధ్వనీహనః,
నిష్పన్దా స్తరవ స్సర్వే నిలీనా మృగపక్షిణః
నైశేన తమసా వ్యాప్తా దిశశ్చ రఘునందన.
శనైర్వియుజ్యతే సంధ్యా నభో నేత్రైరివావృతం
నక్షత్ర తారాగహనం జ్యోతిర్భిరవభాస్యతే,
ఉత్తిష్ఠతిచ శీతాంశుశ్శశీ లోకతమోనుదః
హ్లాదయన్ ప్రాణినాం లోకే మనాంసి ప్రభయా విభో.
నైశాని సర్వభూతాని ప్రచరన్తి తత స్తతః
యక్షరాక్షససంఘాశ్చ రౌద్రాశ్చపి తాశనాః,
ఏవముక్త్వా మహాతేజా విరరామ మహామునిః
సాధుసాధ్వితి తం సర్వే మునయో హ్యభ్యపూజయన్.

అను శ్లోకములు భాస్కరరామాయణమున

క. "రక్షోయక్షవిహారస, మక్షంబునిలీనమృగచయంబు నిమీల
త్పక్షికులాక్షమునిశ్చల, వృక్షమ్మునిశాటభూత విహృతిస్థలమున్.

వ. అగుచు నివ్వనమున్నది మఱియు.

చ. గగనము తారకాగ్రహవికాసవిభాసితమై వెలింగెడున్
మొగిసినచీకటింజెఱచి ముంగలిదిక్కులు తెల్లసేయుచున్
జగములకుత్సవంబొదవఁ జంద్రికగాయుచు భాసమానుఁడై
నెగడెడునింగిఁ జందురుఁడు నిద్దురపోయెడినెల్ల జీవులున్.

క. వినుమర్ధరాత్రమయ్యెన్, జనవర నిద్రింపుమీవు సౌమిత్రియునిం
కనిపలికియూరకుండెన్, మునివరుఁడపుడఖిలమునులు మోదముతోడన్."

అనియు రంగనాథరామాయణమున

ద్వి. "నడురాత్రి యేతెంచె నరలోకనాథ
కడుడస్సినాఁడవు కనుమోడ్తుగాక
చలియింపకున్నవి సకల వృక్షములు
మెలఁగవు వనభూమి మృగసమూహములు
నెఱివిహంగంబులు నీడముల్ చేఱి
మఱచియున్నవి తమ మంజులధ్వనులు
యామినీచరులైన యక్షరాక్షసులు
భూమి విచ్చలవిడిఁ బొరిచరించెదరు
దీటుగఁ జీఁకటి దెసలునాకసము
కాటుకపూసిన కరణి నున్నదియు
నీలాంబరంబున నిండుముత్తెములు
గీలించి బ్రహ్మాండగేహగోళమునఁ
గడుఁగొప్పగామేలు కట్లెత్తినట్టు
లుడుగణంబులతోడ నున్నది నింగి
యడరంగ జనులకు నానందమొదవ
నుడురాజు పొడతెంచుచున్నాఁడఁటన్న
నామాటలకు మెచ్చి యఖిలసంయములు."

అనియు నాంధ్రీకరింపఁబడినవి. భాస్కరరామాయణములోని కందగద్యవృత్తములలో కంటె రంగనాథరామాయణమునందలి ద్విపదీపఙ్క్తులలో భావ మెక్కువహృదయంగమ మగను నానందజనకముగను బ్రకటింపఁబడినదని యొప్పుకొనక తప్పదు. ద్విపదీచరణం బులు నాతిదీర్ఘంబులై నాతిహ్రస్వంబులై యుండును గావునఁ గరచరణాది సమస్తావయ వంబులు నిరవధికముగ నొక్కతటి దృగ్గోచరంబగు పరిమిత పరిమాణచిత్రపటంబుభంగి నిరంతరాయముగ సమగ్రముగ గ్రాహ్యంబులై తదనుగుణమైన అవిచ్ఛిన్నానందమును గలి గించుచుండును. శ్రీనాథుఁ డుపయోగించినది మంజరీ ద్విపది. మంజరీద్విపదినిగూర్చి కవిజనాశ్రయములో

ద్వి. "ద్విపదగణంబులె తెచ్చియన్నిటికిఁ
బ్రాసంబులిడకయె పలుకఁజాలినను
మూఁడవగణమున మొగి విశ్రమముగ
మంజరియందురు మధురవాక్ఫణితి"

అని చెప్పఁబడినది. కవిజనాశ్రయములోనే కాక నన్నయభట్టు ఛందములోఁ గూడ మంజరీ ద్విపది యుదాహరింపఁబడినట్లే యప్పకవీయమువలనఁ దెలియుచున్నది. కాని శ్రీనాథునికిఁ బూర్వము మంజరీ కావ్యము రచించినవా రెవరును లేరు. ఇతఁడువ్రాసిన గ్రంథములలో నిది చివరదియుఁ బరిణామావస్థలో వ్రాయఁబడినదియుఁ గనుక వ్రాయునాఁటికి లోకానుభవ మధికముగా గలిగినట్లు గనబడుచున్నది.

శ్రీనాథుఁడు ఈగ్రంథమున ఉపమానముల స్వాభావికముగఁ జెప్పినాఁడు. మాదిరికై రెండుమూఁ డుదాహరించెదను. చేతికిఁజిక్కిన శత్రువును విడిచి యతనితోఁ గలహించుటకు

"చెట్టెక్కి ఫలమును జేనంటిచూచి
వేగమె దిగి రాత వేసినట్లగును"

అనియుఁ జిన్నవాఁడయ్యుఁ బరాక్రమవంతుఁ డనుటకు

"పిడ్గుచిన్నదికాదె భేదించుఁగొండఁ
జిన్న మిర్యమునందుఁ జెడునె కారంబు
ఘునకపాలము కెక్కి కాకనొందించు
మానక నోశెల్ల మందును లెస్స."

అనియుఁ గొండలు ప్రతిధ్వను లీనెననుటకు

"ధరణీధరంబులు తల్లడంబంది
గుహలను నోళ్ళతోఁ గూయంగసాగె"

అని చెప్పెను. గ్రంథవిస్తరభీతిచేఁ గొన్నింటిమాత్రమె యుదాహరించితి. మల్లదేవరాజంపిన బట్రాజు నలగామరాజుతోడను, నాయకురాలు నలగామరాజుతోడను జెప్పిన ధర్మములు యుక్తియుక్తములుగనుండి శ్రీనాథుని రాజనీతికౌశలముం బ్రకాశింపఁజేయుచున్నవి. నలగామరాజు సభలో వేశ్యానాట్యసందర్భమునఁ జెప్పిన సంగీతరహస్యము లాతఁ డాదియందు

ద్వి. "సంగీతసాహిత్య చాతుర్యకవిత
చెప్ప నేర్చినవాఁడఁ జెలఁగి మాచెర్ల
చెన్న కేశవ పాద సేవారతుండ"

అని చెప్పుకొన్న విషయమును ధ్రువపఱచుచున్నవి. బాలచంద్రుఁడు వేశ్యనుగర్హించి

ద్వి. "కుటిలాత్ములారనీ గుణములు తెలిసె
మటుమాయచేఁజిక్కి మానముధనము
నీపాలుచేసితి నేఁగానసైతిఁ
గామాంధకారంబు కష్టపువిద్య
నీతిమాలినచర్య నేఁటికిఁదెలిసె
నింటిలోభోజనం బిచ్చకురాక
పరులయెంగిలి కాసపడితినినేను"

అని పల్కిన వాక్యములును ననపోతువేశ్యల విషయమై బాలచంద్రునితో

ద్వి. "వారకాంతలరీతి వర్ణింపరాదు
బిడ్డలకోసఁగక ప్రియురాలికీక
చీమలుగూర్చిన చెలువునఁగూర్చి
ధనవంతులగువారి ధనమెల్లదోఁచి
ముంజికాండ్రనుజేసి మురిపెమడంప
వ్యర్థులై విటవృత్తి వసుమతిమీఁదఁ
బోయిరి బ్రదికెడు పొందికలేక"

అని చెప్పినవాక్యములును నీతిబోధకములైనవి. 41-వ పుటలో బాలచంద్రుఁడైతాంబకుఁజేసిన వైరాగ్యోపదేశము, బాలచంద్రుఁడు యుద్ధమునకుఁ బోవుసంకల్పము సూచించినప్పుడు తల్లియైన యైతాంబ వలదని బ్రతిమాలి ఆమె పొందినశోకము, బాలచంద్రుఁడు నిజసంకల్పంబు వదలక తల్లి నూరార్చి సకారణంబుగఁ బలికిన వీరధర్మ వాక్యంబులు, ఉచితముగ నున్నవి. బాలచంద్రుఁడు వీరులతో బాలత్వమునుగూర్చి చెప్పినవిషయములు స్మరింపఁదగినవి. ఆవాక్యముల నుదాహరించుచున్నాను.

ద్వి. "పేరబాలుఁడుగాని బిరుదుమగండఁ
బగవారిఁగొట్టని బ్రతుకదియేల
తలిదండ్రులనుబ్రోవఁ దనయుఁడె కర్త
మానాభిమానముల్ మగఁటిమి మించఁ
బ్రబలింపఁగలవారు బాలురెసుమ్ము
బాలురెపెద్దలు బల్లిదుల్ వారె
బాలురకేవృద్ధి పరికించిచూడఁ
బెద్దలు మతిచెడి పిఱికిపోఁబుదురు

పాంచభౌతిక దేహ పటిమ క్షీణించు
ధైర్యంబుతగ్గు నుత్సాహంబు లుడుగు
వయసుమీఱినవేళ వచ్చునా బలిమి
కీర్తికైనను నపకీర్తికైన
బాలురపైనుండు భారమంతయును."

బ్రాహ్మణక్షేత్ర సంజాతుఁడైన యనపోతును యుద్ధమునకు రానీక వెనుకకుఁ బంపి బాలచంద్రుఁ డేగినపిమ్మట నతఁడు పల్కిన వీరవాక్యంబులు

శ్లో. "అగ్రతశ్చతురో వేదాః పృష్ఠతస్సశరంధనుః,
ఇదం బ్రాహ్మమిదం క్షాత్రం శాపాదపిశరాదపి."

అని పరశురాముఁడు చెప్పిన వాక్యములను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి. అనపోతు బ్రాహ్మణుఁడు; ఆఱువేలనియోగి; గృహనామము "ఒడ్డి" పెద్దనపౌత్రుఁడు; మల్లపరాజు పుత్రుఁడు; తల్లి పేరమ్మ; చతుర్వేదాధ్యయనము చేసినవాఁడు; బాహుయుద్ధమునందు నిపుణుఁడు. అనపోతుతండ్రి మల్లదేవునివద్ద వ్రాయసకాఁడుగా నుండెను. శ్రీనాథునికిఁ బిమ్మట వీరచరిత్రమును వీరభద్రుఁడు పద్యమయముగను, మల్లయ్య, బలరామిసెట్టికొడుకు కొండయ్య యను నిరువురు ద్విపదిగాను రచించిరి. కొండయ్యయు మల్లయ్యయుఁ దమగ్రంథములలో శ్రీనాథు నుదాహరించియున్నారు. వీరు తమ గ్రంథములఁ జాలవఱకు శ్రీనాథు ననుసరించియే చెప్పిరి. వీరొక్కొకచోట లేనివి కొన్నికలిపి, యున్నవి కొన్ని తీసివేసిరి. బొంగరము పుట్టుకయని కొండయ్య యొక వింతకథ కల్పించినాఁడు; శ్యామాంగి (సబ్బాయి) తమ్ముఁ డంతర్వేదిగాని కథయెక్కువగఁ జెప్పినాఁడు; ద్విపదీకృతి వ్రాయువాఁడయ్యును బాలచంద్రుఁడు బొంగరము ాడు కథాసందర్భమునఁ గ్రొత్తగాఁ బద్యమొకటి చేర్చినాఁడు. దానినిఁ జూపు ంన్నాను:—

క. "నెఱిగలిగి నాఁటినాఁటికి, సరిగడవఁగ బిరుదుకచకుచద్వయమొరయక౯
చిఱుతొడల నడుమునెక్కన, విఱిగెనొయనఁ జెలులుదాను వెఱచుచునడచెన్."

ఈపద్యము నన్నెచోడుని కుమారసంభవమునందుఁ గనఁబడుచున్నది.

మఱియుఁ గథాంశములయందుఁగూడ నచ్చటచ్చట మార్పులు చేసినాఁడు. కొండయ్య, మల్లయ్య, శ్రీనాథునిగ్రంథ మేరీతి ననుసరించిరో తెలియుటకై ముప్పురగ్రంథములనుండి యొకటే సందర్భమునందలి కొన్ని పఙ్క్తుల నుదాహరించుచున్నాను.

## కోమటిస్త్రీకి బొంగరము తాఁకినకథ.

శ్రీనాథుఁడు:—

ద్వి. "పొక్కుచుఁ జేరెను బోలఁతులగుంపు
కప్పిరి వలువలు కర్ణంబులందుఁ
గర్పూరరజమును గలయంగ నూఱి
పదతలంబులయందుఁ బాణులయందు
గస్తూరిగంధంబుఁ గలిపిపట్టించి
సఖులెల్ల శైత్యోపచారముల్ సలిపి
చింతింపఁబోకుఁడి చెలి లేచునిపుడె
యని పల్కునంతలో నామూర్ఛ దెలిసి
ముకుళితహస్తుఁడై ముందఱ నున్న
బాలునిఁ గనుఁగొని బలుకోపమునను"

కొండయ్య:—

ద్వి. "ఏమనివగతుము ఏమి చేయుదుము
ఏమనిమామకు నెఱుఁగఁ దెల్పుదుము
నినుఁబాసి భువిమీద నిల్వనోపుదుమె
వనజాక్షి నీవెంట వత్తుమటంచు
నెఱి బ్రహ్మపుత్త్రుఁడు నీవిధియంచు
గరియాన లిరుగడఁ గదిసి చల్లఁగను
భామలందఱు కూడి పలు తెఱంగులను
గోమలి కుపచరణ కొంతగా సేయఁ
జెలికిఁ గప్పినమూర్ఛ తెలిసి శీఘ్రముగఁ
దలవంచి తనకాలు తప్పక చూచి
యిది యేరిబొంగరం బింతచక్కనిది
యిది యెవ్వరిదెయమ్మ యీవెలలేని
దప్పుడు చెలికత్తె లందఱు చూచి
యప్పరో వినవమ్మ యతఁడు బాలుండు

అవిచారితముగా శ్రీ వీరేశలింగంపంతులుగా రీపద్యములే శ్రీనాథునివైనట్లు తజ్జీవిత చరిత్రములో నుదాహరించినారు.

మల్లయ్య:—

ద్వి. "అంతలో జెలికిని నటుమూర్ఛ దెలిసి
ముకుళితహస్తుఁడై ముందఱనున్న

తెప్పిరిబాలుని తెరగెల్ల జూచి
నిప్పులుచెదరగ నెలఁతయిట్లనియె
కావరమేలన్న కట్టెఁడిదుష్ట."

## వృద్ధవేశ్యావర్ణనము.

శ్రీనాథుఁడు:—

ద్వి. "కోఁతివంటిది వృద్ధగురుతరకోపి
కోలపట్టుకవచ్చె గూతుదగ్గఱకు
విఱిగినరొండియుఁ వ్రేలుచన్దోయి
యుఱిసిపోయినయొళ్ళు నూచలుకాళ్లు
వంగిననడుమును వదలినపండ్లు
పీలచేతులుగూని పీనుగుమోము
చిక్కగనరిసిన చింపిరితలయు
వ్రాలిన బొమముడి వదలినమేను
మెడమీద గణతియు మీగాళ్ళబూత
పలుచనిగడ్డంబు పైని బుల్పిరియుఁ
మూతిమీసపుమొల్క ముక్కురోమములు
తలవడంకును మాట తబ్బిబ్బుమఱపు
చొల్లుగాఱెడునోర శుభ్రంపుకంపు
కన్నులఁబుసులును గాంతుమిక్కుటము."

ండయ్య:—

ద్వి. "కల్లలపుట్టిల్లు కడునోడకెల్ల
శిస్తువెడలినచింత చివికినగంత
పత్తిగింజలసంత పరదేశిబొంత
ఊదుపోవనిడొక్క ఉరిపడ్డనక్క
... ... ... ...
ఉచితంబెఱుంగని యూడలితొత్తు
... ... ... ...
తెరలు యీదనవెల్లి దేవాంగపిల్లి
మాయలకతకారి మందులమారి

కాయనిపడుచెట్టు కడుబాడుచెట్టు
దొందరతినగండి తొమ్మంద్రదొండి
అందతుకులబొడ్డి అమిదెపుమడ్డి
అఖిలకోతలవెల్లి యూసబ్బతల్లి."

మల్లయ్య:—

ద్వి. "వృద్ధవానరమైన వెసరాగముండ
దద్దరింపుచులేచి తగునూతకోల
విఱిగినరొండియు నూచలాకాళ్లు
ఉరిసిపోయినయొళ్ళు నూడినతలయు
తోలుశల్యములతో దూగాడునడుము
పీలచేతులు నడపీనుగురీతి."

కొండయ్య శబ్దసౌష్ఠవము పాటింపక యిచ్చవచ్చినట్లు చెప్పినాఁడు. మల్లయ్య రచనలోఁ జాలవఱకు శ్రీనాథుని వాక్యములే యున్నవి.

నాకుదొరికిన తాళపత్త్రగ్రంథములో కొన్నిచోట్లఁ బఙ్క్తులుపోయినవి. పోయిన చోట్లను, బోయిన ట్లగుపడినచోట్లను నా నీరసవాక్యములతోఁ బూర్తిచేసి కుండలిం చితిని. ఒకటి రెండుపదములు పూర్తిచేసినచోట్లఁ గుండలము లుంచలేదు. కథా భాగములకు శీర్షికలు నేను చేర్చినవేను. అచ్చుకూర్పువారి పొరపాటువలననైన నేమి నాపొరపాటువలననైన నేమి 25, 38, 43, 50, 60, 102 పుటలలో నేను బూరించిన కొన్నిపఙ్క్తులకుఁ గుండలములు విడిచిపెట్టఁబడినవి. అవసరమనితోఁచిన స్థలములలోఁ జదువరులకు సుబోధముగ నుండుటకై గచ్ఛద్వ్యాఖ్యను కూర్చినాఁడను. అన్యపండితుల సంస్కృతాంగ్లేయవాక్యముల నుదాహరించినప్పుడు వలయుచోట్ల వానికి సరియైన తెలుగువాక్యములు వ్రాసితిని. బాలచంద్రుని వేశ్యనామము సబ్బాయి యనియుండ శ్యామాంగియని దిద్దితిని. ప్రాచీనగ్రంథాలలో ఉన్నప్రకారము పలనాటివీరచరిత్రయని నామ ముంచితిని. బహుధన సాధ్యములయ్యుఁ జిత్రములను గొంతమంది మిత్రుల యనుగ్రహముచే సమకూర్పఁ దలంచితిఁగాని వారిసాహాయ్యము సమయమునకు రాక పోవుటవలన వీలైనది కాదు. యుద్ధకాలమును ననుగురాజు జన్మదేశమును నాకు లభ్య మైన కొద్దిగ్రంథసామగ్రితోడను శిలాతామ్రశాసనములతోడను నిర్ణయించితిని. ఇతి హాసవిదులు వీరచరిత్రముయొక్క యేభాగమైన దయయుంచి యెవరేని నా కందఁ జేయఁగలిగినయెడల నది వ్రాసికొని వారిగ్రంథము వందనములతో మరల వారికేఁ

బంపెదను. గ్రంథము ముద్రించుట కిదియే ప్రథమపర్యాయము గావున నేమైన లోపము లుండెనేని క్షమింపఁ బ్రార్థించుచున్నాను.

ఈ గ్రంథవిషయమునఁ దోడ్పడిన మిత్రులందఱకు నమస్కారము లాచరించు చున్నాఁడను. అందులో నేను శ్రమపడుట యటులుండ నాకొఱకు శ్రమపడి నిజాము రాజ్యమునుండి గ్రంథమును దెప్పించి వ్రాయించి యిప్పించిన మ-రా-రా-శ్రీ, అక్కిరాజు శంకరనారాయణగారికిని, జల్లగుండ్ల పిచ్చయ్యగారికిని, గ్రంథాంతరము నందఁజేసిన జానపాటి వేంకటప్పయ్యగారికిని వీరచరిత్ర ప్రథమభాగము నొసంగిన పిడుగు వీరభద్రయ్యగారికినిఁ దగినసమయములఁ దోడ్పడుచు వచ్చిన తాడేపల్లి సీతారామయ్యగారికిని, ముద్రణాదివ్యయమున కేఁబదిరూప్యము లొడఁగూర్చి సాహాయ్యముచేసిన మహారాజరాజశ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారికిని నామనఃపూర్వకవందనములు సమర్పించుచున్నాఁడను.

గుంటూరు,<br>
జులై, 1-వ తేది 1911.

ఉమాకాంతుడు.

☞ ప్రథమభూమికయందలి 53, 57, 61, 63 పేజీలలోని గచ్ఛద్వ్యాఖ్యలు ద్వితీయావృత్తిసమయాన వ్రాసినవి.

## వీరచరిత్రకథాసారము.

ఉత్తరదేశమునఁ భ్రాలమాచాపురి యనుపట్టణము కలదు. జంభనాపురియని నికి నామాంతరము. దీని ననుగురా జేలుచుండెను. ఇతఁడు కార్తవీర్యార్జునున కేడవ రమువాఁడు. కార్తవీర్యుఁడు చేసినపాపములు బాధింపఁగా ననుగురాజు బ్రాహ్మణోత్తముల యాలోచనవలన జీడినూనె గుడ్డలు ధరించి ససైన్యుఁడు, సామాత్యుఁడు, సభనుఁడు, సకులదేవుఁడునై రాజ్యమువిడిచి, పాపపరిహారార్థము తీర్థయాత్రలకు వెడలి నానాక్షేత్రంబుల సేవించుచు నదులలో మునుఁగుచు నంధ్రదేశమునకు వచ్చి యమరావతిరేవున కృష్ణానదిలో స్నానముచేయఁగా నల్లని జీడినూనె గుడ్డలు తెల్లనాయెను. ఇట్లు వస్త్రములు తెల్లనగుటయే పాపవిమోచనమునకుఁ జిహ్నమని బ్రాహ్మణు లనుగురాజునకుఁ బ్రథమమునఁ జెప్పియుండిరి. అనుగురా జప్పుడు చందవోలులో రాజ్యము చేయుచున్న రాజుకూతును వివాహమాడెను. ఆమెపేరు మైలాంబ. కూతునకుఁ జంపవోలురాజు పల్నా డరణమిచ్చినందున ననుగురాజు గురిజాలరాజధానిగ పల్నాటి కధి

పతి యయ్యెను. అనుగురాజునకు భార్యలు ముగ్గురు. వీరవిద్యాదేవి, భూరమాదేవి, మైలమాదేవి. వీరవిద్యాదేవియందుఁ బెదమల్లదేవుఁడు, పినమల్లదేవుఁడు, బాలమల్లదేవుఁడు నను ముగ్గురుపుత్రులు గలిగిరి. భూరమాదేవియందు కామరాజు, నరసింహభూపతి, ఝట్టిరాజు, పెరుమాళ్లరాజు నను నల్వురుసుతు లుద్భవించిరి. అనుగురాజు మంత్రి దొడ్డనాయఁడు. ఇతఁడు వెలమ; జేతినాయనికుమారుఁడు. బాదరాజునకుఁ బెద్దన్న యని నామాంతరము కలదు. సంతానము కలుగకముం దనుగురాజుచే బాదరాజు పెంచుకొనఁబడి క్షత్రియుండును గంచర్లపురాధీశుఁడు నైన కృష్ణగంధర్వుని కూతును లవాంబను బెండ్లాడెను. బ్రహ్మనాయఁడు విష్ణువుగా భావింపఁ బడుచున్నాఁడు. కురుక్షేత్రయుద్ధమునఁ గృష్ణుఁ డెంతముఖ్యుఁడుగ నుండెనో పల్నాటి యుద్ధమున బ్రహ్మనాయఁ డంతముఖ్యుఁడుగా నుండెను. ఈయన పల్నాటికృష్ణుఁడని పేర్కొనఁ బడుచున్నాఁడు. ఇతనికుమారుఁడు బాలచంద్రుఁడు. కన్నమదాసని మఱి యొకఁడు గలఁడు.

ఇట్లు దొడ్డనాయఁడు మంత్రిగ ననుగురాజు కొంతకాలము పరిపాలించి మృతి నొందెను. దొడ్డనాయఁడుకూడ స్వర్గమున కేగెను. నలగామరాజు పట్టాభిషిక్తుఁ డాయెను. నాయకురాలను నొకయువతి నిజశక్తిచేత ననుగురాజునను గ్రహము సంపాదించి యతఁడు చనిపోయినవెనుక నలగామరాజువద్ద మంత్రిణి యయ్యెను. ఈనాయకురాలి యసలుపేరు నాగాంబ. నాయకురాలనియే సాధారణముగా వ్యవహరింపఁబడు చున్నది.

"నాయకురాలి జన్మస్థలము పల్నాడుతాలుకాలో నాగులేటియొడ్డుననున్న జిట్టగామాలపాడను నొక చిన్నగ్రామము. ఈమె పంటరెడ్లకులమునఁ బుట్టినది. తండ్రి పేరు చౌదరి రామిరెడ్డి. మేనమామపేరు మేకపోతు సింగారెడ్డి. ఈమెయింటిపేరరవల్లివారని చెప్పఁబడినది. ఇది తల్లిగా రింటిపేరో యత్తగా రింటిపేరో తెలియదు. ఈమెభర్తనామ మెచ్చటఁ గానరాదు. పల్నాటియుద్ధమున కీమెయే కారకురాలు. అతిపరాక్రమశాలిని. గుంజాల పురవరాధీశ్వరులగు నలగామరాజాదు లీమె చేతిలో కీలుబొమ్మలవలె నుండువారు. ఈమె బ్రహ్మనాయని కిరుపోటిగా రాజ్యతంత్రము నడపిన సమర్థురాలు. యుద్ధావసానముపరకుఁ జలనమునొందక మగబిరుదు కట్టి యశ్వారూఢయై బ్రహ్మనాయనితోఁ బోర సమకట్టిన శూరురాలు. ఈమె మంత్రిణి యగునప్పటికి వీరవిద్యాదేవికి జన్మించిన మల్లదేవాదులు బాలురుగా నుండిరి. బ్రహ్మనాయఁడు వీరిని దగ్గఱకుఁ దీసి రాజ్యములోఁ గొంతభాగ మిప్పించి

[1] గురిజాలనుండి పోయి [2] మాచెర్లపట్టణము నిర్మించుకొని వారు యుక్తవయస్కులు కానంతన వారికి బదులుగఁ దానే పరిపాలించుచుండెను. వారు పెద్దవారైనతరువాతఁ గల్యాణపట్టణాధీశుఁడైన వీరసోముని కుమార్తెల నిప్పించి వివాహముచేసి పెదమల్లదేవుని మాచెర్లకుఁ బట్టాభిషిక్తునిఁ జేసెను. అనుగురాజు చనిపోవునపుడు కొడుకులనందఱను బ్రహ్మనాయనికి ఒప్పగించెను. నలగామరాజు నాయకురాలిని మంత్రిణిగాఁ జేసికొన్నను మల్లదేవులకుఁ బెండ్లిచేసిన తరువాత బ్రహ్మనాయఁడు ద్వేషబుద్ధిలేక నలగామరాజునకు భూరమాదేవిపుత్రులకుఁ గట్నము లిచ్చుటకై గురిజాలకుఁ బోయెను. వారును దగినవిధముల గారవించిరి. గురిజాలలో బ్రహ్మనాయనికి నాయకురాలు విషము పెట్టించెనుగాని యామె ప్రయత్నము నిష్ఫలమాయెను. మాయచేసి నాయకురా లాతనినిఁ గోడిపందెమున కొడఁబఱచెను. ఓడిపోయినవా రేడుసంవత్సరములు రాజ్యము విడచిపెట్టి పరభూములకుఁ బోవలయునని పందెపుటొడంబడిక. పందెములో బ్రహ్మనాయఁ డోడి గోపన్నను గోల్పోయి మల్లదేవుల వెంటఁబెట్టికొని మాచెర్ల విడిచి కృష్ణానదిని దాఁటి మండాదిపట్టణమునకు వలసపోయెను. పిమ్మటివృత్తమునకు వక్ష్యమాణమైన "పల్నాటివీరులకథలు" అను గద్యకృతినిఁ జూడదగును.

---

1 పల్నాటిసీమలోనున్నది. 2 పల్నాటిసీమలో చంద్రవంకనదిమీద ఉన్నది. పల్నాడు గుంటూరుజిల్లాలో ఒకసీమ.

# INTRODUCTION.

Ever since the evolution of man began from the brutal state, Great Persons have stepped into and passed away from this world leaving behind their marks in the annals of the progress of mankind. They are the light guiding and shaping men's thoughts and actions in their bewildering journey of life. They are the proclaimers of the unspeakable significance, the unreachable height, the immeasurable breadth and the unfathomable depth of the Infinite Power. By them the whole world moves; in them the whole world rests; for them the whole world longs. The history of the world is the history of these Great Men. Leaving the prehistorical periods, a little thoughtful mind can, from the dawn of documentary history down to modern times, perceive how the world has been affected by the appearance of the personages like Sri Rama, Buddha, Christ, Sankara, Kalidas and Shakespeare. These Great Men or Heroes, as they are justly called, are not confined to a certain country or to a certain age. They have been making their appearance in different corners in different ages. Wherever they appeared, whether in the meditative East or in the practical West, they were received with divine honour, regarded with admiration and adored with prostration. "The worship of a Hero" truly says Carlyle, "is transcendent admiration of a Great Man......No nobler feeling than this of admiration for one higher than himself dwells in the breast of man." Architects built temples in their honour;

sculptors carved their pictures on wood and stone; painters drew their figures in beautiful colours ; poets sang their heroic deeds. Sreenatha sang the valour of the Heroes of the *Palnad* and it is the history of these Palnad Heroes, depicted by Sreenatha that is found in the following pages of this book. These warriors had left their distant home on the banks of the Narmada, migrated for political reasons into the broad grand plains of the Palnad as a place of refuge and settled there —settled never to return. They obtained rights in the country as a matrimonial gift and ever since Palnad has been called their home and they have been styled, "Palnad Heroes." They held undisputed sway over it and diffused their religion and civilization among the people. They built villages, made tanks, constructed anicuts, dug canals, erected temples and raised fortresses in the Palnad and the surrounding country, traces of which remain to this day whispering in the listening ears, dumb as they are, various tales about the activities of of their makers in days gone by. Fortunately or unfortunately, the country had their rule only for a short time. During that short period, they held a wonderful sway over the country. Their love for the subjects was unlimited. Their indomitable valour was unparalleled. The chaotic battle-field was their sporting ground. The roar of the trumpets was their delightful sound. The bare flashing sword was their walking-stick. They were brave but not ferocious; they were valiant but not cruel. Timidity they did not know. Lawlessness they did not tolerate After ably governing the country for a short period, in a great fratricidal war that ensued,they, sacrificing their lives in defence of their rights,

displayed astounding and superhuman prowess which, as was naturally the case in those ancient times, held them deified in the eyes of the people dumb with awe and wonder. What with their humane government and what with their extraordinary character, they earned the love, respect and admiration of the people as no other ephemeral sovereign had done. Villages are named after them. Temples are dedicated to them. Their pictures are carved upon stones. Gorgeous processions are held in their honour. People vie with each other in paying their adoration irrespective of caste and creed. I cannot refrain from quoting in this connection the following lines of that famous archæologist, Robert Sewell, concerning these Heroes :—

" It is a curious fact that, while the Palnad Heroes themselves worshipped indiscriminately Vishnu and Siva and while this mixture of worship is still largely observed in this out of the way part of the country, we have in this Heroes' temple a sort of Mussalman coalition into the bargain. The Mussalmans take part in the anuual festival and pay their devotions to the souls of the Heroes ; and the walls of the temple are discolored with the splashes of chunam water and red paint thrown on them by Muhammadan admirers." Lists of Ant. Vol. I.

The construction of the temple itself is attributed tc a Mahammadan whose grave is still to be seen within the precincts of the temple. Our admiration is all the more increased when we read the story of a female of Panta Reddi family, who, as the leading figure one the side of Nalagama, made such wild charges, evinced such gigantic valour and fought with such stupendous courage as would excite the wonder of Nelsons and Nopoleans. Thousands

of people flock together every year at Karempudi, the scene of the great battle, from almost all parts of the Telugu country. The people are very ardent in their faith in the Heroes. They worship them as Gods. In marriages and such like ceremonies, the symbols of the Heroes stand on the sacred altars in the houses of the people even to this day. It is really interesting to see how Veroism (Hero-worship) which resembles to some extent the Norse faith of Scandinavia and the Shintoism of Japan, originated in the Palnad and extended its influence throughout the Telugu country. This Hero worship has been continuing here for eight centuries and, though an orthodox religionist may coldly speak, a gloomy theologian may disapprove, and a haughty atheist may laugh at the idea, yet must continue as long as the Earth turns round the Sun.

The author of this Ballad Sreenatha is a Vira Saivite for ceremony, but he seems to belong to the school of rational philosophers as they may be called. Though we cannot claim for him subtler elements of social morality according to tradition, his movements seem to be entirely ι high society and he was one of the most celebrated ;holars of his age in the Telugu country.

This Palnati Veeracharitra, has been uupublished and unknown to the general public until this time. It, in the course of four hundred and more years through which it kept its existence, underwent many changes, though not radical, in its composition. Somehow or other the book, from very early times, has always been in the hands of the illiterate low caste beggars who sing the story to the people and receive something as reward from

them. These illiterate people who possess the book never like the idea of publishing it thinking that, if published, every one would know those poems. Orthodox Brahmins, in general, think it madness to pay close attention to the singing of these beggars and disgrace to hold conversation with them. Moreover, this voluminous poem is not in one place with one person but portions of it are scattered throughout the Telugu country. Under such circumstances, the readers can imagine the awkward position in which I was when trying to get the book and the difficulties that would present themselves before finally succeeding in the attempt. In a way, I have now published this part of the whole poem and eagerly expect encouragement from the Telugu Public to bring out the remaining portions also within a short time. I have fixed the date of the war and the original home of the Heroes in my Telugu introduction with the light of the few historical accounts, Puranas and inscriptions I could have access to and if students of history kindly give their valuable suggestions upon the points, I shall feel highly grateful to them and acknowledge my indebtedness to them. Although the book had been given to the press nearly one year back, it could not be completed till now owing to the limited means and time that I could devote for it in the midst of other duties. My thanks are, however, due to Sri D. Kesava Row Pantulu Garu, Proprietor of the Vani Press, for the kind and timely help he rendered in many ways in bringing the book to its present form at least so early as this. I must express my feelings of gratitude to Sri Akkiraju Sankarayana Garu,

Sri Challagundla Pichayya Garu, and Sri Janapati Venkatappayya Garu and Sri Unnava Lakshminarayana Pantulu Garu, for their kind aid in the publication of this work.

BEZWADA,<br>*9th June, 1911.* }

 THE EDITOR.



# పలనాటివీరచరిత్ర

## బాలచంద్రయుద్ధము.



శ్రీరఘునాయకు జిత్తమం దెంచి
శ్రీకంఠుపరమేశు శివునాత్మఁదలచి
పార్వతీదేవికి భావించిమ్రొక్కి
శివగణంబులనెల్ల చింతించిపొగడి
ప్రాకటంబుగవిష్ణు ప్రార్థన జేసి
యిందిరాదేవిని నిచ్చలోనిలిపి
విష్ణుభక్తులనెల్ల వినుతులు సేసి
జలజజుఁగొనియాడి శారదనెంచి
అఖిలవిద్యలకెల్ల ఆద్యుడైనట్టి
గజముఖువిఘ్నేశు ఘనతకీర్తించి 10
వీరభద్రునిశౌర్య విభవంబులెన్ని
* సంగమేశ్వరునకు చక్కఁగామ్రొక్కి
గుర్జాలగంగను గోరిప్రార్థించి
భక్తి † గోగులపాటి భైరవుదలచి
నీలమేఘశ్యాము నిజమూర్తియయిన
‡ శీలమ్మనాయుని చిత్తమందెంచి
కడువేడ్కఁ బోతలింగము గొనియాడి
§ మాచెర్లచెన్నుని మదిలోనదలచి
ఆంధ్రకవుల నుతులమరగావించి
గీర్వాణకవులను కీర్తించిమ్రొక్కి 20
సంగీతసాహిత్య చాతుర్యకవిత
చెప్పనేర్చినవాడ చెలగి "మాచెర్ల"
చెన్నకేశవపాద సేవారతుండ
వలను భారద్వాజ వంశవర్ధనుడ
కవిసార్వభౌముడ ఘనతగన్నట్టి
శ్రీనాథుడనువాడ శివభక్తిపరుడ

---

* కృష్ణా, మాలాపహారిణీ నదులు సంగమించుచోట సంగమేశ్వర క్షేత్రము గలదు. మఱికొన్నిచోట్లఁగూడ సంగమేశ్వరాలయములు గలవు.

† గురిజాలకుఁ దూర్పుగానున్నది.

‡ శీలమ్మ పుత్రుఁడు అనగా బ్రహ్మనాయుఁడు.

§ పల్నాడుతాలూకాలోఁ జంద్రవంకతీరమందున్నది దీనికి మహాదేవిచెర్ల అనికూడ పేరు కలదు.

శాశ్వతంబైనట్టి సద్గ్రంథమొకటి
చెప్పఁబూనిమనసు చెలరేఁగియుండ
శ్రీరమ్యవక్షుండు శ్రితవత్సలుండు
వారిజనేత్రుండు వల్లవీవిటుఁడు 30
శమితభక్తజనార్తి శాశ్వతకీర్తి
కందర్పజనకుండు కనకాంబరుండు
సురరాజవిహితుండు శుభవీక్షణుండు
కరుణాంతరంగుండు కలుషభంగుండు
ఎల్లజగంబుల నేలెడుఘనుఁడు
పాలమున్నీటిపై బవళించువాఁడు
సారిదినెల్లప్డు భూసురరక్షకుండు
గిరిధర్ముడగు చంద్రగిరిరంగవిభుని
వేంకటాద్రిపునకు వెలయనొక్కొక్క
సరసునకును రణసాహసాంకునకు 40
అలరాజుబొకున కవతారమొంది
మలసినూటొక్క బొమ్మలపెండెరంబు
చెలఁగిడాకాలనుంచిన మహాఘనుఁడు
చిలుకలపైకొర్కె జిక్కెడువాఁడు
చేకొన్నమాచెర్ల చెన్నకేశవుఁడు
నాకలలోవచ్చి నయమొప్పబలికె
వినవోయిసత్కవి వేడ్కనామాట
మనమున నాకు సమ్మతమైనదొకటి.

అనవిని దేవ మహాప్రసాదంబు
దృఢముగనానతి యిమ్మునాకిప్డు 50
దనచెన్నకేశవు డప్పుడిట్లనియె
శౌర్యంబుపుణ్యంబు సమకూర్చినట్టి
పలనాటివీరుల భాగవతంబు
ప్రకటితంబుగనీవు రచియించిమాకు
అంకితంబొనరింప ననువొందుసూవె
అనుచును శ్రీకాంతు డరిగినపిదప
మేల్కాంచిమనమున మేలయ్యెననుచు
విలసిల్లు పలనాటి వీరులచరిత
జనులెల్ల భక్తిచే చదువుటకొరకు
* మంజరీద్విపదగా మన్నించి నేను 60
చెప్పఁబూనితివచః శ్రీ మెరయంగ.
ప్రకటితంబైనట్టి పలనాటిలోన
భావింపగావిష్ణు భక్తిని మెరసి
నరనాథసింహంబు నలగామరాజు
మహితచారిత్రుడు మలిదేవరాజు
ధారుణినేలుచు తమలోనబోరి
† కార్యమపూడి శ్రీకదనంబునందు
నరపాలచంద్రుండు నలగాముతాక
పంపిన ‡ బాలుండు బాహువిక్రముడు
తోరంపుగజములు తురగచయంబు 70

---

* ఈద్విపదయందుఁ బ్రాసములేదు.

† పల్నాఁటిలో నాగులేటితీరమున నున్నది.

‡ బ్రహ్మనాయుని కొడుకు.

మన్నీలబలముల మహితశౌర్యమున
చెదరిపారగబొడ్చి చీకాకుసేసి
నలగామతమ్ముడు నరసింగునెదిరి
మర్దించిరణమున మడిసినవిధము
ప్రచురింతువీనుల పండువుగాను

(కథాప్రారంభము.)

గణుతింప తత్కథాక్రమమెట్టి దనిన
అరయ † మేడపిలోన * అలరాజుచావు
వీరవిక్రమతచే వీరసాహసత
పరగిననాయకుల్ పటుపరాక్రములు
వీరనాయకులెల్ల వినివెరగంది 80
భావించితలపోసి బాలమల్దేవు
బిరుదురాజును దెచ్చి పృథ్వివెలయగ
నయమైనయట్టి లగ్నంబునందతని
పట్టంబుగట్టిరి పరగ మేడపిని.
భూమీశసుతునిట్లు పుడమినినిలిపి
భాస్కరసమతేజు బాలునిదెచ్చి
సచివకార్యంబున సమ్మతినుంచి
ఆటకరణపుకార్య మనపోతుకిచ్చి
మాడచియనునట్టి మగువను దెచ్చి
రాణివాసముగావ రక్తితోనుంచి 90
ఆనందమునుబొంది రంతటవారు.

(మలిదేవరాజు, బ్రహ్మనాయుడు
మొదలయినవారు కార్యమపూడి
యుద్ధరంగమునకు బయలుదేరి
పోవుట)

అటమీదభూమీశు డధికోత్సవముల
ఘనకార్యమాపూడి కదనరంగంబు
చేరబోవుటకునై చింతించియపుడు
ప్రజలతో మేడపి బదిలంబుసేసి
పరగముప్వురుపతుల్ పైనంబుగాగ
ఎలమిభూసుర పురోహితులెల్లపూని
జయముహూర్తముబెట్టి చనుమనిచెప్ప
తొల్లియేకాదశి దురమానటంచు
రణభేరివేయించె రమణీయముగను 100
అతులసాహసవృత్తి నాదండువెడలె
‡ గొల్లెనల్గట్టిన గొప్పలాబండ్లు
బల్లానిపెట్టెలు పట్టెమంచములు
తరుచైనపీటలు § తమ్మపడిగెలును
వింతమందసములు వెలయుగొడ్గులును
కాశ్మీరకస్తూరి గంధకర్పూర
మాదిగా వాసన లమరుపెట్టెలును

† బ్రహ్మనాయుఁడితనిని రాయబారమునకుఁ బంపఁగా నాయకురాలు కుట్రచేసి చంపించెను.

* వినుకొండతాలూకాలోనున్నది. మలిదేవరాజాదులు తమ రాజధానియైన మాచెర్లవిడిచి మండాదికివలసపోయి తిరిగివచ్చి యీ మేడపిని నిర్మించికొనిరి.

‡ గుడారము.

§ తాంబూలమువేసికొన్నతరువాతనుమ్మివేయుటకైయుంచికొనునొకవిధమైనపాత్ర.

బోకసంబులబల్వు బోనగావళ్ళు
జవ్వాజికిట్టలు శారికాకీర
పంజరములుపట్టు పరిచారకులును 110
కోడెకాండ్రదలించి కొట్టెడురెడ్లు
పడివాగెతేజీలు పాలకీజోళ్ళు
అష్టభాగ్యంబుల అంగళ్ళవారు
సందడీపడదండు చయ్యనగదలె
వెంపైనపాలకి పెదమల్లుగదలె
పినమల్లుగదలెను పృథ్వీశువెనుక
తమ్ముడుగదలెను ధరణీశువెంట
పచ్చలులింగాలు పట్టుగాజెక్కి
బాగుచేసినయట్టి పాలకియెక్కి
పలుమారుపుత్రుకై పలువరింపుచును 120
కొలువులోనాయుండు కొనరెట్టపట్టి
♦ కులపగదీర్పనీ కొడుకితడంచు
పెట్టెనాచేతిలో ప్రియతనూజాతు
బాలునితెగువ యేపాటిదోయనుచు
* కొమ్మభూమీశుండు గొబ్బునగదలె
అల్లాణరాజులు అచ్చోటినృపులు
అన్నలుదమ్ములు అందరుగూడి
సూర్యవంశమువారు సొంపుతోచనిరి.

వారికివీరికి వరమంత్రియైన
నీలవర్ణుండును నియతచిత్తుండు 130
బ్రహ్మన్నగదలెను పాయనివేడ్క
పట్టెరిగొడుగులు పాలకినెత్తి
సూర్యాతపంబు పైసోకనియట్లు
పాలకీలకురెండు పార్శ్వంబులందు
అందంబుగాబట్టి రరిగెలజోళ్లు
వింజామరంబులు వెలయగానెమిలి
కుంచెలవారును గూడివీపంగ
నాయుండురాజులు నయముతోచనగ
ముందు † ఢమాయీలు మురజసంఘంబు
బూరలుభేరీలు పోటుధారలును 140
కాహాళపంకిణి కాలికొమ్ములును
శంఖసమూహంబు సన్నాయిజోళ్ళు
మురళిచయంబును ముఖవీణవితతి
నరగలంతప్పెటల్ నయమైనడోళ్ళు
తమ్మటమ్ములునెంచదగువీరణములు
ఘనమైనరుంజలు ‡ కనకతప్పెటలు
చేగంటలును మరి చిరుగంటచయము
ఘనమైనమ్రోతచే గగనంబుగప్ప
కుంభిణివణకంగ కులగిరులెల్ల

---

♦ ఇది దినవెచ్చమువంటిది.

* ఇతఁడు క్రీ॥ శ॥ 1188-వ సంవత్సరమునందు కల్యాణమును పాలించుచున్న నాలుగవ సోమేశ్వరుని కుమారుఁడు. ఇతనిపుత్రుఁడు లరాజు. కొమ్మరాజును అలరాజును పలనాటిలోఁ జనిపోయినందున కల్యాణమునేలు పశ్చిమచళుక్య వంశము వీరితో నశించెను.

† చర్మనిర్మితమైన వాద్యయంత్రవిశేషము.

‡ బంగారుతప్పెటలు కావు. ఒకరకపు తప్పెటలు.

మారుమ్రోతలనీదు మనసులుప్పొంగ 150
ఆవాలవారును ఆణెమువారు
కొండ్లవిందులవారు గోవిందువారు
ముతసానివారును ముయ్యూరువారు
నర్మాలవారును నాయఁనివారు
పైడిచుక్కల పాలపర్తివారలును
బలుమూరివారును పాలెమువారు
రేవనూళ్లలవారు రేచెర్లవారు
ఆట్లూరి ముట్లూరి యాఖ్యలవారు
చెవులవారునుమరి చిల్లరవారు
గురియైననాయకుల్ గూడియేతేర 160
గండువారేగురు గదిసినవేడ్క
చనిరిబిరుదులతో సాహసమడర
ఒప్పుగానిందరు నురువైనబండ్లు
ఘోటకంబులు మేటి కుంజరావళులు
ఉత్సాహమున హుటాహుటినడువంగ
భట్టువారలుమించి బహువిధంబులను
బిరుదుపద్యంబులు పెల్లుగాజదువ
ఉద్ధతి * మస్తీలు నొసరనిర్వంక
భైరవఖడ్గముల్ పట్టుకరాగ
శీలమ్మతనయుని సింహవిక్రముడు 170
కరవర్థి కనుకుల కన్నమనడిచె
సకలవీరచయంబు సంతతోత్సాహ
పౌరుషంబులుమీర † బ్రహ్మకిట్లనియె.

"మముజూడునాయుడామాలావుకొలది
మముజూడుబ్రహ్మన్న మాశౌర్యపటిమ
సింధురంబులమీద జెన్నుగాడుమికి
కుంభస్థలంబులు క్రుంగజేసెదము
కొదమసింగంబుల గూలద్రోసెదము
గండభేరుండాల ఖండింతుమలుక
వాయువుబోసిక వడినాపగలము 180
జాతవేదునిబట్టి చమిరివేసెదము
ఘనసముద్రముజొచ్చి కలగజేసెదము
కుంభినికాళ్లతో క్రుంగదన్నెదము
కులగిరులైనను కొట్టివేసెదము
గురిజాలనేలెడు కువలయేశ్వరుని
కులవగకైపట్టి క్రొవ్వణగించి
చలమునవిడువక చంపగాగలము"
అనిపెక్కుపంతంబు లాడుచునడువ
చూచినవారలు చోద్యంబుగాగ
పటువిక్రమాఢ్యులు పలనాటివీర 190
వరులంచుబొగడుచు వర్ణించిపలుక
మలదేవభూపతి, మంత్రిబ్రహ్మన్న
కంపింపభూస్థలి కదలిరావేళ.

(మలిదేవరాజు, బ్రహ్మనాయుఁడు త్రిపురాంతకము జేరుట.)

‡ త్రిపురాంతకమునకు తిన్నగావచ్చి

* శస్త్రవిద్యావిశారదులు.
† బ్రహ్మనాయుఁడు.
‡ శ్రీశైలమునకుఁబోవు త్రోవలోనున్నది.

మహితచారిత్రుడు మలిదేవనృపతి
రాజులుమంత్రులు రసికులుదొరలు
పాటించిసుంకర వారితోగూడ
ఆవేళనీశ్వరు నతిభక్తిజూచి
సాష్టాంగదండముల్ చయ్యనజేసి
హస్తముల్ ముకుళించి అనియెబ్రహ్మన్న
గౌరీమనోహర గంగోత్తమాంగ
నాగకంకణశివ నందివాహనుడ
కాంచనగిరిచాప కంధితూణీర
గరుడాసనాంబక కైలాసవాస
ఘనగజాసురభంగ కామభస్మాంగ
లాలితశ్రీకంఠ లయకాలకర్త
సకలభూతేశ్వర శరభావతార
ఫాలాక్షభూతేశ పరమేశయిపుడు
విన్నవించెదనేను వినుముసత్కరుణ
* శివపురిలోనుండి చేర్చినయట్టి 10
భూతరాట్స్తంభంబు పొందుగానుంచి
మితిజేసిచనితిమి మీనగరంబు
కృతివచ్చెనేటికి మీకృపచేత
కార్యమీడేర్పంగ కర్తలేమీర
నుచు ప్రార్థనజేసి యచ్చటనున్న
కంబముగనుగొని కడుభక్తిమ్రొక్కి
యినుము పిత్తళి కంచు హేమతామ్రముల
పంచలోహంబుల ప్రబలినదాన
నాలుగుముఖముల నయమొప్పమరియు
ఎనిమిదిముఖముల నెన్నికైనావు 20
ముగురుమూర్తులునొక్క ముఖమందునిలిచి
ఒకటసిద్ధులుమరి నొక్కటమునులు
గంగయుదుర్గయు కాలభైరవుడు
నిలిచిభూదేవియు నీయాననముల
గంధర్వపతులతో కాచుచునుందు
రనుచుప్రార్థనజేసి ఆబ్రహ్మపలికె
ఘనకార్యమాపూడి కలనులోపలను
నలగామరాజుతో నయముగాబోరి
మడియంగవచ్చిరి మన్నెనాయకులు
రణరంగపట్టపు రాజవైనీవు 30
సాక్షివైయుండవే సర్వభూతేశ
భుక్తినిచ్చెదనీకు భూతేశుడెరుగ
దాహంబుదీర్చుకో తడుచురక్తమున
ఇప్పుడాహారంబ యిదిగొకొమ్మంచు
కంబమునకునిట్లు గట్టిగాజెప్పి
పెక్కువిధంబుల పిండివంటలును
పరమాన్నమునుమంచి పప్పుకూరలును
పానకంబులుజున్ను పచ్చళ్లునెయ్యి

---

* శివపురియనునది శివసింగురాజుయొక్క పట్టణము. కల్యాణపట్టణరాజయిన వీరసోముఁడీపట్టణముమీద దండెత్తినపుడు బ్రహ్మనాయుఁడు వీరసోమునికి సహాయుఁడుగాఁబోయి శివపురి ధ్వంసముగావించి యచ్చటనున్న శక్తులఁదెచ్చి త్రిపురాంతకములో నిల్పెను.

ఖండశర్కర తియ్య కందగడ్డలును
గొని తెచ్చికుంభము కొండలరీతి 40
కస్తూరికర్పూర కాశ్మీరసహిత
చందనలేపంబు సరిపినొనర్చి
మైసాక్షిసాంబ్రాణి మంచిగుగ్గిలము
తోడుత లెస్సగా ధూపమర్పించి
ఘనమైనపోతుతో గావుజెల్లించి
ఆహారమంతట అర్పించిపిదప
* కంబముంచినయట్టి ఘనమైనశకట
నిచయంబుదరలింప నిలిచి బ్రహ్మన్న
శకటచక్రంబులు సమ్మతిగావ
నాయకావళి నెల్ల నయముతోబిలిచి 50
వితరణచతురుడై విడియంబులిచ్చి
యెనయంగమనపీట నెసగునెద్దులను
కనుగొని తెప్పించి కాండ్లకుగట్టి
చయ్యనబండ్లను సాగింపుమనియె.

(నాయకులు శకటంబులకుఁ బూన్పుటకై యెద్దులనుఁ బేరు పేరునఁ బిలుచుట)

అనిపిడుకొలిపిన నంతంతవారు
పేరుపేరునవాని బిలిచిరీరీతి
అందెలబసవన్న ఆదినాథుండ
నందులపిడిఘుంట నాగవాసయ్య
గోవులవిటకాడ గోగుబయ్యన్న
పంటరిపలిజంకు వరపెరుమాళ్ళ 60
కట్టనికలుకోట కరినందిరంకె
అకలంకగాత్రుండ అంబుధిశయన
బిరుదుగరుత్మంత భీమునిగజము
గోవర్ధనాచల గోపాలదేవ
కరినందిబసవన్న కంచివరదుడ
నెలబాలచంద్రుండ నీలవర్ణుండ
జల్లులదర్దజ జయకంఠనాద
వైకుంఠవాసుడ వాసుదేవయ్య
పుట్టలభూపతి పెంజెల్లుపెద్ద
ఇంద్రునివజ్రమా యిప్పగిరీశ 70
గోగుభైరవమూర్తి గోవిందరాజ
చెంచులయోబయ్య చెన్నమల్లయ్య
కంచియేకామ్రుడా కాశికానాథ
మధురాపురిప్రియా మానందినాథ
కాముడాసోముడా కాయజవరుడ
రాముడాభీముడా రంకెలుసలుపు
మీరీతిపిలిచిన నేపుమీరంగ
వచ్చినయెద్దుల వరుసతోజూచి
వన్నెలుచిన్నెలు వడిజెప్పికొనుచు
నెత్తురుకొమ్ముల నేతైనవాని 80
గణుపుతోకలుగల కరిబొల్లివాని
అచ్చగాకరివన్నె లమరినవాని
మూపురంబులతోడ మొనసినవాని
నుదుటచుక్కలుగల నునుపైనవాని
తెల్లనివన్నెల తెలివైనవాని

* త్రిపురాంతకమునుండి కంబమును దరలించుచున్నారు.

పచ్చనివన్నెలు ప్రబలినవాని
ఇటువంటియెద్దుల నెంతయునేర్చి
గంటలుగజ్జలు గణగణమ్రోయ
గ్రక్కునయెద్దుల గాండ్లగట్టించి
మోకులబంధించి ముందుగానపుడు 90
పంచవన్నెలకూడు పైబారదివిచి
కంబముదర్శించె కమలనాభుండు
*మర్రివేములదాటి మండలేశుండు
ఘూర్ణిల్లురవముతో † గుమ్మడంపాడు
చేరియచ్చటనిల్వ చిత్తంబువిడిచి
‡ గరికెపాటికివచ్చి కాలూనకచట
§ కంకణంబులపల్లె కడనునాథులు
కంకణంబులుగట్టి కదలిరావేళ
పట్టభద్రులు ♦ పైడిపాటికివచ్చి
పరగవీరులకెల్ల పైనంబుజెప్పి 100
మెరసినమన్నీలు మేటినాయకులు
ప్రభువులుదొరలును బంధువర్గంబు
వీరవర్యులుగొప్ప విద్యలవారు
మిక్కిలిబిరుదులు మెరయుసాహసులు
కవులునుజెట్టీలు కలిసియందంద

(మలిదేవరాజాదులు త్రిపురాం
తకమునుండి మేళ్ళవాగుఁ
జేరుట.)

$ మేళ్ళవాగుననిల్చె మించినదండు.
అందరుగొల్లైన లమరంగనెత్తి
యుండిరినాయకు లుత్తలపడక
అంతలోదినకరు డస్త్రాద్రికరిగె
సాంద్రమైచీకట్లు జగమెల్లగప్పె 110
విలసిల్లెచుక్కలు వినువీథియందు
గుమిగూడిపక్షులు గూళ్ళలోజేరె
గూబకదుపుమించి కూయంగసాగె
చక్రవాకంబుల సంతసంబడగె
ఘనచకోరంబులు కౌతుకంబందె
కొలకులకమలముల్ కుందుచుమొగిడె
వికసించెకుముదముల్ విచ్చలవిడిని
జారకాముకులెల్ల సంతోషమునను
మగలనిద్దురబుచ్చి మనసులుబెదర
కెరలివిటులగూడి గృహములువెడలి 120
మించిసాహసమున మేరలుమీరి
తోడికోడండ్రును తోడివారలును

---

* వినుకొండతాలూకాలో నున్నది.

† వినుకొండకుఁ గొంచె మీశాన్యముగ 18 మైళ్ళదూరమున నున్నది.

‡ వినుకొండకు ఉత్తరముగ 19 మైళ్ళదూరమున నున్నది.

§, ♦ ఇవియు వినుకొండతాలూకాలో నున్నవి.

$ నాయకురాలి కనుమదాటినతర్వాత నున్నది. కార్యమపూడికి 6 మైళ్ళదూ
ములో దక్షిణముగా నున్నది.

గురువులు బంధులు గుర్తెరింగినను
నిందింతురనిశంక నిలుపకమదిని
వాగులవంతల వనములయందు
ఇసుకదిబ్బలయందు నిరవైనపొదల
కుంటెనకత్తెలు కూడికాపాడ
మనసులతమిమించ మదనుడావేళ
పూబాణములువింటబూనిసంధించి
మర్మముల్ నొవ్వంగ మాటికినేయ 130
మంచిగంధముబూయ మనసుభీతిల్ల
పువ్వులుముడువను బుద్ధియులేక
ఘననఖక్షతదంత ఘాతలువీడి
రతికూజితంబుల రంతులుమాని
బంధచాతురియందు భావంబువిడక
కొందరు నేలను గొందరునిలిచి
నయముతోగొందరు నానావిధముల
కలసిరి మేనుల కంపంబులలర
చోరులుసాహస స్ఫూర్తులతోడ
ప్రాణంబులకుదెగి భార్యలనుమరచి 140
ప్రతికివచ్చెదమను భావంబువదలి
పట్టణంబులయందు పల్లెలయందు
ధనికులగృహముల తాళ్లూనిదోచి
సారెకుదిరుగంగ సాగిరావేళ

(కార్యమాపూడి రణరంగమును
బరీక్షించుటకై బ్రహ్మనాయుఁడు
కన్నమనీని నర్ధరాత్రంబునఁ
బంపుట.)

అంతట బ్రహ్మన్న యానడిరాత్రి
కనుకులదాసుండు ఘనబాహుబలుఁడు
కన్నమయనువాని గ్రక్కునబిలిచి
వెనుకటిరాజులు విక్రమస్ఫూర్తి
పోరాడిసమసిన బూడిదవెంట
యిలభీమమైనట్టి యెముకలపోగు 150
లెసగినరణభూమి యెన్నికగాను
పావనంబుగజేసి బహుకాలమందు
కనిపెట్టియున్నట్టి ఘనరాజవితతి
దురముఁగోపలనుండి తొలగింపవలయు
ఇరవుగాకలనిలో ఈరాత్రివేళ
ఎవ్వరెవ్వరుగాచి యెట్లున్నవారో
అరసిరమ్మనిపంప నావీరఘనుఁడు
వాసనపెల్లైన వనమాలగదల
కరముల * గుజ్జరి కడియముల్ మెరయ
నేటైనపిడిఘంట నెమలిసోగలును 160
నల్లనిదట్టిని నయమొప్పగట్టి
అర్ధనారీఝల్లకాదులునమర
ఘోరభైరవగద కోరమీసములు
ఎగుభుజంబులుమించు నెరజేరుగడ్డ్లు
ఘనమైనదేహంబు కాలిపెండెరము
వెరవైనభీకర వేషంబుతోడ
కదలెకన్నమనీఁడు కదనభూమికిని
కాటుకకొండయై కదిసినయట్లు

* గుజ్జరి అనునది ఘూర్జరశబ్దభవము. ఘూర్జరదేశమునే యిప్పుడు గుజరాతని చెప్పుదురు.

గరిమతో చీకటిగ్రమ్మినయట్లు
హరిహరాదులమూర్తి యతనికిగలిగి 170
నడికలనింజొచ్చి నలుదెసల్ జూచె
అక్కడకాపున్న యఖిలరాక్షసులు
గండభైరవమూర్తి ఘనభూతవితతి
గుంపులైయున్నట్టి కొరవిదయ్యములు
ఇరవుననున్నట్టి యెరుకలసాని
యున్నతావుకువచ్చి యొయ్యననసియె
వింటివేవార్తలు వినవిచిత్రంబు
గొల్లెనలచ్చోటకుదురుగా జేసి
యీరుద్రభూమికి సీతడువచ్చె
ఏమికార్యమొకాని యెరుగంగరాదు 180
మదమునన్నాడు మనుజాధిపుడు
తెలిసికోవలెవీని తెరగెల్ల నిప్పు
డనిఉగ్రకోపాన నార్పులునిగుడ
కత్తులుద్రిప్పుచు గదిసికూయుచును
గట్టిగానిలిచిరి కన్నమమీద
అంతటకన్నమ అధికరోషమున
కాలాగ్నిరుద్రుడై కత్తినిదీసి
మెరపుకైవడినిల్వ మెచ్చెభూతములు
వల్లకాటికిధైర్య వైభవంబెసగ
ఎవ్వడేతెంచెనో యెరుగరాదిప్పు 190
డీశ్మశానములోన నెసగురుద్రుండో
బ్రహ్మయోవిష్ణుడో పాకశాసనుడో
అగ్నిహోత్రుడో లేక యమధర్మరాజో
అలనైరృతుడో లేక అంబుధిపతియొ
పవనుడోధనదుడో ఫాలనేత్రుండో
మునివితతికినెల్ల ముఖ్యుడోయేమొ
తెలియుదమంచును దిన్నగానిరి
ఎవడవురాయోరి యీభూమిజొచ్చి
యేమికార్యముకొర కేతెంచినాడ
వేరాజుబంటవో యెరిగింపుమనిన 200
పలికెగన్నమనీడు పటుశక్తిమెరయ
సోమవంశంబున శోభిల్లుచున్న
అనుగురాజేంద్రున కంగనయైన
విద్యలదేవికి విభవంబుమీర
ముక్కంటివరమున ముగ్గురుసుతులు
మల్లికార్జునుయొక్క మానసరూపు
లనగజన్మించిరి అందులోమేటి
పెదమలిదేవుడు పృథ్వీతలేశు
డారాజునకుమంత్రి ఆదిదేవుండు
దొరసినరేచర్ల దొడ్డనాయునికి 2/10
పడతిశీలమయను పద్మనేత్రకును
కలికికృష్ణుండైన కారుణ్యమూర్తి
పుట్టెనుబ్రహ్మన్న భూలోకమందు
అతనికిదాసుడ నాదును నేను
మాలలకునుబుట్టి మాలనైపోక
విష్ణుపాదముబట్టి విశ్వంబులోన
తెప్పలినాయుడు తెరవయైనట్టి
వికచాబ్జలోచన పెమ్మసానికిని
శ్రీమించుమాచెర్ల చెన్నునిమేన
పెంపొందెడుతులసి పెదవనమాల 20
వరమునగన్నట్టి వరపుణ్యసుతుడ
కన్నమనాపేరు కమలాక్షివినవె

కాముని కెదిరించి కదనంబుగోరి
పగరపైదండెత్తి బవరంబునకును
వచ్చిరిమావారు వైభవంబలర
భండనక్రియకిది పట్టైనచోటు
వెనుకటిరాజులు విక్రమస్ఫూర్తి
పోరాడివచ్చిన పునుకలవెంట
తొలగించిశుచిసేయ వలెనంచుదలచి
కాముని బలముల ఖండించివైచి 30
మడియంగవచ్చిరి మన్నెనాయకులు
పరభయంకరమైన భండనభూమి
అరసిరమ్మనిపంపె నవతారపురుషు
డైనట్టిబ్రహ్మన్న యనుచు జెప్పంగ
విని యెరుకలసాని విస్మయంబంది
ప్రళయకాలేశుండు పార్వతీశ్వరుని
పాదసేవకులైన ప్రమథులువార
లిపుడిటువచ్చుట్ల నెసగెసంతసము
మనసులోకోరిక మాకుసిద్ధించె
బ్రహ్మనాయుడువచ్చి భండనభూమి 40
పాదరేణువుచేత పావనత్వమ్ము
వెలయింపవలసిన వేళయేతెంచె
కడువేగరమ్మను కన్నమనేడె
అనినకన్నమవిని యాశక్తికపుడు
వందనమస్కృతుల్ తగజేసిముగిడి
బ్రహ్మనాయునిజూచి పదములకెరగి
కమలవల్లభవిను కంటినివింత
కంటినెరుకసాని కంటిదైత్యులను
జయమగువేంచేయుం జలజలోచనుడ

(బ్రహ్మనాయుఁడు కార్యమపూడి
యుద్ధరంగముఁ జేరబోవుట.)

అనుచునచ్చటివృత్త మఖిలంబుచెప్ప 50
విని బ్రహ్మనాయుండు వీరధైర్యమున
ద్వాదశసూర్యులు ప్రబలినరీతి
నెవ్వరికెరిగింప కేగెనావేళ
పాలుపొందనారుద్ర భూమికేతెంచి
నాలుగుకరముల నాయుడునిలిచె
ఆరుద్రవసుమతి నాశ్చర్యముగను
కూలినశల్యముల్ కురుచతుండములు
సోక్కినచర్మముల్ చుట్టలైయున్న
పేగులునరములు పెంటలైయున్న
యేడుమాసంబుల యెముకలుపగిలి 60
రాలిదట్టంబైన రాసులుతరుచు
మునిగిదుర్గంధంబు మొనసినమెదడు
గాలికిదూలెడు ఘనశిరోజములు
కాలికుప్పలుబడ్డ కాయవిభూతి
చిదిమినశవములు చెదరుకోరువులు
నానావిధంబుల నాట్యముల్ సలుపు
భూతకోటులతోడ పొందుగానుండె
తలకాయపుర్రెల దగుబంతులాడు
శాకినుల్ మొదలైన సకలభూతములు
బెదరకవాదించు భేతాళచయము 70
పిల్లాటలాడెడు పెనుపిశాచములు
మిణుగురుల్ దిక్కుల మించిరాల్పుచును
కొమరొప్పపరుగిడు కొరవిదయ్యములు
వేదమంత్రంబులు వెసపఠించుచును

బ్రహ్మనాయునిజూచి భయసంభ్రమమున
ఆశీర్వదించుచు నళుకుచుతొలగి
పరుగులువెట్టెడు బ్రహ్మరాక్షసులు
కలగిబ్రహ్మన్నను కనినంతలోన
పారిరిభయమున బలుదైత్యవితతి
ఇటువంటిరణభూమి నెసగనీక్షించి 80
ఘనకార్యములకెల్ల కారణంబగుచు
ఎముకలపెంటయై యేహ్యమైయున్న
కార్యమాపురిపుణ్య ఖనియగునట్లు
కావింతుదేవతల్ గనిసంతసింప
ధీరతశ్రీవీరతిరుపతిసేయ
వలెనంచునూహించి వైరులపాలి
కాలమృత్యువువంటి ఘనుడుబ్రహ్మన్న
భయదమా రణభూమి ప్రబలుడైనిలిచి
మూడుకాలంబుల ముచ్చటలెల్ల
తెలిసినయెరుకల తెరవనీక్షించి 90
బలువైనబ్రహ్మాండ పఙ్క్తులనెల్ల
ఁట్టింపరక్షింప పాలియింపనేర్చు
బ్రహ్మదేవునివిష్ణు ఫాలలోచనుల
ప్రార్థించికీర్తించి ప్రణతులుచేసి
హరియొక్క పదియైన యవతారములను
మనసునదలపోసి మానంబురోసి
భువనరక్షణచేయ బుద్ధిలోనిలిపి
పరమేశ్వరునిగూర్చి పలికెబ్రహ్మయ్య
"ఓచక్రధర! స్వామి ఓకంజనాభ
జలముపైపవళించు సర్వభూతేశ 100
ప్రమథావతారులు బలువీరవరులు
ప్రధనవసుమతిలోన ప్రాభవమొప్ప
ఇత్తుముప్రాణంబు లీయనినంచు
వచ్చియున్నారదె వైభవంబలర
వీరసింహంబులు వీరనాట్యంబు
చేయుందురిప్పుడు స్థిరబుద్ధితోడ
పూతత్వహీనత పొరయునీభూమి
నిర్దుష్టముగజేయ నిన్నువేడెదము
నీచరణంబున నెరిజనియించి
గంగయై ఖ్యాతినిగాంచి లోకముల 110
క్షాళితమ్మొనరించె గద పూర్వమందు
ఆజలరూపమై యమరుమేఘంబు
వర్షించియీభూమి పరమపూతంబు
చేసెడునట్లుగా సెలవిమ్ముతండ్రి"
అనుచుబ్రహ్మనవేడ నాలించిహరియుం
ఫణిశాయియైయుండి పంపెదేవేంద్రు
నతడుప్రేరేపింప నానీలమేఘ
మాకాశమెల్లను నల్లినట్లుండి
గాఢాంధకారంబు గప్పెభూస్థలిని
ఘూర్ణిల్లుధ్వనులతో కుంభినిమీద 120
ఉరుములుపిడుగులు నొయ్యనబడగ
తళతళ మెరుపులు తరచుగామెరయ
వడగండ్లురాలంగ వాయువువిసర
వాగువంతలనీళ్లు వరదలైపార
గుంటమిట్టనరాక కుంభినినెల్ల
ముంచెదేవతలంత మూకలైచూడ
జలజనాభునిపాద జనితమైనట్టి
గంగలోకములెల్ల క్రమ్మెనోయనగ
ఏకార్ణవంబుగా హెచ్చివర్షించె

అప్పుడాజలమధ్య మందుండియొక్క 130
పునుకజలముపైన బొర్లాడికొంచు
పడమరగావచ్చి బ్రహ్మన్నవద్ద
నిల్చిహసించెను నిష్కారణముగ
అపుడుబ్రహ్మన్నయు నానవ్వుజూచి
తలపుర్రెతోనసె దగువాక్యములను
నవ్వినహేతువు నాతోడజెప్పు
వీనులనిండగా వినగోరినాడ
అసిననాయనితోడ నాపుర్రెపలికె
నాపూర్వమంత విన్నపముచేసెదను
శంఖచక్రాంకిత సకలలోకేశ 140
ఇందిరామందిరా యినచంద్రనేత్ర
జలజజ జనకుండ శార్ఙ్గశరాస
సకలవేదమయాత్మ శ్యామలవర్ణ
సకలధర్మంబులు సమసెడువేళ
తగినరూపముదాల్చి ధరబ్రోతువెపుడు
వేదశాస్త్రంబులు వినుతులుసేయ
చాలగజడనిధిశయనించుచుందు
దనుజేంద్రసంహార తార్క్ష్యవాహనుడ
యొత్రితీయవతార మీయుగమందు
శోభిల్లునీమేను జూడంగగలిగె 150
తప్పుజూడకవిను తగుమనముంచి
దానవుడనుగాను దయ్యముగాను
భూరిభయంకర భూతంబుగాను
వాసియాయాకాశ వాణినిగాను
రహిమించగా బ్రహ్మరక్షస్సుగాను
జలనిధికోటయై చక్కనైయుందు
దక్షిణజలనిధి దండనున్నట్టి
రమపురమను పేర రాజిల్లుచున్న
పట్టణంబేలెడు పరమధర్ముండ
జలధిసోముడనేను సర్వజ్ఞతిలక 160
ద్వాపరయుగమున ధైర్యంబుతోడ
బహుతరాక్షౌహిణుల్ బలములగూర్చి
ధూర్జటికెదిరించి దురమొనరించి
కరులుగుర్రంబులు కాలిమానుసులు
హతమైనపిమ్మట నాలంబులోన
పడితినిపగవారి పంతంబుగెలువ
రణధూర్తుడనుగాను రాజునుగాని
సర్వయుగజనులు సమసినకలని
గతిగానకీలాగు కాలంబుబుచ్చ
చెదురుచూచుచునుంటి మెంతయుమేము
వీరాగ్రగణ్యత వెలసిననీవు
కదనవిక్రముడవై కలనికివచ్చి
శోధింపదిరిగితి శూరధర్మమున
పరమాత్మ మాజన్మ పావనంబాయె
వైకుంఠపట్టణ వైభవంబెల్ల
కంటినాయునిమూర్తి గన్నందుచేత
నీపాదములధూళి నెరసినకతన
పావనంబాయెనీ భండనభూమి.
ఇటువంటికలనిలో నేపునమీరు
కదనసాట్యముసల్పు కడుసంతసిల్లి 180
శంకరుడింద్రుండు సకలదేవతలు
ఎదురుగా చనుదెంచి యిత్తురిష్టములు
ఘనపవిత్రులుగాగ కలియుగమందు

వీరపుంగవులయి వెలయంగగలరు
పరువడిచనిన భూపతులలోగలసి
దివికేగెదము మేము దేవదేవేశ
అనిచెప్పి బ్రహ్మచే నంపించికొనిరి
కరమొప్పవంద్రెండు గడియలకడవు
కుంభవర్షంబయ్యె కుంభినియందు
నీతిచేభూతముల్ నిల్చికొల్వంగ 190
కలనికికర్త్రియై ఘనమైనశక్తి
గరిమ బ్రహ్మన్నను గాంచియునిల్చె
నిలిచినగనుగొని నీలవర్ణుండు
"ఓవిశ్వమయమూర్తి ఓవిశ్వకర్త్రి
ఓలోకపావని యోజగద్ధాత్రి
యోశాంభవీదేవి యోలోకసేవ్య
సమరంబునకునీవు సాక్షివైయుండు"
మనుచుప్రార్థనజేసి యాబ్రహ్మనీడు
మగిడెమనోవేగ మానితగతిని
వేగుజాముకువచ్చి విడిదిలోనిలిచె 200
తెల్లవారగనప్డు దివిజులుపొంగ
చుక్కలకాంతులు శూన్యమైయడగె
కలువలమిత్రుని కాంతులంతగ్గె
చీకటిగుహలలో జేరియుండాగె
గుడ్లగూబలుపోయి (గొందులసణగె)
చక్రవాకంబులు సంతసంబందె
కమలముల్ వికసించె గలువలు మొగిడె
తమతమకార్యముల్ తగజేసికొంచు
మోదంబునొందిరి భూజనులెల్ల
వేదమంత్రంబుల వినుతులుజేసి $\frac{3}{10}$
అఖిలభూసురతతి అర్ఘ్యంబులియ్య
పూర్వపర్వతశిరః పూజ్యాగ్రమందు
ఘనతరమాణిక్య ఖచితసౌవర్ణ
కుంభంబువలెనిల్చి గురుతేజమునను

(ససైన్యంబుగ మలిదేవరాజు
కార్యమపూడిం జేరుట.)

భానుండుదిక్కుల ప్రబలెనావేళ.
తరుహాతమలిదేవ ధరణీశ్వరుండు
పొలుపొందకార్యమ పురికేగదలచి
తాను బ్రహ్మగలసి తగవిచారించి
ఘనమైనడేరాలు గట్టినబండ్లు
ఇతరవస్తులుమోసి యేతెంచునట్టి 20
యెద్దులనొంటెల నెల్లముందుగను
సాగించియంతట సంతోషమునను
కాలిబలంబుల ఘనఘోటకముల
మదమునవిలసిల్లు మంచియేనుగుల
నాలుగుదిశలను నడువంగజేసి
వీరనాయకులూని వెనజుట్టినడువ
తమ్ముడునాయుడు తగుబంధుజనులు
తమతమవాహనోత్తమములనెక్కి
వెంబడియేతేర విభవంబుమీర
తరుచుగారత్నముల్ స్థాపించినట్టి 30
పాలకిలోనెక్కి బట్లునుతింప
ఇరువంక * నరిగెల నెత్తిక్రమ్మంగ

* డాలు.

పటువేత్రకుల్ బరా బరులొనరించి<br>
"అవధారురాజేంద్ర" యని హెచ్చరింప<br>
పూజ్యుఁడు మలిదేవభూపతిచనియె<br>
ఐదువిధంబుల నమరు వాద్యంబు<br>
లాకాశమంతయుం నదరెడునట్లు<br>
సాంద్రధ్వనుల్ హెచ్చె సంతసంబంది<br>
కదనరంగంబైన కార్యమపూడి<br>
పుణ్యభూమిని జేరి పొందుగాఁ దండు 40<br>
విడిసెను వైరులు వెక్కసంబంద.<br>
వేదశాస్త్రజ్ఞులు విప్రులందరును<br>
అధిపునాశీర్వాద మమరంగ జేసి<br>
సరసంపుభూమి ప్రశస్తంబొనర్ప<br>
చెన్నకేశవదేవు శ్రీపాదజలము<br>
లివిరిపూజారులు దెచ్చుటజేసి<br>
తులసిపత్రంబులతోడ తీర్థంబు<br>
ఆచోఁటచల్లించి అలరు లగ్నమున<br>
శంకుసంస్థాపన సమ్మతి జేసి<br>
నిక్షేపముగ రత్న నిచయంబులుంచి 50<br>
తెచ్చినకంబంబు ధీరతతోడ<br>
నడికలనిన్నిల్పె నరనాథవరుడు<br>
కాశ్మీరకస్తూరి కర్పూరయుక్త<br>
పరిమళగంధంబు బాగుగాఁబూసి<br>
మైసాక్షిగుగ్గులు మహితధూపంబు<br>
అర్పించి అటమీఁద నారగింపంగ<br>
మృగములమాంసంబు మెప్పుగా వండి<br>
పంచామృతంబులు పాయసాన్నములు<br>
పేరైనపచ్చళ్లు పిండివంటలును<br>
భూతగాట్టునకప్డు భోజనంబిచ్చి 60<br>
అఖిలభూతంబుల కాచారముగను<br>
ఘనమైనపోతుల గావుచెల్లించి<br>
తరువాత * సర్పాఖ్య తటినిలోపల<br>
పటు † గంగధారనా బరగినమడుగు<br>
శాంతకుజని వీరపుంగవులెల్ల<br>
తమతమనామముల్ ధరలోనదరుచు<br>
ప్రఖ్యాతినొందంగ భక్తితోనందు<br>
స్నానంబు జేసి (విశాలతీరమున)<br>
నిలిపిరి ‡ లింగముల్ నేమంబుతోడ<br>
తరువాతమలిదేవ ధరణీశ్వరుండు 70<br>
నాయునితోడను నదికినే తెంచి<br>
కాలోచితక్రియల్ క్రమముగా జేసి

---

* నాగులేఱు.

† ఈమడుఁ గిప్పటికిని గార్యమపూడివద్దగలదు. ఇది నాగులేటిలోనిదే. దీనిలోని నీటినే సాధారణముగా నచ్చటిజనులు త్రాగుట కుపయోగించెదరు.

‡ వీరునిలిపిన లింగములివియేయని కొన్ని లింగములను జనులిప్పటికిని జూపుచున్నారు. ఇవి గంగధార మడుఁగునొద్దనగల గుడిలోనున్నవి. వీనికి పూజలుకూడ సల్పబడును.

నామతీర్థంబులు నయమొప్ప దీర్చి
పటకుటీరములకు బన్నుగా వచ్చి
సకలనాయకతతి సన్నిధినుండ
కొలువున గూర్చుండె కుధరారిరీతి
అప్పుడు బ్రహ్మన్న అవనీశుతోడ
ఉచితవిచారంబు నొనరించి పిదప
చెలగుచు సమరంబు చేయగా వలెను
తరచైన బలముతో తరలిరమ్మనుచు 80
పొలుపొందు నలగామ భూమీశుకడకు

(నాయుఁడు నలగామరాజువద్దకు భట్టును రాయబారమున కంపుట)

భట్టు పొమ్మన్న పయనమై తాను
వాయువేగముగల వాజిపై నెక్కి
బంగారు గుబ్బతో భాసిల్లు గొడుగు
పట్టుక ముందర భటుడొకడేగ
విలసిల్లు జల్లుల వింజామరంబు
లీవలావల నుండి యిద్దరు వీవ
* గురిజాలకేతెంచి కువలయభర్త
తావుకు ముందర తగ జెప్పి పంపె
విని కామభూపతి విభవంబు మెరయ 90
కొలువు శృంగారింప గూర్చినవారి
పంపించె వారలు పరిచారజనుల
రప్పించి తీర్చిరి రమణీయముగను
కస్తూరి చేతను గలయంగ నలికి
ముత్యాలతోడుత ముగ్గులు వెట్టి
కర్పూరముదకంబు కలిపి ముందటను
(కలయంపి చల్లి నిష్కల్మషభంగి)
శ్రీరామకథలును శ్రీకృష్ణకథలు
పన్నుగా వ్రాసిన పటముల దెచ్చి
కట్టిరి గోడలు కనుపడకుండ 100
మౌక్తికమంజీర మంజుపుంజంబు
వ్రేలాడుచుండెడు వివిధవర్ణముల
ఘనవితానమ్ములు కట్టిరి మీద
నిలువుటద్దంబులు నిలిపిరి దిశల
తంతుపటములు (విస్తరముగ బరచి)
వన్నెలపటములు వానిపై బరచి
పరచినవానిపై పంచవర్ణముల
రత్నకంబళములు రంగుగా బరచి
కాంచననవరత్నఖచితమైనట్టి
పీఠమొక్కటి దెచ్చి పెద్దకొల్వునను 110
నిలిపిరి దిక్కుల నిగ్గులు దేర
చెలువుగా నీరీతి జేసినవార్త

(నలగామరాజు కొల్వుకూటమున కేతెంచుట)

వినినంత నలగామపృథ్వీశ్వరుండు
సరసంపు పన్నీట జలకంబులాడి
ఘనశుచివస్త్రముల్ కటియందు దాల్చి
చిత్రాసనంబుపై జేరి కూర్చుండి
నిలువుటద్దము జూచి నేరుపు మీర
తిలకంబు నుదుట సుస్థితిమీర దిర్చి

* గురిగింజతీగెలు విస్తారముగా నుండుటవలన దీనికీపేరు వచ్చినదని కొందఱు చెప్పుదురు.

సంధ్యాదికృత్యముల్ సమ్మతిజేసి
భుజియించితరువాత పునుగుజవ్వాజి 120
కస్తూరిరసమును గలిపినయట్టి
శ్రీచందనము మేన చెలువుగాబూసి
తగటుకూనంబులు ధరియించితలకు
ఒకవింతయుష్ణీష మొప్పుగాగట్టి
నవరత్నమాల కంఠంబునవ్రేల
డంబుగా కర్ణకుండలములు మెరయ
భుజకీర్తులనియెడు భూషలుదాల్చి
మేనికిరక్షయై మించుతాయెతులు
దండచేతులకెంట ధారణచేసి
మురుగులుగొలుసులు ముంజేతులందు 130
తిరముగావ్రేళ్ళ ముద్రికలనుబెట్టి
నవరత్నఖచితంపు నడికట్టుదాల్చి
గండపెండేరంబు కాలికిబెట్టి
బంగారుదుప్పటి పైననుగప్పి
పావుకోళ్ళనురెండు పదములదొడిగి
కటికివారలుమ్రోల కనుపించిపొగడ
ఈవలావలజేరి హెచ్చరింపంగ
వేత్రహస్తులుగూడి విచ్చలవిడిని
సందడిదూరమై చనునట్లుచేయ
(రహిమించ) నంతఃపురంబును వెడలి 140
కొలువునకేతెంచి కుతుకంబుమీర
నిలిచెశృంగారంబు నేర్పునుగనగ
అంతటకింకరు లతివేగమునను
తూలికాతల్పంబు దూర్చినయట్టి
ముఖమల్లుగుడ్డలు మునుకొనితెచ్చి
పరచి పీఠముమీద బాగైనదిండ్ల
ఉంచినగనుగొని యుర్వీశుడైన
కామభూమీశుండు గద్దెపైనుండె
వెనుకను నరసింగవిభుడుగూర్చుండె
* నాగమయొకవంక నమ్రతనుండె 150
బంధుజనముచుట్టు బలిసికొల్వంగ
వేదశాస్త్రజ్ఞులు విద్వాంసులెల్ల
ఆశీర్వదించుచు ఆసీనులైరి
సకలదేశాధీశ సచివపుంగవులు
ముకుళితహస్తులై ముందరనుండ్రి
శాస్త్రపారగులును సంస్కారయుతులు
కవులునుభటులును కనిపెట్టియుండ్రి

(నలగామరాజు సభయందు విద్యా
వినోదములు జరుగుట.)

వింతగాగాయనుల్ వీణలబూని
తంత్రులుబిగియించి తగసుతిబెట్ట
సరిగమేళములైన స్వరసప్తకంబు 160
ఆరోహణావరోహణభేదములను
బహురాగసంప్రాప్తి పట్టుగాజేర్చి
సంచారిసంస్థాయి సరసభావముల
మృదుతరశబ్దార్థ మిళితమైనట్టి
ఘనతరాలంకార గతిపరంపరలు
† మూర్ఛనల్ మొదలైన ముఖ్యధర్మములు

* నాయకురాలీమెయే.

† సంగీతమునందు స్వరములయొక్క ఆరోహావరోహా క్రమము.

జంత్రంబుగాత్రంబు జంటగావించి
చెలగియొండిన చెట్లు చిగిరించునట్లు
పాడిరితమతమ ప్రావీణ్యమెసగ
పాకశాసనుకొల్వు పగిదినున్నట్టి 170
వేళ నేతెంచిరి విద్యాధికతను
నాట్యమేళమువారు నవవిలాసముల
వచ్చినమత్తమ్రొక్కి ప్రక్కగానిల్వ
ఘనవైభవంబున కామభూవిభుడు
నవ్వుచు సెలవిచ్చె నాట్యంబుచేయ
వరమృదంగము లెస్స వాయించుమేటి
కుడిభాగమునయందు కుదురుగానిలిచె
తాళమానజ్ఞులు దాపటిదిశను
నిలిచిరుత్సాహంబు నేరుపుమీర
ముఖవీణవాయించు ముఖ్యుడొకండు 180
రాగమాలాపించు రమణులిద్దరును
నిండువేడుకతోడ నిలిచిరి వెనుక
కంజలోచనయను ఘనమైనపాత్ర
మదనుపట్టపుదంతి మంజులవాణి
భరతశాస్త్రోచిత బహురాగములను
గరిమతోనేర్చిన కంతుబాణంబు
వచ్చిసభాసదుల్ వర్ణించిచూడ
నిలిచి నాట్యమునకు నేర్పరియైన
వేత్రపాణికిదగ వినయంబుజూపి
అతడొసంగినగజ్జ లతిభక్తితోడ 190
పాదములంగట్టి పంచవర్ణముల
కాశగట్టిగగట్టి కడుజపంబడర
మద్దెలతాళాల మధ్యనిల్చుండి
ఓరచూపునరాజు నొయ్యనజూచి
సమపాదయుతమైన స్థానకస్థితిని
తాత్పర్యమున దేవతలకును మ్రొక్కి
పుష్పాంజలియొసంగి పూనినాట్యంబు
సమకట్టినాదంబు సభయెల్లగ్రమ్మ
కైకోలువిడుదలల్ ఘనకళాశైలి
* కైముడికట్నముల్ కనుపింపజేసి 200
వెలయంగతొమ్మిది విధములయినట్టి
భూచారినాట్యంబు పొందుగాసలిపి
పదునారువిధములై పరగినయట్టి
ఆకాశచారియు నమరంగనాడి
అంగహారాఖ్యగలట్టినాట్యంబు
విదితమౌతొమ్మిది విధములనాడి
గతిచారిభేదముల్ గనుపడునట్లు
భ్రమణసంయుతదీప్త పటిమమీరంగ
పాణిభేదములను బాటించిచూపి
స్థానకసంచయ సంయుక్తి అమర
ప్రేరణిదేశిని ప్రేంఖణశుద్ధ
దండికాకుండలి తగుబాహుచారి
సప్తతాండవములు సల్పెచిత్రముగ
సభవారలాశ్చర్య సంయుక్తులైరి
తరువాతనిరుమేల దగుచెలులమర
సంయుతాసంయుతా చలనసంకుచిత
నానార్థకరములు నాట్యహస్తములు
శిరమునుచూపులు చెక్కిళ్లుబొమలు

* తాళవాద్యవిశేషము.

దంతోష్ఠకంఠముల్ తగు చుబుకంబు
ముఖరాగవక్షముల్ మొదలుగా నెన్న 20
అంగంబులారు ఉపాంగంబులారు
ప్రత్యంగసముదయం బారునుంగూడి
యెనిమిదివదియగు నెసగునంగంబు
లమరంగనభినయం బాశ్చర్యముగను
మూచెర్ల చెన్నుని మహిమంబు దెలుపు
ఆంధ్రసంస్కృతవాఙ్మయాదిగీతముల
భావంబు లెస్సగా ప్రకటంబుచేయ
మాచిరంభాదులు చోద్యంబునొంది
శిరసులువంచియు సిగ్గును జెంది
రప్పుడుభూమీశు డాదరంబొప్ప 30
వస్త్రభూషణములు వారలకిచ్చి
భట్టునురమ్మని పంపించెపిదప

(రాయబారమునకు వచ్చిన భట్టు నలగామరాజుసభయందుఁ బ్రవేశించుట.)

తురగంబుపై నెక్కి దుమికించికొనుచు
వచ్చికొల్వును జేరి వాజినిడిగ్గి
భూమీశు నెదుటను బొందుగానిలిచి
రాజాధిరాజ విరాజితకీర్తి
రాజవేశ్యావిట ప్రాభవప్రకట
గండరగండాంక ఘనదానచతుర
ధైర్యనిర్జిత మేరు ధరణీధరేంద్ర
శౌర్యపరాక్రమకళా సంపూర్ణచంద్ర 40
భాస్కరసమ తేజప్రాఢగుణాఢ్య
మానదుర్యోధన మైలమ్మసుతుడ
అనుగుభూపతిపుత్ర అంచితగాత్ర
వీరకామనరేంద్ర విభవదేవేంద్ర
రాయబారమునకు రాజుపంపించ
వచ్చిన * అల్లుని వధియించినారు
మనసున క్రోధించి మలిదేవరాజు
తమ్ములుతాను దనబంధుజనులు
వీరనాయకతతి విఖ్యాతిమెరసి
ఖరదూషణాదులు గతమైనచోటు 50
శ్రీశైలభూమిలో శ్రేష్ఠమైనట్టి
కార్యమపురిభూమి ఘనపుణ్యరాశి
పటుతరవిక్రమ వైభవంబలర
ధాటిమైనిల్చిరి దండుతోగూడ
అలరాజుతోడనే హతమాదుమంచు
చలమునకోపంబు సంవృద్ధినొంద
వీరనాయకులును వేగిరపడగ
మలిదేవభూపతి మన్నించియిటకు
నన్ను బుత్తెంచెను నరనాథవినుము

(భట్టు నలగామరాజునకు రాజనీతి విశేషంబులఁ దెల్పుట.)

పగవృద్ధిబొందించు భ్రష్టులేకాని 60
అడగించునేర్పరు లవనిలోలేరు

* ఇతడు "అలరాజు" ఇదివరకు బ్రహ్మనాయుఁడు రాయబారమునకై అలరాజును బంపినాఁడు. అలరాజు నలగామరాజున కల్లుఁడైనప్పటికి విరోధులపక్షమున రాయబారమునకు వచ్చినాఁడుగనుక నతనిఁ జంపిరి.

నరసింగభూమీశు నమ్మికమీరు
తమ్ముఁడా మలిదేవధరణీశుకడకు
పంపుడియేకమై పగలనునణచి
పలనాడుమొదలైన బహుభూములెల్ల
ఎదురెవ్వరును లేక యేలఁడిసుఖిత
శృంగారయుతు నరసింగుభూమీశు
పంపుము మలిదేవ పతిగలయంగ
పోరుమంచిదిగాదు భూమినెక్కుడను
పాడౌను దేశంబు పగమించెనేని 70
ప్రజలెల్లనశియించి పారిపోవుదురు
బండారమునకును పైకంబు లేదు
రాణువఅందుచే రహిచెడియుండు
చేజీతగాండ్రెల్ల జెలగికోపించి
యీగలజీతంబు లిమ్మందురపుడు
పతిబంటుమేరలు పరిహృతమగును
పంపినపనిచేయ పాలుమాలుదురు
తెలిసినశాత్రవుల్ ధీరతతోడ
భూమినిగొనుటకు బుద్ధిపెట్టుదురు
పగవారివార్తలు పరికింపలేరు 80
మేకొనిమీలోన మీరుపోరాడ
చూచెడువారికి (జులకనయౌను)
(శౌరిశాత్రవులుమీ గుట్టెఱుంగుదురు)
పలువలుమిము జేరి పగజావనీక
చెప్పుచునుందురు చెనటివాక్యముల
ఐకమత్యముచెడు నద్దానితోడ
చెడునుబలంబును చెడునుభాగ్యంబు
చెడునుయశంబును చెడునుశౌర్యంబు
చెడునురాజ్యంబులు చెడ్డపిమ్మటను
దేశంబు పరస్వాధీనమౌసుమ్ము 90
పారతంత్ర్యంబు మీపైబడగలదు
పరతంత్రజనముల పాలికష్టములు
చెప్పంగనలవియే శివునకునైన
పంజరంబుననున్న పక్షులరీతి
(బంధించిబుట్టలో పాములవాఁడు
వదలకపెట్టిన ఫణులచందమున
గంగిరెద్దులవాఁడు కావరమణచి
ముకుదాడుపొడిచిన పోతెద్దులట్లు
బోనులోనుంచిన పులులవిధంబు
స్వాతంత్ర్యహీనతఁబడియుండవలయు 100
పరికింపఁగా మనోవాక్కాయములను
ప్రథమమ్ముపట్టఁగారానిదిగాన
వాక్కాయములు రెండు బంధింపఁబడును
మనసులోఁబుట్టిన మంచితలంపు
లాచరణమునందు అలవికాకున్న
జన్మఫలంబేమి చచ్చుటేమేలు.
అవ్యక్తకీట తిర్యగనేకహీన
యోనులలో నెన్నియోమార్లు పుట్టి
పడయకపడయక పడసినయట్టి
దుర్లభనరజన్మదూషితంబగును 110
పార్థివాయిటువంటి పారతంత్ర్యంబు
కటకటా పగవారికైననువలదు.)
కుందబృందసితాబ్జ కుముదాప్తతార
హారడిండీరసీ హారపటీర
ఘనమరాళంబుల కాంతినిమించు

సత్కీర్తివేగమే సరవినశించు
అపకీర్తిజగముల నధికమైయుండు
ఉభయవాదులుమీర లొక్కటైయున్న
సకలకార్యంబుల సమకూర్పవచ్చు
ప్రజలకుసుఖమౌను పంటలుపండు 120
ధనముసంపాదింప దగియుండునపుడు
సంపూర్ణకాములై సకలసేవకులు
కాపాడుదురుమిమ్ము కనిపెట్టియుండి
పరరాజులనుగెల్వ పైకొనిపోయి
అమితమ్ముగాగ ధనాదులనెల్ల
కొనవచ్చు ధర్మముల్ కూర్పంగవచ్చు
సత్కీర్తిజగముల సాంద్రమైనిల్చు
కలహించి వెనుకటి కౌరవులెల్ల
గతిచెడిపడినట్టి కష్టముల్ వినమె
పగపెరిగించుట భావ్యంబుగాదు. 130
ఉభయవాదులుమీర లొక్కటికనుక
నయమొప్పజెప్పితి నామాటవినుడి
అనుచుజెప్పిననీతు లాలింపడయ్యె

(నలగాముండు భట్టుమూర్తిచెప్పిన వాక్యంబుల నిరాకరించుట.)

కామభూపాలుండు కనులెఱ్ఱచేసి
కోపంబుమించగా కొలువెల్లజూచి
వింటిరెసభవారు వీరలతలపు
రాణువతో మును రణభూమినిలిచి
తమ్మునంపమటన్న ధర్మమాతమకు
విన్నవారెల్లను వెరగందగలరు
మగతనంబునబుట్టి మగకాశగట్టి 140
మగటిమివిడనాడి మానంబువిడిచి
వారున్నతావుకు వచ్చుటతగవె
భటవృత్తివాడవై పల్కితివిట్లు
పూర్వకార్యంబుల పుట్టువుమరచి
యీరీతిబల్కితి వేమందునిన్ను
అనరాదువినగూడ దామాటలిపుడు
తమభూమినిచ్చిన దక్కించికొనగ
శక్తిగల్గినజాలు సదయుండనగుచు
ఇచ్చితితమభూమి యేలికొనంగ
అనుచువింతగబల్క ఆమాటలకును 150
భావంబుతెలియక పటురోషమంది
నవ్వుచుదగ్గరి నాయకురాలు

(నాయకురాలేకాంతంబున నలగామునకు సంధివిముఖంబులైన మాటలుచెప్పుట)

ఎవ్వరువినకుండ ఏకాంతమునను
పల్కెకామునితోడ ప్రావీణ్యమొప్ప
విను నరనాయక విన్నవించెదను
బాలరాజులుతాను బ్రహ్మనాయకుడు
కలిగినబలముతో కార్యమపూడి
కలనుప్రవేశించి కదనంబుజేయ
కనిపెట్టియున్నాడు గ్రక్కునమిమ్ము
రమ్మనిపిలిచిన రామనరాదు 160
కలిగినబలిమియు కలిమియువిడిచి
మగటిమివిడనాడి మానంబుదూలి
పంచిభూమినొసంగ పంతంబుగాదు
కయ్యంబుచేయుట ఘనవిచారంబు

ఇద్దరురాజులై యేర్పడిరేని
అవనిలోపలనాజ్ఞ కమరికయౌనె
సిరిపొత్తుచేయుట చెల్లునుగాని
ఆజ్ఞపొత్తిచ్చుట అదినీతిగాదు
చర్చించిచూచిన జ్ఞాతియుండంగ
అగ్నితోబనియేమి అన్నవాక్యంబు 170
వినవెపెద్దలుచెప్ప పృథ్వీతలేంద్ర
పగరకుజోటివ్వ పాదుకొనెదరు
తరువాతబెరుకంగ ధరనసాధ్యంబు
పాండవులకుభూమి పాలిచ్చిపిదప
కౌరవులేమైరి కార్యమర్మజ్ఞ
నీవెరుంగనినీతి నేనెరుంగుదునె
అనవినిభూమీశు డాత్మలోదెలిసి

(నలగాముఁడు భట్టుతో మలిదేవ రాజుబలంబుఁ దృణీకరించుట.)

భట్టునుకోపించి పలికెనావేళ
అలరాజుచావున కాగ్రహమంది
పగతీర్పనమకెంత బలమదిగద్దు 180
నాతోడబోరాడ నరులెంతవారు
సేనాధిపతిలేడు సేనలులేవు
బలువైనశూలాల బండ్లునులేవు
కరితురగంబులు కాలిమానసులు
లెక్కింపగానేమి లేవువారలకు
నేనెరుంగనిబల మెప్పుడువచ్చె
కూడిగుంపైయున్న గున్నయౌచింత
చెట్టుక్రిందికిలేదు శిబిరమంతయును
మూకంతవరిమడి మూలకులేదు
యేమివిచారించి యిటువచ్చినావు 190
బవరంబొనర్చిన పట్టిబంధించి
రణబలిపెట్టింతు రణభూమియందు
ప్రాణముల్ వలసిన బాలరాజులను
తిన్నగాదోడ్కొని తిరిగిపొమ్మంచు
పటుబుద్ధిగాజెప్ప బ్రహ్మనాయునికి
అనినకోపంబుతో నాభట్టుపలికె

(భట్టుమూర్తి నలగామునిఁ దూల నాడి బ్రహ్మనాయుని ప్రతాపా దులఁ బేర్కొనుట)

ఉత్తలమేటికి ఉర్వీశనీకు
కాకిమూకలరీతి క్రమ్మియున్నట్టి
బలముజూచుకగర్వ పడనేలనయ్య
సంధికేతెంచిన జామాతబట్టి 200
చంపినవారలు జగతిలోగలరె
* ఆడుబిడ్డనుజంపి అల్లునిజంపి
హింసకురోయని హీనవర్తనుఁడ

* ఆఁడుబిడ్డయనఁగా నిచట నలగామరాజుకూతురు. ఈమెపేరు రత్నాల పేరమ్మ. ఈమెను నలరాజునకిచ్చి పెండ్లిచేసిరి. అలరాజు నాయకురాలికుట్రచేఁ జంపఁబడినప్పుడు, భర్తయైన అలరాజుతోఁ బేరమ్మ సహగమనముచేసెను. ఈవిధమున నలగామరాజుయొక్క అల్లుడు కూతురు నొక్కసారియే చసిపోయిరి కనుకనే "ఆడుబిడ్డనుజంపి అల్లునిజంపి" యని చెప్పినాఁడు.

యెరుగవావీరుల నెరుగవాబ్రహ్మ
పగవారిగుండెలు బ్రద్దలుసేయు
పటుతరవిక్రమ వైభవాఢ్యుండు
పగరాజులబోజుంగు బ్రహ్మన్నతొల్లి
అష్టదిక్కులరాజు * లారణగండ్ల
కేతెంచిరణమున నెదిరినవేళ
కుంజరంబులమీద కోదమసింహంబు $\frac{5}{10}$
దుమికినరీతిని దోర్బలంబొప్ప
కినిసివారలనెల్ల గెలిచియాలమున
మెప్పించిదివిజుల మేటివజ్రంబు
సమమైనకుంతంబు జక్కగాగొనియె
కువలయేశులవద్దగానె అప్పనములు
ఆదినారాయణు నవతారమూర్తి
కృష్ణునిదెసవేళ కేరిగ్రాహంబు
చంపవచ్చిన జూచి జంకింతలేక
ఖండించివైచిన ఘనశూరుడతడు
చుట్టునిప్పులవేరు శోభిల్లుచున్న 20
నైటైనశివపురి నీరుగాజేసి
భూతరాట్టస్తంభంబు బుచ్చికొన్నట్టి
శూరుడుధీరుడు సుమహితుడెన్న
చెడనాడవారల జెల్లునానీకు
లక్షకొక్కడుసరి లావునయందు
పదికోట్లసైనను బవరంబునందు

తెగవేసిపుత్తురు ధీరతతోడ
ఉగ్రకోపాఢ్యులు ఉరుబాహుబలులు
అసహాయశూరులునరువదేగురును
భండనవిజయుల పటుపరాక్రముల 30
కన్నులమదమెక్కి గర్వించిపొంగి
కానకనిందింప గలుగునాఘనత
చిరినక్కకొమ్మపై చీదరరేగి
వృక్షంబుపైగంతు వేసినయట్లు
బలములుగలవని పటుగర్వమేల
యెదురునీబలముల నెన్ననేమిటికి
ఏనుగుల్ సింగము నెదిరింపగలవె
కార్చిచ్చుభంగిని గనలికోపించి
యున్నారురణమున కుత్సహించుచును
వెడలుడుకలనికి వెడలకుండినను 40
నడుతురుకోటకు నాయకులెల్ల
కరులుసరస్సును గలచినయట్లు
గురిజాలపురమును కోటతోగూడ
పెరికివైతురు క్రుంగువేరులతోడ
నిన్నునీతమ్ముని నీకైనవారి
నీదునాగమ్మను నీకూర్మిసఖుల
శిక్షింతురోరాజ సిద్ధమీమాట
అనిననారణభట్టు నందరుచూచి
కోరమీసలుదువ్వి కోపించిరపుడు

* ధరణికోటరాజైన యుత్తరేశ్వరునికి ననుగురాజునకు నిచ్చట గొప్ప యుద్ధము జరిగినది. బ్రహ్మనాయుఁడు, ఉత్తరేశ్వరుని నతనికి సహాయులుగావచ్చిన రాజులనుఁ బూర్తిగనోడించెను. ఇది సత్తెనపల్లితాలూకాలోనున్న యమరావతికి సమీపమున నుండియుండవచ్చును.

(నాయకురాలు భట్టుతో భీకర వాక్యంబులఁ బల్కుట.)

మంత్రిణినాగమ్మ మండుచుబలికె 50
భటవృత్తివాడవై పల్కితివిట్లు
కామభూపతి పాద కమలంబులాన
కరి చేతద్రొక్కింతు గట్టిగానిన్ను
భట్టువాడవుగాన బ్రతుకనిచ్చితిని
దైవంబునీపాల దయ చేసినాడు
వీరులుఘనులని వెరపింపరాకు
సమరంబులోవారు సమయంగగలరు
మశకాళి తేనెలో మడిసినరీతి
మిడుతలుచిచ్చులో మిడిసిపడ్డట్లు
మా చేతజచ్చును మన్నీలబలము 60
లన్నదమ్ములమేర లడగెసిద్ధంబు
వాజులపైబడి వడితోడబోరి
గురుతుగాశిరములు కుప్పలుచేసి
మత్తకరులచేత మట్టించివిడుతు
పయనమైదండెత్తివత్తుము మేము
పారకనిలుమని వాక్రుచ్చుపొమ్ము
టంచుకట్నములిచ్చి అతనినిసంపె
అనిచినపురికేగ నప్పుడెకదలి

(భట్టుకార్యమపూఁడికిఁదిరిగిపోయి గురిజాలలో జరిగినవృత్తాంతము రాజునకుఁ దెల్పుట.)

కార్యమపూడికి గ్రక్కునవచ్చి
మలిదేవుబొడగని మన్ననవడసి 70
కాముఁడాడినయట్టి కఠినవాక్యములు
వీరులునాయందు వినుచుండగాను
విన్నవించినరోష వివశులైవారు
కార్చిచ్చుభంగిని గనలికోపించి
గొబ్బుననీవేళ గురిజాలకేగి
కోటలగ్గలకెక్కి కూలద్రోసెదము
పట్టణంబంతయు పాడుచేసెదము
అనవుడునాయకు డప్పుడిట్లనియె
దండెత్తివచ్చెదు ధరణీశువిడిచి
తగదుకోటకునేగ ధర్మంబుగాదు 80
వీరధర్మముదప్పి వెనగుటయేల
అనిబుద్ధిగాజెప్ప నట్లుండిరంత
గురిజాలలోపలకుంభినీశుండు

(భట్టు కార్యమపూఁడికిఁబోయిన తర్వాత గురిజాలలో జరిగిన వృత్తాంతము.)

నలగామభూపతి నాగమబిలిచి
మనవద్దబంట్లును మన్నెవారలును
బుజ్జులనన్నంబు భక్షించువారు
రొక్కజీతంబుల రూఢులౌవారు
క్షేత్రముల్ జేసుక జీవించువారు
పల్లెలుబుచ్చుక బ్రతికెడువారు
నెలగోలుప్రజలకు నెల్లరకిప్డు
పైనమైరమ్మని పరగజెప్పింపు
కరితురగంబుల గదలింపుమనుము
బలుపైనశూలాల బండ్లదర్లింపు
సాగింపునీవుండి జాగుసేయకుము
నావుడుమంత్రిణి నాగమ్మపలికె

(నలగామరాజుతో నాయకురాలు
మలిదేవరాజుయొక్క బలముం
గూర్చి నిరసనవాక్యంబులాడుట.)

వినుము చెప్పెదనీకు వీరకామేంద్ర
పిల్ల సైన్యమునకు భీతిలనేల
అరువదేగురెకాని అధికులులేరు
బలములరప్పించి పన్నిపోరాడ
వారికిబలమేది ప్రారంభమందు 100
గుంపుగానల్లర గూర్చుకవచ్చి
బాలురగొనివచ్చి బ్రహ్మనాయకుడు
భూమిగొనెదనంచు బూనియున్నాడు
నీబల్మి కల్మలు నీకగోచరము
దేవేంద్రుడునునిన్ను ధిక్కరించునొకో
వారిబింకములకు వంగగనేల
నీవురాబనిలేదు నృపకులశ్రేష్ఠ
నన్ను బలమునంపు నాయుని గెలిచి
మన్నీలవీరుల మగటిమిదూల్చి
మేదినీభర్తను మేడపిపురికి 110
పట్టిచేతులతోడ బంపంగజూతు
అనిననాగమతోడ ఆరాజుపలికె
కొడుకుచావునకయి కొమ్మభూవిభుడు

(నలగాముండు నాయకురాలితో
రాచకార్యంబులఁ జెప్పుట.)

బహుఖేదయుక్తుడై పగతీర్చుకొనగ
బాలరాజులుతాను పటిమతోవచ్చి
ఉన్నాడుకలహింప ఉగ్రతేజమున
నాకులక్ష్యములేదు నాగమవినుము
నీతిశాస్త్రంబుల నిర్ణయరీతి
పగవారలతులని భావింపరాదు
కొంచెపుఫణియైన కొట్టెడుకొరకు 120
ఘనమైనదండమె కావలెగాని
కూడదుసన్నని కోలలగొట్ట
తప్పెసాతమకాన దరుముకవచ్చు
హెచ్చైనబలముతో ఏగుటనీతి
మరణమైనంజాలు మంచిదియంచు
తగజెంపొనర్తురు దారిద్ర్యయుతులు
వేగిరపడనేల వెలదిరోమనకు
ధనధాన్యబలములు తక్కువలేవు
పట్టుజాలవునిండి భండారములును
తరుగవుగాదెలు ధాన్యంబుహెచ్చి 130
తండ్రినాటిబలంబు తక్కువలేదు
మానాడుగలయది మంచిబలంబు
బంధుమిత్రులుచాల పట్టుగాగలుగ
అఖిలభూపతులునా ఆజ్ఞచేపట్టి
పనులనొనర్తురు భక్తితోనిప్పు
డిటువలెమనలావు హెచ్చియుండంగ
మలిదేవుకార్యంబు మనమునరాదు
కార్యస్వతంత్రత గలదెయాతనికి
భండారమాకొద్ది పగయధికంబు
ప్రకృతసైన్యమునకే ద్రవ్యంబులేదు 140
బలములగూర్చిన భక్షణమేడ
ఈవిలేకుండిన నెవరువచ్చెదరు
వచ్చినవారలు వశ్యులవుదురె
ఒకనెలమించెనా యొర్వరుబంట్లు
దొరబంటుమేరలు తొలగుచునుండు

కార్యముల్ చెడిపోవు కలిమి లేకున్న
ప్రతిమల నాడగ బట్టినయట్లు
నాటకవిధమున నాయుడు చేసె
కదనరంగంబున గానగనౌను
మన్నీలు వీరులు మనశక్తి యెరుగ 150

వేగమెచనిదండు విరియింపవలయు
చుట్టుకవారల శూలాలబొడిచి
తురిగరింఖలచేత ద్రొక్కించుదనుక
నెరయగన్నులనిండ నిద్దురవట్ట
దనియిట్లువలికిన ఆరాజుతోడ
నాగమ పల్కెను నయయుక్తి మెరయ
మనకప్పనము పెట్టు మన్నెవారలకు
పంపించి లేఖలు బలముల గూర్చి
పగతుల శిరముల బల్మిని గొట్టి
రాలుబరచినట్లు రణమున బరచి 160

భద్రగజంబుల బంతిగా గట్టి
మట్టింపవలెనన్న మైలమ్మ సూను
డట్టులేయని చెప్పి అంగీకరించి

(తనకు సహాయులుగా రమ్మని నలగాముఁడు నానా దేశ రాజులకు లేఖలఁ బంపుట.)

వ్రాయించె లేఖలు వసుధేశతతికి
"బ్రహ్మనాయునివద్ద బలువైనకుంత
మున్నదియనిభీతి నుర్వీశులెల్ల
అప్పనాలిచ్చినా రడిగినయట్టు
లేనునుమీరలు నేకమైయిపుడు
విక్రమసంపద విశదంబుగాను
బ్రహ్మనాయునిగర్వ పాటవం బణచి 170
మనసులోనరమరల్ మానియుమనము
పోరాడిశత్రుల బోరిగొనియెదము
శ్రీగిరీశునియాన చెన్నునియాన"
అనిబాసపత్రిక లపుడు వ్రాయించి
మామగుండముకోట మనుజేశునకును
* ధరణికోటపురికి దక్షుడైనట్టి
భీమదేవుండను పృథ్వీశునకును
గోలంకిభర్తకు ఘూర్జరపతికి
ఉరగసేనుండను ఉర్వీశ్వరునకును
ఏడుమాడెములేలు ఎరుకుకామునికి 180
పొన్నాళ్ళభూపతి † పొదిలెరాజులకు

---

* గుంటూరునకు 20 మైళ్ళదూరమున నుత్తరముగా సత్తెనపల్లి తాలూకాలోఁ గృష్ణానదీతీరముననున్నది. దీనినిఁ ద్రిణయనపల్లవుఁడు నిర్మించెనని సంప్రదాయజ్ఞులు చెప్పెదురు. ఈ త్రిణయనపల్లవుఁడు క్రీ. శ. 2-వ శతాబ్దియందో, 3-వ శతాబ్దియందో యుండియుండునని ఇతిహాసకర్తలయభిప్రాయమైయున్నది.

† నెల్లూరుజిల్లాలో నెల్లూరునకు కొంచెము వాయవ్యముగా 84 మైళ్ళ దూరముననున్నది.

* కటకాధిపతికిని † కల్వరాయనికి
‡ దేవాద్రినేలెడు తెలుగుబిడ్డలకు
పెదబాహుభూపతి భీమసేనులకు
సూర్యకుమారాఖ్య చోళరాజునకు
సంగ్రామవిజయుఁడౌ జయదేవునకును
జయసింగునృపతికి § చంద్రాద్రిపతికి
ధీరవిక్రముఁడైన తిరునాళ్లపతికి
• ప్రాభవాఢ్యుఁడు వీరభల్లాణునకును
అరవసింగాళ్లన కర్ణమాపతికి 190
బంగాళపతికిని పాండ్యేశునకును
మళయాళకర్ణాట మానవేంద్రులకు
వ్రాయించిపంపిన వారెల్లఁగూడి
చింతించిరీరీతిచిత్తంబులోన
నలగామరాజును నాయనివారు
పగపెట్టికొనిపోరపయనమైనారు
తనకుసహాయులై తరలిరండంచు
నయలేఖలంపెను నలగామరాజు
సవతిపుత్రులకిప్డు సమకూడెపోరు
తీరదెవ్వారలో తెగటారుదనుక 200
కాముఁడు గెల్చిన గలయప్పనములు
లేవనిపంపెను లేఖలుమనకు
కదలుదమిప్పుడు కామునికడకు
వీరకామునిగూడి వీరయుద్ధమున
బలియిచ్చిఅందరి బ్రహ్మనాయకుని
పోంగెల్లఁ అణగింప బోలునుమనకు
అనుచువిచారించి ఆప్రొద్దెకదలి
భేరీధ్వనులుమించి పృథ్వికంపింప
కరులుఘోటకములు కాలిమానుసులు
ధ్వజములుంగొడుగులుఁ తగుచామరములు $\frac{6}{10}$
వేలసంఖ్యలఁగూర్చి వెడలివేగంబె

---

* కటకము ఇది గజపతిరాజుల ముఖ్యపట్టణము.

† కర్నూలుజిల్లాలో నంద్యాలకు 21 మైళ్ల దూరమునఁ గల్వయను గ్రామముకలదు. కల్వరాయఁడనఁగా దీనినిబాలించినయతఁడేనని యూహింపవచ్చును.

‡ ఇది యాదవరాజుల రాజధానియగు దేవగిరియై యుండనోపు.

§ ఇదియే చంద్రగిరి. ఇది ఉత్తరార్కాడుజిల్లాలోఁ జిత్తూరున కీశాన్యమూలగ 29 మైళ్ళదూరములోనున్నది. యాదవరాజులలో నొకఁడయిన యిమ్మడి నరసింహభూపతిచేఁ గ్రీ. శ. 1000 సంవత్సరమునఁ గట్టఁబడినదని చెప్పఁబడు నొకప్రాఁత కోట యిప్పటి కిచటఁగల యొక కొండమీదనున్నదని తెలియుచున్నది.

• ఈతఁడు క్రీ. శ 1173-1224 వరకు ద్వారసముద్రము రాజధానిగా రాజ్యముచేసెను. ఇతనిపూర్వులు చళుక్యరాజులకు సామంతులుగా నుండిరికాని యితఁడు స్వాతంత్ర్యమువహించెను. ఇతఁడు రెండవ వీరభల్లాణుఁడు.

దిక్కుదిక్కుననుండి తెంపునవచ్చి
తీర్కైనచోటుల దిగియుండిరప్పు

(నలగాముఁడు నిజబలంబునుయుద్ధమునకై సన్నద్ధపఱచుట.)

డంతటనలగాము డధిక మోదమున
గొల్వునకేతెంచి గురురత్నమయత
అలరుపీఠంబున ఆసీనుడగుచు
తనమంత్రివరుల మిత్రప్రకరమును
పాలెగాండ్లదొరల బంధువర్గమును
పడవాళ్ళపిలిపించి పైనముల్ చెప్పి
రేవంతతుల్యులౌ దృఢశౌర్యయుతుల 20
రాహుత్తనిచయముఁ రమ్మనిచెప్పి
విజయునికీడైన విలుకాండ్రగములు
బంతినిభుజియించి పావలుదొడిగి
గర్రునదేన్పుచు గరములపైని
పిగిలిపిట్టలునుండ బెద్దసావళ్ళ
చేరిభాషించుచు జెలగిదుప్పటుల
సొగసొప్పగప్పుక సూరెలనుండ
బొట్టెలువిడియముల్ పొందించియివ్వ
మీసముల్ మెలివెట్టి మీదికెత్తుచును
గడ్డముల్ నివురుచు గంభీరమొప్ప 30
కదనంబుచేసెడు కథలుసెప్పుచును
మూకలైయుండెడు మూలబలమును
ధాన్యముల్ గొనువారి ధనవేతనకుల
నెలగోలుప్రజలను హెచ్చువంటర్ల
పిలిపించివారికి ప్రియములుచెప్పి
జయనమ్ముకమ్మని పల్కెనంతటను
వారెల్లరోషంబు ప్రకటముగాఁగ
పంతముల్ మీరంగ బలువిడిమెరసి
సురియలుపరిఘముల్ శూలసంఘంబు
ప్రాసముద్గరములు పటుఖడ్గచయము 40
పేరైనచక్రముల్ భిండివాలములు
పరశువుల్ బల్లెముల్ బాకుకటార్లు
శార్ఙ్గముల్ ధనువులు శరధులుదాల్చి
నియతిచేనందరు నిజశక్తిమెరయ
నలగామరాజుకు నమ్రులైనిలిచి
రటుమీదభూపాలు డానందమొప్ప
దోడువచ్చినయట్టి దోర్బలఘనుల
పటుపరాక్రములను పార్థివేశులను
పిలిపించివారికి ప్రియములుచెప్పి
మనముచేరగవలె మనవారితోడ 50
గరిమకార్యమపూడి కదనరంగంబు
పైనమైరావలె వడితోడమీరు
ఘనతరసుముహూర్తకాలమునందు
భేరీనికరమును బెద్దడమాయి
నిచయంబుమ్రోగింతు నిఖిలంబెరుంగ
అనుచుజెప్పినరాజు లరిగిరందంద
ఇతరభృత్యసమూహ మెల్లనువెడల
చయ్యనపురిలోన జాటగాబంచి
నలగాముడంతట నాగమతోడ
ఘనవాజిశాలల కడకునేతెంచి 60
వాజులనెల్లను వరుసనుజూచి
చెలగుసాహిణులను చేరంగబిలిచి
పరగగుర్రాలను భద్రంబుచేసి

పైనమ్ముకమ్మని పలికెనంతటను
కాంచననవరత్నఖచితమైనట్టి
పక్కెరల్ పైగట్టి బంగారుకుప్పె
కుచ్చులుజల్లులు కూడిప్రేలాడ
శార్ఙ్గశరధిఖడ్గ శరములనున్న
వజ్రాలురత్నముల్ ప్రభలదీపింప
ముఖమాలుపట్టలు మొగములగట్టి 70
అందెలుపదముల నాయత్తపరచి
పుత్తడిగజ్జల పొందికచేసి
కంఠదేశములందు కట్టియీలాగు
సకలజాత్యశ్వాల సవరణచేయ
రౌతులబిలిపించి రమణీయమైన
వస్త్రంబులిప్పించి వారలందరికి
వాజులరౌతుల వన్నెగాదీర్చి
కుంజరతతులను గుంపులుచేసి
పట్టుబొందులజోళ్ళ బలువైనయట్టి
గజ్జలపేరులు గంటలువచ్చి 80
గజములకెల్లను కట్టంగజేసి
అంకుశంబులబట్టి అలరుమావతుల
గొనకొనిరమ్మని కోపించిపలికి
ఘనమైనశూలాలు గట్టినయట్టి
శకటసమూహంబు సాగించిపిదప
పలుగుడారంబులు బరువులుమోయ
ఎద్దులనొంటెల హెచ్చైనయట్టి
వేసడంబులనెల్ల వేగంబపూన్చి
తర్లించికొనిపోవ దగిలియున్నట్టి
కొట్టికాండ్రనుబిల్చి గొబ్బునజెప్పి 90
తరువాతనలగామ ధరణీశ్వరుండు
జోస్యులబిలిపించి సుముహూర్తమడిగి
భేరీధమామికల్ వెల్లుగామ్రోగ
చేయింపుమనిఅంత జెప్పిపంపించె
వానిమ్రోయించెడు వారలుపటిమ
చరచినభేరుల సాంద్రనాదంబు
విన్నవారలకెల్ల వీనులుపగిలె
ఆకాశమంతయు నదరంగగడగె
ధరణీధరంబులు తల్లడంబంది
గుహలనునోళ్ళతో గూయంగసాగె 100
ఘనముగాభూస్థలి కంపింపదొడగె
దిగ్దంతులుముడింగె దిక్కులుమ్రోసె
తపనతురంగముల్ తప్పెమార్గంబు
ఎటువచ్చెనోయని ఎల్లదిక్పతులు
తెలియకభ్రాంతిచే దికమకపడిరి
అప్పుడునగరున కరిగియారాజు

(నలగాముఁడు గజారోహణంబొనర్చి యుద్ధభూమికిబయఁలుదేరుట.)

కాలోచితములైన కర్మముల్ దీర్చి
భూసియుఁతొడిగియు బొందించికట్టి
సకలశృంగారంబు సమ్మతిజేసె
సర్వబలంబులు చనుదెంచినిలిచి 110
తొలగిరినృపతికి దూరంబుగాను
మావంతులప్పుడు మదముననిలిచి
పగవారలకునెల్ల భయములుఁచేయు
పటుతరోన్నతమైన భద్రగజంబు
పైనిబల్వన్నెలు పరగుచునున్న
తగటుపటంబులు దంటగాజేసి

కూర్చినగంతలు కుదురుగా వెన్ను
పైగప్పిముఖమాలు పరపులు వేసి
పదునారువన్నియ బంగారుతోడ
రచియించిదానికి రత్నముల్ తాపి 120
తీర్చిన * చౌడోలు తెచ్చియుఁకట్టి
మణిగణతపనీయ మయమైనయట్టి
చప్పరంబొక్కటి సమకూర్చిమీద
పద్మరాగప్రభా పటలిచేమించు
బంగారుశిఖరంబు బాగుగనిలిపి
గంటలుమువ్వలు గట్టిగాగట్టి
చుట్టుముత్యపుచేర్లు శోభిల్లజేసి
మణిమయమంజరి మధ్యప్రేలాడ
చిరుతగంటలపేర్లు చెలువైనకరికి
కరమందుగూరిచి ఘంటసంధించి 130
పంచవర్ణంబుల ఫాలమందుంచి
ముత్యాలజల్లుల మొనసినపటము
కుంభస్థలంబున కొమరొప్ప జేసి
శుభ్రదంతంబుల శోభిల్లునట్టి
తపనీయవలయముల్ దట్టించిమొనల
ఘనశితశస్త్రముల్ ఘటనగావించి
బంగారుగొలుసులు పదములగట్టి
గంటలుప్రక్కల గణగణమ్రోయ
తొండంబుగొలుసుల తోడరంజిల్ల
శృంగారమీరీతి శీఘ్రమె చేసి 140
మావంతుడెక్కియా మను జేశునకును
చేయించెవినతిని జెలువంబుమించ
కూర్చుండజేసెను కుంభినినప్డు
దంతటఅనుచరు లతివేగమునను
పుత్తడినిచ్చెన బొందికసేయ
సేవకుడొక్కడు చేదండయివ్వ
ఘనకరీంద్రము నెక్కె కామభూవిభుడు
వెనుకనొక్కరుడుండి వినయంబుతోడ
విడియంబొసంగుచు వింజామరములు
వీచెశీతానిలాన్వితుని జేయంగ 150
తరువాత లేచెను దంతావళంబు
హేమదండంబుల ఎసగుచునుండు
మౌక్తికచ్ఛత్రముల్ మనుజేశునెదుట
పట్టిరిబహుకాంతి పటలిమిన్నదర
ధ్వజములసందడి తరచుగానొప్పె
అయిదువిధంబుల అమరువాద్యంబు
లధికరవంబుల ఆనందమొసగె
దళములతోగూడ ధరణీశవితతి
దిక్కులెల్లనుక్రమ్మి తిన్నగానడిచె
తరువాతనెలగోలు దళములుకదలె 160
కదలిరిదండును గైజీతగాండ్రు
బలమునల్దిక్కుల పటిమతోనడిచె
బహుమిత్రవర్గంబు బంధుజనంబు
మంత్రిపురోహితుల్ మన్ననరాగ
పచ్చలుతాపిన పాలకినెక్కి
నరసింగుడరిగెను నాథునివెనుక
పడవాళ్లుబలములు పదపదమనుచు
పటుతరధ్వనులచే బలికిరిహెచ్చి

* ఏనుఁగుమీఁపుపైఁ గూర్చుండుటకై యమర్పఁబడుతొట్టి.

వేత్రహస్తులు చేరి విదళింపగాను
సందడియెడగల్గి జరుగంగసాగె 170
మొనయుచు శతదండములు సరిచుట్టు
పోతుటీగకునైన బోవీలులేక
అధికమాబలమెల్ల అరుగుచునుండె
గుఱ్ఱముల్ గజములు గుంపులుగూడి
పక్షభాగంబుల వచ్చుచునుండె
మధ్యరాజెక్కిన మత్తగజంబు
సందుగానివ్వక జరుగంగసాగె
తురగహేషారవ స్ఫూర్తులుమించె
గజములుఘీంకార గాఢంబులాయె
ఘనతరోత్సాహులు కాలిమానుసులు 180
అట్టహాసంబుల నమరిరావేళ
గొప్పగుఱ్ఱంబెక్కి కుడిభాగమందు
జగడంబుచేసెడు చాతుర్యమెల్ల
నయగలిదెల్పుచు * నాగమచనియె
నగరంబువెల్వడి నలగామరాజు
దక్షిణదిశయందుఁ దనరెడుబయల
† దూబచెర్వనెడునుత్తుంగభూస్థలిని
నిలిపించెగజమును నిండినవేడ్క
వెంబడివచ్చిన విప్రులనెల్ల
వినయానబొమ్మన్న వేడ్కతోవారు 190
పగవారినెల్లను బలిమిమైగెల్చి
సకలరాజ్యములు వశంబుచేసికొని
ఏకాధిపతివౌచు నేలుభూస్థలము
అనుచుదీవనలిచ్చి అరిగిరివేగ
విశ్వాసపాత్రులై వెలసినయట్టి
బలములో బేరైన ప్రౌఢనాయకుల
పిలిపించివారికి ప్రియములుపల్కి
కస్తూరికాగంధ కలితులజేసి
తాంబూలములనిచ్చి ధైర్యంబుచెప్పి
నగరంబుకోట క్రన్ననమీరలంత 200
పగలురేయియుం బొరపాటులులేక
కలవారుమీరలేగద మాకుపూని
కాపాడవలెనన్న కదలిరివారు
పిమ్మటనాగమ పేరుపేర్వరుస
అధికారులనుబిల్చి ఆనియెవారలకు
గొల్లెనల్ మొదలయినగురుతరభార
నిచయంబులెల్లను నించినబండ్లు
శస్త్రాస్త్రచయమయ శకటసంఘంబు
సకలవస్తువులచే సాంద్రమైనట్టి
నానావిధంబుల నాణెంబులుండు 7/10
మందసంబులుగట్టి మసలకమోయు
వేసడంబులచ్చి వీరసేవకుల
జీతపురొక్కముల్ చేతిలోవేసి
వెంటనెపంపుడి వేగంబెమీర
లనవినివారలు అరిగిరివేగ
తరువాతకాముడు తరలించెకరిని

* ఈమెనే నాయకురాలని చెప్పుదురు. ఈమె నలగామరాజుయొక్క మంత్రిణి. శూరురాలు.

† ఇప్పటికి నీచెఱువు గురిజాలకు దక్షిణభాగమునఁ గలదు.

హయములు కాల్బలం బాజ్ఞతో నడిచె
బలపాదసంఘాత భవధూళిచయము
మేఘమార్గ బందు మేదురంబాయె
తపనునిహయములంధతవహియించె 20
అఖిలదిక్కులయందు నమరెజీకట్లు
బలములునడుచుట బహుకష్టమాయె
జళిపించుకత్తుల సాంద్రతేజంబు
మణిగణభూషణ మంజుదీధితులు
అంతటంతట మార్గమట్టెచూపించె
అవనీస్థలముక్రుంగ ఆదిశేషుండు
సిగ్గుచెందినయట్లు శిరములువంప
దిగ్గజంబులు మ్రొగ్గ దిశలుగంపింప
భటులుబిరుదముల పద్యముల్ చదువ
అఖిలయాచకకోటి కానందముగను 30
దానంబులిచ్చుచు దరలియాప్రొద్దు

(నలగాముఁడు గజారూఢుఁడై సేన
తోఁగూడి కార్యమపూడికేగుచుం
డఁద్రోవలోఁగోదమగుండ్లపౌరులు
విన్నపంబొనర్చుట.)

కోదమగుండ్లకుచేరె కుంభినీశుండు
పేరైనపల్లెల పెద్దలారెడ్లు
కోమటిజనములు కూడియేతెంచి
కామభూమీశుని కనుగొని మ్రొక్కి
విన్నవించిరిమహా వినయంబుతోడ
మామాటవినదగు మైలమ్మసుతుడ
వైరంబుమీకేల వసుధాధినాథ
అన్నదమ్ములుపూర్వ మవనియెరుంగ
కలహించిమడిసిరి కదనంబులోన 40
పగలేకయేలుట బలిమిమీకెల్ల
ప్రజలకుసుఖమౌను పరులుతగ్గుదురు
బిడ్డలవిధమున బ్రీతితోమమ్ము
రక్షించుచున్నారు రాజులుమీరు
కలహించిమడిసిన కదనంబులోన
ఇతరరాజులుమాకు నేరువచ్చెదరో
మీరురాజ్యముచేయ మేదినియందు
దుష్టులనిర్భయోత్సుకతనశించె
శిష్టులకును మేలు చేకురుచుండె
ప్రాణముల్ భద్ర ముపద్రవమడగె 50
కరములు హెచ్చుగ గైకొంటలేదు
అనుకూలురై మీర లవనియేలంగ
కనుగొన్న మాకెల్ల కలుగుశుభంబు
హితులముగనుకమీ కెరుగజెప్పితిమి
శక్తిచాలదుమాకు సారెకుదెల్ప
అనివిన్నవించిన అనియెవారలకు
మదమునగర్వించి మలిదేవరాజు
రణముచేయగదర్లి రమ్మనిమాకు
భట్టునుబంపెను బలమెరుంగకయె
పైనమైవచ్చితి బవరంబుచేయ 60
వీరులనాయుని వెసమలిదేవు
బంధుమిత్రాదుల పారిపోదోలి
వేగమెవత్తుము విభవంబుమెరయ
ఎలమితోనుండుడీ యిండ్లలోనిలిచి
ఈరీతివారికి హితములుచెప్పి
పొమ్మన్నవారలు పోయిరావేళ

మరునాడునలగామ మండలేశుండు
మనమునరోషంబు మల్లడిగొనగ
కాలోచితంబైన కర్మముల్ దీర్చి
ఘనతరశృంగార కలితుడై వెడలి 70
భద్రకరీంద్రముల్ పైనిగూర్చుండె
తమ్ముడునరసింగ ధరణీశ్వరుండు
ఎలమితోపాలకి నెక్కివెంబడిని
స్థిరగతిబలములు చెలగంగనేగె
ఆర్పులబొబ్బల అవనికంపింప
సాగరముప్పొంగి చనుదెంచినట్లు
మేఘముల్ వినువీథి మేదురంబగుచు
పరువులుపెట్టెడు భంగినిదోప
క్రమ్ముకకార్చిచ్చు కదిసినరీతి
పవనుండుదట్టమై పరగినమాడ్కి 80
వివిధబలంబులు వేగమెనడిచె
చక్కగామిరియాల సరిహద్దుదాటి
ప్రజలమేలిమిచింత పల్లెయుదాటి
కౌరవుల్ పాండవుల్ కలహంబొనర్చి

(నలగాముఁడు కార్యమపూడిఁ జేరుట.)

కూలిచచ్చినయట్టి కురుభూమిరీతి
రౌద్రగుణోద్వీర రక్తసిక్తంబు
పావనచరితంబు పలనాటిపేర
పొలుపొందుచుండెడు పుణ్యదేశమున
కాశికిసమమైన కార్యమపూడి
రణరంగభూమిని రాజుదానిల్చి 90
భద్రదంతినిడిగ్గె పదిలంబుగాను
చచ్చొకమేర్పడ సరసంపుభువిని
హేమకుంభంబుల నెసగుచునున్న
పటకుటీరంబులు పన్నుగాగట్టి
మూలబలంబులు మొనగాండ్రువచ్చి
కూర్చున్న ఘనమైన గొల్లెనల్ కూర్చి
స్వర్ణసింహాంకంబు పరగెడునట్టి
నెరిధ్వజస్తంభంబు నిల్పిరి మ్రోల
కప్పురపువిడెంబు గావించివచ్చి
కొల్వుకూటంబున కూర్చుండెరాజు 100
దాపట నరసభూధవుడునుదొరలు
కొండమన్నెమరాజు కోటకేతుండు
కుడిదెసరెడ్డియుం గురియైనయట్టి
చేరువకాండ్రును జేరికనలర
వీరఘంటలుగట్టి విలసిల్లుచుండు
సోమదేవరరౌతు శూరులైనట్టి
వీరరాహుత్తులు వెలయమున్నూట
అరువదిమందిదా మట్టహాసముల
రణశూరులైనట్టి రాజపుత్రులును
పోటుబంట్లనుబట్టి పొడిచెడువారు 110
ఊడిగలందంద యొనరికొల్వంగ
దేవతాగణయుత దేవేశురీతి
భూపతిసభమందు పొల్పొందుచుండె
రాజువెన్కంజేరి రమణినాగమ్మ
కార్యఖడ్గముల ప్రజ్ఞావిశేషముల
తెలుపుచుగూర్చుండె ధీరతతోడ
ఇతరబలంబులు హెచ్చువేగమున
తర్లెడువారును తగనడ్చువారు

విడిచెడువారునై వెరవైనచోట్ల
తగినతావులయందు తప్పకనిల్వ 120
మూడుసహస్రముల్ ముఖ్యులౌబంట్లు
కలనికంగాణముల్ కనఏడునూర్లు

(వివిధదేశరాజులువచ్చి నలగామ
భూపతిని గలిసికొనుట.)

లలిమీర వీరభళ్లాణుండువచ్చె
పటువిక్రమాఢ్యులు పండ్రెండువేలు
గడలవారొకవేయి గజచయమమర
ఘాన్నాళ్లవిభుడు సముద్వృత్తివచ్చె
పదినూరువేలకాల్బలములతోడ
కూడిముప్పదివేల కుంజరావళుల
కదిసెమాళవపతి కామభూవిభుని
కడగితొమ్మిదివేల కాలిబంట్లు 130
నమ్మదగినయట్టి నాయకచయము
ఒకవేయిఅశ్వాల నొనర * ప్రతాప
రుద్రుడుపంపించె రూఢసంగతిని
పదివేలకాలరి బలములతోడ
ముదమున ప్రాచిదేవుండునుగలసె
నీలిటెక్కెంబుల నేటైనబంట్లు
వెంటరాబంగాళ విభుడునుగలసె
గజములుపదివేలు ఘనమైనబలము
ఇదిపదివేలతో నేతెంచె † నొడ్డె
భువినేలు ‡ బలదేవపురుషోత్తముండు 140
పదివేలతురగముల్ బంట్లొకలక్ష
కూడిరాకల్యాణ ఘూర్జరపతులు
కాముని గదిసిరి గౌరవమెసగ
ధనరథాస్యుడువచ్చె దర్పంబుమీర
మహిదేవిదాసుడు మదకరుల్ వేయి
శకటసహస్రముల్ చనువునగొలువ
ఏతెంచెసాహస మెల్లవారెరుగ
దశలక్షబలము లుత్సవమునరాగ
ద్రావిడకేరళ ధరణీశవరులు
వచ్చిరినలగామ వసుధేశుకడకు 1[illegible]
పద్మసేనుండును పరువడివచ్చె
గురుసహస్రద్వయ ఘోటకయుతుడు
గుండమదేవుడు గొబ్బూరిరాజు

---

* ఇతఁడు, ప్రతాపరుద్రీయకృతిపతియై క్రీ. శ. 1295 సం॥ మొదలుకొని 13[illegible] సంవత్సరమువరకు రాజ్యముచేసి, రుద్రమదేవికి దౌహిత్రుఁడై ప్రఖ్యాతివడ[illegible] ప్రతాపరుద్రుఁడు కాక, కాకతిప్రళయునితరువాత సింహాసనమెక్కి క్రీ. 1140 సం॥ మొదలుకొని 1199 సం॥ వరకు రాజ్యముచేసి మొదటి ప్రత[illegible] రుద్రుఁడని ఇతిహాసమునఁ బేర్కొనఁబడు రుద్రదేవరాజై యుండవలయును (సోమదేవరాజీయము చూడఁదగును.)

† ఓఢ్రశబ్దభవము "ఒడ్డె" దీనినిప్పుడు "ఒరిస్సా" యందురు.

‡ ఓఢ్రదేశమునుఁబాలించిన గజపతిరాజులలో నితఁ డొకఁడు.

మొదలయినరాజులు ముఖ్యులౌబంట్లు
ఏనూరుతోఁగూడ నెనుబదిమీద
ఎనుబదివేలతో నేతెంచిరపుడు
తక్కినరాజులు తమతమబలము
లెసగగనేతెంచి రివ్విధంబునను
వచ్చినబలముల వరుసగణింప
బుద్ధిమంతులకైన బొసగదు నేర్వ 160
సంతోషముల చేత చనుదెంచినట్టి
మనుజేంద్రులకునెల్ల మంచికట్నములు
తెప్పించియిచ్చిన తిన్నగానుండి
రంతటనాగమ్మ అశ్వంబునెక్కి
తగినయిరవుచేసె ధరణీశతతికి
మిగిలినవారికి మేలైనతావు
లమరించివిడియించె ఆనందమొంద
ఎక్కడచూచిన నెడలేకకదిసె
ఇసుకజల్లిననైన ఇలమీదబడదు
చొరదువాయువుదండు చొచ్చినరాదు
సుపథంబుదొరకదు చోద్యమైయుండు
ఆదండులోపల అఖిలవణిజులును
సకలధాన్యంబులు సకలరత్నములు
బంగారువెండియు బహుధనవితతి
సరిగవస్త్రంబులు సరసపుంబట్టు
పటములుఘనతంతు పటములుమరియుం
కాంస్యతామ్రశ్వేతకమ్రభాండములు
రసవర్గములనెల్ల రంజనంబొప్ప
క్రయవిక్రయమ్ముల కావింతురెపుడు
సౌందర్యఘనతచే సంపన్నమైన 180
వేశ్యవాటికలొప్ప విశదంబులగుచు
దారిద్ర్యమనునది దండులోలేదు
ధనధాన్యవృద్ధిచే దనరెడులక్ష్మి
వేలంబులోపల విలసిల్లుచుండు
అంతటబహువిక్రమాఢ్యమానసులు

(వీరులు తమకు యుద్ధమునకాజ్ఞ యిమ్మని బ్రహ్మనాయునిఁ దొందరపఱచుట.)

భండనవిజయులు పటుపరాక్రములు
వీరులుతత్సైన్య విధమెల్లజూచి
బ్రహ్మనాయునితోడ వాక్రుచ్చిరిట్లు
నలగామభూతలనాథుండుమదిని
తనకెవ్వరెదురని ధైర్యంబుపూని 190
భండనవిజయత ప్రబలుడనంచు
భువనభయంకర భూరిప్రతాప
పటిమగల్గినయట్టి బ్రహ్మనునిన్ను
విజయోద్ధతాటోప వీరులమమ్ము
తలపకమాత్సర్య దర్పముల్ మీర
వీపుననెదురెక్కి వెరవకనిలిచె
కనియూరకుండుట కార్యంబుగాదు
పందలవలెనుంట పంతంబెమనకు
అనివార్యమైనమా యాజ్ఞాఖలీన
బద్ధులమైనిల్వ బడితిమిగాక 200
కత్తికినొక్కొక్క కండనుదీసి
పరిపంథిగణముల పట్టిమర్దించి
కుమ్మరావమునందు కుటిలతగచ్చ

ఫలము వేసినభాండ పటలంబుపగిలి
వెంకులై పడ్డట్లు పెనుకంప మొంది
విడిబడియేనుగుల్ వీథులబార
సకలబలంబుల సమయించియమని
పురికంపియుండమే భుజశౌర్య మొప్ప
ఏమివిచారించి యిటులుంటిరయ్యా
సెలవిచ్చిపంపుము శీఘ్రమె మమ్ము 8/10
నాయుడుశీలమ నాయుండుపలికె

(బ్రహ్మనాయుఁడు వీరులతోఁ దొందరపడవలదని నీతు లుపదేశించుట.)

వినరయ్యవీరులు విశదంబుగాను
విదితస్వశక్తిపై విశ్వాసమున్న
ఎదిరిసామర్థ్యంబు తృణముగాదోచు
(సహజగుణంబిది జంతులకెల్ల)
కానకామేశుండు కదిసెనుమనల
నలగామునిందింప న్యాయముగాదు
రణకేళిసల్పుట రాజధర్మంబు
మనకున్నబలముల మనముకూర్చికొని
పోయిశత్రువులను పోరిగొనవలయు 20
సాహసంబొనరింప (చనదన్నిపట్ల
సర్వకార్యములొక్క చాయనరావు
హెచ్చైనతనబల మెదిరిబలముల
కొలదులుపరికించి కొరతలుండినను
సవరించిసకలంబు సన్నద్ధపఱచి
చిత్తంబునందన్య చింతలుమాని
కార్యదీక్షవహించి కదనరంగంబు
చేరంగబోవుట స్థిరవిచారంబు
నేనుమీయుత్సాహ నిర్మలస్ఫూర్తి
తగ్గించినానని తలపగవలదు 30
తమకింపగూడదు తఱియగుదనుక)
నాయుడుకొమ్మ భూనాథుండుపలికె
పలికెదుచల్లని వాక్యంబులిపుడు
కొడుకునుపగరచే కోల్పోయినట్టి
దుఃఖంబుమదిలోన దొరలుచునుండ
నలగాముజంపక నామదిచింత
వాయదు నీవెన్ని పలికిననైన
ఎవ్వరుతనకెదు రీభూమినంచు
జగడంపుడేరాలు సరవినెత్తించి
ఉన్నాడుమనమీద ఉగ్రతేజమున 40
కమలబాంధవవంశ కర్తయైనట్టి
* బలభద్రరఘుపతి పంపుననిప్పు
డరచియుంనొకశరం బారాజుకడకు
అంపిననిలిచిన నతడునాసాటి
చెడివిర్గిపడెనేని క్షితిభర్తగాడు
పంతమియ్యదియని వాక్రుచ్చిపిదప
గాండీవసమమైన ఘనచాపమెత్తి
వాసుకికోరల వాడిగలట్టి
దొనలనుమెరయగ తూర్ణంబెతివిచి
వెలయుంగముత్యాల పేరుల్లాడ 50
అలుగునమణిగణం బమరంగముఖము
మధ్యాహ్నభానుని మాడ్కికన్పట్టి

* ఇతఁడు కొమ్మరాజుయొక్క ధనుర్విద్యాగురువై యుండును.

శరము చాపంబున చయ్యనదొడ్గి
కర్ణపర్యంతంబు గ్రక్కునలాగ
కోపంబుమించగా కోయనియార్చి
కనుగవదృష్టిని కదలకనిలిపి
పీకతోమంటలు వెళ్ళగాయుచును
బాణమువిడిచెడు పటిమకావేళ
నక్షత్రములుండొల్లె నాగేశుడులికె
అవనియుకంపించె ఆకాశమదరె 60
కనురెప్పపాటున కంటెవేగమున
పిడుగుపడ్డట్లుగా పృథ్వీశుడదర
ఘనమైనగొల్లైన కంబంబుదాకె
అదియంతతునకలై అవనిపైబడెను
పసిడికుండలుడొల్లి పడెగుడారంబు
లానందమునవార లరచిరిమించి
విడిబడియేనుగుల్ వీథులబారె
అశ్వముల్ రాహుత్తులరిగిరిచెదరి
బండ్లతోనెద్దులు పరువిడసాగె
సాలగుర్రంబులు సరభసమంది 70
కట్లుతెంచుకపారి గట్లపాలాయె
కోల్పడిగెలుపట్టు గోడుగులనెల్ల
పట్టెడువారలు పడవైచిచనిరి
కల్లోలమందుచు కామునిబలము
భయమునజనిచింత పల్లినిదాటె
వీరకామేంద్రుండు వేత్రపాణులును
పడవాళ్ళనంపించి భయములదీర్చి
జనులనుబిలిపింప చయ్యనవచ్చి
తమతమతావుల దగనుండిరపుడు
వీరులందరుతమ వేలంబులోన 80
నిలిచిరిసంతోష నిర్మలమతుల
ధీవరులైన జ్యోతిషికులనపుడు
పిలిపించిబ్రహ్మన్న ప్రియములుచెప్పి
సమరము చేయగ సరసమైనట్టి
సుముహూర్తమొక్కటి శోధింపుడన్న
ఆరీతిమాచెద మందులకేమి
క్షీరాబ్ధిశయనుడు శ్రీవల్లభుండు
దాసరక్షణమందు దయగలవాడు
చెన్నుడుమీవెంట చేరియున్నాడు
సకలకార్యంబులు సమకూరుచుండు 90
అనిచెప్పిదీవించి అరిగిరివార

(ఈసమయమున మేడపిలో జరిగిన వృత్తాంతము.)

లంతట మేడపినైనవార్తలును
* తెలుపుడుజనులకు దెల్లముగాగ
పరమోత్సుకతచేత † బాలచంద్రుండు
సంగడిబాలురు చనవునగొలువ
రమణీయమైనట్టి రాచిల్కచదువు
వినుచువేడుకపుట్టి విచ్చలవిడిని
గుమ్మడికాయలు కొంతసేపాడి

---

* ఇది కవివచనము.

† బ్రహ్మనాయునికొడుకు.

చెరకులపందెంబు చెల్వొప్పగెలిచి
తనసంగడీలకు దయతోడనిచ్చి 100
తమ్ములువెంటరా ధామముజేరె.

(అనుజులతోఁగూడి బాలచంద్రుఁడు తల్లియైన ఐతమ్మవద్దకువచ్చుట.)

తల్లినిగనుగొని తనవారలందరును
మ్రొక్కినదీవించి ముదమునతల్లి
పలికెనీవిధమున వారలతోడ
నాయాత్మసుతులార నాయన్నలార
పద్మనాభునిగర్భ పాథోధియందు
పూర్ణచంద్రులరీతి బుట్టినవారు
ఘనమైనభూషణ కాంతులుమీర
మీరన్నదమ్ములు మేలిమినాదు
ఎదుటనునిల్చి నన్నేమివేడెదరు 110

(ఐతమ్మ బాలునిమనోరథముఁ దెల్పుమని యడుగుట.)

చిత్తంబులోకోర్కె జెప్పుడీయనిన
నవ్వుచుబాలుడు నాతికిట్లనియె
తరుణిరో మేమునీ తనయులమగుట
సకలవైభవములు సమకూరెమాకు
ప్రియముతోమమ్ముల పెంపుసేయంగ
ప్రొద్దుపోదేమిట పొసగంగనన్న
ముద్దులకొమరుని మోమువీక్షించి
ప్రొద్దుపోవకయున్న పుత్రరత్నంబ
పోకలాటలచేత బుచ్చుము ప్రొద్దు
ఆడుడిముత్యమ్ము లమరుబంతులును 120
గుంతమాపలనాడి కొనిగెల్చికొనుము
పైటనాడగవద్దు బడలెదుసుతుడ
కుటిలజంతులదెచ్చి గుడిలోననుంచి
విడిపించిపోరాడు విధమునుచూడు
రూకలకుప్పలు రూఢిగనాడు
మనినతల్లిరో వాని నాడితిమమ్మ
వానిపైనిష్టాస పడదుచిత్తంబు
క్రొత్తలపైన మక్కువగల్గియుండు
అనిబాలుడాడిన ఐతమ్మపలికె

(భారతయుద్ధాదికథల వినుమని యైతమ్మ బాలచంద్రునికిఁ జెప్పుట.)

ఆటపాటలపైన ఆలసితివేని 130
వినవయ్యబాలుడ విశదంబుగాను
విబుధులవిప్రుల పిల్వగబంచి
వినుముభాగవతంబు విజ్ఞానమొదవ
భారతరణకథ పాటించివినుము
భీష్ముడొనర్చిన వివిధశౌర్యముల
అచలితబుద్ధితో ఆలింపుపుత్ర
ద్రోణుండునెరపిన దోర్బలగరిమ
మనమునబట్టింపు మానితసుతుడ
కర్ణుండుజూపిన ఘనపరాక్రమము
సూక్ష్మంపుబుద్ధితో జూడుమతనయ 140
శల్యునియందున్న శస్త్రచాతురిని
జాగరూకతమెయి చర్చించుకొడుక
దుర్యోధనునిమాన ధూర్వహపటిమ
ఆసక్తితోడుత అరయుమాత్మజుడ

చాపంబువిడిచిన సవ్యసాచికిని
కృష్ణుడు చెప్పిన గీతలయందు
కర్మరహస్యముల్ గాంచుకుమార
నేర్చినవానిని నేరుపుమీర
దృఢధైర్యమున ఆచరింపంగవలయు
అనినమాటలువిని ఐతమ్మతోడ 150
బాలుడిట్లనియెను పకపకనవ్వి

(బొంగరములాడుట నిజమనో
రథంబని బాలుఁడు తెల్పుట)

వినవమ్మతల్లిరో విమలేందువదన
ధర్మార్థకామ తత్వంబెరుంగుదును
శాస్త్రజాలంబుల చాలగవింటి
మనమునదెలిసితి మర్మంబులెల్ల
ప్రకృతకౌమార చాపల్యంబుకతన
చిత్తవిశ్రాంతికై చేరియీవేళ
బొంగరాలాడగ బుద్ధిజనించె
సెలవిచ్చిపంపుము శీఘ్రమెయమ్మ
ఈరీతిపలికిన ఏణాక్షికలగి 160
వెరచియుం వెరవని విధముననవియె

(బొంగరము లాడవలదని తల్లి
బాలునికిఁ జెప్పుట.)

విశదంబుగాబాల వినుముద్దుతనయ
ఈబుద్ధితలపగ ఇచ్చలోవలదు
వలసలోనున్నాము వడబొంగరాల
ఆడినజేతప్పి అతివలకైన
తగుబాలురకునైన దాకునుబోయి
పడతులుకోపించి పలుతెరంగులను
శపియింతురీమాట సత్యంబుపుత్ర
శాపింపబడుటకు సాహసమేల
నామాటగడచుట న్యాయంబుగాదు 170
నావుడుబాలుడు నాతికిట్లనియె

(బాలుఁడు తల్లిమాటలకుఁ
బ్రతివచనంబు సెప్పుట.)

ముదితరోనావంటి ముద్దులసుతులు
పుట్టరాభూమిని పుణ్యాంగనలకు
వారేలశపియింత్రు వనితరోనన్ను
అలిగితిట్టినపాప మనుభూతమగును
పూబోడినాదేహ పోషణార్థంబు
పెట్టనితావుల పెట్టిదాచెదవు
కొదమసింహముతన గురుశౌర్యమమర
ధరవిజృంభింపక దాగునాయొదిగి
ఏటికిభయమంద నింతిరోనీకు 180
అనవినిఅబ్జాక్షి ఆత్మలోగలగి

(బొంగరాలాటకూడదని తల్లి
మరలఁ జెప్పుట.)

ఏలబాలుడనీకు నింతధైర్యంబు
శాపింపబోరని సంశయమేల
దుష్టలుతులువలు దుర్భాషిణులును
తారతమ్యంబుల తగవెరుంగకయె
కచ్చెకుముందుగ గాలుదువ్వెదరు
భావంబులిట్టివి పడతులకెల్ల
నీమేలుగనుగొని నేనోర్వలేక

పలుకుటకాదోయి బాలచంద్రుండ
అనిచెప్పినంతట ఆబాలుడనియె 190

(బాలుఁడు తల్లిమాటలకుఁ దగు
సమాధానము చెప్పుట.)

దుష్టభావుడగాను ధూర్తుడగాను
వెలదులకెల్లను వినతిచేయుదును
దయచేయుదురువారు తనయునిమాడ్కి
తడవాయనేవచ్చి తల్లిరోయిటకు
పుత్రునిమాటలు బుద్ధిలోనుంచి
నాకాంక్షలీడేర్చి నన్నంపవమ్మ
బాలచంద్రుండిట్లు పలికినవేళ
ఐతమ్మనవ్వుచు నపుడునేర్పరుల

(బాలచంద్రుఁడు తల్లియొక్క
లోభత్వమును దూలనాడుట.)

ఒజ్జలబిలిపించి యొప్పుగామీరు
బొంగరంబులుకొన్ని భూనిచేయంగ 200
గునన్నబాలుండు తనలోననవ్వి
ల్లితోననియెను దయవచ్చునట్లు
శత్రువులబోజుంగు సాంద్రవిక్రముడు
గండుభీమనగర్భకంధిరత్నమవు
లోభమ్మునీకేల లోలాయతాక్షి!
ఏడుకోటులసంఖ్య నెసగినధనము
కలిగినఆగండుకన్నమనీని
చెల్లెలవైయుండి సిరులుచెన్నొంద
చెనటిబొంగరములు చేయించుకొరకు
ఏరీతిమనసొప్పె ఏణాక్షినీకు

బీదవాక్యమ్ముల పెదవులపైకి
తేరాదుపెద్దల తీరుకువెలితి
భావంబులోలోభ పటిమమీరంగ
గృహకార్యములు నిర్వహింపజాచెదవు
నీవంటిదానికి నీతియేచెపుమ
నీవెయుంచికొనుము నీతండ్రిసొమ్ము
సకలదేశాధీశ సంఘంబునెల్ల
సమరరంగంబున సాధించిమించి
వారిచేమాతండ్రి వలసినయట్టు
లప్పనంబులుఁగొన్న అధికధనంబు 20
పొందుగాదెప్పించి పుటముపెట్టించి
పైడిబొంగరముల పరగజేయింపు
వెండిచేములుకులు వెలయబెట్టింపు
పట్టుచేజాలెలు పన్నిపేనింపు
ముత్యాలకుచ్చులు మొదలగూర్పింపు
తెప్పించియిప్పింపు తీవ్రంబుగాను

(బాలుఁడు నిజౌదార్యమును
దెల్పుట.)

దండివిక్రములైన తమ్ములునేను
ఆడుకోవలెనంచు అభిలాషపొడమె
నావంటిబాలుండు న్యాయంబుతప్పి
బీదబొంగరముల వెలది! యెట్లాడు? 30
చూచినవారలు చోద్యమందుదురు
ప్రజలుదూషింతురు బహువిధంబులను
సకలరాజులగెల్చి జయముచేకొన్న
బ్రహ్మనాయునిగర్భ పాథోధియందు
చంద్రునివిధమున జనియించినట్టి

బాలుని కీలేమి ప్రాప్తమాటహహా
కాలమహిమమని గర్వింపగలరు
కావునలోభమ్ము గాంచనీకేల

(బాలచంద్రుఁ డైతమ్మకు వైరాగ్య
ముపదేశించుట)

కలుములు నిత్యంబుకావు మాతల్లి
మెరపు మెరయుఁరీతి మేఘంబులట్లు 40
బుద్బుదంబులభంగి పోవును జెదరి
ఈరీతిదలపోసి యెరుకచేమించి
సంపదవేళనే సకలభోగములు
పొందంగవలె ధర్మములు చేయవలయు
భోగానుభవముచే పుట్టిసంతృప్తి
వేసటజనియించి వెగటుగాదోచు
అటుమీదవైరాగ్య మమరుచునుండు
ధర్మముల్ చేసిన తనరు పుణ్యంబు
సజ్జనసహవాస సంప్రాప్తికలుగు
వైరాగ్యమధికమై వర్తించుబిదప 50
భోగధర్మంబులు పుట్టినయపుడె
సరవివిరాగిత సంసారమెడలు
సద్గురు పదసేవ చయ్యనగలుగు
అందుచే నిర్వాణమందికయగును
కావున భోగముల్ గైకొనవలయు
శాస్త్రంబులీలాగు చాటిచెప్పెడిని
ధనమందులోభంబు తగ్గింపుతల్లి
ప్రాణంబనిత్యంబు భవమనిత్యంబు
ద్రవ్యంబువచ్చు నాతవిలి వెన్వెంట
* ఇటువంటి మానవుఁడీదేహమెడలి 60
పోయికొన్నాళ్ళకు బుట్టునుమరలి
కర్మరహస్యముల్ గాంచినవారు
ద్రవ్యంబునకు నవస్థాద్వయమిట్లు
తనరింపుచుందురు తద్జ్ఞులగనుక
నీవెరుంగని మర్మమే నెరుంగుదునె
చనినభూపతులెల్ల సమకూర్చినట్టి
చిత్రమౌధనములో చిన్నమేమైన
గొనిపోయిరావెంట గూర్పంగనేల
ఆశచాలించుటే ఆనందపదవి
చెలిమినామాటలు చిత్తమందుంచి 70
మాకోర్కెలీడేర్చి మమ్ముమన్నింపు
ధనలోభమందిన దానవుకనుక
ఇంతగా జెప్పితి ఏణాక్షినీకు
నీలోభగుణమును నేవిన్నవింతు

(బాలచంద్రుఁ డైతమ్మయొక్క
వెనుకటి లోభకార్యంబుఁ
బేర్కొనుట.)

తప్పక మదికిని దార్కొణగాను

* "देहिनोऽस्मिन् यथा देहे कौमारं यौवनं जरा।
तथा देहान्तरप्राप्ति धीरस्तत्र न मुह्यति"
అని యర్జునునకు శ్రీకృష్ణుఁడు చేసిన యుపదేశముకూడ నిట్లేయున్నది.

నీ మేనగోడలి న్నీవడ్గినపుడు
నా మేనమామలు నా పెండ్లి నాడు
మా కులంబునఓలి మాడలుగలవు
తగినధనంబీక తామీయమనిరి
ఆమాటమీదట నమ్మరోనీవు 80
ముట్టడివేసితి మూర్ఖతతోడ
అయిదురోజులదాక నంతమామామ
అక్కవైనను నేమి అలిగిన నేమి
అడిగినధనమీయ కతివ నేనీయ
బ్రహ్మవచ్చినగాని భయపడబోను
నియమంబునాకిది నెలతరోయన్న
ఏమికావలె నీకు నిప్పింతునిప్పు
డన్న సందేహింపకడుగవే యనిన
మాడలు తూమెడు మాకుగావలయు
ఇప్పింపు వేగమె యింకొక్కమాట 90
అఖిలరాజులొసంగినట్టి యప్పనము
లందుదాలువిగల వతివరో వినుము
పొల్లును తాలును పోసగవుమాకు
తీరైనమాడలదెచ్చి యిమ్మన్న
మదిలోననొవ్వక మగువనీవప్పు
డూడిగీలనుబంపి ఒప్పైనధనము
తెప్పించిరాశిగా దీర్చిపోయించి
కొలిపించికొమ్మన్న కోరిమీయన్న
మెట్టొండు కట్టించి మీదదానెక్కి
హెచ్చుగాతూర్పార నెత్తెనుభువిని 100
చిందిపోయినవెల్ల జెడుతాలుపొల్ల
అనిరోసి మిగిలిన అర్థమంతయును
అధికమౌ తూమొకటపుడు తెప్పించి
ఎలమితూమునకంటె హెచ్చుగాగొలిచి
కళ్ళమద్దువితానె కావలెననుచు
తాలునుపొల్లును దానెగోరుచును
ఇందన్నిమాకని హెచ్చినకాంక్ష
కట్టించిమూటలు కైకొని తల్లి
నేనెరుంగుదుదల్లి నీమనస్సరణి
మించినకీర్తికై మెలగితివప్పు 110
డన్నపుత్రునిమాట కైతమ్మనవ్వె
హెచ్చుగా నవ్వినారెనమంద్రసుతులు
గారాబుతనయుల గడుప్రేమమదర
గూర్చుండబెట్టియు గూరిమితోడ
మొదలురప్పించిన ముఖ్యులైనట్టి
ఒజ్జలుతనమ్రోల నుండంగజూచి
బొంగరంబులుచేయ బొసగునుమీకు
పైడియిప్పించెద బట్టినయంత

(ఐతమ్మ బొంగరంబులు చేయఁ బంచుట.)

పనిముట్లుదీసుక పడిరమ్మటన్న
వారలిండ్లకుబోయి పట్టెడకారు 120
కమ్మచ్చులును నీరుకార్లు సుత్తెలును
ఘనమౌపడచ్చును కత్తెరల్ మరియు
అలరుమచ్చులుగుదులాదియైనట్టి
పనిముట్లుగొని తెచ్చి భామకన్నెదుట

భక్తితో నిలిచిరి పటిమదీపింప
ఐతమ్మసెలవిచ్చె నంతటవారు
చదు రేర్చికూర్చుండిసరి పనిముట్లు
పరచిముందరకడ పావకున్నిలిపి
పుష్పగంధంబుల పూజకావించి
నైవేద్య తాంబూల నతులొనరించి 130
కనకలక్ష్మికిదగు కమఠంబు నిలిపి
కడుగొప్పమూసలుగట్టిగా జేసి
నిజమైనబంగారు నిండించిమంచి
పలుకుల గరగించి పరికించునపుడు
కాలహేతువదేమొ ఘనలక్ష్మిమహిమ
కరగువేళలవన్నె కదలకనిల్చె
తరువాతఆశ్చర్యదంబై చెలంగ
చెదరిఅంతంతకు చీకాకునొంది
చిదురుపలాయె విచిత్రంపుభంగి
ఒగిచుట్టుయున్నట్టి ఒజ్జలందరును 140
కనుగొనిభీతిల్లి కంపితులైరి
బాలుడావేళను ప్రాభవం బొప్పు

(బాలచంద్రుఁడు
భౌతిక రహస్యములఁ దెల్పుట.)

తల్లి తోననియెను తననేర్పుమీగ
కడనెన్ని చిదురులై కరగిననేమి
కరగినవేళల కళలేమిచెడక
నిలుచుటే శకునంబు నిశ్చయంబిదియ
అటుమీదనగుకార్య మదియేమిలెక్క
చెడనిపదార్థముల్ సీమలోలేవు
చెడునుగట్లును నదుల్ చెట్లును లతలు
సంచారి జీవముల్ సమయుచునుండు 150
సమసినజీవముల్ జనియించుమరల
జడపదార్థంబులు చైతన్యమొందు
* పొలియదొక్కటివిను బొత్తిగానెపుడు
పుట్టదు క్రొత్తది భూమిలోపలను
పోయినదానిని పోయెనటంచు
ఉన్నదానినిజూచి యున్నదటంచు
భావింపగారాదు పడతిలోకనుము
కాలవశంబున గలపదార్థములు
రూపభేదంబుల రూఢిగాబొందు
ధర బ్రహ్మవ్రాతలు తప్పింపరాదు 160
కావునఆశ్చర్య కారణంబేమి
మాయాభవంబిది మాసిపోగలదు
హృదిలోన సంశయమేల నేతల్లి
కావింపుమమ్మ బొంగరములనెను
వేయిమాడలచేత విరచించిఅపుడు

(సిద్ధమైన బొంగరముల
బాలచంద్రాదుల కొసంగుట.)

మంగలియైనట్టి మాధవుకిచ్చె

* "नित्यं परमाणुरूपं" అని తార్కికుల మతముకూడ నైయున్నది.

కుమ్మరపట్టికి గురుతుగా రెండు
వేలకు జేయించి వేగమె యొసగె
సరిమూడువేలతో చాకలచందు
బొంగరంబమరించి పొసగనిప్పించె 170

అలరునాలుగు వేల కమరిక చేసి
కంసాలిచందుకు గరుణతో నిచ్చె
అయిదువేలకు జేసి యాకమ్మరికిని
ఇప్పించె మదిలోన నెన్నికొనంగ
వెలమపట్టికి ఆరు వేలకుదీరె
పదివేలతో జేసి బాపనికిచ్చె
నారాయణుండైన నాయునికొడుకు
బాలునిచేతికి పండ్రెండువేల
తీరిచివన్నెలు దీరిచిపైన
సకలరత్నంబులు సంఘటియించి 180

ములుకులు వెండితో మొనలగ దించి
ఇచ్చెను సంతోషమింపెసగంగ
పిమ్మటనొజ్జల ప్రియముతో జూచి
తగినకట్నంబుల దయమీరనొసగి
పొమ్మని సెలవీయ పోయిరివార
లంతటఐతమ్మ ఆనందమునను
చారువర్తనవాడ చక్కనివాడ
గురుతరరేచర్లకులవార్ధిసోమ
బాలుడనీమది పరిణామమాయె
షడ్రసోపేతమౌ సకలవస్తువుల 190

వంటయైయున్నది వచ్చి మీరెల్ల
భుజియించి పొండన్న పొందుగా లేచి
బానసశాలలో పక్వవస్తువుల
గరిమతో భుజియించి కరములుకడిగి
వాసశాలకువచ్చి వసియించిమించి
కాశ్మీరకర్పూరకస్తూరులెసగ
తెచ్చినగంధంబు దిన్నగాబూసి
చిత్రవర్ణంబుల చెలగుచునున్న
తగుపట్టువస్త్రముల్ దవిలిధరించి
బహువిధమణులచే భాస్వరమైన 200

ఆణిముత్యంబుల అమరినయట్టి
మెరుగుభూషణములు మేనులదాల్చి
భాసిల్లి శృంగారభరితులైవచ్చి
తప్పక నిలచిన తనయులజూచి
ఎలమితో ఐతమ్మ యిట్లనిపలికె

(ఐతాంబ కుమారులకు బుద్ధులు గఱపుట.)

మేడపిలోపల మేలైనయట్టి
రచ్చకొట్టంబుల రాజవీధులను
విపణిమార్గంబుల విబుధగేహముల
బొంగరాలాడగ పొసగదుసుమ్ము
కరుణతో నాబుద్ధి గైకొనిమీరు 10/10

మేడపిలోనుండి మేలుగావెడలి
ఉత్తరదిశయందు ఒప్పుచునున్న
చాలురావులకాడ సరసమైనట్టి
రమణీయమగు మొల్లరావిక్రిందటను
ఆడుడిబొంగరాలానందమెసగ
పొందుగా ఈరీతి బుద్ధులుచెప్పి
చక్కనిముత్యాల జాలెలదెచ్చి
అందించి చేతుల కాశీర్వదించె

సేవకుల్ తగరుల శృంగారపరచి

(బాలచంద్రాదులు బొంగరము
లాడఁబోవుట.)

పసిడిపల్లంబులు బాగుగాగట్టి 20
పట్టుజాలెలు దెచ్చి పరువడిగప్పి
ముందరనిలిపిరి ముద్దుపొట్టేళ్ళ
బాలచంద్రుండును భ్రాతృసంచయము
వేడ్కమీరగవాని వీపులనెక్కి
కమ్మరగరితలు గణములుప్పొంగి
వింజామరలబట్టి విసరుచునుండ
గచ్చకాయలుకొన్ని కలిగినయట్టి
తిత్తులు చిరుతలు తీరైనగోడెలఁ
జూదమాడుటకయి సొగటాలుకొన్ని
బంతులుపిట్టలు పంజరచయము 30

పేరైనడేగలు పిగిలిపిట్టలును
శారికావళి కీరసంఘంబు మరియు
ఆటలసాధనాలవి వెంటరాగ
రయమునజనిచాలు రావులసరస
మొల్ల పేరిటిరావి మొదటను జేరి
తీరైనతగరుల డిగ్గి వేదికల
పైనిబరచినట్టి పలువన్నెలమరు
రత్నకంబళముపై రంజిల్లనుండి
బొంగరాలాడగ పూనిరావేళ
సరస మేడపిజనుల్ సంతసంబొప్ప 40

బొంగరాలాడెడు పొంకమంతయును
పోయిచూడదలంచి బుద్ధులునిలిపి
వనితలుతంద్రుల పతులపుత్రులను

(అమ్మలక్కలు బొంగరా లాటఁ
జూడఁబోవుట.)

అత్తలమామల అడుగుటమాని
గృహకృత్యభారంబు లెడలచాలించి
ఒక్కరినొక్కరు ఒగిబిల్చికొనుచు
తమలోనముచ్చటల్ దగజెప్పికొనుచు
రయమునబోయిరి రావులకడకు
ఆపురవరమున అలరుచునుండు
వరవిప్రకామిని వైశ్యకామినియుఁ 50

ఎడలేనిపొందుచే ఎసగెడువారు
తరివిచారించిరి తమలోనదాము
నాయునిపుత్రుండు నవమన్మథుండు
బాలుడు సంతోషభరితుడైయిపుడు
తమ్ములుతానును దననేర్పుమీర
బొంగరాలాడగ పూనియున్నాడు
కనుగొనివత్తము గ్రక్కునబోయి
అని పల్కె బ్రాహ్మణి ఆవెతోనపుడు
ప్రకటమ్ముగావైశ్య. వనితయిట్లనియె
ఓయమ్మబాలుండు ఉరుమనిపెడుగు 60

పాపపుణ్యంబుల భావింపడతడు
శకట సమూహంబు చనియెడువేళ
చీలలూడగదీయు జేతులబట్టి
ఆడెడుపాపల అదరంటగొట్టు
వెంగలిదుష్టుండు వీతధర్ముండు
వానిజూడగనేల వాంఛజనించె

నావుడు బ్రాహ్మణనారి యిట్లనియె
నేబోయివచ్చెద నెలతనీవుండు
మనినుడువంగ వైశ్యాంగన కూర్మి
పడతినీదగుపొందు పట్టుట మొదలు 70

ఎడబాసియుండుట యెన్నడు లేదు
నేడునిన్నెడబాసి నేనెట్టులుండు
వచ్చెదపదమని వడితోడ లేచి
నీరాడికడవను నేర్పుగాబట్టి
అత్తకుమామకు అతిభక్తిమ్రొక్కి
కనుగొనివత్తుము గ్రక్కునబోయి
అనననవ్వి పెద్దవా రతివలనంప
కదలిరికర్పూర గంధులు చెలగి
చనిదీర్ఘికనుడిగ్గి జలములనంత
కప్పిననాచును గడకేగజేసి 80

నిర్మలోదకములు నించికడవల
శృంగారమొప్పగ శిరములబెట్టి
దురితబంధంబుల దొలగింపలేక
కర్మఫలంబును గడవగలేక
నెలతలు చనుదెంచి నిల్చిరచ్చోట
ఆశ్చర్యవాక్యాల అప్పుడిట్లనిరి
ఈతడేపలనాటి నేలేడు బ్రహ్మ
తనయుండు సౌందర్య దర్పకుండితడె
మార్తాండతేజుండు మహితశౌర్యాఢ్యు
డీచొప్పునీయొప్పు నీచక్కదనము 90
అలవియేపొగడంగ అజునకునైన
బంగారుకలశాల పన్నీరుతెచ్చి
మదనారి నభిషేక మాడించెదొల్లి
* మంచాలకాతన్న మానితయశుడు
కలితసౌందర్యుండు కందర్పసముడు
పతియేలయానని పాయనివేడ్క
ముచ్చటలాడిరి మూకలై చేరి.
† ఆసమయంబున అనపోతు లేచి
పట్టుగాగిరివ్రాసిపైడిటంకంబు
నిల్పిబాలునిజూచి నెనరొప్పననియె 100

ఊరకయున్నాడ వోబాలచంద్ర
బొంగరాలాడేదు బుద్ధితోతమ్ము
లెల్లను గనిపెట్టి యిపుడున్నవారు
నీవుముందాడక యెవరాడరాదు
మొదలిడుమని చెప్ప ముదమున అతడు
తోరంపుసందడి తొలగింపుమనెను
బద్దలవారంత పరుగునవచ్చి
చెలగిబరాబరుల్ చేసిరిమ్రోల
తంత్రజ్ఞులగు మేటి తమ్ములు లేచి
చేరిఆటలనాడ చిరునవ్వునవ్వి 110

(బాలచంద్రుఁడు బొంగరమును
ద్రిప్పుట.)

బలపరాక్రముడైన బాలచంద్రుండు
ఘనతరమాణిక్య ఖచితమైనట్టి
బొంగరంబరచేత బూనుకయుండి

* బాలచంద్రుని భార్య.
† బాలచంద్రుని యన్న. బ్రాహ్మణక్షేత్రసంజాతుఁడు.

నేరుపు చూడుడి నిలిచిమీరెల్ల
తిరిగింతు చేతిలో దీటులేనట్టు
లవనిపై బడకుండ అనంతరమందె
పట్టియాడింపెద బహువిధగతుల
అని చుట్టునున్నట్టి అతివలజూచి
అత్తమామలభక్తి అమరినవారు
పతిమాటలకెదురు పలుకనివారు 120

వినయమానామాట వినుడిమీరెల్ల
దూరాననుండుడి తొలగికన్గొనుడి
అని చెప్పి బొంగరం బరచేతబట్టి
ముత్యాలజాలెను ముదమున జుట్టి
చేయెత్తిహుంకించి స్థిరబలంబునను
వేసినవడిమీర వేగమెపోయి
సంయమీశుండను చక్రాతిదాకి
మింటిమీదికెగసి మెరుగులుక్రమ్మ
* అన్నమ్మయను పేర నలరుచునున్న
చక్కనికోమటి జలజాయతాక్షి 130

మీఁగాలికిందాకి మించినముగికి

(అన్నమ్మయను వైశ్యకాంతకు బొంగరము దగుల నాపె మూర్ఛిల్లుట.)

అరకాలుదిగివచ్చి అవనికిదాకె
తాకినఆవైశ్య తరుణిభీతిల్లి
గగనంబుపైబడ్డ గతికంపమొంది
కరిగినఖర్జూర తరువుచందమున

తటుకునమూర్ఛచే ధరమీదనొరిగె
చెదరికుంతలములు చిక్కులనొందె
మిక్కిలిచెమటచే మేనివస్త్రంబు
తడిసెనుగుండియ దడదడమనియె
మేదినీరేణువుల్ మేనెల్లగప్పె 140

ఈరీతిబడియున్న యేణాక్షికడకు
పొక్కుచుజేరెను పొలతులగుంపు
కప్పురపలుకులు కర్ణంబులందు
కర్పూరరజమును గలయంగనూరి
పదతలంబులయందు పాణులయందు
కస్తూరిగంధంబు గలిపిపట్టించి
చానలుశైత్యోపచారముల్ సలిపి
చింతింపబోకుడి చెలిలేచునిపుడె
అనిపల్కనంతలో ఆమూర్ఛదెలిసి
ముకుళితహస్తుడై ముందరనున్న 150

(కోమటియన్నమ్మ బాలునిదిట్టుట.)

బాలునిగనుగొని బలుకోపమునను
కన్నులెర్రగజేసి కాంతయిట్లనియె
ఓరిదురాత్ముడ ఓరిదుర్మార్గ
క్రిందుమీదెరుగక కెరలుచున్నావు
గర్వమేటికినీకు కాంతలయెడను
కలిగినదినవలె గట్టంగవలయు
ఎరుకమాలినచేష్ట లేలచేసితివి
మురియంగనేలనీ పొంగెల్లనణగ
ముదిరెమదంబునీ మురిపెంబుక్రుంగ
తగమల్లభూపతి ధరమెల్లనీదు 160

* ఈమెయే విప్రస్త్రీతోఁ గూడ వచ్చిన వైశ్యతరుణి.

సదనంబు జేరిన సత్తువనుండి
త్రుళ్లుచున్నావు దుష్టచిత్తుండ
సమరంబులోనిన్ను శత్రులు గ్రుమ్మ
నడిచెడుపదముల నారసాలేయ
చూచెడుకనులకు సూదులు గ్రుచ్చ
మీయయ్యలెల్లను మించినబలిమి
చేరివైరులతోడ శ్రీయుద్ధభూమి
ఉప్పొంగుచున్నవా రుర్వీశు నెదుట
వారిలోగలయుము నీవడికానవచ్చు
పోతుసింహమురీతి పొదలుచున్నావు 170

మదముపట్టినగిత్త మాడ్కి మేదపిని
ఉన్నావు కావర ముడిగెడుగాక
అనితూలనాడిన అధికరోషమున
కలుషించిఆనపోతు కనులెఱ్ఱ చేసి
పట్టుజాలెదుబూని భామలనెల్ల
పరమసాహసమున పారంగదోలె
అప్పుడాఆనపోతు నమరంగజూచి
పలికెబాలుడునీతి పటిమచెలంగ
వనితలనదలింప వచ్చునామనకు
అందుచేపాతక మంటునుమనల 180

అనిచెప్పితరువాత ఆవైశ్యవనిత

(తప్పుక్షమింపుమని బాలచంద్రుఁ
డన్నమను బ్రార్థించుట.)

కాదరమొప్పగ ననియెబాలుండు
"నొప్పికల్గుటచేత నోరాపలేక
అనరానిమాటల అడితిగాని
నీమీదపగచేత నేనేయలేదు
బాలులకాటలు పథ్యంబుగనుక
ఆడితిబొంగరం బదినిన్నుదాకె
దైవకృత్యంబని తలపకాడితివి
నిన్నింకనేమందు నీరజనేత్ర
అబలవునిన్నేమి యనవలదైన 190
నాతప్పుమన్నింపు నయభావమునను
కరుణింపు"మనుచును కాంతకావేళ
పచ్చవన్నెలపట్టు పటములేచించి
ఘనమైనమందులే కాలగట్టించి
మాన్పికొనుటకును మాడలేనూరు
ప్రియముననిప్పించి వెలదితోననియె
అమ్మమాతల్లి నీసైతమ్మమారు
* మాయయ్యలెల్లను మలసిదండెత్తి
పోయియేదిక్కున బూనియున్నారు
తలపోసిచెప్పవే తరుణిరోనేడు 200
నావుడుకోమటి నారియిట్లనియె
కదలింపకుమునన్ను గన్నమాయయ్య
కాలికయిననొప్పి ఘనమాయెగనుక
కోపించిపలికితి గురుతెరుంగకయె

---

* "మీయయ్యలెల్లను మించినబలిమిఁ । జేరివైరులతోడ శ్రీయుద్ధభూమి । నుప్పొంగుచున్నవా రుర్వీశునెదుట । వారిలోఁగలయుము నీవడికానవచ్చు" అని యీ కోమటిస్త్రీ యన్నది గనుక బాలచంద్రుఁడీప్రశ్న నడుగుచున్నాఁడు.

మీాయయ్యచనిన సమిద్రంగమరయ
ఇలమీాదనెచటనో యేనునెరుంగ
ఐతమ్మయెరుగు నన్నడుగకుమన్న
ఆటలజాలించి అనుజులుదాను

(బాలచంద్రుఁడు తల్లివద్దకేగి
బ్రహ్మానాయుఁడు పోయిన
యుద్ధరంగమేదియో యడుగుట.)

మేలైనవీథుల మేడపికేగి
వేగమె యిలుచొచ్చి వినయంబుతోడ
తల్లికిమ్రొక్కిరి తనయులందరును
మ్రొక్కినదీవించి మురియుచునున్న
తల్లితోబాలుండు తానిట్లువలికె
వెలదిరో మేడపి వెలవెలబోయి
కళదప్పియున్నది కారణంబేమి
నయమొప్పనాయుడు నాయకులెల్ల
ఎక్కడికరిగిరో యెరిగింపవమ్మ
అనుడునావాక్యంబు లతివకర్ణముల

(బాలునిమాటలువిని యైతమ్మ
మూర్ఛిల్లుట.)

ఘనతరశరముల గతినేచనులికి
తరిగినకదళికాస్తంభంబురీతి 20
గుండెలువరియలై కుంభినినొరగె
చంద్రమండలమందు సాంద్రంబుగాను
జలదంబుకప్పిన చందంబువెలయ
సలలితకుంతల జాలంబుచెదరి
కప్పినవదనంబు కనుపింపదాయె
కన్నులనీరాని కాటుకచెదరి
గళబద్ధనవరత్నకాంచనయుక్త
హారజాలములెల్ల నటునిటుదొలగె
జమిలిముత్యపుచేర్లు చక్కనైయున్న
పాపటబొట్టూడి ప్రక్కనబడియె 30
వేనలిదురిమిన విరులెల్లజారి
పడెనుభూస్థలిమీాద బరచినయట్లు
కొంతసేపునకామె గొబ్బునలేచి
ఘనమైనదుఃఖంబు గ్రమ్మంగబలికె

(ఐతమ్మ యుద్ధవిముఖములైన
మాటలు బాలునికిఁ జెప్పుట.)

చేసినధర్మముల్ చెడిపోయెనిపుడు
వరపుణ్యజాలంబు వరదనుగలసె
నాభాగ్యమునకెల్ల నాశంబుదోచె
ఇటువంటికార్యంబు నిచ్చలోదలచి
నాలుకెట్లాడెను నన్నడ్గనీకు
బాలుడానీకేమి భారంబువచ్చె 40
వినగననిటువంటి వెర్రినెక్కడను
కాలంబుననవలె గానినిన్నన్న
ఫలమేమియని చాలభయమునుబొంది
పుత్రుడువిడనాడి పోవకయుండు
బొంకుమాటలదల్లి పొరిపొరిననియె
తనయుడావినునీదు తండ్రులుమామ
లెల్లవిచారించి యేకభావమున
మలిదేవుమన్నన మట్టాయెగనుక
ఇచ్చోటువిడనాడి యేగిరివార
లేదిశబోయిరో యెరుగనుసుతుడ 50

అనినబాలుడుతల్లి కప్పుడిట్లనియె
ఎన్నడసత్యంబు లెరుగనినీవు

(బాలుడు నిజధర్మముల
వివరించుట.)

తగవటేనాతోడ దబ్బరలాడ
చెలగి కార్యమపూడి శ్రీయుద్ధభూమి
మలిదేవసహితులై మాయయ్యలెల్ల
చలమున నున్నారు సమరంబుసేయ
అవలశాత్రవచయ మతివిక్రమమున
మూకలై బ్రహ్మన్న మొదలైనవారి
గహనముల్ దావాగ్ని కాలిచినట్లు
దగ్ధంబుచేయంగ దలచినవార 60

లీసమయంబున నేనేగకున్న
అపకీర్తి పాలౌదు హానియువచ్చు
తండ్రికష్టంబును దప్పింపలేని
పుత్రుడుండిననేమి పోయిననేమి
* జనకుడేపుత్రుడై జనియించునంచు
గొల్లున వేదముల్ ఘోషించుచుండు
తల్లిరో కావున తనయునిబలిమి
తనబల్మియేయని తండ్రిదలంచు
పితకుపుత్రునికిట్లు భేదంబులేదు
కార్యమపురికేను గదలంగవలయు 70

కదలిననీవల్ల గానున్నదేమి?
అనివిచారించుట అబ్బబ్బతగదు
తల్లిరో నాకసాధ్యంబిలలేదు
బ్రహ్మాండములబట్టి బంతులాడుదును
మృత్యుదేవతనైన మెదిపివేసెదను
హరిహరుల్ మెచ్చగా అనిచేసిమించి
కామభూవిభునకు గలబలంబెల్ల
ఖండించివైచెద కలియుగమందు
వీరచరిత్రలు వెలయజేయుదును
తల్లిపంపుమునన్ను తడయంగనేల 80
చిత్తంబుచెడిపోవ చింతింపబోకు
మనినపుత్రునిమాట కైతమ్మపలికె
తమకంబుకూడదు తాళుముతనయ
తెలిసివిచారించి తెలిపెదనీకు
ఉండుమీవనిచెప్పి యొయ్యననేగి

(ఐతమ్మ శీలమ్మ నాలోచన
యడుగుట.)

అత్తయాశీలమ్మ అతిభక్తిజూచి
కరములం ముకుళించి కార్యమంతయును
వినిపింపచిత్తంబు వెరగునుబొంది
తలపోసిశీలమ్మ దైవజ్ఞవితతి
పిలిపించి బాలునిపేరటలెస్స 90
గ్రహగణభావంబు గ్రహియించిపిదప
ఐతమ్మతోడుత ననియెనీరీతి
పటుపరాక్రముడైన బాలచంద్రుండు

(శీలమ్మ యుపాయంబు సెప్పుట.)

పదునేనుదినముల పరిణామమొందు
చెప్పంగబడెనిట్లు సిద్ధాంతమందు
ఎడలేకఅడలెద వింతిరోనీవు

---

* "अङ्गादङ्गात्संभवसि" అనియు, "आत्मा वै पुत्रनामासि" అనియు శ్రుతి.

సీవెంతఆడలిన నిల్వడాతండు
కాలమెవ్వరికైన గడవగరాదు
బ్రహ్మవ్రాసినవ్రాలు వశమెతప్పింప
నీమాటకాతడు నిలువంగబోడు 100

కన్నకడుపుగాన కాంతరోనీవు
పడపలసినపాట్లు పడపలెగాని
ఊరకయుండుట ఉచితంబుగాదు
శంబరాసురవైరిజాయహస్తమున
చెలువందనిల్చిన చిలుకకుసమము
* మంచాల త్రద్రూప మహిమగన్గొన్న
చాలింపగలడమ్మ సకియనీసుతుడు
నావినిఐతమ్మ నాతికిమ్రొక్కి
పీడనిచింతచే వెడలితావచ్చి
తనకుమారునిజూచి దయనిట్టులనియె 110

(భయంకరరణరంగవర్ణనతో నైతమ్మ
బాలుని భయపెట్టుట)

ఓయయ్యబాలుడా ఒప్పగావినుము
పరరాజసైన్యమ్ము పైకొనిరాగ
వాద్యసమూహంబు వడితోడ మ్రోయ
ఘనకరీంద్రముల ఘీంకారరావంబు
సాంద్రతురంగహేషావిజృంభణము
రథనేమిసంకుల ప్రబలశబ్దంబు
అమితపదాతిచయాట్టహాసంబు
భేరీఢమామల ఫెళ్ళనుమ్రోత
యేకమైమించిన నెట్లుతాళెదవు
విలుకాండ్రు చెలరేగి విచ్చలవిడిని 120

జడివానపట్టిన చందంబుతోప
దట్టమౌశరవర్ష ధారలుగురియ
తప్పించికొనలేవు ధైర్యంబుమీర
అలుగులమెరుగులు అవనిపైనిండ
కన్నులచీకటి గ్రమ్మగజేయ
బద్దలఈటెలు పట్టుకతూరి
పైబడ్డధైర్యంబు బట్టగలేవు
కత్తులుజళిపింప గనుగొనినీవు
తాళెదవేరీతి తందరపడక
నీవేదరణమేడ నీబలమేడ 130

బాలులతోనాడు పగిదిగాదోయి
చెక్కులుమీటిన జిందునుపాలు
నుదురుమీటినగడు నూనెవెళ్లెడును
గంద్రతనంబుల గైకొనుతనయ
పిన్నవునీకిట్లు బిరుదులువలదు
ననువీడిపోవుట న్యాయంబుగాదు
నావుడుబాలుండు నాతికిట్లనియె

(బాలచంద్రుండు నిజబలోత్సేషం
బుఁ దల్లికెఱింగించుట.)

భయమేలచెప్పెదు భామనాకిపుడు
పుత్రమోహంబున బొంకెదుకాని
యెరుగవేనాబల్మి యిందీవరాక్షి 140

నలగాముడెరుగును నాదుశౌర్యంబు
ప్రళయకాలమునాటి భైరవురీతి

* బాలచంద్రుభానిభార్య, గండు కన్నమనాయకుని కూతురు.

సైంధవవధవేళ సాహసస్ఫూర్తి
విజయుఁడు రణములో వెలసినకరణి
కౌరవసేనలో గదబట్టితూరి
వడిముడియనిలోన వ్రాలినవిధము
వాయుపుత్త్రుఁడు లంకవడితోడ జొచ్చి
భస్మంబుగా గాల్చి ప్రబలినభంగి
రాక్షసరణములో రామచంద్రుండు
వీరపరాక్రమ విధిజెందినట్లు 150

జలధిమధ్యంబున చరియించినట్టి
మందరమనియెడి క్ష్మాధరమ్మట్లు
ఫాలాక్షుడతిరౌద్ర పటిమమీరంగ
త్రిపురంబులను సంహరించిన గరిమ
కాలాగ్నిలోకముల్ గాల్చినపోల్కి
స్థావరజంగమజగతినుద్ధతిని
ప్రళయంబుముంపంగ పరగినరీతి
కామభూపతిసేన గడగడవణక
విక్రమక్రమశక్తి విడివడజొచ్చి
పృథ్విపైపీనుగు పెంటలుగాఁగ 160

విహరింతుమదిలోన వేడుకకొలది
ఉర్వీశుదళముల కురుమనిపిడుగ
గర్వించుపగవారి కంటిలోనెరస
ఎదురెవ్వరేనాకు నీభువిలోన
నలగామబలముల నలినలిచేసి
వండంగతరిగిన వడుపుననరికి
నెత్తురుమడుగులు నిండనొనర్తు
దహనునికడ్డంబె దట్టమౌవనము
బడబాగ్ని నార్చునే పాథోధిజలము
భయదంపు పులికిని పశుగణంబెదురె 170

జింకలకదుపులు సింహముకీడె
బాలుండననినన్ను భావింపవలదు
చిన్నమిరియమందు చెడునెకారంబు
నావిని సుతునకు నాతియిట్లనియె

(సంతానమునకై పడ్డకష్టముల
నోచిన వ్రతముల నైతమ్మ
వేర్వేరఁ జెప్పుట.)

వినవయ్యబాలుఁడ వీరశేఖరుఁడ
(కన్నకడుపుగానఁ గాంక్షమిక్కుటము
పుత్త్రమోహమువంటి మోహంబులేదు
దశరథప్రముఖ భూతలనాథవరులు
పడిరిపుత్త్రులకయి పడరానిపాట్లు
పుత్త్రులులేనట్టి పురుషభాగ్యంబు 180

విపినంబులోఁగాయు వెన్నెలరీతి
కొడుకులులేనట్టి కోమలిబ్రతుకు
పూచికాయనియట్టి భూజంబువిధము
* పున్నామనరకంబు పొందకుండంగ
తల్లిదండ్రులఁగావ తనయుఁడెకర్త
బాలుఁడాననునీవు పాయుదువేని
నిమిషకాలంబైన నిల్వంగనోప)
సంతానమేలేక చాలకష్టించి

* "पुन्नाम्नो नरकात्त्रायत इति पुत्त्रः" అని పుత్త్రశబ్దమునకు ఒక వ్యుత్పత్తి.

అవనిలోఁగల నోములన్నియుఁనోచి
తరచుగాజేసితి దానధర్మములు 190

తాంబూలములను సద్భక్తిదక్షిణల
కూర్చిచూరవిడిచి కుమ్మరామముల
ఆడెడుగానుగ లవికొల్ల పెట్టి
పెండ్లిండ్లుచేసితి పేదవిప్రులకు
పాడైనదైవత భవనంబులందు
పూజాదికంబుల పొందించిభక్తి
ఆమడామడమీద అన్నసత్రముల
వెలయంగజేసితి విస్తారమైన
వనములోపల చలిపందిళ్ళునుంచి
శ్రీగిరికేగెడు శివభక్తతతికి 200

చెలగఇచ్చితిరాగి చేనిర్మితముల
ఘన కమండలువులు కప్పెరచయము
శ్రీభ్రమరాంబకు శ్రీశైలపతికి
రజతకాంచనముల రంజిల్లునట్టి
కూష్మాండఫలముల గూర్చిదక్షిణలు
కానుకలిచ్చితి కడుభక్తితోడ
గౌరిమహేశ్వర ఘననామశిఖరి
ఎక్కియునోమితి నేలేశ్వరంబు
దిగివచ్చినోచితి తిలపర్వతమున
మొగివిష్ణుకాంత నోమును సలిపితిని 12/10

తగనొనర్చితిని సంధ్యావర్తినోము
అలయకనోమితి ఆజగజ్జ్యోతి
ఏగురువనితలనింపుగగూర్చి
యేకబాణమునోము నెలమినోచితిని
పదుగురువనితల బాగుగగూర్చి
పచ్చవిల్తునినోము పట్టినోమితిని
నందికిపులగంబు నయతనిచ్చితిని
శ్రీశైలపథమున చెలువంబుమీర
అశ్వత్థపత్తుల అభివృద్ధిచేసి
రజతకాంచనమయ రమ్యతంతువుల 20

అశ్వత్థతరువుల కలరజుట్టించి
వెంటిపోతులకును పెండ్లిచేసితిని
చీకటింటనునోము చేసితిభక్తి
నియతికేదారేశు నిల్పినోమితిని
గొనకొనికనుగొన్న గుంటికినెల్ల
చేయెత్తిమ్రొక్కితి చెప్పనేసిగ్గు
కరమెత్తిమ్రొక్కితి కాట్రేనికేను
పలునోములీరీతి భక్తితోజేయ
ఏదేవుడైనను ఇచ్చలోమెచ్చి
వరమీయడాయెనా వ్రాతకేమందు 30

అనిచింతచేయుచు అసురుసురంచు
దైవంబుదూరుచు దలకెడువేళ

(బాలచంద్రుని జన్మప్రకారము.)

వింటినివచనంబు వినువీథియందు
గజనిమ్మనోమిన గలుగుసంతాన
మనువాక్యమునకప్డు డానందమొంది
పెద్దలావిప్రుల పిల్వగబంపి
ముకుళితహస్తనై మ్రొక్కిఆమీద
వారితోజెప్పితి వాక్యలక్షణము
వినివారుసంతోష విశ్రాంతమతిని
వ్రతకల్పములనెల్ల వడివిచారించి 40

శోధించిచెప్పిరి శుభముహూర్తమున

శాస్త్రమందున్నది చానయీవ్రతము
సంవత్సరమునిండ సల్పగావలయు
ఇదివిష్ణుదేవుని కింపైనవ్రతము
శాస్త్రోక్తదినమున స్నానకృత్యమును
వాక్రుచ్చుచున్నది వ్రతవిధానమ్ము
చంద్రభాగానది సదృశశైవలిని
కలుగదుపలునాటి గడ్డయంచెల్ల
కృష్ణకుసమమిది కీర్తనీయంబ
ఎడమభాగమ్మున నెనయు చెన్నునికి 50
దాపుగబారు ఉత్తరముఖంబుగను
స్నానమానదిజేసి సరిగంచుపట్టు
కోకలుధరియించి కుంకుమపసుపు
తాల్చిగంధంబును తనువునబూసి
సంతోషమునబోయి స్వామియైనట్టి
చెన్నకేశవునకు జేసిజోహారు
దీపనైవేద్యముల్ తీరుగానిచ్చి
వైకుంఠశృంగార వనములోపలను
చెన్నారుఅనిమ్మ చెట్టునకేగి
చుట్టులెస్సగజేసి శుద్ధిచేయించి 60
అలికించిముగ్గుల అచటబెట్టించి
వనదేవతనుభక్తి వర్ణనచేసి
నయముగఆవాహ నంబుగావించి
* పలకలబావిలోపల నీరుముంచి
పాదులోపల గడుభక్తితోబోసి
సకలప్రకారోపచారముల్ చేసి
భూసురులందరు భుజియించుకొరకు
తగినవస్తువులిచ్చి తప్పకయుండ
ఫలములఆహార పటిమగ్రహించి
పరమేశుచెన్నుని భావించికొనుచు 70
ఎడపకదినముల నీలాగుజరుప
కొన్నాళ్ళకానిమ్మ కొమ్మలిగిర్చ
ఫలతతుల్గన్పించి పరిపక్వమౌను
వర్షాంతమందనివార్యంపుభక్తి
చెట్టుఫలంబుల చెన్నునికిమ్ము
సంతానమబ్బును సంశయపడకు

---

* ఈ బావినిగుఱించి విచారింపఁగా నచ్చటి శ్రీ శాతంరాజు కృష్ణారావు వారీ తీరునఁ దెల్పినారు. పలకలబావియని పిలువఁబడు బావి యిప్పుడు మాచర్లలో లేదు. కాని చెన్నకేశవుని యాలయములో నీశాన్యభాగమం దొక బావిగలదు. అది బ్రహ్మనాయుని కాలమునఁ ద్రవ్వఁబడినదని ప్రతీతికలదు. తత్కూపశిలా దర్శిత పౌరాతన్యంబా ప్రతీతిని స్థిరీకరించుచున్నది. ఈ బావిలో మఱియొక చేదుడుబావి గలఁదట. నీరెప్పుడు నెండిపోకుంటచేఁ దానినిఁజూచినవా రెరును లేరు. అగాధమై జనోపద్రవకరముగ నుండ రాతిపలకలతో మూసివేసి యుందురు. బహుశః దానివలన నీ బావికిఁ బలకలబావియని పేరువచ్చినదేమో. మఱియుఁ జంద్రవంకమధ్యభాగమం దొక తలుపులబావియున్నట్లు చాలమంది జనులు సాధారణముగాఁ జెప్పుదురు. ఈ తలుపులబావినే యొకప్పుడు పలకల బావియని పిలుచుచుండిరేమో !

మఱుచుభూసురులెల్ల ఆడిరిగనుక
సంవత్సరమునిండ సల్పితివ్రతము
కడపటిదినమునకడు మోదమునను
పూజాదికంబుల పొందుగాతీర్చి 80

విప్రభార్యలనెల్ల బిల్వగబంచి
సకలోపచారముల్ సమ్మతిజేసి
చెట్టుఫలములను జిదిమితెప్పించి
పసిడితోఁజేసిన పళ్ళెరంబందు
పోయించిభయభక్తి పూర్వంబుగాను
చేతులబట్టుక చెన్నునికడకు
వెడలితిచెల్లెండ్రు వేడుకతోడ
కానుకల్ మొదలగు కలవస్తువులను
గొనివెంటజనుదేర కూరిమిమీర
సర్వవాద్యంబులు సాంద్రతమ్రోయ 90

వారకాంతలునాట్య వశతచేజనగ
బహువిధగీతముల్ పాఠకుల్ చదువ
వివిధవిద్యలవారు వెన్వెంటరాగ
* చనిజమ్మివృక్షంపు సవ్యభాగమున
చెన్నునికెదుటను చిత్తముప్పొంగ
నిలిచితిమపుడేము నిశ్చలమతిని
పూజారివార లప్పుడుచనుదెంచి
తలుపులుతెరచిరి తాళముల్ దీసి
చిత్రజుజనకుని చెన్నునిరూపు
కన్నులపండువు గాగజూచితిమి 100

ఫలములుంచినజాలవల్లికస్వామి
కర్పించిశరణంబు నందెదమనుచు
చనువేళచెన్నుఁడు సత్కృపమాని
పడమటిముఖమాయె భావమెట్టిదొకో

---

* ఈచెట్టునుగుఱించి శ్రీ శాతంరాజు కృష్ణారావువారి క్రిందివృత్తాంతము నాకు వ్రాసిరి. ఈజమ్మివృక్ష మిప్పటికి 10సంవత్సరముల క్రిందటివఱకు చెన్నకేశవస్వామి కోవెలలో ధ్వజస్తంభమునకు నైఋతభాగమున నైదుగజములదూరమున నున్నదని చూచినవారు చెప్పుచున్నారు. 20 సంవత్సరముల క్రిందటనే యిది నశించినది. ఆచెట్టుచుట్టు వలయమేర్పడి మధ్యభాగము క్రిందనుండి పైభాగమువఱకు తొఱ్ఱ యుండునదఁట. ఆ తొఱ్ఱపైన కొద్దికొమ్మలుమాత్ర ముండునవియఁట. దీనిని జూచినవారందఱు తమ తండ్రులు తాతలు ముత్తాతలెఱుఁగని పూర్వకాలమునుండియు నా వృక్ష మచ్చటనున్నట్లు చెప్పఁబడుచుండెనని వక్కాణించుచున్నారు. బ్రహ్మనాయుఁడు మాచర్లకురాకముందే యీచెట్టు చిన్నమొక్కగా నచట నుండెననియు, వచ్చినతరువాతఁ జెన్నకేశవుని యాలయము విస్తృతముచేసి కట్టించుచు నీచెట్టును గొట్టివేయక కడుమక్కువతోఁబెంచి దానియందు మిక్కిలి యనురాగముగలవాఁడై యుండెననియు నచ్చటి జనులు పూర్వకాలమునుండి పరంపరగాఁ జెప్పుకొనుచున్నారు. చెట్టు పూర్వమందున్నట్లు పాఁదు మొదలయిన యస్పుటచిహ్నములు కాన్పించుచున్నవి.

తపియించె చిత్తమ్ము తత్సమయమున
సంచలించెనుగుండె ఝల్లుఝల్లనగదలె
గద్గదస్వరములు గళములగలిగె
తడడాటునడలకు దార్కొనె మేన
చెమటలుజారగ చీకట్లు గ్రమ్మె
పరవశంబునమహిజడిలె మాచెల్ల 110

తెలివొందియంతలో ధీరతనిల్పి
పటుతరరౌద్రంబు భావమందలర
పలికెనిబ్బంగి భయమింత లేక
అదియేమిస్వామి మాఅపరాధ మేమి
తల్లియు దండ్రియు దైవంబుగురువు
నీవకాకితరంబు నెరుగ మెవ్వారి
ఇహపరంబులకెల్ల ఇంటిదేవతవు
తనువులుప్రాణముల్ ధనధాన్యవితతి
పశుపుత్రమిత్రులు పరిజనంబంత
నీకధీనులు మేము నీసేవజేయు 120

వారముమాకెల్ల ప్రభుడవునీవు
మరవవుదాసుల మదిలోన నెపుడు
నీవాడననుచును నిశ్చలబుద్ధి
శరణన్నమాత్రాన సంరక్షచేయ
* వ్రతమునాకంచును రామరూపమున
ఆనతియిచ్చితి వఖిలమువినగ
† సకలధర్మంబుల సరవిత్యజించి
నన్నొక్కనినె శరణంబంది తేని
సర్వపాపంబుల సమయజేయుదును
వగవకుమదిలోన వలదుభయంబు 130

సత్యమీమాటని సవ్యసాచికిని
దయతోడ కృష్ణావతారంబునందు
పలికినాడవుగాన భక్తితోనీవె
శరణనియంటిమి చానలమేము
పడతులు మొరపెట్ట పాలనగలదు
వనితలరక్షించు వాడవునీవు
‡ గౌతమభామిని కాంచెపూతతను
శ్రీమించునీ పాదరేణువుచేత

* విభీషణుఁడన్నచే పరిభవింపఁబడి శరణార్థియై రామునివద్దకురాఁగా సుగ్రీవుఁడు రాక్షసమాయలు నమ్మరాదని శ్రీరామునితోఁ జెప్ప నతఁడు "**अभयं सर्वभूतेभ्यो ददाम्येतद्व्रतं मम**" (रा. यु) అని వాక్రుచ్చినట్లు రామాయణములో యుద్ధకాండమునందుఁ జెప్పఁబడినది.

† **सर्वधर्मान् परित्यज्य मामेकं शरणं व्रज । अहं त्वा सर्वपापेभ्यो मोक्षयिष्यामि मा शुचः ॥** (गी) అని గీతాశాస్త్రంబున మోక్షసన్యాసయోగమునందు శ్రీకృష్ణుఁడు సెప్పిన వాక్యములనే శ్రీనాథుఁడిచట సూచించియున్నాఁడు.

‡ ఈమెపే రహల్య. దేవేంద్రునితో సంగమించినదని భర్తయైన గౌతముఁడీమెను శిల యగునట్లు శపించెను. తరువాత శ్రీరాముఁడు సీతను వివాహము చేసికొనుటకయి మిథిలాపట్టణమునకుఁ బోవుచు గౌతమాశ్రమమున నున్న యాశిలను దనపాదముతో స్పృశింపఁగనే శాపవిమోచనమై యహల్యశరీరము దాల్చెను.

కరుణ చేకుబ్జకు * కాంక్షదీర్చితివి
వల్లవీజనముల వాంఛదీర్చితివి 140
† ద్రౌపదిమానము దక్కజేసితివి
‡ కాచితివుత్తర కడుప్రేమతోడ
ప్రాణకాంతలనిట్లు పోషించినావు
ప్రాణులపోషింప భారంబునీది
మిక్కిలిదయగద్దు మెలతలయందు
ఇట్లునీమది యినుమాయెనేమి
కటకటానీకింత కాఠిన్యమేల
శరణంబులె నెరనమ్మినాము
తిరిగిచూడవుమాకు దిక్కెవరయ్య
కరగదునీమది కాసంతయైన 150
ఈజీవనంబేల యీదేహమేల
నీకైనప్రాణముల్ నీకెఅర్పింతు
మబలలమనియెంచ అర్హంబుగాదు
నెత్తురునీమీద నిండజల్లెదము
చూడుమాసాహస స్ఫూర్తులనుచు
ఆగకరోషసమావేశమెసగ
ఒరలమట్టుకు కత్తు లురవడిదూసి
వక్షస్స్థలంబుల వదలకయుంచ

---

* ఈమె కంసునికి గంధము మొదలగు పరిమళద్రవ్యములు దెచ్చియిచ్చెడు పరిచారిక. ఈమె మిఱుగుజ్జుదై వక్రదేహము గలిగియుండెను. శ్రీకృష్ణుడును బలరాముడునుగలసి వ్రేపల్లెనుండి మధురకుబోవునప్పుడు వివిధగంధద్రవ్యముల పాత్రను గంసునివద్దకు గొనిపోవుచున్న కుబ్జనుజూచి యామెవద్దనున్న కలపముల పాత్ర నడిగి తీసికొని వారిద్దఱుపూసికొనిరి. శ్రీకృష్ణుడు కుబ్జను మెచ్చికొని యామెకుబ్జత్వము పోవునట్లనుగ్రహించెను.

† కపటద్యూతమున ధర్మరాజు పరాజితుడైనతరువాత సభాంతరమున కీడ్చి తేబడ్డ ద్రౌపదియొక్క పుట్టంబులు దుర్యోధనునిశాసనమున దుశ్శాసనుడొలుచునప్పుడు శ్రీకృష్ణుడు కరుణించి యొకవస్త్రమువిడువగనే మఱియొక వస్త్ర మామెజఘనమండలమునకు బాయకయుండునట్లుచేసి యామెమానముగాపాడెను.

‡ సకలమైన పాండవసంతానము వినయంబుగ నశ్వత్థామ యస్త్రప్రమోచనంబు చేసినప్పు డయ్యస్త్ర ముత్తరగర్భంబుననున్న పిండమును హింసింప శ్రీకృష్ణుడా పిండమును రక్షించెను.

మారుముఖంబాయె మగిడిచెన్నుండు
ఫలములపళ్లెంబు స్వామిసన్నిధిని 160
ఉత్సాహమునయుంచి ఒయ్యనమ్రొక్కి
చేతులుదట్టించి శిరములువంచి
కమలామనోహర గజరాజవరద
కాంచనాచలధీర కందర్పజనక
పక్షీంద్రవాహన పన్నగశయన
శశిరవిలోచన జలజాతనాభ
పరమదయాకర పాపవిదూర
కామితమందార ఘననీలవర్ణ
మాకాంక్షలీడేర్పు మాచర్లచెన్న
అనిసన్నుతులుచేసి అబలలమెల్ల 170

కనుచూపుపదముల గట్టిగానిలిపి
నియమంబుతోడుత నిల్చినవేళ
అర్చించువైష్ణవు నంతరమందు
ఆవేళమైపల్కె అందరువినగ
కోపింపమీమీద కూరిమికలదు
మనసులనిల్కడ మర్మంబుదెలియ
అరయంగదలచి నేనటుమళ్లినాడ
భక్తికిమెచ్చితి భయమందగూడ
దనిపల్కనంతలో అధికవేగమున
పళ్లెంబులోపలి ఫలమొక్కటెగిరి 180

వచ్చినాచేతుల వ్రాలినచిత్త
ముప్పొంగిజోహారు లొయ్యనజేసి
గుడినుండివెల్వడి కోర్కెలుమీర
విజనమౌదెసకేగి విప్రభామినికి
ఫలమిచ్చిమాకెల్ల పంచియిమ్మన్న
ఎనిమిదిఖండంబు లేర్పడజేసి
ఆర్వురుకాంతల కారుఖండములు
మేరతోడుతనిచ్చి మేలైనదొకటి
నాచేతికందిచ్చి నాతితానొకటి
పుచ్చికొన్నప్పుడు పొలతితోనంటి 190

బ్రాహ్మణకులమున ప్రభవించినావు
సర్వజనములమీకు సాటిరాదగదు
పొలతిముందరనీవు భుజియింపవమ్మ
అటుమీద మేమెల్ల ఆరగించెదము
నావినిబ్రాహ్మణ నారిఆరీతి
చేసినతర్వాత చెలగిమేమంత
ఫలఖండములగొని భక్షణచేసి
కరముఖపాదముల్ కడిగిఆమీద
పోయిస్వామికిమ్రొక్క పూజారివచ్చి
పాలుపొందతీర్థమ్ము మొదలైనవిచ్చి 200

చెలువైనపదపీఠి శిరములబెట్ట
వెనుకకునడచుచు వేడుకతోడ
మామాగృహములకు మరలినయప్డు
గర్భంబులాయెను కంటెనినిన్ను
చాలకష్టముమీద జనియించినావు
ననుబాసిపోవుట న్యాయమానీకు

(ఐతమ్మ శోకభరంబునఁ
బలవించుట.)

ఎలమితోనొక్కనా డెదుటలేకున్న
ప్రాణంబులేభంగి పట్టంగగలను

చనియెనుమీతండ్రి సమరంబొనర్ప
తోడునీవుండిన దుఃఖంబులేదు 13/10
పోషింతువీవని బుద్ధినమ్మితిని
పడ్డకష్టంబెల్ల పరులపాలాయె
సంతానహీనవై చాలదినములు
బహుళదుఃఖంబుల పాలైతికొడుక
స్వామికరుణచేత జనియించినాడ
వానాటనుండియు అడగెఖేదంబు
వేములుపూసెను వేములుకాసె
కడసారిఫలములు కాకులకాయె
మనుజరక్షణలేని మల్లెపూదోట
పడిమారపోయిన వడుపయ్యెదండ్రి 20

జలముదుక్క పెనముపై చల్లినభంగి
కప్పినకుంపటి గాల్చినరీతి
అణగినవగపెల్ల అధికమైపొరలె
నీడనిధానంబు నిలిచికన్నట్లు
పడ్లెగావజ్రంబు పడిగన్నమాడ్కి
గుడిజొచ్చిదేవు గన్గొనినవిధంబు
కంటినిపుత్రుడ కాంక్షతోనిన్ను
తాడెక్కుపురుషుని తల్లికిఅట్లె
గడమీదనాడు కర్కశునితల్లికిని
* శూరునితల్లికి సుఖమేమిలేదు 30

పందలై పుట్టిన బ్రతుకంగగలరు
ముందరనీవున్న మురిపెంబుమీరు
దూరాననిల్చిన దొడరునుజాలి
కుంతాలవారికి గురుదేవకృపను
సంతతికలిగెను చక్కగనంచు
సకలభూములజనుల్ సంతోషపడిరి
తప్పజూచెనుగదా దైవమీవేళ
బవరంబునకునేగ పైనమైనావు
వీరమాతలకును వీరభార్యలకు
విషమిచ్చియేగుట విహితంబునీకు 40

తరువాతమీతండ్రి దగ్గరకరుగు
మనియిట్లువగచెడు ఐతమ్మజూచి
బాలుఁడీగతి బల్కెపటుశౌర్యమలర
అమ్మరోయిబ్భంగి అడలగనేల

(బాలచంద్రుఁడు వీరధర్మప్రభా
వంబు దల్లికిఁ జెప్పుట)

కార్యమపురమందు ఘనపరాక్రమత
తండ్రులునిల్చుండి దండుచేయంగ
నేనింటనుండుట నీతియేతల్లి ?
ఉండుమంటకునీకు ఒప్పునామనసు ?
నీవెరుంగనిధర్మ మేనెరుగుదునె
ప్రాకృతభామల పగిదిబల్కెదవు 50

వెర్రితనంబేల వీరమానినికి
కాయమనిత్యంబు కల్మిహుళక్కి
జలబుద్బుదవిధంబు క్షణభంగురములు

* ["मा शूरं मा च पण्डितम्" అని కుంత్యుక్తత్వంతో ప్రసిద్ధమైనవచన మిట్లాటి అభిప్రాయాన్నే తెలుపుతున్నది.]

షట్చక్రవర్తులు సకలభూపతులు
చనిరి బ్రహ్మేంద్రాది సర్వదేవతలు
భూతంబులైదును పాలియుంచునుండు
శౌర్యసత్కీర్తులు సమయవెన్నటికి
సకలపురాణముల్ సద్ధర్మకథలు
నీతిశాస్త్రంబులు నీవెరుంగుదువు
పౌరుషాధికతచే బ్రతుకుటలెస్స 60
జననమరణములు జనులకునిక్క-
మాలయంబుననున్న అడవిలోనున్న
తప్పకతారొక్క-రు తథ్యంబుగాను
పుణ్యలోకంబును బొందుమార్గముల
వినిపింతు నేతల్లి విశదంబుగాను
* సజ్జనసంగతి సంసారమెడల
గురువుబోధించిన గురిమీదమనసు
నిలిపిమరణమొందు నిశ్చలుండొకడు
ప్రాజ్యసామ్రాజ్య సంరక్షణమందు
ఘనరణమ్మునరొమ్ము గాయాలనొంద 70

మనసుచలింపక మరణంబునొందు
శౌర్యపరాక్రమ సంపన్నుడొకడు
వీరలిద్దరు లెస్స వినువీథికేగి
ఆదిత్యమండలం బరుదారచించి
పోయిపుణ్యంబుల భూమిజెందుదురు
మొదటికార్యముబూను ముఖ్యతలేదు
శౌర్యంబుచేమాకు సంపాద్యమగును
వినిపింతు నికనొక్క-విహిత ధర్మంబు

(బాలచంద్రుఁడు స్వధర్మ నిరూపణంబు సేయుట.)

చిత్తంబునిల్పియుఁ జెవియొగ్గి వినుము
ప్రప్రథమంబున బ్రహ్మనిర్మించె 80
వరవిప్రరాజన్య వైశ్యశూద్రులను
వేదవిద్యలయందు విప్రులనుంచె
రణకార్యముల యందురాజులనుంచె
క్రయవిక్రయాది కార్యంబులయందు
వైశ్యులనియమించి వశులగాజేసె
చర్చింపనీమూడు జాతులవారి
శుశ్రూషవులజేసె శూద్రులనెల్ల
సరవినాలవజాతి జననంబుమాకు
వెలమలమైతిమి వీరజీవనత
విప్రులసేవింప విజ్ఞానమొదవు 90

క్షత్రియసేవచే శౌర్యంబుగలుగు
కడువైశ్యసేవచే గలుగుసంపత్తి
మేమురాజులగొల్చి మెరయుచుండుదుము
విక్రమక్రమరూఢి వెలయుటజేసి
తమసరిగా మమ్ముదయ చేయుచుంద్రు
శస్త్రధారులకెల్ల సమరంబు † కూడు
శౌర్యంబుచాలించి సకలధర్మములు

---

* ఈ విషయమే శుక్రనీతియందుఁగూడఁ జతుర్థాధ్యాయములో సేనానిరూపణమను షష్ఠప్రకరణంబునఁ జెప్పఁబడియున్నది.

† ఆహారము.

చేసినసత్కీర్తి చెందదుమాకు
మనువుబోధించిన మార్గమేయిదియు 100

పరమాత్మకృష్ణుండు భండనభూమి
సవ్యసాచికిదెల్పి సకలధర్మముల
అటుమీదజేయించె అధికరణంబు
జనులకుకష్టంబు సమకూరునపుడు
శ్రీవీరవీర్యంబు చెదరంగజేయు
దేశంబు పరస్వాధీనమౌనపుడు
శ్రీవీరసత్వంబు చిక్కంగబట్టు
సామ్రాజ్యతరువెండి చచ్చెడునపుడు
శ్రీవీరరక్తంబు చిగిరింపజేయు
రాజసేవకులకు రణమేసుఖంబు. 110

ఇదిగాకయింకొక్క హేతువువినుమి
* అలరాజు కాముచే హతుడైనవెనుక
కొమ్మభూమీశుండు కోపించినపుడు
అనఘుడునాతండ్రి నాచెయ్యిబట్టి
గొనిపోయిఒప్పించె కొమ్మభూపతికి
తీర్చునుమనపగ ధీరుడితండె
యిల్లడచేసితినే బాలచంద్రు
అనిపల్కెనోయమ్మ అరమరలేక
ఆనాటనుండియు ఆఒప్పగింత
నాటెయున్నదిసువ్వె నామదియందు 120

ఆహారనిద్రల కరుగదుమనసు
కార్యమీవేళను గదిసెనుపూని
ప్రాణమైననునిత్తు పగయైనదీర్తు
తప్పి తేవారికి దాసుండనగుదు
మనసొప్పదిందుకు మముగన్నతల్లి
అరలేకచెప్పితి అంతరంగంబు
బిరుదుకొమరుడగాని పిన్ననుగాను
మగువలుండెడు నట్టిమందిరంబందు
ఉండుటకొమరుల కుచితకార్యంబె
యెక్కువపల్కకయిక నూరకుండు 130

జననమరణములు చాలుపుమనకు
పుట్టుపుట్టువునకు పుత్రులునీకు
జన్మజన్మంబున జనసులునాకు
కలుగుచుండుదు రిదికమలజునియతి
దుఃఖింపబనిలేదు తోయజగంధి
దీవించినన్నంపు ధీరతతోడ
భయమందకీలాగు బాలుండుపలుక

(భార్యకుజెప్పి యుద్ధమునకేగుమని
బాలచంద్రునితో నైతమ్మచెప్పుట.)

ఐతమ్మకొడుకుతో అనియెనీరీతి
సమరంబునకునేగు శౌర్యవంతులకు
తల్లిదీవనబొంది తగభార్యచేత 140

దీవనగొనిపోవ తేజంబుసుమ్ము
నడచిరిపెద్దలీనయమార్గమునను
మనసుంచినామాట మన్నింపుసుతుడ
అనవిని ఐతమ్మకనియె బాలుండు
తల్లినీదీవన తరుగదుమాకు
కులకాంతదీవన కొనుటయేలాగు
నాగుశౌర్యంగదు నాతిమాంచాల

---

* మూడవ పుటలో వివరణపత్రిక చూడదగును.

యేనాపెపోలిక యెట్టిదోయెరుగ
మనయిల్లెరుంగదు మగువమాంచాల
చానయింటికినేను చనుటయేలేదు 150

నీమాటవినకున్న నీతికాదనుచు
వేగంబపోయిన ప్రియురాలుకినిసి
తప్పులెన్నను చిన్నతనమగునాకు
సాహసల్ మూర్ఖలు సకియలెల్లెడల
మాటమంచిదిగాని మనసుకత్తెరయె
పూర్వజన్మఫలంబు పొందికబట్టి
ఆలుమగలజేసె అజుడుమమ్ములను
నాభాగ్యమేమియు నాతియెరుంగ
దింతికిదుఃఖంబు హెచ్చుగనుండె
అపరాధమధికంబె అమ్మనాయందు 160

ఈసమయంబున నేనేగరాదు
నాతులభావముల్ నమ్మగలేదు
నావినిసుతునకు నాతియిట్లనియె

(ఐతాంబ మాంచాలదగ్గర
కేగుట.)

అటజనివృత్తాంత మారసివత్తు
ఇచ్చటనేయుండు మెచటికిబోక
అనుచు నేరాండ్రు తానందలాలెక్కి
* గండువారింటికి గ్రక్కునజనిరి
ముత్యాలలఘువమ్మ ముందరనేగె
ఘనమైన పేర్నేని గౌరమ్మయరిగె
దంటగావెన్వెంట దాదులువెడలి 170

రైతమ్మయీరీతి ఆనందగరిమ
వచ్చుటగ్రహియించి వారనిప్రీతి
† చెలువొందరేఖాంబ చెల్లెంద్ర నెల్ల
వివరించిపిలిచెను వేడుకతోడ
వెలమనాయునిభీమ వేగమేరమ్ము
మలినేనియాచమ మము జేరరమ్ము
పినమలినాయుని ప్రియురాలవైన
చందమ్మయిచటికి చయ్యనరమ్ము
గోపినాయునికూర్మి కులకాంతలక్ష్మి
నను జేరరావమ్మ నాతియటంచు 180

పిలిచినవచ్చిరి ప్రియమెసలార
వారునుదానును వాంఛలుమీర
ఐతమ్మకెదురుగ ఆరిగికొంపోయి
కనకపీఠంబుల గరిమతోడుంచ
అప్పుడు మేడపై అలరుచునున్న
మంచాలదిగివచ్చి మర్యాదయొసగ
అత్తలకెల్లదానమరంగమ్రొక్కి
కస్తూరిపునుగును గలిపినయట్టి
చందనమ్మునలంచె సకియలకపుడు
చేకట్లుకడియముల్ చెలువుగనిచ్చె 190

మరియును మాణిక్యమయమైనభూష
లందరికినొసంగి హర్షమొందింప
కోమలులందరు కూర్చున్నవేళ
వదినెయౌ ఐతమ్మవదనంబుచూచి
వినయంబుతోడుత వెలదిరేఖాంబ

* బాలచంద్రునిమామయైన కన్నమనీని యింటిపేరు.

† ఈమె కన్నమనీని భార్య. బాలచంద్రుని యత్త. మంచాలయొక్క తల్లి.

అక్కలుచెల్లెండ్రు అత్యంతకరుణ
ఆందోళికారూఢలగుచుమీరెల్ల
మముజూడవచ్చుట మాభాగ్యమరయ
మీరువచ్చినపని మీకోడలైన
మరునిపట్టపుదంతిమాంచాలయెరుగు 200

తక్కినవారికితరముకాదనెను
తనతల్లిమాటకు తనయమాంచాల
నవ్వుచువాక్రుచ్చెనయభావమునను
మాఅత్తతనకొడుక్కు మగటిమిచెలఁగ
ఆజిరంగంబున కరిగెదనన్న
ఆలుదీవనగొని అరుగుమాయనెను
మొగముచెల్లమిరాక మొగిదలవంచె
పిలిపింపుమనివచ్చె వేగనాకడకు
బ్రహ్మాగూర్చెనుమమ్ము బాల్యంబునందు
సమరానఆతఁడు సమసినవెనుక 14/10

వెంటనేగెదఅత్త విడువుమీమాట
పంపుమా పుత్రుని బవరంబుచేయ
అనినభీతిల్లుచు ఐతాంబపలికె
పరమపాతివ్రత్య పావనమూర్తి
పతిభక్తిగల్గిన పద్మాయతాక్షి
నేనువచ్చినకార్య మీవెరింగియును
ఇబ్భంగిబల్కుట యేటిక్రమంబు ?
పతినెడబాయుట భావ్యంబెనీకు
నేరంబులతనివి నిలుపకుమదిని
రట్టుచేసితివేని రాడువాడిటకు 20

నిన్నువీక్షించిన నిలువంగనోపు
అనియిట్లుపలికిన అత్తకుమ్రొక్కి
వాక్రుచ్చెమాంచాల ప్రౌఢభావమున
ఇసుమంతనాసౌఖ్య మెరుగడునీదు
తనయుఁడో అత్తరో దైవంబుకెరుక
పాపపుమాటలు పలుకంగవలదు
వెలయభుజించుట వేశ్యగేహమున
విడియంబుచేయుట వెలయాలియింట
సౌఖ్యంబుపొందుట సానిధామమున
నానోముఫలమేమొ నళినజునియతి 30

చేసినఁ విడిపింప జేసెనానాతి
భోగంబునొందెదు పొలతులువారు
చావనోచినయట్టి సకియను నేను
సరిచేసియీమాట సభనెన్నరాదు
నీపుత్రునడవడి నీచిత్తమెరుగు
నీవుకర్త్రివిమాకు నేమివాక్రుత్తు
ఆడవలయుమాట లాడితిగాని
నీబుద్ధికెన్నడు నేవెలిగాను
తెరవరోమదిని సందియమునువదలి
పంపుముబాలుని పగతీర్చుటకును

పోయెదుపయనంపు బుద్ధిమాన్వింతు
ఏడేండ్లనుండితా నేమారనట్టి
వేశ్యపైమోహంబు విడువనొనర్తు
నీయానసిద్ధంబు నేకల్లలాడ
అనిపల్కుకోడలి నాలింగనంబు
చేసిపుత్తడికమ్మి చీరలురత్న
కాంచనమయమైన ఘనభూషణములు
పెట్టికోడలికప్డు ప్రియమేపుమీర
కోల్వులోపలినుండి గొబ్బునలేచి

వియ్యపురాలిని వెసకౌగిలించి 50
కోర్కెతోశీలాంబ కోడండ్రుతిరిగి
అందలంబులనెక్కి అతులమోదమున
తమతమయిండ్లకు దారేగిరప్పు
డైతాంబసుతుజూచి అనియెనీరీతి
రావయ్యబాలుడ రాజులదిగుల
గండువారింటికి కదలంగవచ్చు
అలిచేదీవన నందంగవచ్చు
అనిచెప్పిపుత్రుని కధికధనంబు
మాడలుచీరలు మణిభూషణములు
సురభియైనట్టి కస్తూరిచందనము 60
బాగాలుచక్కని పక్వపర్ణములు
తగువారిచేనంపె తనయునివెంట
బ్రాహ్మణజనులకు భట్రాజులకును
ఆటపాటలవారి కఖిలార్థితతికి
దాసజనాళికి దాదులకెల్ల
దానంబొసర్పుము తగినమార్గమున
అత్తలుమొదలుగ అంగనాతతికి
నయంబుతోనిమ్ము వేర్వేరసొమ్ము
రాజునుమంత్రియై రంజిల్లుచున్న
బ్రహ్మన్నసుతుడవు పటుదాతవరయ 70
అర్థంబుగలవారి కల్లుడవీవు
కీర్తిసంగ్రహబుద్ధి కీలింపుమదిని
అనిచెప్పిచనుమన అధికసాహసుడు
పొమ్మన్నమాటకు పూనెహర్షంబు
వృద్ధశీలాంబకు వేడ్కతోమ్రొక్కి
ఐతాంబమొదలైన అమ్మలనెల్ల
లిన్నగసేవించి దీవనవడసి
యెలమినితమ్ములు నిరుదెసగొలువ
బ్రాహ్మణుల్ దీవింప భట్టులుపొగడ
ఆటపాటలవార రాడుచురాగ 80
సానిగేహమునకు చయ్యననేగి
వాకిటిముందర బాలుండునిలిచె
* శ్యామాంగియప్పుడు సకియనుజూచి
బడలియున్నదటంచు పలుకుమంపోయి

(బాలచంద్రుఁడు వేశ్యయింటికిఁ జనుట.)

అనగనాసకియ బయటికినేతెంచి
తలనొప్పిచేజిక్కి తమమొక్క నేడు
పాన్పుపైబొరలుచు బాధనొందుచును
ఉన్నదియంచును ఒయ్యనజెప్ప
బాలచంద్రుడువిని పలికెనీరీతి 90
గరిమకార్యమపూడి కలనికినేను
పోవుచుధనమిచ్చి పోవలెనంచు
వచ్చితినింతలో వనితగర్వించి
ప్రేమమైసిరిరాక పెడచేతద్రోసె
భామకిప్పట్టున భాగ్యంబులేదు
దైవమీయదుసొమ్ము తరుణికీవేళ
అనవినిచనిఆపె ఆవార్తచెప్ప

* బాలచంద్రుని వేశ్య సబ్బమ యని, సబ్బాయి యని ఈమెకు ఖ్యాత నామములు.

శ్యామాంగి తత్తరమంది తాలేచి
త్వరగ నాయత్తమాయె బాలునిబిల్వ
కస్తూరిజవ్వాజి కలిపినయట్టి 100

మలయజమోపిక మైనిండనలది
చెలగుచుజాళువా చీరధరించి
రాజిల్లుహొంబట్టు రవికనుదొడిగి
కుంతలంబులదువ్వి కొప్పును బెట్టి
అలరుచునవరత్నహారచయంబు
వక్షోజయుగళంబుపై చిందులాడ
గళమునదాలిచి కరములయందు
హేమకంకణములు హెచ్చుగమెరయ
చక్కనిముత్యాల జల్లులునమర
సౌందర్యఖనియైన శ్యామాంగియపుడు 110

వివిధచిత్రంబుల వెలయుచునున్న
సౌధంబుపైకెక్కి స్వప్రతిబింబ
మద్దంబులోజూచి అటునిటుదిద్ది
అంతటదిగివచ్చి హర్షముప్పొంగ
వీరులందరికిని విడియముల్గొనుచు

కడువేడ్క బాలుని గానగబోయి
పన్నీరుచెప్పించి పదములగడిగి
యెనమండ్రకప్పుడ యిచ్చివిద్యములు
వెలదిబాలునిరెట్ట విడువకపట్టి

మేడపైకెక్కించె మెలతసౌందర్య 120
మహిమచూచిరణంబు మరచెబాలుండు
ద్వారసమీపాన తమ్ములందరును
కనిపెట్టియుండిరి కడుభక్తిమీర
బాలుడుపవళించె పట్టెమంచమున

(బాలచంద్రుఁడు వేశ్యమాయలకు లోఁబడుట.)

చెలియప్రేమ పరీక్షచేయుటకొరకు
తలవాంచియుండెను తరుణినంటకయె
బాలునిభావంబు పల్లటిల్లుటను
తెలిసిఆశ్యామాంగి తిన్నగననియె
నినుబాసిదినములు నేటికైదాయె
ఐదేండ్లవలెదోచె అక్కటనేను 130

నీకుసంతసమిచ్చు నెలతనుగాను
కరుణనాపైదప్పె కాంతుడనీకు
దయదప్పినప్పుడెంతగ వచించినను
నీమదికెక్కదు నేనేమొనర్తు
నామనంబెరుగును నావికారంబు
విరహతాపముదొట్టి వేసటపుట్టి
* పదియవస్థలుమేన ప్రాప్తించిమించ
బహువేదనలబడి పారంబులేక

---

* ఈయవస్థలు మన్మథావస్థలనఁబడును. కామశాస్త్రనుసారముగా నివి పండ్రెండుకాని యాలంకారికులుమాత్రము పదియనియే విశేషించి చెప్పియున్నారు. భావప్రకాశకారుఁ డీతీరున దెలిపెను. "दशधा मन्मथावस्था भवेद्द्वादशधाऽपि वा। इच्छोत्कण्ठाभिलाषाश्च चिन्ता स्मृतिगुणस्तुती। उद्वेगोऽथ प्रलापःस्यादुन्मादो व्याधिरेव च।

ఉసురసురంచును నుడుగనిజాలి
భావంబులోనుండి భయమునుబొంది 140

తనువుకంపింపగ తగుమాటమరచి
యెప్పుడునీరూపు నేజూతునంచు
వాక్యంబుపల్కిన వగరుపుపుట్టు
నిట్టూర్పువిడుచుచు నిన్నెచింతించి
పొరిసిగ్గువిడిచియుం భుజియింపమాని
తపియింపదేహంబు తరచైనకాక
తడబడనాలుక తల్లడంబంది
జీవంబుదొలగంగ చింతయొనర్చి
పరవశంబుననుంటి పానుపుమీద
తలనొప్పిఘనమాయె తాపంబుహెచ్చె 150
నీవువచ్చుటజేసి నీమాటవింటి
అడగెనుతలనొప్పి అనిమేషమున
ఎంతగనీమీద నేమోహపడిన
నీమదిదయలేదు నేనేమిచేయ
అనితలవాలిచి శ్యామాంగియపుడు
కన్నీటిబిందువుల్ గ్రుక్కునజారి
వక్షస్థలంబున వరదలై పార
విహ్వలభావయై విలపింపదొడగె
బాలుడుముందరి పాటెరుంగకయ
పట్టిదుఃఖంబని భావింపలేక 160

కామాంధకారంబు కన్నులదట్టి
శ్యామాంగినతిప్రేమ అక్కునజేర్చి
కాటుకచెదరంగ కన్నీరుతుడిచి
చెదరినకురులను చిక్కులుదీసి
సీమంతమొగిదిర్చి చేర్చుక్కనిలిపి
కౌగిటబిగియించి కాంచనరత్న

---

जाड्यं मरणमित्याद्ये द्वेकैश्च द्वर्जिते बुधैः" [మన్మథావస్థలు పది లేక పండ్రెండువిధములు. 1 ఇచ్ఛ (కోరిక), 2 ఉత్కంఠ (కోరినవానినిఁ బొందుట యందలి తహతహ), 3 అభిలాషము (సర్వాంగ సుందరుఁడైన పురుషునిఁ జూచినప్పుడుగాని విన్నప్పుడుగాని జనించు స్పృహ), 4 చింత (విచారము), 5 స్మృతి (తలఁచుకొనుట), 6 గుణస్తుతి(గుణములనుతించుట), 7 ఉద్వేగము (భయము), 8 ప్రలాపము (ప్రియసంశ్లిష్టగుణములఁ బలవరించుట), 9 ఉన్మాదము (చేతనాచేతనములయందుఁ దుల్యవర్తిత్వము), 10 వ్యాధి (తాపాధిక్యము), 11 జాడ్యము (శూన్యాంతఃకరణత్వము), 12 మరణము (మరణార్థమై ప్రయత్నము) అని పండ్రెండు మన్మథావస్థలు. వీనిలో మొదటిరెంటినిఁ గొంతమంది బుధులు విడిచిపెట్టెదరు. (కనుక అభిలాషము మొదలుకొని మరణమువరకుఁ బదియవస్థలగును]. ధనంజయుఁడు పదియనియే చెప్పినాఁడు. "दशावस्थः स तत्रादावभिलाषोऽथ-चिन्तनं। स्मृतिर्गुणकथोद्वेगप्रलापोन्मादसंज्वराः।जडता मरणंचेति दुरवस्थं यथोत्तरम्"(द). అని దశరూపకము.

హారంబులెదమీద నమరికచేసి
కెరలిమోహమున చెక్కిళ్లుముద్దాడి
యేనూరుమాడల నిచ్చెకామినికి
బాలునిగనుగొని పల్కెనాలేమ 170

పైనమైవచ్చిన భావంబుతోచె
తెలుపగావలెనాకు తిన్ననికరుణ
అన విని వాక్రుచ్చె అపుడుబాలుండు
చెలగి కార్యమపూడి శ్రీయుద్ధభూమి
వీరులగలయంగ వెసబోవుచుంటి
ప్రియురాలివని నిన్నుబిలువవచ్చితిని
పరువడినీవును పైనమైరమ్ము
జాగుచేయకుమన్న సకియతానవ్వి
బాలుడ నీకేల పట్టెను వెర్రి
యెక్కడిమోహంబదెక్కడిపొందు 180

సరసుడవౌదువు సాటినీకెవ్వ
రీయెడనీబుద్ధి యెక్కడికేగె
కాని సొమ్మునకీవు కాంక్షచేసెదవు
జగములోనిటువంటి సమయంబుగలదె
అడవిలోగాసిన అమ్లఫలంబు
ఉదధిలోలవణంబు నొగిగూడినట్లు
జరిగెనీకునునాకు సంగతివినుము
సరిలేని ఇహసౌఖ్య సాధనాలేము
పరసౌఖ్యమునకు నీపడతిసాధనము

(బాలుండు వారకాంతలఁ దూల
నాడుట.)

అని పల్క విని బాలుడాగ్రహమొప్ప
నరవిమొందరనున్న శ్యామాంగిజూచి
కుటిలాత్మురాల నీ గుణములుతెలిసె
మటుమాయచేజిక్కి మానముధనము
నీపాలుచేసితి నేగాననైతి
కామాంధకారంబు కష్టపువిద్య
నీతిమాలినచర్య నేటికిదెలిసె
ఇంటిలోభోజనం బిచ్చకురాక
పరులయెంగిలికాస పడితినిగాదె
అనిదూరికోపించి అనుహోమహుండు
కాలాగ్నిరుద్రుడై కనలుచులేచి 200

పోవగశ్యామాంగి పోనీకపట్టి
పకపకనవ్వుచు బాలునికనియె
నీబుద్ధిపేదది నినునమ్మరాదు
నీమదినిల్కడ నేగాంచగోరి

(శ్యామాంగి మాయాలాపంబు
లాడుట.)

పలికితి తప్పుగ భావించనేల?
పురుషులనమ్మంగబోలదటంచు
మాటికిజెప్పిరి మా పెద్దలెల్ల
పద్మాగ్రములయందు పట్టుకన్రేలు
జలబిందుతతివలె చలనంబునొందు
మనసొకచందంబు మాటొకతీరు
స్వాధీనుడంగన పార్శ్వమందున్న
ఇల్లువెళ్లినవాని నెవరుపట్టెదరు
క్రొత్తలపైలెస్స కూరిమినిలిపి
ప్రాతలవిడనాడు భావముంచుదురు
తమతప్పులేమియు తలపరుగాన
ఒకరితప్పులనెన్న నోడరుసుమ్ము

15/10

కరుణకుమూలంబు కాంతకోపంబు
సాహసంబోనరింత్రు శౌర్యసంపన్ను
లందు చేమనమున అలుగంగరాదు
మనలోనభేదంబు మానుటనీతి 20

నరికితేజలములు నడిమికిదెగవు
తరువును లతయును దంటగానుండ
చెట్టువినాశంబు చెందినయపుడు
తీగెకాధారంబు తిన్నగజెడును
తీగెనాశంబున చెడిపోదుచెట్టు
మనసున నీభంగి మరవగవలదు
తగదీగెనేనాదు తరువవునీవు
భూమిలోకాంతకు పురుషుడాదరువు
* మాయక్కకంటెను మరివేగమునను
నీతోడవైకుంఠ నిలయంబుచూతు 30

అనిన బాలుడు మెచ్చె అంగనపుడు
చయ్యన అగసాలచంద్రుని బిలిచి
వేయిమాడలనిమ్ము వెలదికిననిన
ఇచ్చెను గైకొనె ఇందీవరాక్షి
మాపెద్దలకునీవు మక్కువనోలి
యిప్పింపుమనిచెప్పి యింతిశీఘ్రముగ
దాసిచేబిలిపించె తమతల్లినపుడు

(వేశ్యమాత బాలునిఁ గదియుట.)

కోతివంటిది వృద్ధ గురుకోపయుక్త
కోలపట్టుకవచ్చె కూతురుకడకు
విరిగినరొండియుం వ్రేలుచన్దోయి 40
ఊరిసిపోయినబల్లినూచలుకాళ్లు
వంగిననడుమును వదలినపండ్లు
పీలచేతులుగూని పీనుగుమోము
చిక్కగనరిసిన చింపిరితలయుం
వ్రాలినబొమముడి వదిలినమేను

మెడమీదకణతియుం మీగాళ్లపూత
పలుచనిగడ్డంబు పైనిపుల్పిరియుం
మూతిమీసపుమొల్క ముక్కురోమములు
తలవడంకును మాట తబ్బిబ్బుమరపు
కంపుగొట్టుచుచొల్లుగారెడునోరు 50

కన్నులపుసులును కాంక్షమిక్కటము
సొక్కుచునీల్గుచు సోలుచువచ్చి
చేవెలుంగునబాలు చెచ్చెరజూచి
ఒరుగుపోయిననోటి నొయ్యనదెరచి
పలికె కంపముమీర బాలునితోడ

దొరలజూచినయంత తొలగంగవలయుం
వారితోఁపొందైన వడిసుడివచ్చు
మాసరివారితో మాలిమిమేలు
తగినఆతడుమాకు దక్కినయెడల
చేనికికాపగు చెప్పినపనులు 60

భక్తిమైచేయును పశువులునెరయు
ఆలసినొలసినప్పు డాదరువగును
ముక్కుకుగానట్టి ముత్యంబువలదు
నామాటవినుమని నాశక్తికొలది
చెప్పినవినదాయె చెలియనేమందు

* బాలచంద్రుని భార్యయైన మాంచాల.

కడసారిదయచేయం కలవారిపొందు
నీవేమిచేసితో నీకేమరగెను
నిశ్చయించెనుభామ నీవెంటజనగ
బ్రతుకుమాయెవ్వరి పాలుచేసెనోకో
ఒకనాడుమాయింటి కొయ్యనవచ్చి 70

వేడినసొమ్మిచ్చు విటకానినైన
చిక్కులబెట్టుదు చీకాకొనర్తు
సంప్రదాయంబిది సకలవేశ్యలకు
మనసునీపాలాయె మమ్మెల్లవిడిచె
అనుకొన్నఫలమేమి ఆపెకెతెలియు
మెల్లనిమాటకు మీరదునీకు
నేనుగద్దించిన నిలువదుమ్రోల
తెలిసియేయుండు నాతీరులోకమున
సర్వకాలమునేను సాకినదాన
సత్యంబునీవెంట సాగిపోనీయ 80

కెరలిననాతోడ గెల్వరెవ్వారు
అనుచుతోడచరచి ఆగ్రహమంది
అడిగినద్రవ్యంబు నలరనాకిమ్ము
నీవెంటపంపింతు నెలతనునేను
సమ్మతిదీవింతు సర్వేశునాన
వెలయగబండ్రెండు వేలరొక్కంబు
ఎలమినుంకువగాగ ఇప్పింపుమన్న
అవిచారముగబాలు డందుకునొప్పి
వెలమలదోర్ణిని వేగంబపిలిచి
యేడువేలధనంబు నింటికినిమ్ము 90

కూరిమితమ్ముడ కుమ్మరిపట్టి
మూడువేలధనంబు ముదిదానికిమ్ము
కంసాలిచందన్న కడమవిరెండు
వేలమాడలనిమ్ము వృద్ధభామినికి
అనిచెప్పియిప్పింప అతివదాగొనియుం
కరములుముకుళించి గ్రక్కునమ్రొక్కి
ముదివానరమువంటి ముదుసలిపలికె
చక్కదనముకుప్ప సరసంపుతెప్ప
మదనునిబాణంబు మాకుప్రాణంబు
దక్కించికొంటివి తగనిటువంటి 100

పుత్తడిబొమ్మ నీపుణ్యముకతన
చేరినదూరక సిద్ధించునట్లు
పట్టుపచ్చడమిమ్ము భక్తితోనాకు
నీమారుగా జూతు నేపెద్దదాన
అనుచువేడిననిచ్చె అప్పుడునవ్వి
యింతిదాబుచ్చుక యింటికినేగె
ఈరీతిదనతల్లి యేగినవెనుక
బాలచంద్రునితోడ పల్కెశ్యామాంగి
ఉల్లంబుచల్లనై ఉత్సాహమొదవె
ఎల్లికార్యమపూడి కేగంగవలయు 11

మల్లభూమీశుని మన్ననపడసి
గొల్లెనలోపల కొలువులోనుండి
మదిలోననన్గూర్చి మరచిపోయెదవు
రాజులుసెలవీక రారాదుమరలి
యెన్నినాళ్లగునొకో యీకార్యసరణి
అన్నపుఖర్చున కాకుపోకలకు
ఈనున్నదేమైన ఇపుడెయిప్పింపు
మనినబాలుడువిని హర్షంబునొంది
చయ్యనకంసాలిచంద్రునిబిలిచి

ఈపెనునాల్గువేలిమ్ము తమ్ముండ 120

అనినమంచిదియంచు నందరివద్ద
అరసిఆద్రవ్యంబు నంతయునిచ్చె
తరువాత బాలుండు తరుణినిజూచి
పైన మైయుండుము పద్మాయతాక్షీ
ఘనతకార్యమభూడి కదనరంగంబు

చూపింతునీమది చోద్యమందంగ
అనిచెప్పిఒప్పించి అనుజులుదాను
శ్యామాంగిసదనంబు చయ్యనవిడిచి
పంచవాద్యంబుల పటలిమ్రోయంగ
బ్రాహ్మణుల్ దీవింప భట్లుపొగడగ 130

ఆనందమునవీథి కపుడరుదెంచి
గుంపులై యున్న భిక్షువులనుగాంచి
వీరికందరికిని వేడినధనము
కూరిమినొసగుము క్షమ్మరపట్టి
అనిపల్కబాలుని నాతడుచూచి

తల్లియిచ్చినయట్టి ద్రవ్యమంతయును
వ్యయమయ్యెనేభంగి అర్థులకిత్తు
అనిచెప్పతమ్ముల నందరిబిలిచి
అడిగినవారెల్ల ననిరివ్విధమున
ఆసమయంబున ఆనపోతులేచి 140

పటుకోపమునబల్కె బాలునితోడ
ఇంతగర్వంబేల యీమదమేల

(అనపోతు బాలచంద్రుని ప్రవర్తనను దెగడుట.)

కామాంధకారంబు కన్నులదట్టి
క్రిందుమీదెరుగక కేరుచున్నావు
కలధనమెల్ల భోగముదానికిచ్చి
చేసితిపాపంబు చెడ్డవెచ్చంబు
ఇహపరదూరపు టీవృత్తియేమి ?
శ్యామాంగిపైప్రేమ సర్వనాశంబు
సానిదానికిమ్రొక్కి సొమ్మెల్లనిచ్చి
యిందరినడిగిన నేమిలాభంబు 150

వారకాంతలరీతి వర్ణింపరాదు
బిడ్డలకొసగక ప్రియురాలికీక
చీమలుగూర్చిన చెలువునగూర్చి
ధనవంతులగువారి ధనమెల్లదోచి
* ముంజికాండ్రనుజేసి మురిపెమందంప
వ్యర్థులైవిటవృత్తి వసుమతిమీద
పోయిరిబ్రతికెడు పొందికలేక
ఉర్విపైవేశ్యలకొలియిచ్చుటలు
వినలేదుకనలేదు వేడబంబిడ్డి
అనిదూరిపలికిన ఆబాలుడరసి 160

తలవంచిమరుమాట తానాడలేక
వెలమలదొర్నిని వేగమెపిలిచి
మలిచుట్టుతప్పించి మాణిక్యఖచిత
కనకమయూంచిత కటిసూత్రమపుడు

* బ్రహ్మచారులు.

తీసి చేతికొసంగి దీనిమూల్యంబు
బ్రాహ్మణులకునిమ్ము భట్టులకిమ్ము
పేదవారలకిమ్ము భిక్షులకిమ్ము
నావుడాతండు ధనంబు తెప్పించి
సకలార్థులకునిచ్చె సంతుష్టులైరి
తరువాత బాలుండు తాత్పర్యమొప్ప 170

(బాలచంద్రుఁడు గండువారింటి కేఁగుట.)

వైభవంబునగండు వారింటికేఁగ
విపణిమార్గంబుల వెలయుచురాఁగ
వరవిప్రకాంతలు వడితోడవచ్చి
హారతులిచ్చినా రానందమొదవ
పలుకానుకలొసంగె బ్రాహ్మణజనము
బాలుండుశృంగార భరితమైయొప్ప
గండువారిగృహము కదిసిఆవేళ
మాణిక్యతోరణ మండితంబైన
ద్వారమునంజొచ్చి దాటుచుజూచె
ఘనచిత్రకర్మసంకలితపటాళి 180

గోడలుకనరాక గుత్తమానట్లు
చేసివితానంబు చెలువొప్పగట్టి
సరసంబొనర్చిన చవికెలోపలను
రక్తకంబళముల రామణీయకము
అరసిచూచుచు బాలు డాసీనుడయ్యె
తమ్ములందరువచ్చి తగినతావులను
వసియించిరచ్చట వైభవంబలర
ద్రాక్షాగుళుచ్ఛముల్ దాడిమ్మపండ్లు
నారికేళాదులు నారింజపండ్లు
జాలవల్లికలతో సరగునదెచ్చి 190

ముందరనిల్పిరి ముదముమీరంగ
వింజామరంబులు విసరిరిలెస్స
బాలుండు సురరాజు భంగిగనొప్పె
కనుగొన్నవారల కన్నులకప్పు
డలరంగచెలికత్తె లమితహర్షమున
మంచాలననువుగ మక్కువతోడ
శృంగారమొనరించు చిత్రంబులుంచి

(చెలికత్తెలు మంచాల నలంకరించుట.)

సంపెంగతైలంబు చయ్యనదెచ్చి
మగువకుశిరసంటి మంచిగంధమున
ఆటకలిరాచియు ఆనూనెపోవ 200

బంగారుబిందెల పన్నీరుతెచ్చి
స్నానమాడించిరి సంతసంబొప్ప
తడితీర్చిరప్పుడు తగినవస్త్రమున
ఒకపొడివసనంబు నొప్పుగగట్టి
కూర్చుండబెట్టిరి గురుహేమపీఠి
బంభరచయమును భయమందజేసి
కాటుకకాకచే కందగజేసి
చీకటిగుహలలో జేరగడంచి
కాలాంబుదంబుల గట్టులజేర్చి
దీర్ఘమైనునుపులై తీరైనకురుల

16/10

కూర్చినున్నగదువ్వి కొప్పుగీలించి
బంగారుపూచేర్లు బాగుగాజుట్టి
మదనుకుంతముకు సమంపుపాపటను
మణిహేమముక్తిక మండితంబైన

చేర్చుక్కఁ జేరిచి చిత్రంబుగాను
పాలుపొందశశిరవి భూషణయుగము
పాపటకిరువంక భాసిల్లనిలిపి
మాణిక్యహాటక మయబింబమొకటి
తలవెన్కఁ మెరయగ దట్టించిరేలమి
సగముచంద్రునితోడ సమమైనయట్టి 20

ఘనఫాలదేశంబు కాంతులుగ్రక్కఁ
నిఖిలజగత్తుల నిర్జించునట్టి
కందర్పువిండ్లను ఖండించిపైచు
బొమలురెంటికిమధ్య పొందికగాను
కస్తూరిబిందువు ఘటనగావించి

ముక్కఁనముత్యంబు ముంగరనిలిపి
చంద్రఖండంబుల సారెకుదూరు
గండభాగంబుల కస్తూరితోడ
మకరికాపత్రముల్ మానుగవ్రాసి
శ్రీనవసంఖ్యల చిరునవ్వునవ్వు 30

వీనులు మితిలేని విభవంబునొంద
దీపితరత్నమౌక్తిక హేమయుక్త
తాటంకభూషణ ద్వయముగీలించి
ముత్యాలకుచ్చులు మునుకొనివ్రేలు
* బవిరలు † కుంటేండ్లు పసమీరబెట్టి
కర్ణాగ్రదేశముల్ కాంతులనీన
కుప్పెలముత్యాల కుచ్చులురెండు
ఘనకుంతలంబుల గదియించిమరియు

కాశ్మీరకర్పూర కస్తూరులెసగు
మలయజంబలర హేమసమంపుమేన 40

విశదంబుగాపూసి విసరిరంతటను
పువ్వులగుత్తుల బొంగరంబులను
మానితకందుక మాలూరతతుల
చయ్యననిరసించు చన్నులపైన
బంగారుపువ్వుల పట్టుకంచుకము
తొడిగినేరుపుతోడ దూముడివేసి
ముత్యాలరత్నాల మురిపెంపుపేర్లు
పతకాలుపవడాలు బన్నసరాలు
వక్షఃస్థలమ్మున వరుసగవేసి
కంబుసన్నిభమైన గళభాగమందు 50

ముత్యాలపట్టెడ ముదముతోబెట్టి
మర్రియూడలతోడ మార్కొనిగెల్చి
సుమమాలికలసొంపు చూరలుపుచ్చి
చెలువొందుచుండెడు చేతులరెంట
రత్నాలుచెక్కిన రమ్యాంగదములు
దండకడియములు దంటతాయెతులు
మక్కువతోగట్టి మనికట్లునెగువ
నీలాలగాజులు నేర్పునదొడిగి
పచ్చలకంకణాల్ భాసిల్లబెట్టి
‡ చామలాకడియముల్ సంధింపజేసి 60

సొబగైనచేకట్లు సొమ్ములుదాల్చి
మాణిక్యతపనీయ మంజులోర్మికల

* ఒక విధమైన కర్ణాభరణము.

† ఒక విధమైన పూర్వకాలపు సొమ్ము. ఇవి యిప్పుడంతగా వాడుకలోలేవు.

‡ కంకణ విశేషము.

అంగుళంబులకెల్ల అమరంగగూర్చి
పాపటసవరించి బంగారుతగటు
ముయ్యంచుచేలంబు మోహనమొప్ప
కటియందుసంధించి గజ్జలువ్రేలు
తపనీయకాంచిని దట్టించిముడిచి
పయ్యెదరొమ్మున బాగుగజేర్చి
అంచెలుగొలుసులు నమరగబెట్టి
ఘర్మవినిర్మిత బహువిధదీప్త 70

* భూషణంబులువ్రేళ్ళ పొందుగబెట్టి
పదములలత్తుక ప్రకటంబుచేసి
పద్మపాణిసాల భ్రమనొందజేసి
చెవులపర్యంతము చెలగునేత్రముల
కాటుకవెలయించి కాంతలీరీతి

శృంగారమొనరింప చెలగిమాంచాల
తల్లికిమ్రొక్కిడి దయరాగననియె
అమ్మనీయల్లుని నసలెనెరుంగ
రీతిచెలియుందు నేయుపాయంబు
పతియనియితరుల భావింపగూడ 80

వాభంగిజేసిన అపరాధమగును
హాస్యంబుచేయుదు రక్కడివారు
కంపుముగురిచెప్పి పణతిరోయనిన
మంచాలకప్పుడు మాతయిట్లనియె
నీవటుపోయిన నినుజూచినపుడు
లేతురుదుమరుదులు లేవదువరుడు
గురుతుచెప్పితినేగు తూతురాఅసిన
తల్లినిసేవించి తానేగెనపుడు

(మాంచాల భర్తదగ్గరకేగుట)

భూదేవితనరూపు పాలతినిజేసి
బాలునిభ్రమియింప బంపెనోయనగ 90

సౌందర్యఖనియైన చానమాంచాల
నిల్చివారలజూచి నివ్వెరపడగ
మరదులార్వురుగూడి మక్కువతోడ
వేగమేలేచిరి వెలదినిగాంచి
పతిలేవకుండెను బ్రాహ్మణోత్తముడు

లేచినపాపంబు లేమకుజెందు
అనుచులేవకపోయె అపుడుమంచాల
యిద్దరిలోభర్త నెరుగగలేక
కాంచనవర్ణప్రకాశుడైనట్టి
బ్రాహ్మణుడనపోతు పాదంబుపట్టి 100

పన్నీటగడుగంగ భావనచేయ
భయమున అనపోతు పలికెవేగంబ
నేనుబాలుడగాను నిజముమాతల్లి
మరదిబ్రాహ్మణుడను మగువనానామ
మనపోతునాబిల్తు రందరుజనులు

విప్రుడీరీతిని వెలదితోబలుక
అనపోతుతోనసె అపుడుమాంచాల
మరదియౌయెరుగను మగడొకోయెరుగ
భయమొందనేటికి బ్రాహ్మణోత్తముడ
అనిపల్కెమాంచాలకావిప్రుడనియె 110

అమ్మనీపెనిమిటి యతడు; నామంబు
బాలుండు; క్షాత్రవ భయదుండుసుమ్ము

* కాలివ్రేళ్ళకని యర్థము.

నీమనోహరు సేవ నియతిమైజేసి
తరువాతమమ్మెల్ల దయనాదరింపు
మనినంతనతనితో ఆలేమపలికె
వినవయ్యవిప్రుడ విన్నపంబొకటి
ఇద్దరికినిమీర లెలమితోపెండ్లి
చేసెదునాడొక చెనటివిప్రుండు
చూడగాలేక అసూయవెంపొంద
సౌందర్యమన్నది చానకుసున్న 120
యెట్లుగావించి నారీవివాహంబు
అనిపల్కెనోయేమొ యటుకాకయున్న
బాలుడివ్విధమున భావంబువిడిచి
నన్నేలవిడనాడు నయమార్గమెడలి
పరిచయమేలేదు పతికినినాకు
బాలచంద్రుండిప్పు వచ్చెనుగనుక
నేనుపూర్వమునందు నియమంబుతోడ
చేసినతపమంత సిద్ధించెననుచు
హర్షంబునొందితి ఆత్మలోపలను
బాలుడుమమ్మిక పాయకయున్న 130

మాభాగ్యమిల అసమానంబుగాదె
బ్రహ్మకులంబున ప్రభవించినావు
వేదాదివిద్యల విజ్ఞానివనుచు
నీచరణంబులు నేనుపూజింప
పట్టితినాకన్య భావంబులేదు
మనసునిశ్చయమిది మరదినాకంచు
అనువొప్పగాబల్కి ఆత్మేశుజూచి
పన్నీరుదెప్పించి పాదముల్గడిగి
వచియించెనిబ్భంగి ప్రౌఢవాక్యముల
ప్రాణాంగనలగన వచ్చెదునప్పు 140
డితరులదెచ్చుట యేపాటినీతి?
* అనినబాలుడుపంపె అనుజులనెల్ల
పోవుచుజెప్పిరి పొసగనవ్వుచును
బవరంబునకునేగు పయనంబునిలిచె
మనసుభయంబందె మక్కువమీర
కులవైరముందీర్చు కోర్కెయేమాయె
బవరంబునకునేగు పైనమేమాయె
నవ్వరాయీమాట నాయకుల్విన్న
కలనిలోనున్నట్టి ఘనులెవ్వరయ్య
యీసుఖమేదక్కె నెవరునాకేల 150

అనిచూడగూడునా అపకీర్తివచ్చు
అనిపల్కువాక్యంబు లాలించియపుడు
బాలచంద్రుడుపల్కె భ్రాతలతోడ
ఇంతగానాకు మీరేలచెప్పెదరు
బవరంబునకునేగు పైనంబుమరవ
కులవిరోధములోన కుములుచునుండె
కాయమిచ్చుటబుద్ధి కలనిలోపలను
నివసించియున్నది నిశ్చయంబిదియు
శ్రీగిరీశునియాన చెన్నునియాన
మాయమ్మమాటకు మారాడలేక 160
యిటువచ్చినాడ మీరేమిచెప్పెదరు
రయమునవచ్చెద రమ్మందురేని
మీరెల్లనిలుమన్న మీరకనిల్తు
ఎన్నినాళ్లుందు నే నెరిగింపుడనిన
ఏడుజాములదాక నిచ్చోటనుండు
మంతటమిలివచ్చు అరుగంగవలయు

* ["जातानुरागायां......शेषजनविसृष्टिः" (वा. का)] (నాయిక అనురక్త అయి నప్పుడు శేషజనులను పంపవలెను'') అని వాత్స్యాయనుడు.

సర్వజ్ఞుడవునీవు జడులము మేము
వచ్చెనాఅపకీర్తి వచ్చునందరికి
ఒత్తిచెప్పుటలుమాకుచితధర్మంబె
అనిపల్కి-శీఘ్రమే ఆకొల్వువెడలి 170

తమతమయిండ్లకు తమ్ములుచనిరి
తరువాతమాంచాల తనభర్తయైన

(బాలచంద్రుఁడు నతనిభార్యయు నంతఃపురంబునఁ గ్రీడించుట)

బాలచంద్రునితోడ భావముప్పొంగ
మేడమీదికిబోయి మేలైనయట్టి
చిత్తరువ్వజూపుచు చిలుకలచదువు

వినిపించిశృంగార విపినంబుజూపి
పెద్దలుతనమీద ప్రియముమీరంగ
ప్రొద్దుపోవుటకునై పొందించినట్టి
బొర్మపాంచాలికావ్రాతముజూపి
అందులోనొకబొమ్మ నాడంగజేసె 180

అందుకాతడు కరమానందమొందె
ఆటుమీదనిద్దరు నధికమోహమున
చిత్తరువ్వమేడకు జేరబాలుండు
హంసతూలికపాన్పు నందుపరుండె
ప్రియురాలుముత్యాల పీటపైనుండి

తాంబూలమిచ్చుచు తనమదిలోన
బాలునిభావంబు బాగుగనెరిగి
ఆయత్తపడివత్తు ననిమ్రొక్కి-లేచి
తనిరయొద్దకుబోయి జలకంబులాడి

(పూంచాలతల్లిదగ్గర కేగుట.)

ముత్యాలుగూర్చిన ముంగొంగుమెరయ

ప్రతిమలువ్రాసిన పట్టువస్త్రంబు
కటియందుధరియించి కనకమాణిక్య
మౌక్తికసంయుక్త మంజులంబైన
భూషణవితతిని పొందుగాదాల్చి
చెలగిపాదముల మంజీరయుగంబు

సంధించిముత్యాల జల్లులువ్రేల
బహువిధశృంగార భరితురాలగుచు
(బిడ్డలయాశలఁ బ్రియమునఁదీర్ప
జననితోసమమైన జంతువులేదు
కావునదనకున్న కష్టంబులెల్ల 200

పోగొట్టునని యెడు బుద్ధితోనాపె
తల్లితోడుత నివ్విధంబునఁబల్కె-
కాంచకకాంచక కాంచితిఁబతిని
కాంచితినేకాని కలలోనివార్త
కదనరంగమునకుఁ గదలుచున్నాఁడు

చిరవియోగముమాకు సిద్ధించునొక్కొ-)
దైవమీలాగున దయదప్పినన్ను
పుట్టింపగానేల (భూస్థలిమీద)
అడవిగాసినవెన్నెలాయె నాబ్రతుకు
తల్లిరోనేనెట్లు తాళగలాను 17/10

(బాలునిఁబోకుండఁ బట్టుటయెట్లు
దరియేమినాకని తల్లడంబంద
తరుణియిట్లనిపల్కెఁ దనయనుజూచి

(రేఖాంబ తనకూతురైనమాంచాల
కుపదేశించినజ్ఞానప్రకారము.)

ముద్దులమాంచాల ముదమునవినుము
జన్మవృక్షమునకుఁ జవిగలయట్టి

పటుతరకమనీయ ఫలములురెండు
కెరలుభోగములొండు కీర్తిరెండవది
తొలుపండుచవిచూచి తొలఁగునొకండు
మలుపండు చవిచూచి మలఁగునొకండు
వీరలిద్దఱికిని భేదంబుహెచ్చు 20

మొదటిఫలంబున మొనసెడురసము
క్షరభగురంబది సమసిపోఁగలదు
రెండవఫలమున రెక్కుచురసము
శాశ్వతంబౌచు దిశలెగలదాఁక
సవితృఁడుగలదాఁక శశిగలదాఁక

తారలుగలదాఁక ధరగలదాఁక
వారిధిగలదాఁక వరలుచునుండుఁ
బ్రకటఫలద్వయ రసముచుగ్రోలి
యనుభవించెడు వారలరుదుభూస్థలిని
ప్రాకృతజనములు ప్రథమఫలంబు 30

ప్రాపించిసంతృప్తి వడయంగఁగలరు
వీరాంశమునఁబుట్టి వెలయువారలకు
మొదటిఫలంబది ముఖ్యంబుగాదు
మహిమాస్పదంబయి మనసుజ్వలింపఁ
బరుగెత్తుదురు రెండవఫలంబుకొఱకు

వెలదిరోనీభర్త వీరశేఖరుఁడు
కీర్తికాముకుఁడయి కేరుచున్నాఁడు
నీవుభోగములపై నిరతిఁద్యజించి
బాలచంద్రుని భద్రభావంబెఱింగి
భావిమానవుల హృద్భవనంబులందు 40

తావకీనయశోల తావివర్ధనము
సేయంగఁగోరుము చెలువరోయిపుడు
బాలచంద్రునినాగఁ బట్టంగవలదు
నావుడుమాంచాల నమ్రతతోడ
జననికిఁదా నమస్కారంబుచేసి)

భర్తదగ్గరకేగి భక్తితోనిల్వ
(దనమదిబాలుండు తలపోసెనిట్టు)
లెక్కడిసౌందర్య మెంతయొయ్యార
మేమనియెన్నుదు నీయింతిచెలువు

(బాలచంద్రుఁడు తనపూర్వప్రవర్త
నకుఁ బశ్చాత్తాపమొందుట.)

నరలోకసురలోక నాగలోకముల 50

సరిలేరుభామకు సౌందర్యగరిమ
ఇటువంటికాంతపై నిచ్చబోవిడిచి
పశుబుద్ధితోడనే భావంబుమరచి
నిందపాలైతిని నిఖిలరాజ్యముల
పరలోకసౌఖ్యంబు పారదోలితిని

మిత్రులుచుట్టాలు మేటిబంధువులు
తిట్టిదూషింతురు తెలియలేనైతి
ఆశ్రితజనముల అరయుటమాని
పరియాచకముచేయు వారలకిచ్చు
భ్రష్టులపోలిక భార్యనుబాసి 60

వెలయాలిప్రేమించి వీరిడినైతి

ఏగతిచింతింతు నేమందువిధిని
నాకర్మఫలమేమొ నాగతియేమొ
తరమెనా కెరుగంగ దైవంబెయెరుగు
అనితలపోసెను ఆబాలుజేరి
మాంచాలగూర్చుండె మక్కువతోడ
బాలుండుమోహంబు ప్రకటంబుచేయ

(బాలచంద్రుడు భార్యతో వినోదంబులు సల్పుట.)

* చేవేగమునచీర చెంగునునొడిసి
పట్టినఆచీరపై నున్నయట్టి
ముత్యాలచేరులు మొదటికితెగెను 70
చెదరిరాలినగని చేయభీతిల్లి
చిన్నబోయెను మోము చెలువెల్లదొలగ
వెలదివెల్వెలబోవ విభుడప్పుడనియె
చింతింపబనిలేదు చిత్తంబులోన
అంతనుబాగుగ అమరింతుచీర
అనిలేచిసంభ్రమ మచ్చుపడంగ
చెక్కులుకరముల చెన్నుగనిమిరి
తగునేర్పుతోడ ముత్యంబులనెత్తి
చీకాకుపడజేసి చిక్కులబెట్టి
కాలంబునీరీతి గడుపంగమించి 80
జాములేడునుదాటె తరుణిమాంచాల
బాలునితోననె భావంబెరింగి
నాలోబెనంగిన నయమేమిలేదు
కడువడికలసికి గదలుడిమీరు
కులవైరముందీర్చ గురుసాహసుండు
పరికించిచూడ నెవ్వరుమీరుదక్క
అనిపల్కుచుండంగ ఆసమయమున

(బాలచంద్రుని యనుజులు దుందుడుకు సేయుట)

ఆటకూరులైనట్టి యనుజులువచ్చి
గంనువారింటిదగ్గర జేరినిలిచి
ధ్వనియొనర్చిరి హెచ్చు తమకంబుమీర 90
వినిబాలుడడిగెను వెలదినిజూచి
మేడపిచెప్పుని మేలైనసేవ
అనితెల్పగా బాలుడాసక్తితోడ
మౌక్తికమాలలమరుపగడంగె
తమ్ములందరునప్డు కత్తరపడుచు
ఘనరౌద్రముగనుండు కత్తులుదూసి
వెడలినకోపాగ్ని పీరులేవ్వరును
మారెరుంగకకేరు మదకరులట్లు
పురముతల్లడమంద భూధ్రముల్ కదల
భీకరంబుగనార్చి పెడబొబ్బలిడిరి 100
అదిబాలుడాలించి ఆయుధమందె
ఓడకోడకమంచు ఉవిదలబలికె
పెనగొన్నకోపాన పెరికికటారి
అట్టహాసముచేసె అనుజులమీద
పలికిరితమ్ములు బాలునితోడ

(బాలచంద్రుం డనుజులపైఁ గవర్హారు లజ్జాకరంబులగు మాటలాడుట.)

త్రుప్పుపట్టినకత్తి దూయుటకగవె

---

* ["केशहस्ते वस्त्रान्ते नीव्यामित्यवलम्बनम्' (वा. का)] (కేశపాశమం చీరెచెంగునందు, చీరెముడియందు (రతోపక్రమానికి) పట్టుకొనడం (ఉచితం).] వాత్స్యాయనుడు.

ఘనమైనశౌర్యంబు గలవాడవౌర
ప్రబలుచునున్నట్టి వైరులవిడిచి
అనుజులమీదనా? ఔద్ధత్యగరిమ
భోరునకార్యమ పురమునకేగు 110

సమరకార్యమునీవు చాలించినావు
కొలువులోమీమామ కొమ్మభూపతికి
ఇల్లడచేసెని స్నేలమి బ్రహ్మన్న
అలరాజుపగరచే హతుడైనవెనుక
పెండెంబునందెయు భేతాళమనెడు

ఖడ్గంబుమొదలైన కలబిరుదముల
ఒసగుమంచునునీకు సర్వేశుడంపె
వినుమినుమునురాగి యిత్తడికంచు
పెట్టిచేసినయట్టి బిరుదులుగలవు
రజతజాంబూనద రచితమైనట్టి 120

వెలలేనిసొమ్ములు వెసనీకుదక్కె
సన్నుతికెక్కనీ సరసత్వమెల్ల
కట్టిడివాడవు కరుణలేదాయె
నఅక్క వెలలేని మాణిక్యమరయ
బ్బిఆకైలాస శైలంబునందు
లరాజుగలసిన దాశ్చర్యసరణి
రసిజలోచన చావువిన్నపుడు
దరికొనదా? మది దావాగ్నిరీతి
అన్నమెట్టులులోని కరుగునునీకు
కంటికినిదుర యేగతివచ్చునయ్యో 130

బంటుతనంబును పాడియువిడిచి
కులవైరముందీర్చు కోరికవదలి
ఇంటికాసించుట యేనీతియగును?

బాలుడా! మమ్మంపు బవరంబునకును
కులవైరముందీర్చి గురుశౌర్యమమర
తక్కించెదమునీకు దరిలేనికీర్తి
అనినబాలుడునిని అడకువమీర
సిగ్గుచేతలవంచె శీఘ్రమెతిరిగి
మాంచాలమందిర మార్గంబుపట్టి
పురుషునిరాకడ బుద్ధిగ్రహించి 140

వాకిటిపొంతకు వడినెదురేగ
అతివచేతికిబాలు డాయుధమిచ్చె

(మాంచాల భర్తనుదీవించి
ఖడ్గంబు చేతికిచ్చి యుద్ధమున
కంపుట.)

నవ్వుచుదీవించె నలినాయతాక్షి
రతిరాజసుందరా రణరంగధీర
కమలబాంధవతేజ కరుణాలవాల
వినతాత్మజునిలావు వెసనీకుగలుగు
సామీరికుండిన సాహసంబబ్బు
కృష్ణునికీడుగా కీర్తిఘటిల్లు
రవికాంతియుతుడవై రంజిల్లుచుండి
అలరాజుపగదీర్చు మనుజులతోడ 150

పటుతరవిక్రమ వైభవంబలర
శ్రీగిరిలింగంబు చెన్నకేశవుడు
వరములొసంగగ వర్తిల్లగలరు
శాత్రవవిజయంబు సమకూరుమీకు
ఈయాయుధము వడిచిచ్చునుజయము
కలియుగంబునమీకు ఘనపూజలమరు

అని ప్రాణనాథుని ఆశీర్వదించి
ఆయుధంబిచ్చిన అతడు గైకొనియె
బాలునితోపల్కె పడతిమాంచాల
కలహంబునకుమీరు కదలుచున్నారు 160

జయమపజయము నీశ్వరునకు దెలియు
విప్రుడాఅనపోతు వెంటరాదలచు
బ్రహ్మహత్యఘటిల్లు పాపమువచ్చు
బహుజన్మములకైన పాయదాకీడు
* పరమేశ్వరుండైన పార్వతీజాని

పాపికొనగలేక పలుపాట్లుపడియె
మనుజులెంతటివారు మదివిచారించి
మగుడంగబంపుము మాయ చేనైన
అనినసమ్మతమొంది అపుడుబాలుండు

---

* శివునికి బ్రహ్మహత్యయెట్లు సంభవించెననఁగా:—

తొల్లి బ్రహ్మ మేరుపర్వతకూటస్థలియందుఁ గొల్వుతీరియుండఁ బరతత్వంబెద్దియో తెల్పుమని సభాస్తారులైన మునులతని నడుగ నేనేపరతత్వమనియుం నేనొక్కరుండ నీశ్వరుండనియుం నాకధీశ్వరుండులేఁడనియు బ్రహ్మవాక్రుచ్చె. అంతట నచటనున్న క్రతుపురుషుండు దర్పోజ్జృంభితుఁడై బ్రహ్మతో నీవు లేనిపెద్దఱికంబు వహించెదవు, నేను సాక్షాన్నారాయణుండను యజ్ఞపురుషుండ, జగత్ప్రభుండ నని పలికెను. వీరిద్దఱిట్లు పరస్పరజయకాంక్షులగుచు తమతారతమ్యంబు వేదంబులనడిగిరి. చతుర్వేదంబులును రుద్రుండవ్యయతత్వం బద్యులయందాశబ్దవాచ్యత్వంబు సంప్రతిష్ఠితంబు గానేరదని సాక్ష్యంబిడియె. వల్లకాటియందుఁ గాంతాసహితుఁడైయుండు రుద్రునకుఁ బరబ్రహ్మభావంబెట్లుకలుగునని విరించియు యజ్ఞపురుషుఁడును వేదంబుల సాక్ష్యంబంగీకరింపరైరి. పిమ్మటఁ బ్రణవంబుమూర్తిమంతంబై రుద్రుండే పరమాత్మయని చాటిచెప్పెనుగాని ప్రణవవాక్యంబులంగూడ నిరాకరించిరి. అప్పుడొకయఖండదివ్యతేజోమధ్యంబున హరుం డుద్భవించెను. అతనింజూచి బ్రహ్మ ఓయిశివుఁడా నీవు నాలలాటస్థలంబునఁ బుట్టితివి గాన నీవు నాపుత్త్రుఁడవు నన్నాశ్రయించి బ్రతుకుము నావుఁడు భర్గుఁడు నితాంతరోష సంరంభంబున విజృంభింప భైరవుఁడుపుట్టెను. భైరవుఁడు శివునాజ్ఞనొంది గర్వించుచున్న బ్రహ్మయొక్క పంచమవదనంబు నఖరధారంద్రుంచివైచెను. యజ్ఞపురుషుఁడు, విరించియునంతటభయపడిస్తోత్రంబుగావించిరి. శివుఁడు భైరవునింజూచి యిఁకనీకోపంబు చాలించి బ్రహ్మకపాలంబుదాల్చి, లోకాచార ప్రకటనార్థంబు భిక్షాన్నంబుఁగొనుచుఁ గాపాలికవ్రతముతోఁ జరియింపుమనిచెప్పెను. తరువాత శివుఁడు బ్రహ్మహత్యను సృజించి భైరవుని వెంటఁబంపెను. బ్రహ్మహత్యతోడనవర్తింప జగమ్ములుభ్రమ్మరుచు నొక్కనాఁడు

(ఐతాంబ, కుమారుని దీవించి యుద్ధరంగమున కంపుట.)

మాంచాలవీడ్కొని మనసు చలింప 170
తనయింటికే తెంచి దండిశూరుండు
తల్లి చేనన్నంబు తానారగించి
చందనపరిలిప్త సర్వాంగుడగుచు
తగటువస్త్రంబులు తగజుట్టితొడిగి
ధర్మమూర్తికరత్న బహుభూషణములు
తగినఅంగములందు దాలిచిమించి
తల్లికిమ్రొక్కిన తనరదీవించి
సురనాథు విభవంబు సొంపొప్పగలుగు
వీరభద్రునికట్లు విజయంబుగలుగు
వినతాతనూజాత వేగంబుగలుగు 180
రఘునాయకులయొక్క రాజసమొప్పు
పవనపుత్రునిమహాబలముసిద్ధించు
విచ్చేయుమనితల్లి వేడుక బలికె
తగినట్టిదీవన తల్లిచేకొంది
దట్టమౌకోపానతన మొగసాల
కరుదెంచిఆబాలు డానందమొంది
* భూమండలపుకోట పొందుగగెలిచి
పాండ్యులజేకొనె పటువిక్రమమున
† బలువైనజగజంపు భద్రసాలేయ
మదిపంపుమని వార్తనంపెతల్లికిని 190

భైరవుఁడు కాశీపట్టణంబుఁజొచ్చెను. చొచ్చినంతనే బ్రహ్మహత్య మొఱవెట్టుచుఁ బాతాళంబునఁబడియెను. కరంబునవున్న బ్రహ్మకపాలంబు భూతలంబునంబడియెను. ఈశ్వరరూపాంకరమైన భైరవునికి బ్రహ్మహత్యాపాతకంబు తొలఁగిపోయెను. అనియివ్విధమున స్కాందపురాణాంతర్గతంబైన కాశీఖండంబునం జెప్పఁబడినది. బ్రహ్మ పంచముఖుఁడై యుండిన కాలమున నొకనాఁడు త్రిమూర్తులు కొల్వుదీరియుండఁ బార్వతి యచటికి వచ్చి పంచాననులైన శివబ్రహ్మలలోఁ దనభర్తయెవరైనది తెలిసికొనలేక విభ్రాంతి చెంద శివుఁడు కనుసైగ చేసెను. అకనుసన్నతెలిసి పార్వతి శివుని వద్దకుఁబోయెను. తనభార్యకింతభ్రాంతి కలుగుటకు బ్రహ్మకైదు ముఖములుండుటయే కారణమని గ్రహించి యాయైదుముఖములలో నొకదానినిఁ దీసివైచి యతఁడు బ్రహ్మను జతుర్ముఖునిం జేసెను. అందుకు బ్రహ్మకోపించి శివునకుఁ గాపాలికత్వమును భిక్షావృత్తియుఁగలుగునట్లు శపియించెను. ఈబ్రహ్మహత్యాపాపనివారణకొఱకు విష్ణుబోధితుఁడై శివుఁడు తీర్థయాత్ర చేసెను. ఇట్లు తీర్థయాత్ర సల్పుచుఁ గాశీపురికిరాఁగా నచట నప్పాపమువలన విముక్తుఁడయ్యెను. అని మఱియొకకథగలదు.

* సత్తెనపల్లి తాలూకాలోని ధరణికోటయై యుండును.

† ఇది ఛత్రనామము.

తనయునివాక్యంబు తామీరలేక
తెప్పించియిప్పించె దీవనతోడ
రాచబిరుదులంది రణరంగమైన
కార్యమపురిచేర గదలగదలచి
మేడపివెడలెను మితిలేనిపటిమ

(అనపోతును వెనుక కంపుటకు
బాలచంద్రుం డుపాయంబు
వన్నుట.)

తొడిబడి బాలచంద్రుండూహ చేసి
తమ్ములకెరిగించి తనమర్మమెల్ల
కనుచూపుమేరను గదలకనిలిచి
మకంపుపైనాన దగు మోసమాయె
మి చేయుదునింక నిటమీద నేను 200

సలియీపైనంబు మానితినేని
శ్నకునంబగు దొడరునుగీడు
మ్మరపట్టినా కూర్మితమ్ముండ
డితోడజనుము మీవదినెనుగనుము
ముత్యాలగళమాల ముద్దుటుంగరము
మరచివచ్చితి దెమ్ము మసలకయిప్పు
డసినకుమ్మరిపట్టి అతనితోననియె
నఘాత్మనాదేహ మలసటనొంచె
డవనోపగలేను నరకుంజరంబ
అరసిచాకలచందు నాలాగుపలికె 18/10

కమ్మరపట్టియీ కరణివచించె
మేడపికేగెద మెలతజూచెదను
రయమునమిము జేర రాలేనుసుమ్ము
వెలమలదోర్నిని వేడనిట్లనియె

నీప్రౌఢతిరిగిరా నేనలనితిని
కలయవచ్చెదరేపు కలనిలోపలికి
కొదువయిద్దరవేడి కొనినంతవారు
పోలేమటంచును బొంకిరివేగ
అంతనవ్వుచుబాలు డనపోతుకనియె
నమ్మినతమ్ముడ నయశాస్త్రవిదుడ 20

పేరమ్మతనయుడ పెద్దనపౌత్ర
ఒడ్డిమల్లపరాజు నొయ్యారిపట్టి
అందనితరువుల యాకులుదీసి
వ్రాయుదులెక్కలు వసుధేశతతికి
బ్రహ్మవంశజలోకపావనమూర్తి
నాఆత్మసఖుడవు నను జేరరమ్ము

గ్రక్కునవదినెను కనుగొనివేడి
ముత్యాలగళమాల ముద్దుటుంగరను
కొనితెమ్ముతమ్ముడ గురునీతిపరుడ
అనఅనపోతు చిహ్నంబులనడిగె 30

పెనగొన్న వేడ్కతో పీటపైనుండి
ముత్యాలుగూర్చిన మొనచీరకొంగు
చేపట్టియీడ్చిన చెదరెముత్యములు
కనికూర్పగాబోవ గనుపట్టదాయె
ఇదియానవాలని యింతితోపలుకు
హితవొప్పసానివా రింటికిబోయె
అడుగువారానవా లడిగినజెప్పు
అరటిఫలంబుల అమరుచర్మంబు
ఫలమనియిచ్చెను పడతియావేళ
ఇదియానవాలని యెరుకగపల్కు 40

మనిచెప్పిపొమ్మన్న నప్పుడెకదలి

వడిపాదఘట్టనవశమునధూళి
చనివేగవినువీథి సాంద్రమైపర్వ
అసహాయశూరుడయి ఆనపోతుపోయె
బాలుడుబ్రాహ్మణు బలునేర్పుమెరయ
మాయామతంబున మగుడబంపించి
తమ్ములుదానును తాత్పర్యమునను
కదువడి * త్రిపురాంతకమునకువచ్చి
అచటఆసక్తితా నాసీనుడగుచు
తెప్పించెఘంటంబు తీరైనఆకు 50
వ్రాసినాడొకయుత్తరము స్వహస్తమున
ఆదిరావికొమ్మల కంటగట్టించి
వీరులేగినత్రోవ వెంబడినడచె
పల్లెలవారెల్ల బాలునిజాడ
చనుదెంచిరెంతయు సంతసంబొప్ప
ముటుకూరికాపులు మ్రొక్కుచునసిరి
విందారగింపుడు విశ్రమింపుండు
తరువాతదరలుట తగుశకునంబు
వినుమన్నవారితో వీరుడుపలికె
కార్యమపురమున కదిసెనుబోరు 60
నిల్వరాదియ్యెడ నిల్వుడిమీర
లీరీతిననిబాలు డేగినవేళ
† గరికెపాటనుగల కాపులువచ్చి
కనిమ్రొక్కినంతట ఘనుడువారలకు
పోకలాకులొసంగి పొమ్మనిపంపె
‡ మేళ్ళవాగునుజేరి మితిలేనియట్టి
పోటుమూకలువెంట బొబ్బరింపంగ
ఘనశైలగహనముల్ కనుమలుగడచి
తార్క్ష్యుండుగిరులపై దాటినయట్లు

(బాలచంద్రుడు నలగొండను డాయుట.)

భానునికైరాహు పరువెత్తినట్లు 70
భయవర్జితుండయిన బాలుడార్చుచును
పరదళంబులువిన్న పరుగెత్తిపోవ
నరసింగభూతల నాథుచిత్తమున
కలవిరోధమునకై గురిచేసినిల్పి
కొదమసింగంబులు గూడినభంగి
అనుజులువెనువెంట అరుగుదేరంగ
§ కురువకునేతెంచె గురుశౌర్యమమర
ఎక్కినా ♦ నలగొండ యెదురేమిలేక

---

* మార్కాపురమున కీశాన్యమున 2 మైళ్ళ దూరమునం గర్నూలు జిల్లాలోనున్నది. శ్రీశైలమునకుంబోవు త్రోవలోనుండును.

† 8-వ పుటలో వివరణము చూడందగును.

‡ 8-వ పుటలోని వివరణము చూడందగును.

§ దీనినే నాయకురాలి కనుమయని చెప్పెదురు. ఈ కనుమగుండ వాగులేఱు ప్రవహించును. ఇది కార్యమపూడికిని మేళ్ళవాగునకును మధ్యముననున్నది.

♦ ఈకొండ నాయకురాలి కనుమవద్దనే యున్నది.

(కుంజరసైనిక ఘోటకావళుల
బృంహితభాషిత హేషితంబులును 80
పటహారావంబులు ప్రబలుచునున్న)
కార్యమాపూడిశ్రీ కదనరంగంబు
(బాలుఁడంతశ్శక్తి ప్రజ్వలింపంగ)
నలగొండశిఖరంబు నన్నిల్చిచూచి
నమ్మరపట్టిపై కుడిహస్తముంచి
వెలమలదోర్నిని వెసజేరబిలిచి
ప్రథితుఁడాఅలరాజు పగదీర్పవచ్చి
ఒక్కఁడనేగుట యుచితంబుగాదు
వెనుకజిక్కినయట్టి వీరపుంగవులు
కలయువచ్చినదాక గడియకాలంబు 90
విశ్రమింతమటంచు వేడ్కతోనుండె
* అటమున్నె కలనిలో సైనకార్యంబు
వివరింతుజనులకు విశదంబుగాను
నలగాముకొల్వులో నాయకురాలు

(సంధికయి నాయకురాలు
రాయబార మంపుట.)

తలపోసిమదిలోన తగినవారలను
వాసిగ బ్రహ్మన్న వద్దకుబంపి
బవరంబుగాకుండ పట్టుటకార్య
మని పెద్దలనదగు ఆప్తవర్గమును
కొండ † అన్నమరాజు కోటకేతుండు
కూరిమిహితుఁడు మాడ్గులవీరరెడ్డి 100
పరమాప్తుఁడౌచింత పల్లిరెడ్డియును
మొదలయినసువిచారముఖ్యులైనట్టి
చనవర్లబిలిపించి సమబుద్ధిననియె
బాహుపరాక్రమ ప్రాభవులైన
వీరులురాజులు వెలయశోభిల్లు
కొల్వులోనికిబోయి కూరిమిమీర
సమరంబుగాకుండ సంధియౌనట్లు
మాటాడిఅటమీద మాచెర్లభాగ
మేలుకొమ్మనిచెప్పి మింకొకమాట
నాయునివద్దకు నరసింగుదెచ్చి 110
కులవైరమడతుము కోరిమీరంద
రొక్కటికమ్మని యొప్పించిరండు
మగిడిపోవలయును మనదేశమునకు
అనివీడుకొలిపిన నంతటవారు
పైనమైయేతెంచి పట్టపురాజు

(రాయబారులు మలిదేవమహీపతి
కొల్వునకు వచ్చుట.)

మలిదేవుదర్శించి మన్ననపడయ
చెలువొందజోహారు చేసిరందరును
కూర్చుండనియమించె కుంభినీశ్వరుఁడు
వచ్చినవారలు వారితోననిరి
ఇదియేమికలనిలో నిన్నిదినములు 120
తడసితిరిచటికి తడవాయెవచ్చి
యేమికార్యంబొమా కెరిగింపుడనిన

---

* ఇది కవి వచనము.

† "మన్నెమరాజు" అని పాఠాంతరము.

మీరెఱుంగని కార్య మేదియియ్యెడల
తెలిసియుండడిగిన దెలుపగవలయు
సంధికార్యమునకు జను లెఱుగంగ
అలరాజునంపిన సామహీశ్వరుని
హేయమనకపట్టి హింసించుటెల్ల
తీర్పరులౌమీకు దెలిసిన మేలు
నలగాముతమ్ముడు నరసింగురాజు
తలగోసికొనగ పంతంబొనరించి 130
కులవైరముందీర్ప కుతుకంబుతోడ
విఖ్యాతయశులగు వీరపుంగవులు
నిలిచిరిరణభూమి నిశ్చలప్రజ్ఞ
ఎత్తివచ్చినవార లికబోవరాదు
సమరంబుచేయంట సంతోషకరము
బ్రతుకులస్థిరములు పడుటసిద్ధంబు
సంపదల్నిలువవు జలబుద్బుదములు
సత్కీర్తియొక్కటి సమయదెన్నటికి
వెరగందిపందలై వెనుదీయకుండ
అనిచేయమీరెల్ల నాయత్తపడుచు 140
పరుగునరమ్మని బ్రహ్మన్నపలికె
వినికోటకేతుండు వివరించిచెప్పె
వినవయ్యనాయుఁడ విన్నపంబొకటి
అతివివేకులుమీర లఖిలరాజ్యముల
మీదృశులయినట్టి మేటివిక్రములు
నీతిమంతులులేరు నిశ్చయంబిదియు
గొంతుగోయగమీరు కోరినయట్టి
నరసింగరాజును నయమునదెచ్చి
యిచ్చెదమామీద నేమైనలెస్స
సరవిరక్షించిన సంహరించినను 150
భారంబుమీపైన పాదుకయుండు
మునుపటిరీతిని ముదమొప్పమీరు
మాచెర్లభాగంబు మక్కువనేలి
సంరక్షణముచేయ జనములనెల్ల
ఉభయరాజులుమీర లొక్కటైయున్న
మావంటివారికి మానసంబలరు
అఖిలాధిపతులుమీ ఆజ్ఞచేయుదురు
మీరెరింగిననీతి మేమెరుగుదుమె
ఉభయసంస్థానంబు లొక్కటిమాకు
* అనుగురాజేంద్రుడు హరిపురికేగు 160
సమయానతనపుత్రచయమునుచూపి
మీకుసమర్పించి మేనుత్యజించె
తర్వాత నిర్వాహదశయెల్లనీది
ఒకయిల్లు రెండుగనొప్పనొనర్చె
తద్దుమాటాడె నేయపుడెవరైన
మతిచెడియాలోన మనసులుగలగె
అందుచేపగహెచ్చెనీర్ష్యజనించె
కోడిపోరాడుట కూడదటంచు
ఇచ్చతోజెప్పిన నెవ్వరువినిరి
గురిజాలపురికిని కోడిపోరాడ 170
ఎవ్వరువచ్చినా రిదియేమిమాయ
ఏనట్టికార్యంబులన్నియునీకు
తెలిసియెయున్నవి (తేటతెల్లముగ)

---

* ఇతఁడు మలిదేవరాజాదుల తండ్రి. చనిపోవునప్పు డతడు తన భార్యలను బుత్రులను నెదుటికి రప్పించి బ్రహ్మనాయుని కొప్పగించెను. తరువాత నాయకురాలికుట్రచే ననుగురాజు పుత్రులైన నలగామ మలిదేవాదులు వేఱైరి. మలిదేవులకు బ్రహ్మనాయుఁడును, నలగామరాజాదులకు నాయకురాలును అమాత్యులైరి.

గతజలంబుల కడ్డుగట్టినరీతి
(జరిగినదానికిఁ జర్చలేమిటికి
ఆవలీవలి వారినరసిరక్షింప
భారంబునీయది బ్రహ్మనాయుండ
కౌరవతతినెల్ల కదనంబునందు
కూఁకటివేళ్ళతోఁ గూల్చియామీఁద
బహుళార్తినడవుల పాలైరిగాక 180
పాండవులేమేలు పడసిరిచెపుమ?
చేరిమీఁదొక నరసింగునికొఱకు
సకలభూపతులను సమయంగఁజేసి
పాడైనరాజ్యంబు పైనిబెట్టికొని
చివరకుఫలమేమి చెందఁగఁగలరు
పొందికఁగలహంపు బుద్ధులుమాని
సవతిపుత్రులకిప్డు సంధియొనర్చి
అనుకూలముననుంట యర్హంబుమీకు)
అరయనింతియ కార్య * మనుగురాజాన
నీయానమే మింక నిల్వమిచ్చోట 190
నావినిఆవీర నాయకులనిరి

(వీరులు రోషవాక్యములాడుట.)

పాపంబుచేసిన పగవాడువచ్చి
కనుపట్టశిక్షింప కర్తవ్యమగును
సమానంబొనర్చిన జనులుదూషించి
భయపడిరంచును పరిహసించెదరు
పగవారియెడ దయపాటింపదగదు
హతమొనర్చుట మంచిదనువైనవేళ
† భాండంబునెగబట్టి బలురాతిమీఁద
వేసిపగిల్చిన విధమునమించి
తరిచూచిశత్రుని దండింపవలయుఁ 200
హస్తగతుండైన యట్టిశాత్రవుని
పొమ్మనిసెలవిచ్చి పోరాడుటెంచ
చెట్టెక్కిఫలమును చేనంటిచూచి
వేగమెదిగి రాతవేసినట్లగును
తెంపునవీరు లీతీరుననిన

(కొమ్మరాజు వీరుల వాక్యములఁ
బూర్వపక్షము చేయుట.)

చెవులురెండునుమూసి శ్రీకంఠుదలచి
నయమునకొమ్మ భూనాథుడిట్లనియె
చేతికిచ్చినవాని ఛేదించినట్టి
పాపంబునెబ్భంగి పాపికోవచ్చు
(చిన్నరహస్యంబు సెప్పెదవినుము 19/20
చతురంగబలముల చందమట్లుంచి
మానసంబైనట్టి మర్మంబుకనుము
ప్రజ్వరిల్లెడు వీరభావంబుమీఁద
స్వకృతాపరాధంబు ప్రాబల్యమొంది
తొడిబడజల్లని తుంపురుల్ చల్ల
జ్వలనంబుక్షీణించి చల్లారగడగి
ధర్మతత్పరుడైన తద్జ్ఞునియెదుట
మలుగఁబోయెడి చిరుమంటయైయుండు
సైరించితలవంచి శరణనివేడి
సగముక్షీణించిన శత్రునిబట్టి 20

* మలిదేవరాజుయొక్కయు, నలగామరాజుయొక్కయు తండ్రి.

† [ఈపఙ్క్తి ఆదిపర్వంలో కణికుడు చెప్పినవచనాన్ని అనుసరించినది.
"ततः प्रत्यागते काले भिन्द्याद्घटमिवाश्मनि"
అని కణికోక్తి.]

చంపుటయేనీతి? సర్వజ్ఞులార
అలరాజుజంపిన యట్టినేరంబు
మహితుడౌనలగాము మానసమందు
చురుకుచురుక్కున సూదియైపొడువ
తానొనర్చినయది తప్పని తెలిసి
సిగ్గుచేదలవంచి చేరియున్నాడు)
శరణనివచ్చిన శత్రువునైన
కాచిరక్షించుటే ఖండించుటరయ
కాదనికసిపోవ ఖండింతువేని
ఇహముననిందింతురెల్లవారలును 30
పరముననరకంబు ప్రాప్తించుసుమ్ము
పగవానితమ్ముడు పాదంబుబట్ట
రక్షింపడా? మును రామభూజాని
అని భానుకులనాథుడాడుమాటలకు
మనసులోకోపంబు మానినాయకులు
సంధికార్యమునకు సమ్మతులైరి
అటవీరవరులకు హార్యక్షుడైన

(బాలచంద్రుడు నలగొండ శిఖర
మునుండి రణరంగంబు
నవలోకించుట.)

బల్లరగండడు బాలచంద్రుండు
* నలగొండపైనుండి నాలుగుదిశలు
పరికించికనుగొని భావముప్పొంగ 40

వెలమదొర్నితో వివరించిపలికె
ఎరిగియుండుదువె నీవీశిబిరంబు
అడిగెదగురుతుల నవిచెప్పవలయు
అనినదొర్నిడనె ఆతనితోడ
చెప్పశక్యముగాదు సేనలతెరగు
వెలయఅంబుధివెల్లి విరిసినరీతి
నలగామభూమీశు నమ్మినసేన
ఉన్నదినామది ఉత్తలపడగ
ఇసుకచల్లినబడనెడమేమిలేదు
నేలయీనినరీతి నిండియొసంగు 50
చుట్టుకొండలు నిల్వజూడనొప్పుచును
రణరంగభూమివిరాజిల్లసాగె
(వెనుకటిరాజులు విక్రమస్ఫూర్తి
గట్టునచెలరేగి కదనంబుసల్ప
వీరులరక్తంబు విసువకత్రాగి
మత్తిల్లియల్లన మలయుచునున్న
నాగులేరల్లదెనాయునిసుతుడ)
పాలేటిజేరుముచే పగిలిభూధరము
నాగాధిపతి ప్రాణనాశంబుచేసి
నడుముగాపారిన నాగులేరాయె 60
కన్నులపండువై కన్పించెచూడు

* [ఇట్లానే రాముడు సువేలాద్రిని, రావణుడు తన ప్రాసాదశిఖరాన్ని యెక్కి శిబిరాలను చూస్తారు.

" सुवेलं साधुशैलेन्द्र मिमं धातुशतैश्चितम्,
अध्यारोहामहे सर्वे.........................
लंकांचालोकयिष्यामो निलयं तस्य रक्षसः।" (रा. यु.)

అని.

" इत्युक्त्वा परुषं वाक्यं रावणो राक्षसाधिपः।
आरुरोह ततः श्रीमान् प्रासादं हिमपाण्डरम्॥" (रा. यु.)

అని వాల్మీకి.]

ఉభయపక్షంబుల ఒప్పైనబలము
నివసించియున్నది నిశ్చలమతిని
హద్దులు చెప్పెద నవిచిత్తగింపు

(దోర్ణుడు శిబిరంబునకు హద్దులు
వివరించుట.)

* జువ్వలకల్లను సొగసైనపల్లె
† సన్నెగండ్లఅనంగ జవరనియూరు
తూరుపుదిక్కుకు తుదిమేరసుమ్ము
దక్షిణదిశహద్దుతగ వివరింతు
నాగులేటికి తూర్పు నలగొండకాని
చెలువైన ఆ ‡ వప్పిచెర్ల చెలంగు 70
పడమటికినిహద్దు బాలచంద్రుండ
కొదమగుండ్లయనెడి గురిగ్రామమొకటి
ప్రజలమేలిమి § చింతపల్లియునొకటి
ఉత్తరదిశ యెల్ల లొయ్యనగాంచు
ఇక గొన్ని గురికొండ్ల నేర్చెదవినుము
జన్ని దేవరగుళ్లు ♦ సవనాలమేడ
వంగతోటలబైలు వన్నియకెక్క
సింగభూపతిచెర్వు శ్రీకరమైన
సంగడిగుళ్లను సర్వేశుడైన
ఉత్తరేశునిగుళ్లు నూర్జితాకృతిని 80
ఉయ్యాలకంబంబు నున్నట్టితావు

గరుడకంబముదాకి కలజువ్విచుట్టి
నల్లగొండనుహత్తినాగులేరంటి
విడిసియున్నదిదండు విభవంబుతోడ
ఆశ్చర్యమైతోచె ఆదియేమొనుదికి
నరనాథుడైనట్టి నలగామరాజు
గొల్లెనచుట్టునుగూడి కాపాడు
సేనాధిపతులను చెప్పెదవినుము
పడమటిదిక్కున ఫౌజుల బ్రహ్మ
సంకోజిగణపతి సరవితూర్పునను 90

నాయకురాల్ దక్షిణంపుదిక్కునను
దంటలైయుండిరి దక్షతమెరయ
అందెలరాముండు నానెమలిపురి
ముమ్మడిరెడ్డియుం మొనతీర్చినట్టి
$ పొందుగులను నేలు భూరివిక్రముడు
వీరమల్లనునట్టి విఖ్యాతుడొకడు
ఉత్తరభాగాననుండిరి వేడ్క
ఇందరినెల్లను హెచ్చరించుచును
తిరుగుచునరసింగ ధీవరుడుండె
విక్రమసింహంబు వీరకామేంద్రు 100

డబ్బంగి సేనతో నచ్చటవిడిసె
మాన్యబలుండైన మలిదేవు సేన
మార్కొనియున్నది మనసుంచికనుము

---

* కార్యమపూడికిఁ దూర్పుగ షుమారు 3 మైళ్లదూరముననున్నది.

† కార్యమపూడికిఁ గొంచెమాగ్నేయ దిశయందు $1\frac{1}{2}$ మైళ్లదూరమున నున్నది. దీని నే పేటసన్నెగండ్ల యని కూడఁ జెప్పుదురు.

‡ కార్యమపూడికిఁ బడమర $1\frac{1}{2}$ మైళ్లదూరమున నున్నది.

§ కార్యమపూడికి వాయవ్యదిశయందు $1\frac{1}{2}$ మైళ్లదూరమున నున్నది.

♦ ఇది వెనుక యజ్ఞములు సల్పుచోటైయుండును.

$ ఇది పల్నాటిలో కృష్ణాతీరమున ఉన్నది.

ఘనమైనతురగముల్ కాలిబలంబు
బల్లాని పెట్టెలు పటువీరవరులు
మహితనాగానది మడుగండ చేసి
వరలు రేవంతుని బైలులోపలను
దీపించుపడమటి తీరంబునందు
పరవీరభయదమై బలమెల్లవిడిసె
చాలుపు తేరులు సముదేభములును 110

మనవారికెనయైన మానవుల్ గలరె
ఒక్కొకవీరుడె యొక్కొకలక్ష
దళమునుసమయింప దగియున్నవాడు
చెలువైననలగాము సేనకునెదిరి
కడలికిచెలియలికట్ట చందమున
మనబలమున్నది మహిమమీరంగ
అని తెల్పుదోర్శ్నిని కనియెబాలుండు

(నలగొండదిగి రాజదర్శనమునకుం బోవుటకై బాలచంద్రుండు గమకించుట.)

౹మెల్లసాంద్రమై వ్యాపించిదిశల
౹రిసిచెలంగు కేరివీక్షింప
౹క్కడసందులే దిసుమంతయైన 120
మార్గంబుగనదుసూక్ష్మంపుచూడ్కియును
రాడాయెనంచును రాజుచింతించు
ఆలస్యమిచ్చటనాయెను మనకు
అపకీర్తిపాలౌదు ఆడికవచ్చు
తెంపుననొకదిక్కు తెగటార్చికొనుచు
శౌర్యసంపదమీరచయ్యనబోయి
కలసినవీరులు కలహించిమనల
ఎంతకోపింతురో యేమిపల్కుదురో
అరువదేగురునుతా మటులుండగానె
పడుచుతనంబున బాలుడువచ్చి 130

యెంగిలిచేసి నాడెదుటిబలంబు
నేమందమీపట్ల నీపిన్నవాని
అనినిందచేయుందురల జడియగను
తెగనికార్యంబాయె తెలియదుమనకు
ఇరుగడవారల ఇచ్చలీవేళ
ఎబ్బంగిదెలియుద మెవరుచెప్పెదరు
సంధికార్యంబింత సమకూడెనేని
విచ్ఛిన్నమైపోవు వేడుకతగ్గు
పొందినకార్యంబు పొసగంగనీక
పగతెచ్చెవీడని ప్రజలాడగలరు 140

నవ్వుదురవనిపుల్ నామోముచూచి
ఛీకొట్టగలరిక సిగ్గెల్లబోవు
నాతండ్రికొడుకని నన్నుచేపట్ట
డనిపలువిధముల హర్షంబుతగ్గి
పలుకంగచెలికాండ్రు బాలునికనిరి
వినుబాలచంద్రుడ విద్విషద్భయద

(బాలచంద్రుండు కార్యమపూడిం జేరంగదలుట.)

పరశురాముడవీవు బాహులబల్మి
పరగజహార్యక్ష పావనమూర్తి
శౌర్యగంగాధర సర్వజ్ఞచంద్ర
కదనగాండీవికి కడుపునబుట్టి 150
ఈనిందపొందుట కేమికారణము

కులవైరముందీర్చి కొనవలెభూమి
పోనివ్వగూడదుపోరు నిశ్చయము
కూర్మితోమలిదేవు కొల్వులోజొచ్చి
వీరులగనుగొని వేడ్కమైమ్రొక్కి
కలనిలోమీరున్న కారణంబేమి
ఆనతిండనివారి నడుగంగవలయుం
కామునితో సంధికార్యంబుచేయ
ఉన్నార మితరంబులొప్పవుమాకు
అని మాటలాడిన ఆవలికేగి 160

దర్శింతమప్పుడు ధరణీశవరుని
రాజుపంపగబోయి రణమొనరింప
ప్రాప్తమా దేవేంద్రపట్టణవాస
మనిపల్కబాలుండు హర్షంబునొంది
శైలంబుపైనుండి సాహసంబొప్ప
బిట్టురికభూమిపై పృథ్విపుల్వడక
బలువైనమందర భ్రమణంబుకతన
కలకజెందినయట్టి కంధిచందమున
తరితీపుప్రాపించి ధైర్యంబువదలి
బలమెల్లభయపడి పారగసాగె 170

తురగముల్ గజములు ధూళిమిన్నులమ
బంధంబులూడ్చుక పరువులుపెట్టె
దండెల్లనీరీతి దత్తరమొందె
తమ్ములుంబలమును తనవారలెల్ల
కలసిరిబాలుని ఘనమోదమలర
అంతట ఆబాలుడధికశౌర్యమున
పరిఘుముల్ టెక్కెముల్ బలుసాధనములు
శస్త్రమైతగు భద్రసాలేయమనెడు
జగజంపుఛత్రంబు జయమునగొన్న
సకలమాబిరుదులు సరసరంజిల్ల 180

భయదమై నరసింగుపాలిటిమృత్యు
వీరూపమునవచ్చి యెదిరించెననగ
బ్రహ్మన్నతనయుండు పటుసాహసుండు
తొలగుడీ తొలగుడి దూరానటండు
డెదుటనిల్వకుడంచు హెచ్చరించుచును
బలములనన్నిటి పాయదోలుచును
మలిదేవు గొల్లెనమార్గంబుపట్టి
వచ్చెడుచందంబు భావించిచూచి
సంధికార్యమునకు చనుదెంచినట్టి
దొరలమొగంబుల తొలగెతేజంబు 190

వెలవెలబారుచు వేడుకలుడిగె
ఒకరిమొగంబొక్క రొయ్యనజూచి
ఇకనేమిచక్కటి యేమికార్యంబ
దితడురాకుండిన నెసగునుసంధి
ఇకసాగదెవ్వరి హితవిచారంబు
దైవకృతంబేరు తప్పింపలేరు
అనిచింత సేయుచు నక్కటాయనుచు
కళతప్పినిలిచిరి కడుచిన్నపోయి
మలిదేవభూపతి మంత్రియైనట్టి
బ్రహ్మనీడాతని బంధువర్గంబు 200

సమరసంతోషలా సకలవీరులును
కొల్వుకూటంబున కూర్చుండిరెలమి
బాలచంద్రుండంత ప్రాభవంబొప్ప
రాచబిరుదులతో రంజిల్లుచుండి
తమ్ములుకొల్వగదరగనివేడ్క

* వనజాప్తసుతురీతి వచ్చెనాసభకు

(బాలచంద్రుఁడుసభలోఁబ్రవేశించి
రాజదర్శనమునకు మార్గ
మిమ్మని సభాస్తారుల నడుగుట.)

వీరులుకైతవ విభవంబెసంగ
కార్చిచ్చుభంగినికనలి కోపించి
భూవరుదర్శింప బోవసందీక
ఉన్నభావము బాలుడొయ్యనదెలిసి 20/10

సౌందర్యసాంద్రరాజ సభాస్థలంబు
కనుగొంటి సంతోషకలితుడనైతి
విష్ణుసన్నిభుడైన విభునిజూచెదను
తెరుపీయవలెమాకు ధీరాత్ములార
అనదానిఆలింప మెప్పుడుకినిసి
బాసదబ్బరగండ బ్రహ్మన్నసుతుడు
(మండుకారడుపుల మంటచందముల
రణరంగమునయందు రాజిలువాఁడు
ప్రారబ్ధకార్యంబు వదలనివాఁడు
కొరగానికోర్కులు కోరనివాఁడు 20

సుఖదుఃఖ భేదంబు చూడనివాఁడు
తనదేహకష్టంబు తలపనివాఁడు
పరులకార్యములకై పనిచేయువాఁడు
ఆత్మధర్మాధీనుఁడైనట్టివాఁడు
పల్నాటివారికిఁ బ్రాణహితుండు
మహివీరవరులకు మార్గదర్శకుఁడు)

వాసిగరేచెర్ల వంశవర్ధనుడు
(ప్రయతచిత్తుండగు బాలచంద్రుఁడు)
పదములుదట్టించి బాహువులెత్తి
సాహసోత్సాహుడై శౌర్యంబుమెరయ 30

కనికిసింగపుపిల్ల గంతుకొన్నట్లు
కుప్పించిదుమికెను గురుజవమొప్ప
వసుధేశుసన్నిధి వ్రాలెనువేగ
పిడుగుపడ్డవిధంబు పృథివికంపించె
సన్నిధినిల్చుండి జగదీశుజూచి
అతిభక్తిమ్రొక్కిన నటుమొగమాయె
కడుభయభ్రాంతుడై కరములుమోడ్చి
ఏమిచేసితిరాజ యేలకన్గొనవు
నాయందుతప్పేమి నన్నేలువాడ
అనిప్రార్థనముచేయ ఆకొల్వులోన 40

(బాలచంద్ర కన్నమదాసుల
సంవాదము.)

గాసిల్లుకన్నమ కడురోషవశత
ఉలికిపాటునలేచి ఉగ్రుడైమెరసి
ఘనరౌద్రభరితుడై ఖడ్గంబుదూసి
చయ్యనజళిపించి సభజూచిపలికె
కంటిరాబాలుని గద్దరిపనులు
తనసాటిబలియుండు ధరలేడటంచు
మత్తిల్లిమరచెను మావంటివారి
చులకనైతిమి వీనిచూపులకేము
దండిశూరులుచూడ దట్టించినిన్ను

* కర్ణుఁడు.

ఖండించివైచెద గనియలుగాగ 50

ఏ పాటిదంటవు నీవుమాకన్న
మా పేరువిన్నంత మదిలోనబెగడి
ఉభయదళంబులు నులుకుచుండు
సభలోననీవుంట సహ్యంబుగాదు
సరసుడవగుదువు చయ్యనచనిన

అనవినియాబాలు డప్పుడిట్లనియె
బంట్లుమీరలుగాక బవరంబునందు
మే మేడబంట్లము మీసాటిగాము
సరిగబంచినయాళ్లు సర్వంబు విడిచి
విపినశైలంబులు వేసటలేక 60

తిరిగితిరెవ్వరు దీటులేరైరి
వాగులనీళ్లును వనములబండ్లు
తినుచునుమితియైన దినములన్నియును
జరగగాజేయుచు సమరంబుమరచి
ఉన్నందుచే వీరయోధులామీదు

స్థూలఖడ్గములకు త్రుప్పులుపట్టె
పాపికొనగ మీకు బవరంబులేదు
పగవారుకన్నుల బడకున్నవారు
పగచేసిమముగూల్చి పాపికోత్రుప్ప
సభలోన నేనిట్లు చౌకళించితిని 70

పార్థివుబోడగాంచ వచ్చినయప్పు
డెవ్వరునెడమీయరే నీతిచెపుమ?
పంతంబుచెడినేను బ్రతిమాలలేక
ఒయ్యనమీదుగా నురవడిజనితి
తప్పేమినాయందు దగవర్లనడుగు
కులవైరమందీర్ప గూర్చుండుటేమి

పరభూములందెల్ల పరువులువారి
వనములకృశియించి వచ్చినందునను
మేనునబడలికల్ మించెనోయేమొ
ఆరీతిబడలికలంటెనా మీకు 80

పగవారివిస్తరి బండికన్నగును
భావించికొనదగు ప్రాభులుమీర
లనినకన్నమ పల్కె నాబాలుతోడ
పడుచువాడవునీవు పలుమాటలేల
కొలువులోవిషయంబు గురుతెరుంగకయ

ఈ తేపపలికిన నీకత్తిచేత
తల తెగవేయుదు ధరణీశునెదుట
అనినతామసపడి అపుడుబాలుండు
కులశైలధీరత గొబ్బునపలికె
కడలిమధ్యంబున గడ్డయున్నట్లు 90

వ్రాలియున్నారు శాత్రవులమధ్యమున
మున్నీరుపెరిగినా మునుగునుదిన్నె
శాత్రవబలములు సమయంబుచూచి
నల్దిక్కులను ద్రొక్కి నడచినవేళ
ఏమాదురో మీర తెరుగకయుండి

రిదివిచారింపక యేలవచ్చితిరి
మీరుమాత్రమె రాక మేదినీశ్వరుని
ఏటికిదెచ్చితి రీస్థలంబునకు
ప్రజలాడికొనుటలు పరికించివినరు
గొల్లెనలోజేరి కోపంబుచేసి 100

పదరినమాత్రన ఫలమేమిచెపుమ
బ్రహ్మనాయుడు నీకుబంధువుడెట్లొ
వినిపింపుకన్నమ వివరంబుగాగ

అనినకన్నమవల్కె నాతనితోడ
నాయుండువిష్ణువు నారాయణుండు
ప్రకటదయాంబుధి వరమఁలోసంగె
తగజనించితినేను తల్లిగర్భమున
పరమపావనమూర్తి బ్రహ్మనాయునికి
పాదసేవకుడనై పరగినవాడ
భుజములముద్రలం పూనినవాడ 110

క్షుద్రమార్గులనెప్డు చూడనివాడ
ప్రాసాదజీవినై ప్రబలినవాడ
జ్యేష్ఠపుత్రుడనంగ చెలగినవాడ
పుట్టితివీవెన్క పురుషోత్తమునకు
దట్టించిపలికెదు ధరణీశునెదుట

పడుచువాడవునీకు వాగ్గర్వమేల
అనవినిఆబాలు డప్పుడిట్లనియె
చెలగిబ్రహ్మన్నకు జ్యేష్ఠపుత్రుడవు
తలదన్నిపుట్టిన తమ్ముడనేను
కదిసిఅగ్రజుతోడల్ గద్దలుచేసి 120

త్రొక్కుచుబోవచ్చు తోడరినమూర్తి
ధరణీశుబోడగన దాటితినన్న
అంతమాత్రమెసుమ్మ హంకారమెరుగ
అనిపల్కెకన్నమ అటతలవంచి
భైరవఖడ్గంబు పడవైచిధరణి

చిరునవ్వునవ్వుచు చేరిసోదరుని
ఒనరంగనెత్తుక ఉర్వికిదించి
తప్పునాయెడనుండె తమ్ముడాయనెను
బాలచంద్రుడు హర్షభావమునొంది
భ్రాతలునుందాను రాజునుజూచి 130

జోహారుచేసిన చూడకాభూపు
డూరకతలవంచియుండెను బాలు
డందుకువెరగంది అనుజులకనియె

(బాలచంద్రుఁడు మలిదేవభూపతిని
సమ్ముఖమున దూషించుట.)

తెలిసెనా? ధరణీశ తెరగెల్లమీకు
పగతీర్చికొనుటకు బవరంబుచేయ
మితిమూడునెలలని మేకొనిచెప్పె
మదిలోననామితి మరచెనోయేమొ
యెండకన్నెరుగని యీరాజచంద్రు
డవనిశాత్రవులకు నర్పించిపెక్కు
కానలద్రిమ్మరి కాయంబుడస్సి 140

నీడలనిలిచిన నీళ్ళెల్లద్రావి
పొలపుకూరలుచాల భుజియించెగాన
పసరుకన్నులకెక్కె పలుకకున్నాడు
మంచిమందిచ్చిన మానును వేగ
అనిపల్కెమాటల కదరుచుగండు

(గండుకన్నమనీఁడు బాలచంద్రుని
వాక్యంబులఁ బూర్వపక్షము
చేయుట)

కన్నప్పయల్లుని గనికోపకలన
భర్జించిఅనువైన పల్కులననియె
ఇటువంటిమాటల నేమిఫలంబు
తప్పంతమనయందు దట్టమైనిల్చె
ఏరీతిననియెదవే నెరిగింతు 150

పగవారిచర్యలు భావమందెరిగి
కులవైరముసుదీర్చికొనుటకు మనము
వచ్చుచుతగవుకు వసుధాతలేంద్ర
తెచ్చుటయొకతప్పు త్రిపురాంతకమున
కలహమేర్పరచక కలనుకంబంబు
తర్లింపరెండవ తప్పనియెరుగు
కంకణంబులపల్లె కడహస్తములను
కంకణధారణ కాంచమూడవది
తెగిరణభూమిలో దిగుటనాల్గవది
తరిమిశత్రులువచ్చి తారొక్కన్నపిదప 160

కలయవిచారించు కార్యమైదవది
యీయైదునేరము లెవ్వరివగును?
పంచాపరాధముల్ వైరులయందు
కలవవిచెప్పెద గ్రహియింపగడగు
సరిరాజ్యమోర్వక సంగ్రహబుద్ధి
కోడిపోరునగెల్చి కొనుటమొదటిది
పసులకుపంపుట పరుసరెండవది
జామాతజంపుట సరవిమూడవది
భట్టునుమనవారు పంపించినపుడు
వెళ్ళదోలించిన విధమునాల్గవది 170

కూటువమూకల గూర్చుకవచ్చి
గర్వించినిల్చిన కార్యమైదవది
ఎక్కువతక్కువ లీరీతినుండ
తెలియకధరణీశు దెగిమాటలాడ
అపరాధమంటదా యదినీతియౌనె
యెక్కువమాటల నికనాడబోకు
మనసురాకుండిన మగిడిపోవేగ
అనిపల్కుమాటల కాబాలుడనియె

(కన్నమనీనివాక్యంబులకు బాల
చంద్రుడు ప్రత్యుత్తరంబిచ్చుట.)

మేరతప్పెనటంచు మీరిపల్కితివి
మేటిబ్రహ్మనవాకు మితితప్పరాదు 180

చుక్కలురాలిన సూర్యుండుతప్పి
పడమటబొడిచిన పాథోధిమించి
చెలియలికట్టపై చెంగలించినను
చల్లనైననువహ్ని సత్యసంధుండు
నాయునిమాటకు నమ్మికగలదు
పగవారికలుకుచు పలికితివయ్య
ఇటువంటికార్యము లెందుకుజరుగు
పగవానిసేనలో బల్విడిజొచ్చి
కరములుశిరములు ఖండించివైతు
దగ్ధముచేయుదు దావాగ్నిరీతి 190

చిన్నవాడంటివి చెలగియీకలన
అలనాడుగురిజాల నయినట్టిపగకు
చేపట్టియిల్లడ చేయగాలేదె
అపుడుబాలుడనాదు అఖిలభూపతుల
కెదిరియుద్ధముచేయ నేనిల్చినప్పు
డపకీర్తిమాటల నాడుటతగవె
వినగూడదీమాట విడువుముచాలు
అనిచెప్పిసభలోన నందరువినగ
వీరులవేర్వేర పిలిచిరోషమున
మలిదేవుసన్నిధి మండుచుబలికె 200

ధీరాగ్రణీవంకి దేవరాజేశ

(బాలచంద్రుఁడు యోధులకు
రోషమువచ్చు మాట
లాడుట.)

(వీరుఁడనని పేరు పెట్టుకనీవు
బ్రతికియుండంగనే పగరునీసుతుని
పట్టిచంపిరిగదా భయమింతలేక
శౌర్యంబునీయందు చచ్చెనాయేమి?
ముక్కుదూలముమీదఁ బొడిచినయపుడు
గుర్రుమనగలేని కోపమెన్నటికి)
శంకింపగానేల సమరంబుకదిసె
తీరనిసుద్దుల దెగజాలవేల
ధనువుశింజినిలాగి ధ్వనిచేసితేని 21/10

బ్రహ్మాండభాండము ల్పగిలినట్లుండు
ఎనలేనివిలుకాడ విటువంటినీవు
తనయునిచావుకు తాళెదవెట్లు?
ఆవాలనాయుఁడా అపుడుపంతములు
పలికిననీవేల పరవశుడైతి
తలపోయగా వీరధర్మంబుమరచి
నిద్రించుచుండుట నీతియెనీకు
విముఖతలేనట్టి వీరుడవీవు
కట్టితివిదెకాశ కత్తిపట్టితివి
పగయీదలేనట్టి పౌరుషమేమి? 20

మితిమూడు నెలఁబాయె మెదలకున్నావు
నీవంటిజగజెట్టి నేజూడలేదు
మామకన్నమనీడ మగటిమియేది
కదలనికంబంబు కాలిసంకెలలు
పొందించిచావుకై పూనినిల్చితిరి
కంబంబుచెదలంటె కదలించిచూడు
సుంకరరాముఁడా చుట్టుడొంకెనలు
త్రుప్పులువట్టెను దొడరవదేల
చెవులనాయకులార చెరగెడుబంటు
లిచ్చగించరుమది సెంగిలిపోటు 30

మేటిశూరులనాఁజి మెచ్చనియట్టి
నమ్మినజంగిలి నాయకులార
తగుజల్లికేడెముల్ దండచక్రములు
పోగొట్టిపోరయ్య పోరుమీకేల
వీరయోధులుగదా పెనుమాలవారు

గాయగోవాళాఖ్య గలబిరుదములు
పగతురుగనకుండ పాతుడిభూమి
బాదన్నరాహుత్త పాటవమేడ
సంపెటనారన్న జయమగుబిరుద
మెక్కుడికేగెనీ వెందుదాగితివి 40

(జడతనిద్రించెడు శౌర్యాత్ములార
యుద్ధతయుద్ధ సూర్యోదయంబయ్యె
తరచుగాఁగల్య కర్తవ్యముల్ గలవు
లెండు కాలంబయ్యె లెండు లెండింక)
అనిబాలుడుగ్రుడై అదలించిపలుక

విని బ్రహ్మనాయుఁడు వేగమెలేచి
తనయునికెదురేగి తాగారవించి
అర్ధాసనంబున ఆసీనుజేసి
పలనొప్పదంటగ వచ్చినవారి
కొల్వకుబిలిపించి కూర్చుండుడనిన 50

కూర్చుండిరందరు కూరిమిమెరయ

కూర్చినవారల కుశలంబులడిగి
తన కార్యమంతయు దగవినిపింప
విని బాలుడీర్ష్యతో వివరించిపల్కె
శాత్రవు * లలరాజు చంపినయట్టి
కోపంబు మదిలోన గూర్చుటమాని
పరదమాటలు పల్క పంతమామీకు
ఉద్వేగభరజనితోగ్ర రోషాగ్ని
భస్మీకృతాఖిల పరరాజవిపిన
బ్రహ్మన్ననాతోడ బల్కకుమయ్య 60

వదలకరాజును వంచించినపుడె
నాచేతిక త్తితో నాయకుల్ జూడ
తలతెగగొట్టుదు ధరణీశునెదుట
సత్యంబుపల్కితి శంకనాకేల

(కొమ్మరాజు బాలచంద్రుని
కోపంబు చల్లార్చుట.)

అనకొమ్మభూపతి అల్లునిడాసి
వినయంబుతో రెట్టవిడువకపట్టి
నాయన్న వినుమయ్య నలినాప్తతేజ
సంధికార్యంబేగి శత్రులచేత
పరగజచ్చినవాడె బాలుడుసువ్వె
అరయమాసుతుడైన అలరాజవీవె 70

వచ్చిమనలజూచి వారనిభీతి
బిరుదులుత్యజియించి పిరికిపారుచును
అనుజునిలోబడి అర్చించినపుడె
క్షత్రియజాతికి చచ్చుటసుమ్ము
చలమునబోరాడ సారస్యమేమి
చేతికిచ్చినశత్రు చెలగివధింప
పలుపాతకంబని పల్కెవేదంబు
లెన్నిజన్మములకు నేక్రియనైన
పాయదుపాపంబు పట్టిపీడించు
అనియితిహాసంబు లతనికిజెప్పి 80

కౌగిటజేరిచి కడుంబుజ్జగించి
మనసుపెట్టకుమన్న మసలకుమన్న
మామాటవినుమన్న మన్నింపుమన్న
వినిబాలచంద్రుడు వినయుడైయుండె
చలమెల్లవిడనాడి సంధిమేకొనిరి
తరువాతకొందరు దర్పముల్ మీర
నేచేటుపాటైన నేమిమాకేల
విందులుభుజియించి వేగమెపురికి
పోవలెజాడ్యంబు పూనకుడనిరి
ఇరుపక్షములవారు నింపుసొంపెసగ 90

పొదలిన సంతోషముననాడుచుండి

(అనపోతు మేడపికేగుట.)

రంతటమేడపి కనపోతుచేరి
మాంచాలమేడకు మక్కువనేగి
వినయంబుతోడ ఆవెలదినిజూచి
పల్లవమృదుపాణి బంభరవేణి
కంజాతలోచన కరిరాజగమన
శంబరరిపుబాణ సాధుసమ్మాన

* 19-వ పుటలో వివరణముం జూడుము.

గంధఫలీనాస కౌముదీహాస
పావనగుణసీమ భామాలలామ
(అధరనిర్జితబింబ) అధికనితంబ 100

వరవసంతునిపీక వనములచిలుక
లావణ్యవదన ఓరాకేందువదన
రమణినేవచ్చిన రాకనాలింపు
* అన్నబాలుడుపంపె అతివనీవద్ద
ముత్యాలహారంబు ముద్దుటుంగరము
కలవవితెమ్మన్న గదలివచ్చితిని
మరచినవస్తువుల్ మాచేతికిమ్ము
త్వరగబోవలెనేను బాలునికడకు
అనఅనపోతుతో ననియెమాంచాల
యేమానవాలయ్య యీపదార్థముల 110

కనబ్రాహ్మణోత్తముడావెనుజూచి
కూరిమిపాన్పుపై కూర్చుండితాను
పైటకొంగొయ్యన బట్టిలాగినను
ముత్యపుచేరులు మొదటికితెగిన
అవికనలేకుంట ఆనవాలమ్మ

అననివిమాంచాల అవునయ్యతత్వ
శాస్త్రముల్ వేదముల్ చదివినవాడ
వెరుగవైతివిగదా యీరహస్యంబు
కమ్మలుంపిలిచిన తరితీపుతోడ
విడివడ్డముత్యముల్ వెదకికూర్పంగ 120

వ్యవధిలేకుంటచే బాలుడువెడలె
మాటతెల్విడినీవు మదివిచారింపు
కారణమేలేదు కలనికిబోవ
మీయన్నబాలుని మితిచేసివారు
పొసగపట్టము గట్టమూడుమాసములు
మితివెళ్లెగావున మీవారిగలయ
చనియెనుమీయన్న సమరంబుకడకు
వీరమేడపినీవు వెలయరక్షింప
బాలచంద్రుడునీకు పట్టముగట్టె
అందుచేరణమున కరుగంగగూడ 130

దనవినిబ్రాహ్మణు డత్యుగ్రుడగుచు
విముఖుడైయచ్చోటు వెడలియేతెంచి

(అనపోతు శ్యామాంగి గృహమునకుఁ జనుట.)

శ్యామాంగి యింటికి చయ్యనవచ్చి
పలికెనాయనపోతు భామతోనపుడు
ముత్యాలగళమాల ముద్దుటుంగరము
మరచివచ్చితినేను మగిడిసీవేగి
అడిగితెమ్మని పంపెనానవాలడిగె
కదళీఫలాలపైకల్గుచర్మంబు
ఇచ్చితిఫలమని యిదియానవాల
టన్నభామినినవ్వి అనపోతుకనియె 140

ఆసలేనట్టియీ ఆనవాలంది
యెందుకువచ్చితివిది పొల్లుమాట
మరచుటదాచుట మావద్దలేదు
మాయమాటలుచెప్పి మరలపంపించె
కనలేకవచ్చితిగద భూసురేంద్ర

* సోదరుఁడు. అనిన నని యర్థముకాదు.

అనిపల్కె బ్రాహ్మణు డమితరోషమున
వెడలుకోపాగ్ని చే వెడలెను వేగ

(బాలచంద్రుడు మేడపినుండి మరలుట.)

కదలిఆ త్రిపురాంతకమునకువచ్చి
బాలుని తెరగెల్ల ప్రజలనునడిగె
ఆతీరు మేమేమి అరయుంటలేదు 150

మూకలుగూడెను ముందరిదెసను
తెలిసికొమ్మనివారు తెల్పుదీవ్రముగ
అచ్చటికేగియా అవనీసురేంద్రు
డశ్వత్థతరువున కమరంచినట్టి

(బాలచంద్రుడు వ్రాసిన పత్రము ననపోతు చదువుట.)

పొంకైనపత్రిక పుటనెగనెత్తి
తిన్నగాజదివె నీతీరునదాని
శ్రీగిరీశునియాన చెన్ననియాన
మలిదేవరాజాన మాతండ్రియాన
అర్వదార్గురుపీరు లందరియాన
త్రోసివచ్చితివేని ద్రోహమంటెదును 160

బాలునిమిత్రుల ప్రాణంబులకును
తప్పినలాగౌను తరలితివేని
అనలుమీరుట అదినీతిగాదు
తనసంగడీలతో తరలెబాలుండు
సాహాసమునసీవు సాగిరాగూడ

దనునట్టికతినంపు టానలుచదివి
చండాగ్నిపైనూనె చల్లినరీతి
భీకరకోపాగ్ని పెనగెచిత్తమున
అప్పుడుభూసురు డధికదుఃఖమున

(అనపోతు బాలచంద్రునిగూర్చి నిష్ఠురవాక్యంబులాడుట.)

దంటనౌననుపీడ ధర్మమానీకు 170
మంచితనంబున మన్నించినన్ను
పొమ్మన్నపనులకు పోయితిగాని
తప్పనవాలని తలపకపోతి
నిజమనిచెప్పిన నీయానవాలు
తబ్బిబ్బటంచెగ తాళిసలిపిరి
నిజమువిచారించి నీవున్నకడకు
వచ్చితివిడనాడి వడినేగినావు
పగవనేరందుకు వరగుణశాలి!
నీనాతిమాంచాల నీపొందుకత్తె
హాస్యంబుచేసినారానవాలెరిగి 180

వెంగలినైతిని వెలమలవద్ద
కలిమికోసమువచ్చి కలియుంటలేదు
కులమునకొదవని కూడుటలేదు
తల్లినిదండ్రిని దాయాదజనుల
ఎడబాసినీపొందు నేనమ్మియుంటి

పగవాడనైతిని బాంధవతలికి
పాసిపోదగునయ్య బ్రహ్మన్నతనయ
కెల్లగాబోయితి ఖిన్నునిజేసి
న్యాయంబువిడనాడి నమ్మినవాని
ఒంటరిగానుంచ నొప్పెనాచిత్త 190

మెన్నడునాలావు నిసుమంతయైన
కనుగొనవైతివి కట్టడివాడ
బ్రాహ్మణుడీతడు బవరంబుచూచి

భయపడునంచును భావించితకట
అటులైనజూచితే అనిలోననన్ను

బ్రాహ్మణమరణంబు పాపమటంచు
చనితివిదయలేక సర్వజ్ఞచంద్ర
ధర్మశాస్త్రంబుల దారినీకెరుక
తనునేలినట్టి ఆధరణీశునెదుట
సమరంబులోపల చచ్చినయపుడు 200

పాపమనగరాదు బలిమినిజట్టి
ఖండించివైచిన కలుషంబువచ్చు
ద్రోణుండుకృపుడును ద్రోణసుతుండు
సమరంబుచేయరా సాహసమొప్ప
గురువైనద్రోణుండు కూలెయుద్ధమున

ఆకిల్బిషమ్మంటె నాయేరికైన
ఈవెరుంగుదుదీని నింతిమాటలకు
నన్నెడబాసితి నాకర్మమే మొ
కామునిబలములు కదిసినమీద
బల్లియములవారి బవరంబునందు 22/10

గెలువగవలెనంచు కోరుచునుంటి
ఈతెరగాయెను హితమైనవాంఛ
యేమిసేయగలాడ నేమందువిధిని
అడవిపాల్చేసితివన్న! సోదరుని
నవవిక్రమయుద్ధ విభవంబుగనగ

భాగ్యంబులేదాయె పాపినినేను
పూర్వజన్మంబున పొందులుదీసి
యెవ్వరెవ్వరినినే నెడబాపినానొ
అనుభవింపగవచ్చె నాఫలంబిప్పు
డీవుపాసినయట్టి ఈదేహమొల్ల 20

(జన్మమెత్తితిఁగాని సఫలంబుగాదు
సఫలంబుకాని యీజన్మంబదేల
తనవారిరక్షింపఁ దరివచ్చినపుడు
వినియోగపడనట్టి వీరరక్తంబు
రక్తమే కలుషనీరంబగుఁగాక

ఉప్పొంగుచున్నది యుజ్వలశక్తి
అడఁగదునేనెంత అడఁచిననైన
దహియించుచున్నది దావాగ్నిరీతి
ప్రాణంబులిఁక నేను బట్టఁగఁజాల
తివిరివ్యర్థంబైన దేహంబువిడుతు 30

స్వర్గలోకమునందు బాలునిరాక
కెదురుచూచుచునుంద నెంతయువేడ్క)
పుణ్యనివాసంబుపొందియుండు
అనిచింతసేయుచు నయ్యాయోయనుచు
ఉన్నంతలోపల నొయ్యననపుడు

గరిగెమాడచియను కాంతయొకర్తు
వీరమేడపినుండి వీరులగలయ
చనుదానినచ్చోట చయ్యనజూచి
అంజలిచేసినా డనపోతుతెలిసి
బ్రాహ్మణుడాయిట్లు పలుకంగరాదు 40

తగమునీవొనరించు దండముగొనగ
ఏలయిచ్చుటనుంటి కెరిగింపుడనిన
అనపోతుమాడచి కనియెనావేళ
బాలునికలనికి పంపియిచ్చోట
నిల్వగారణమయ్యె నెలతరోనాకు

అన్నబాలునికిదే అంజలిచేసి
విన్నవించెదనేను వినిపింపవమ్మ

నామాటగా జెప్పు నాసోదరునికి
కూరిమితమ్ముల గూడుకనన్ను
వలదనిపోయితి వగచినవాడ 50

ఆలస్యమిక చేయ నాయత్తపడితి
ఇందులకిల్బిషం బెనయదునీకు
నీరాకచూచెద నేస్వర్గమందు
ననుగూడరావయ్య నాబాలచంద్ర
అనిచెప్పిమదిలోన నధికనియతిని

ఈషణత్రయమునం దిచ్ఛనువదలి
ఇంద్రియదశకంబు నేర్పడనిల్పి
తల్లిదండ్రులనెంచి దండంబుపెట్టి
పరమాత్మమదిలోన పాయకతలచి
ఆడపంబువారిని అతిప్రీతితోడ 60

గొడుగువారినిప్రేమ గూడగబిలిచి
వెరతురురక్తంబు వెడలుటచూచి
యీదెసనిల్వక యేగుడుతొలగి
పాపమనుచునన్ను పట్టంగబోకు
అనిచెప్పిబ్రాహ్మణు డత్యంతభక్తి

ఇంటివేల్పులనంగ నేర్పడియున్న
శ్రీగిరిలింగంబు చెన్నకేశవుల
భక్తితోప్రార్థించి ప్రభుడైనయట్టి
బ్రహ్మన్ననామంబు భావించియెంచి
సంగడీలనుచాల సన్నుతిచేసి 70

బంగారుజందెంబు పాదంబుబిరుదు
మాడచికినొసంగి మన్నించినీవు
బాలునికిమ్మని పణతికిజెప్పి
తనతలగోసుకధరమీదవ్రాలె

తలఆవలించెను దటుకునసెగిరి
కన్నులువివ్వెను ఘనముగనవ్వె
ఎటువంటిభావంబొ యీశ్వరుడెరుగు
వెసఆడపమువారు వెతగొద్దువారు
తద్గతి తెల్పిరి తల్లిదండ్రులకు
వినిమూర్ఛనొందిరి వేగమెవారు 80

(అనపోతు తలిదండ్రులు కుమా
రుని మృతకళేబరముం జూచి
విలపించుట.)

కొంతసేపటికిని కొంచెము తెలిసి
కుందుచుజనుదెంచి కొడుకుపైవ్రాలి
(రొమ్ముగుద్దికొనుచు రోలుచుఁబడుచు)
తనయుఁడామాపుణ్య దశయిట్టులాయె
(మాయచావయ్యెను మాముద్దుకొడుక
ఇచ్చోటనుండెనా మృత్యువునీకు?
చెలువుఁడామమ్మేమి చేసిపోయితివి
చెలికాండ్రకేమేమి చెప్పిపోయితివి
మాకోర్కెలెల్లను మంటఁగల్పితివి
కటాకటాకడుపును కాల్చిపోయితివి

మూఁడుకాళ్లముసళ్ల ముంచిపోయితివి
బాలచంద్రుసెపుడు పాయఁగలేవు)
నాల్గువేదంబులు నయమొప్పజదివి
అఖిలదేశముల విఖ్యాతినిగాంచి
చెల్లితివా నేడు చెలికానివిడిచి

(దైవమానీకెంత దయలేకపోయె
అనిచింతనొందుచు నయ్యోయోయనుచు
కంటికిఁగడవెడు గాఁగనేడ్చుచును
విలపించుచుండగ విప్రబాంధవులు

కాలంబునేఁటితోఁ గడచెనీతనికి 100
నిప్పుడో యెప్పుడో యీశరీరములు
పడిపోవఁగలవు శాశ్వతములుకావు
జన్మించువానికి చావునిక్కంబు
చైతన్యమెడలిన శవమునుగూర్చి
విలపింప బ్రతుకునా వెఱ్ఱితనంబు)

దహనకార్యముచేయ దగునంచుబలుక
గంధపుచెక్కలు ఘనకాష్ఠవితతి
తెప్పించిపేర్పించి తీర్చిరివేగ
తగుశాస్త్రమార్గంబు తప్పిపోకుండ

(అనపోతు దహనసంస్కారము.)

జాయవెంజడినేగ సమ్మతిరాగ 110
దంపతులిద్దరి దహనునికిచ్చి
చనిరిగేహములకు స్నానముల్ చేసి
అంతటమాడచి ఆయత్తపడుచు
తరచునెత్తుటిచేత దడిసినయట్టి

(మాడచి కార్యమాపూఁడిలోని
శిబిరము సొచ్చుట.)

)రుదునుజండెంబు పెట్టెలోబెట్టి
ౖందోళికారూఢయై త్వరితముగ
చనుదెంచిధరణీశు సన్నిధినిలిచె
విందులుభుజియింప వివరంబుగాను
వీరులుదొరలును వేడుకమీర
పఙ్త్తినిగూర్చున్న బానసీలపుడు 120
పండినవస్తువుల్ వడ్డించిపిదప
చమురులువడ్డించు సమయంబునందు
మాడచియటకేగి మదిదలపోసి
తెలిసిమేడపినుండి తెచ్చినయట్టి
మధురవస్తువులెల్ల మరవకయిచ్చి

పలికెబాలునిజూచి పడతిధైర్యమున
వీనికంటెను కడుప్రియమైనమేలు
వస్తువులివిగొన వలయునటంచు
తరచురక్తంబున దడిసినయట్టి
జండెంబుబిరుదంబు చయ్యనవిచ్చె 130

(రక్తసిక్తంబైన జందెము, బిరుదు
చూచి బాలచంద్రుఁడార్చుట.)

చూచినయంతనె ఛురికాగ్రమునను
వక్షంబుబొడిచిన వడువునగలగి
బాలచంద్రుడులేచి పగరువినంగ
పెడబొబ్బపెట్టెను పృథ్వీశులదర
ఒప్పివారునువీరు నొక్కటియైన

శంకింపకెదురెక్కి శాత్రవచయము
బారులపైబడి ప్రకటశౌర్యమున
బ్రహ్మాప్రముఖ వీరవరులనుగదిసి
అనిలోనమఁదుగ హతముగావించి
తరువాతకాముని దళముపైదుమికి 140

కాలిబలంబుల గజవాజివితతి
పీనుగుపెంటలు వెల్లుగజేసి
తమకించి నరసింగు తలనుఖండించి
కొమ్మభూపతికిచ్చి కులవిరోధంబు
తీరిచిపంతంబు దీర్చెదజూడు

అనిబాలుడాడిన అప్పుడుతెలిసి

(సంధి కాదని యంపరు నాళ
వదలుట.)

రులుం దొరలును వేగ మెలేచి
ంధి కార్యముగాని * జాహ్నవికేగి
మధ్యంలో వేసి రన్నమంతయును
వరకు కార్యంపు స్థితివిచారించి 150

రాయబారులతోడ రాజులిట్లనిరి
గాకున్న కార్యంబు కాకపోదిప్పు
డెక్కుడిబంధుత్వ మెక్కుడిచెలిమి
బాలునితమకంబు పట్టలేరెవ్వ
రనివీడుకొల్పిన ఆరాయబార్లు

కాముని కడకేగి కరములు మోడ్చి
వినిపింపసాగిరి విషయమంతయును
మమ్మంపితిరిమీరు మలిదేవుకడకు
విన్నవించితి మంతవీరులయెదుట
ఓనరంగసంధికి ఒప్పియావేళ 160

వీరులురాజులు వేడ్కనుప్పొంగి
విందులుభుజియింప వివిధవస్తువులు
పచనంబు చేసిరి పజ్జులుసాగె
ఇరుపక్షములవారు నింపుమీరంగ
కూర్చుండిరరలేని కూరిమితోడ

బానసీలన్నంబు పట్టుకవచ్చి
వడ్డించిచమురులు వడ్డించువేళ
గరిగెమాడచివచ్చి కలవరపడగ
అనపోతు తెరగెల్లి అపుడుబాలునికి
తెలుపగనాతడు తెంపునలేచి 170

ఇడినట్టిఅన్నంబు ఏటిలోగలిపి
ఉగ్రుడైరణమున కుద్యుక్తుడయ్యె
మలిదేవరాజును మన్నెనాయకులు
మముబంపిరంతట మగిడివచ్చితిమి
కాగలకార్యంబు గతిమీకెరుపక

(బాలచంద్రుడు సోదరులవద్దకు
బిల్చుట.)

అంతటనబ్బాలు డతికోపమునకు
భుజములనెగబెంచి పొడవుగానిక్కి
ఉదుటుపంతములాడు చున్నంతలోన
గురుతరరణలక్ష్మి గొబ్బునవచ్చి
ఆవేళమైనిల్చె నాతనియందు 180

కేరితమ్ములతోడ కిలకిలనార్చి
నిండుధైర్యముమీర నిశ్శంకనడచు
కనుగొనుచుండెను కామునిదళము
తమకంబు హెచ్చంగ దాలిమియొసగ
బవరంబునకుతాము పైనపైపోవ

సుముహూర్తమెక్కుట చూడగనప్పు
దైవజ్ఞులను సమ్మతంబుగ నడిగె
వీరాగ్రగణ్యుండు వినుతసద్గుణుడు
హాటకాచలధీరు డబ్ధిగంభీరు
దరిజయసంశీలు డైత్తమ్మసుతుడు 190

సంగడీలకు ప్రాణసఖుడైనవాడు
నిర్మలుడగు బ్రహ్మనిజతనూజాత
భగవదంశముగల బాలచంద్రుడు

* గంగధార మడుగు.

పులినిదండంబుతో పొడిచినయట్లు
కొల్వులోపలినుండి గొబ్బునలేచి

తనప్రాణసఖులను దగ్గరజేర్చి
వెన్నిచ్చిపగరకు వెనుకాళపడవు
విరిగినవైరుల వెన్నాడిచనవు
కులమునవెలమవు క్రోధంబుహెచ్చు
సకలశాత్రవులకు సమవర్తివీవు 200

వన్నెతెచ్చితివౌర వంశమంతకును
ననుజేరరావయ్య నమ్మినవాడ
మేటియోజ్జలలోన మేటివైనట్టి
కమ్మరపట్టి నాకడకురావయ్య
తగవింజమోజుకు తనయుడవైన

కంసాలచందు! దగ్గరకురావయ్య
గురువైనబిరుదుల కుమ్మరపట్టి
మరియుచాకలచందు మంగలమల్లు
నమ్మినమిత్రులు ననుజేరరండి
అనియిట్లులార్వర అతిభక్తిబిల్వ 23/10

సంతోషమునబాలు సన్నిధికేగి
వరుసతోమ్రొక్కిరి వదనముల్ వాంచి
తరువాతబాలుడు ధైర్యచిత్తమున

(బాలచంద్రుఁడు వీరులకు నిజ
మనోరథంబుఁ దెల్పుట.)

వీరనాయకులను వేడుకజూచి
విన్నవించెనుశౌర్య విభవంబెసంగ

దేవతల్ చూడంగ తీక్ష్ణతమెరయ
మనసునశంకలు మట్టుగాజేసి
బ్రతుకులపైనాశ పారగదోలి
పిరికిప్రేవులువీడి బెగడుటమాని
లోభమోహంబుల లోలతద్రెంచి 20

సూర్యతేజంబున శూరతమీర
కామంబుక్రోధంబు కడకేగనెట్టి
కామభూపతిగెల్తు గదనంబునందు
సత్యవ్రతోత్సాహ సాహసులార
నిర్మలగుణయుక్త నిశ్చలులార

జయులారదేవాంశ సంభూతులార
ధర్మమర్మవిచార తత్పరులార
విజ్ఞానశోభిత వీరాత్ములార
సజ్జనావనులయి జగములలోన
వీరకార్యంబుల వెలసినయట్టి 30

అరువదేగురుమేటి అయ్యలుమీరు
మీబంటుబ్రహ్మన్న మితిలేనిగరిమ
పూర్వమొనర్చిన భుజవిక్రమములు
విందుముమీరెల్ల వినిపించుచుండ
బ్రహ్మన్నకెదిరెదు పగవాడుగలడె

అటువంటిబ్రహ్మన్న కనుగుపుత్రుడను
భీతిచేబగరకు బెదరనునేను
తాతతండ్రులకును దగుమామలకును
కడుపిన్ననిమీరు గారాబమలర
ఎత్తిముద్దాడుట యీమేలుమీద 40

కన్నెకయ్యమునందు గలిగెపుణ్యంబు
స్వర్గంబుగొనుటకు చాలినవాడ
నాపంతమరయుడి నాయకులార
కామునితమ్ముని కలనిలోచంపి
తలదెచ్చిమీకిత్తుధరణీశు నెదుట

చంపుదురణమందు సకలశాత్రవుల
ప్రతినతీర్పకయున్న బాలుడగాను
నావుడువిని వీరనాయకులనిరి

(వీరులు బాలచంద్రుని
వారించుట.)

వలదు బాలుడ పిన్నవాడవునీవు
నన్నవుపని గాదు సమరకార్యంబు 50

దళము విస్తారంబు తగదుశౌర్యంబు
పసుచువాడవునీవు పటిమకొంచెంబు
పలనొప్పుశీలము వారికందరికి
సంతానమేలేక సంతోషమెడలి
పండ్రెండువర్షాల పరిమితిగడచె

మాచెర్లచెన్నుని మన్ననవడసి
ఐతాంబనినుగనె అధికమోహమున
సంతతివృద్ధియై జరుగంగనిమ్ము
సమరంబునకునేగు సాహసమేల
మీతలిదండ్రుల మిగులమన్నించి 60

మమ్మాదరించియు మామాటవినుమ
టంచుబల్కినవారి కనియెబాలుండు
కడుతెంపుమీరగ గలకలనవ్వి

(బాలచంద్రుఁడు వీరులకుఁ
బ్రతివచన మిచ్చుట.)

ఈరీతిపల్క మీకిదిధర్మమానె
అసహాయశూరులౌ అయ్యలుమీరు

తనరినయాగంగధారకువచ్చి
అనఘులు మడుగులో అందరుమీరు
స్నానముల్ చేసి ప్రశస్తివహించ
భక్తిలింగంబుల పట్టుకవచ్చి
ధరణిప్రతిష్ఠించి ధైర్యసంపత్తి 70

అన్నంబువెసముట్టి ఆరాజుచేత
విడియముల్ గొన్నట్టి వీరులుమీరు
ప్రథమతాంబూలంబు పట్టితినేను
వీరులునాయకుల్ వేడుకజూచి
శ్రీరణమొనరింతు చెన్నుడుమెచ్చ

ఎంగిలిపోటగు నిప్పుడుమీకు
సురలోకవైభవస్ఫూర్తినాకగును

(బాలచంద్రుఁడు తన పూర్వ
జన్మముల వృత్తాంతము
తెల్పుట.)

బాలుడీతండని పలుకగరాదు
నాపూర్వమంత విన్నపమొనరింతు
వీరనాయకులార విఖ్యాతులార 80

వినుడుచెవులనొగ్గి విశదముగాఁగ
ఉరుతరనగరమయోధ్యబాలించి
చనినట్టియాహరిశ్చంద్రభూపతికి
చంద్రమతికినేను జనియించిమించి

* లోహితాస్యుడనైతి లోకము లెరుగ
నాడు బాలుడగానె నాయకులార
కనకకశిపునకు కాంతులు హెచ్చ
ప్రహ్లాదుడను పేర పరగ పుట్టితిని
చేసితిదుర్ఘట చేష్టలుకొన్ని
అతులమన స్థైర్యమగపరచితిని 90

నాడు బాలుడగానె నాయకులార
యేలెదుశివకంచి యేకామ్రపతికి
చిరుతొండనంబినా చెలగుభక్తునికి
శెంకెలశిరువను సీమంతినికిని
సిరియాళుడనబుట్టి చెన్నొందినాడ
తలిదండ్రులపుడు నిర్దయతమర్దించి
యిష్టభోజనముగానే మీశ్వరునకు
నిన్నియ్యనుంటిమి నీవేమియందు
వనినన్ను ప్రశ్నింప నౌనుగాదనక
సమ్మతించితివారి సత్కారమునకు 100
జీవముతోడనె శివునితోగూడ
కాంచీపురంబున కాపురమున్న
ఏడువాడలవారి కింపుగకొక్కత్త
ఘనపుణ్యావాసంబు కైలాసమునకు
కొనిపోయితిని నేను గురుతరభక్తి

నాడు బాలుడగానె నాయకులార
కిష్కింధనేలెడు కీశాధిపతికి
తారకంగదుడనై ధరబుట్టినాడ
రామచోదితుడనైరావణుకడకు
రాయబారిగనేగి రాక్షసుల్ గ్రమ్మ 110
వారినిఖండించి వడిచూపినాడ
నాడు బాలుడగానె నాయకులార
రఘువంశమునయందు రామచంద్రునకు
కుశుడనైపుట్టితి గురుశూరుడైతి

---

[ * హరిశ్చంద్రపుత్రుడు రోహితుడని

"तस्य ह पुत्रो जज्ञे रोहितो नाम" (ऐ. ब्रा.)

అనేశ్రుతి చెప్పుతున్నది. ఇట్లానే

"......पुत्रो जातस्तु रोहितः" (श्री. भा. न.)

అని శ్రీభాగవతకారుడు.

ఈ కథయొక్క విస్తరం మార్కండేయపురాణంలో కలదు. మార్కండేయ పురాణప్రతుల్లో రోహితాస్యుడని, రోహితాశ్వుడని రెండు పాఠాలు ఉపలబ్ధం. మారనాదులకృతుల లోహితాస్యుడనే పాఠం రలల అభేదాన్ని అనుసరించినది.]

నాడుబాలుడగానె నాయకులార

పాండుభూవరునకు పౌత్రుడనగుచు
అభిమన్యుడను పేర అవనిజన్మించి
వీరధర్మముచూపి వెలసినవాడ
నాడుబాలుడగానె నాయకులార
ఇటువంటిజన్మంబు లెన్నియోకలవు 120

చెప్పశక్యముగాదు చెన్నునియాన
ఒక్కొక్కజన్మమం దొప్పువిక్రమము
శ్రీపురాణంబులు చెప్పుచునుండు
కలియుగంబుననిప్డు కడసారికేను
కుంతాలవారింట కూరిమిమీర

బ్రహ్మనాయునికిని పడతిఐతమకు
బాలునిపేరిట పల్నాటిలోన
జననమొందినవాడ సమరశూరుండ
పేర బాలుడుగాని బిరుదు మగండ
పగవారిగొట్టని బ్రతుకదియేల? 130

తలిదండ్రులను బ్రోవ తనయుండెకర్త
మానంబుదక్షత మగటిమిమించ
ప్రబలింపగలవారు బాలురెసుమ్ము
బాలురెపెద్దలు బల్లిదుల్ వారె
బాలురకే వృద్ధిపరికించిచూడ

పెద్దలుమతిచెడి పిరికిపారుదురు
పాంచభౌతికదేహ పటిమక్షీణించు
మనసుచలించును మాటిమాటికిని
ధైర్యంబుతగ్గు నుత్సాహంబులుడుగు
వయసుమీరినవేళ వచ్చునాబలిమి 140

కీర్తికైనను నపకీర్తికినైన

బాలురపైనుండు భారమంతయును
మైలమకామిని మడియంగజేసి
నాయకురాలిని నయహీనజేసి

పరదళంబులజంపి పంతంబుతీర్తు
పడుదునురణభూమి బవరంబుచేసి
చూచిఆస్వర్గంబు చూరలుగొందు
అనియిట్టులాబాలు డాడినమాట

(బ్రహ్మనాయుడు బాలచంద్రుని
సాహసము వారించుట.)

వినితండ్రులెల్లరు విశ్వాసమునను
గాఢంబుగాగ్రుచ్చి కౌగిటజేర్చి 150

బాదన్నమొదలైన భ్రాతృవర్గంబు
వేరుచింతలుమాని వినుచుండగాను
బాలచంద్రునితోడ బ్రహ్మన్నపలికె
నాఆత్మనందన నాకూర్మిపట్టి
పుట్టినదాదిగ బుధులనుగొల్వ

ఇట్టిధీరత్వంబు నీదిట్టతనము
ఏరీతినీకబ్బె నిదియేమివింత
ఒకబుద్ధిచెప్పెద ఒప్పుగవినుము
ఘోటకంబులుమేటి కుంజరావళులు
కాలిబలంబులు ఘనఖడ్గతతి 160

కుంతంబులునుగండ్ర గొడ్డండ్లుగదలు
ముసలముద్గరములు మొనలకటార్లు
చక్రతోమరములు శార్ఙ్గసంఘంబు
ఛురికలుబాణముల్ శూలచయమ్ము
మొదలైనశస్త్రాస్త్రములనెల్లజూచి

భావంబుచెదరిన పంతముల్ గావు
పలికినరీతిని బవరంబునందు
విక్రమంబుననిల్చు విధమద్భుతంబు
సమరకాలంబున సకలదేవతలు
కనిచిత్తచలనంబు గావించుచుంద్రు 170

గణపతి భైరవుల్ కాళికాదేవి
విఘ్నమ్మొనర్తురు విసురణవేళ
* పార్థుడంతటివాడు ప్రధనరంగమున
కర్ణునిరాకడ గనిభీతినొంది
బ్రతికితే శుభములు పడయంగవచ్చు

అరదంబుమరలింపు మయ్యశ్రీకృష్ణ
అనివిన్నపముచేసె ఆశ్చర్యభంగి
ఇతరులమాటలికేల వచింప
ఆమీదపౌరుష మంతయుంబోవు
అన పల్కు విని బాలు డల్లననవ్వి 180

(బాలచంద్రుఁడు నిజశౌర్యంబు తండ్రికిఁ దెల్పుట.)

తండ్రితోననియెను ధైర్యంబుమీర
పిద్దుచిన్నదికాదె ఛేదించుకొండ
చిన్నమిర్యమునందు చెడునె కార్యంబు
ఘనకపాలము కెక్కు కాకనొందించు
మానకనోరంత మందును లెస్స
కాలుదావాగ్నికి కారడవెదుకి
హనుమానుడేగురు నాఅచాటిపడెలు
వారిధిలంఘించి వడిదాటుగాక
బాలుడుచిల్లర బలముపైబడడు
రాముని తమ్ముని గదిసిమర్దించి 190
తలగోసి తెచ్చును ధైర్యంబెసంగ
అనుచుబాలుడుపల్కు నందరువినగ
తరవాతనాయుడు తనయునిజూచి

(బాలచంద్రుఁడు యుద్ధమునకుఁ బోవుటకు సమ్మతించి బ్రహ్మనాయుఁడతనికి రణధర్మంబుల నుపదేశించుట.)

వినుబాలచంద్రుడ విశదముగాగ
ధరలోననాపేరు దశదిశలందు

* [ఈవాక్యాలు

"जीवन् प्राप्नोति पुरुषः सङ्ख्ये जयपराजयौ ।
मृतस्य तु हृषीकेश भङ्ग एव कुतो जयः ॥
एष कर्णो रणे भाति मध्याह्न इव भास्करः ।
निवर्तय रथं कृष्ण जीवन् भद्राणि पश्यति ॥" (म·क)

అని అర్జునవచనంగా చెప్పబడిన పద్యాలననుసరించినవి.

ఇట్లాంటి అభిప్రాయాన్నే-

"विनाशे बहवो दोषा जीवन्भद्राणि पश्यति ।" (रा·सु)

అని అశోకవనస్థుడైన హనుమంతుడిచేత వాల్మీకి విశదం చేయిస్తాడు.]

ప్రఖ్యాతినొందెను బ్రహ్మనాయుండ
మండలేశులకెల్ల మదితల్లడమయి
చెల్లినమన పేరు చెడిపోవనీకు
పృథ్వీబిరుదముల పెంపునొందింపు
ఘనమైననా పేరు కల్ల చేయకుము 200

ముల్లుచూశౌర్యంబు మొక్కపోనీకు
మిలలోనమనలావు నెన్నలేరెవ్వ
(రాజియనంగ నేమనితలంచెదవు)

(యుద్ధరంగ తత్త్వము.)

శౌర్యంబునకు బాదుస్వర్గంపుద్రోవ
యెల్లసుఖంబుల కిదిపట్టుగొమ్మ
* యిదిముక్తిసోపాన మిదిమూలధనము
(ఆగర్భశూరులకాటప్రదేశ)
మిది దేవవితతుల నెన్ననామేలు
హెచ్చైనవీరుల కిదిపుట్టినిల్లు
(ధర్మసంరక్షణార్థంబయి బుధులు 24/10

కదలకరక్తంబు కార్చెడుచోటు)
పటుకీర్తినొందించు బ్రహ్మాండమందు
ఇదిసమరావని యిదిపుణ్యభూమి
శ్రీకంఠుశిరసంటి చెప్పెదనీకు

(బ్రహ్మనాయుఁడు కుమారునకు
రణనీతి నుపదేశించుట.)

కామనృపాలుండు కల్మిపెంపొంద
సకలభూమీశుల సంగ్రామమునకు
పిలిపింపవచ్చిరి పేర్మినిజాప
ఖండనపటిమచే ప్రబలినవారు
చతురంగబలములు చాలుపచ్చోట
పూర్వంబుమనతోడ పోరాడలేక 20

చిక్కి చెప్పినయట్లు చేయుచునుండి
పగవారిలోచేరి పరతెంచినారు
జడియకనిల్తురు సమరంబునందు
కన్నెకయ్యంబిది కనిపెట్టిపోరు
సలుపంగవలయును సత్కీర్తివచ్చు

తలపడునప్పుడు తలకకుమన్న
అలుగులదీప్తికి అలుకకుమన్న
వారణధ్వనివిని వడకకుమన్న
శరములదీప్తికి జడియకుమన్న
సమరకాలంబున జంకకుమన్న 3(

మొనచెదరణములో మురియకుమన్న
బిరుదులుజారిన బెదరకుమన్న

---

* [ఈతీరుగానే

"इदं वः क्षत्रिया द्वारं स्वर्गायापावृतं महत्,
गच्छध्वं तेन शक्रस्य ब्रह्मणः सहलोकताम्." (म. भी.)

అని భీష్ముడు వీరులకు ఉపదేశిస్తాడు. శాస్త్రధర్మాలసందర్భంలో యుద్ధప్రశంస శుక్రనీత్యాదులందు దృష్టం.]

ఘనఖడ్గహతులకు గతిమాలవలదు
బలములుమట్టిన భంగంబుగాకు
సందడిరణమున శంకనొందకుము

పైకొనినైపుణ్య పటిమచెలంగ
పరదళంబులనొంచి బవరంబుచేయు
కామందురణమున కంపంబునొంద
నరసింగుపైకేగు నాయూర్మిసుతుడ
జయముచేకొనదగు సాహసస్ఫూర్తి 40

అనినీతిగాజెప్పి అపుడు బ్రహ్మన్న
తగినట్టికర్పూర తాంబూలమిచ్చి
శంఖతీర్థమొసంగి జయమొందుమంచు
పంపింపతనతండ్రి బ్రహ్మనాయునికి

(బాలుఁడు యుద్ధరంగమున
కేగుట.)

దండనమస్కృతుల్ తాజేసివెడలె
ఆవేళరణభేరు లధికమైమ్రోసె
ఢక్కాఢమామికల్ * డంగురంబులును
పటహాశంఖంబుల పటుతరధ్వనులు
బహుళమైమిన్నంద బాలచంద్రుండు
సమరభూస్థలినుండి సంతోషమలర 50

సూర్యభైరవులాది సురలకుమ్రొక్కి
దిక్పతులార ఓ దేవతలార
కనుగొనుచుండుడి కదనరంగంబు
చేసెదసమరంబు చిత్తముప్పొంగ

అనివిన్నపముచేసి ఆయుధమంది
ఒరతీసిజళిపించి ఉగ్రుడై నిల్చె
తరువాతనరసింగ ధరణీశ్వరుండు

(నరసింహాభూపతి రణమునకు
వచ్చుట.)

ఘనమైనగజముపై గ్రక్కుననెక్కి
సమరరంగమునకు చనుదెంచువేళ
చొక్కచువ్వలవారు సూరెలవారు 60

నిల్చిరిపదివేలు నిండుశౌర్యమున
బల్లెముల్ పట్టుక బలువైనబంట్లు
గజముముందేగిరి గాఢధైర్యమున
విలుకాండ్రు నాలుగువేలసాహసులు
బాణతూణీరముల్ పరగధరించి

వడితోడరణరంగ వసుధదాొకనిరి
అశ్వమ్ములైదువే లరుదెంచెధాటి
భూరిమాతంగముల్ భూధ్రంబులట్లు
బృంహితధ్వనులతో పెల్లుగనడిచె
కూలశరోద్వృష్టిశోభిల్లుచుండు 70

వీరులువచ్చిరి విచ్చలవిడిని
కడమబలంబులు కాదులెక్కింప
పటువిక్రమస్ఫూర్తి బలమిట్లువెడలె
ధ్వజములు పడిగెలు దట్టమైకదలె
బిరుదుచత్రంబులు పెద్దటెక్కెములు
సాంద్రమైయుండెను జగదీశునెదుట
ప్రబలమైవాద్యంపు పటలిమ్రోయంగ

---

* వీరణము.

పిక్కటిల్లెదిశల భేరీరవంబు
కాహాళల్ బూరలుకనకతప్పెటలు
ధ్వనులచేజనతతి దల్లడపరచ 80

భయదమై చెలగిన పరిపంధిసేన
బాలచంద్రుడుచూచి భ్రాతలుతాను
శుష్కాటవులనగ్ని సుడిసినయట్లు
కోయనియార్చుచు కుప్పించియురికి
బలముపైవ్రాలెను పౌరుషాధికత
కుంతముల్ చేసంది గదలుగాబోడిచి
కత్తులచేతలల్ ఖండించివైచి

(బాలచంద్రుడు భీమంబగు
సంగ్రామం బొనర్చుట.)

మణికట్లదునుమాడి మస్తకవితతి
ధరమీదనొరగంగ దట్టించినరకి
మోచేతులెడచేసి ముక్కలుచెక్కి 90

ఫాలంబులంజింపి ప్రక్కలగోసి
దౌడలూడగనూకి దండముల్ద్రుంచి
కనుగ్రుడ్లుపగులంగ కర్ణముల్వ్రాల
బలుపైనరొమ్ములు పరియలుగాగ
తొడలెల్లతునుకలై తూగాడుచుండ

జానువులూడంగ జంఘలువిరుగ
చీలలుపట్టేది చీకాకునొంద
ఈరీతిగొంత సేపీప్సితమడర
అనుజులతోగూడ నని చేసిపిదప
దంతావళంబుల దట్టంబుచూచి 100
బాలుడుకోపంబు ప్రకటంబుగాగ
కొదమసింహముభంగి కుప్పించియెగిరి

బలిమిమై కుంభముల్ పగులగమోది
తొండముల్ తోకలు తునుకలుసేసి
మావంతులనుగొట్టి మరణమొందించి

పైనున్నదొరలను పడిపోవపొడిచి
దంతముల్ ముక్కలై ధరవ్రాలజిదిమి
చెవులనుకత్తితో చీలికల్ చేసి
పిల్లదంతంబుల బెకలిచివైచి
ఘనపదంబుల దున్మి కంఠముల్ నరికి 110

కొంత నేపిమ్మాడ్కి గురుశౌర్యమలర
సమరంబుగావించి జవనాశ్వవితతి
చక్కాడపైబడి సాహసగరిమ
ఖడ్గకుంతంబులు కరములబట్టి
పైనున్నరాహుత్తపటలిని చంపి
తొడిగినజోడంగి తుక్కుగజేసి
సింగిణివిండ్లను చిదుకలొనర్చి
బాణతూణీరముల్ భగ్నముచేసి
ఖడ్గఖేటకములు ఖండించిమించి
మెడలురెండుగజేసి మేనులుచించి 120

యెదురురొమ్ములలెస్స యీటెలగ్రుచ్చి
కొంకులుతెగగొట్టి ఖురములుచెక్కి
చాలసేపీగతి సమరంబొనర్చ
బలమెల్లనీలాగు భంగంబునొంది
కంఠముల్ దెగిపడ గ్రక్కునసురికి

(నలగామరాజు సైన్యము
కలతనొందుట)

పడితన్నికొనిచచ్చు బలసమూహంబు
మస్తకంబులుపోయి మహిమీదమడిసి

కన్నులు తెరచుచు గంతులు వైచి
ప్రాణముల్విడిచెడు వారునుమరియు
పాదముల్ విరుగగ బవరంబు చేయ 130

పండ్లుగీటుచు నేలపైగూలువారు
కరములుతునిసిన గత్తులువదలి
బాలునిగనివచ్చు భయదోగ్రభటులు
ప్రేవులువెడలిన పెడచేతనెత్తి
కడిమి చేబల్లెంబు గట్టిగాబట్టి
అహామహామికతోడ అరుదెంచగడగి
సంచలింపనిదీర్ఘ సాహసఘనులు
మూల్గుచుచచ్చెదు ముదియోధవరులు
బాలునికనుగొని భయమందిబెగడి
పారిపోయెడుపంద భటసమూహంబు 140

పారిపోవగలేక బ్రతుకుపైనాశ
బ్రతిమాలుచుండెడు బలనిచయంబు
లిటువంటిజగడంబు లెన్నడెరుంగ
మేలాగుపోదు మన్నేడ్చెడువారు
ఆలుబిడ్డలబాసి అన్నంబుకొరకు
వచ్చితిమీనేల వ్రాసెనుమృత్యు
వనిదుఃఖమొందుచు నసురుసురంచు
వేగమెప్రాణముల్ విడిచెడువారు
బహుదినంబులు మేము పాలేరుచేసి
మునికోళ్లలెల్లను ముంజూర్లదోపి 150

పణతులుదిట్టిన పడలేకవచ్చి
చచ్చుచునుంటిమీ సమరరంగమున
పారిపోనిచ్చిన బ్రదుకుదుమయ్య
అనిమ్రొక్కుచుండెడు అతిదీనభటులు
బోయవారము మేము పూర్వంబునందు

బుజములకాయలు పూనికన్గొనుడి
పగవారుమముగని పారిపోవుదురు
మీకేమిభయమని మెలతనాగమ్మ
బాగుగానమ్మించి పంపవచ్చితిమి
జీవముల్ దక్కిన చిన్నలగలిసి 160

బలుసాకుదినియైన బ్రతుకగగలము
మీరుపిల్చినవేళ మేమరుదెంతు
మనియంజలియొనర్చి యవమానమొంది
మగసిరివిడిచిన మానహీనులును
వీలుచిక్కినరణ వీరులవదలి
పోయెడునట్టి దుర్బుద్ధిసంయుక్తులును
చచ్చినవిధమున సమరోర్వియందు
పలుకకయూరక వ్రాలెడువారు
చనలేకభయమున చచ్చినవారి
మీదద్రోసుకయుండి మెదలనివారు 170

చచ్చినగజముల చాటునడాగి
పందతనంబున పడియుండువారు
పెండ్లాలదలచుక బిట్టేడ్చువారు
వల్మీకములమీద వసియించువారు
గడ్డిలోజొరబడి కదలనివారు
వ్రేళ్ళుచీకెడువారు వెన్నిచ్చువారు
(వెండ్రుకల్ విప్పుక విదిలించువారు
నీవారమనిపల్కి నిల్చుండువారు
ఆయుధాల్ పడవైచి యలికెడువారు
పడలేకచతికిలబడి యుండువారు) 180

బవరంబులోగూలి ప్రాణజాలంబు
విడిచియుఖడ్గముల్ విడువనివారు
భయదమైయిబ్బంగి పరికింపరాక
సమరరంగము భయజనకమైయుండె

(బాలచంద్రుఁడు శాత్రవబలంబులఁ
జక్కాడుట.)

కొందరువిలుకాండ్రు గుంపులుగూడి
బహుబాణములుమీఁద బరపెడువేళ
తమ్ములనందర తగనిల్వఁజేసి
పరిఘమొక్కటిచేత పట్టుకతూరి
తనువునబాణముల్ దాకకుండంగ
భ్రమణనైపుణ్యంబు బల్విడిఁజూపి 190
పరతెంచువిశిఖముల్ పాయఁగొట్టుచును
ఖడ్గమాడించుచు గర్జిల్లొనర్చి
అట్టహాసంబున నావిలుకాండ్ర
పైకేగిధనువుల భంగంబుచేసి
శింజినులెల్లను జిదురుపల్ చేసి
తూణముల్ శరములు తుమురుగాఁగొట్టి
చుట్టుపేరెమువారి శూరతమెఱయ
పండతరిగినట్లు వడిమేనులెల్ల
ఖండించియముజేర గ్రక్కుననంపె
చొక్కుచువ్వలవారు శూరతహెచ్చ 200

పంచుకపైకుర్కి వచ్చుటసూచి
బాలుఁడువెసనార్చి పకపకనవ్వి
తమ్ములుతోడు రాదంటయైతోడరి
కప్పించిపైబడి గొడ్డండ్లతోడ
చెరకులునరికిన చెలువుఘటిల్ల
అలుగులనీటెల నన్నింటిదునిమి
శూలంబులంబోడ్చి సురియలగ్రుమ్మి
గండ్రగొడ్డండ్లతో గనెలుగాఁగొట్టి
బాకులరొమ్ములు పరియలుచేసి
గదలచేశిరముల గదునుగ్గొనర్చి



బాధించిపొట్టల పటిమచేజించి
కత్తులమేనుల కండలుదుల్చి
పంపించెజముజూడ బలములనెల్ల
సంగ్రామమీరీతి జరిగినవేళ
పారిరిమిగిలిన బంటులుగూడి
ఆవేళనరసింగు డధికకోపమున

(పారిపోవుచున్న సైన్యమునకు
నరసింహభూపతి ధైర్యవాక్య
ములు చెప్పుట.)

పారెడువారికి బలుకంగసాగె
విరిగిపోవుట యిట్లువీరధర్మంబె
బాలురకనుగొని పరువిడనేల
మిమ్ముగాచినవారి మేలెత్యజింప 20

(బలిమిమీనరములఁ బారురక్తంబు
రాజాన్నవర్ధిత రక్తంబుగాదె
ధూర్తులైనృపునకు ద్రోహంబొనర్చి
నమ్మినరాజును నట్టేటముంచి
పోవుటయేనీతి పుణ్యాత్ములార
తనువులస్థిరములు ధనములుకల్ల
కీర్తియొక్కటి భువిఖిలముగాకుండు
ధైర్యహీనత వీరధర్మంబుమాని
భంగురంబై మలభాండమైనట్టి
దేహంబుకొరకు సత్కీర్తిపోనాడి 30

విరిగిపోయెడునట్టి వెఱ్ఱులుగలరె
వీరసింహములకు వినుతినిగాంచు
సమరరంగంబులే సంచారవనులు
చచ్చినబ్రతికిన సౌఖ్యమచ్చటనె

బుద్ధులుచెడి పాఱిపోవుదురేని
భుక్తిముక్తులు రెండుపోవుదురొలఁగి)
నను బాసిపోవుట న్యాయంబుగాదు
తప్పునామరణంబు తలచెడిపార
మృత్యుదేవతవచ్చి మేనులనిల్చె
బంటుపంతంబులే పారిపోవుటలు 40

పరికింపపెండ్లికి వచ్చుటలేదు
సమరకార్యమునకై చనుదెంచినాము
వచ్చినకార్యంబు వరదలో గలిపి
బంధులుమిత్రులు పగవారునవ్వ
పోవుటనీచతపుట్టదన్నంబు

పోవద్దురాజాన పోయితిరేని
అనియిట్లుపల్కిన ఆబలుంబెల్ల
పారిపోవకరోష భరితమై నిల్చె
బాలచంద్రుండంత భ్రాతలగూడి

(నలగామరాజు సైన్యంబు బాల
చంద్రునిపైఁ గవయుట.)

అట్టహాసముచేసె అరిసేనలపుడు 50
జడిసిగుండెలు ప్రీల చలనంబునొంది
ధైర్యంబువహియించి దర్పముల్మీర
కదలుచక్రంబులు గండ్రగొడ్డండ్లు
పెద్దవిసురియలు భిండివాలములు
బల్లెముల్ కుంతముల్ పరుశూలచయము
కొనికరంబుల తీవ్రకోపులై వచ్చి
మిడుతలుమంటపై మిడిసిపడ్డట్లు
బాలునిదాకిరి భయదూరులగుచు
విక్రమాటోపత వెలసిబాలుండు

జలధిలోమందర శైలంబుతిరిగి 60
కలకనొందించిన కైవడిమీఱి
కాలాగ్నిలోకముల్ కాలిచినట్లు
దవవహ్ని విపినంబు దారొక్కన్నభంగి
మనుజులలోమారి మరిగినరీతి
శత్రుసైన్యంబుపై చయ్యనగదిసి
వారుప్రయోగించు వరశస్త్రవితతి
బహువిధంబులద్రుంచె భంగముగాగ
ఒకబంటునొకకాలు నొయ్యనబట్టి
యొకబంటుతోడవట్టి హుంకరించుచును
ఇద్దర ముగ్గుర నేకకాలమున 70

కుంతంబులంజిమ్మి కూలజేయుచును
బాణంబులంగ్రుచ్చి పట్టియెత్తుచును
కత్తులతోతలల్ గట్టిగానరకి
వ్రయ్యలైతనువులు వసుధపైబడగ
కటిదేశములయందు కత్తులువేయ
తునకలైభూస్థలి దొరగుచునుండె
కుంతంబులెడ గ్రుమ్మికూల్చెడువేళ
నెత్తురుభూమిపై నిండుగపారె
ఎదురులేక సమర మీగతిచెల్ల
కనుగొనినరసింగు కంపంబుగదుర 80

తలయూచిశ్రీహరి దలచినెమ్మదిని
వ్రేలిడిముక్కుపై వెరగందియుండి

(బాలుఁడు శత్రుసైన్యంబులఁ జాప
కట్టుగఁ గూల్చుట.)

ఇతడుబాలుండని యేలాగుపలుక
శూరతదళముల సుడివడగొట్టె

ఇతనితో పోరుటకేదినాబలము
గ్రక్కునమాయన్న కడకేగుదెంతు
అనిభయంబుననేగె అవనీశ్వరుండు
తరువాతబాలుడు తనరోషవహ్ని
అధికమైజ్వలియింప ఆపగలేక
చిత్రంబుగాగూల్చె సేనలనెల్ల 90

కొందరఖండించి కొందరదరిమి
గుదిగ్రుచ్చెగొందరగూల్చె కొందరను
సంగరమీరీతి జరుగుటకతన
ఖండనరంగంబు బయలగుచుండె
మదగజవ్యూహంబు మావంతులపుడు
తివిరిధీరతతోడ దీకొల్పియార్చి
దట్టంపుశరవర్ష ధారలుగురియ
బాలచంద్రుడు కోపభరముతో అపుడు
అనుజులతోగూడి అధికవేగమున
కదిసిఖండించెను గజసమూహమును 100

తునుమాడిదంతముల్ తుండెముల్ చేసి
కూలంబులంగ్రుమ్మి సురియలబొడిచి
పట్టెసంబులగొట్టి బాకులమొత్తి
గదలచేకుంభముల్ ఘాతలుచేసి
చరణముల్ తెగిపడ శాతఖడ్గముల
కొట్టినకూలెను కొండలరీతి
వినువీథిదేవతల్ వేడుకచూచి
ఆశ్చర్యమొందిరి హర్షంబులెసగ

(బాలచంద్రుఁడు నరసింహుని తల యనుకొని వేరొకని తలఁగోసి తండ్రియొద్దకుఁ గొంపోవుట.)

ఘనమంగనొకవెల్ల గజముపైనెక్కి
నేర్పుమైయొకడుండ నిర్భయుండగుచు 110
అనుజులనందర నటబుచ్చివచ్చి
కొదమసింహముమాడ్కి కుంభిపైదుమికి
పక్షమున్బాకున వడితోడబొడువ
వాలంబునకువెళ్లి వచ్చెనుతిరిగి
కదగిగుంజగ నెత్తుకాలువలయ్యె
ఖండించిమదగజ ఘనమస్తకంబు
కూల్చెనుభూమిపై కొండచందమున
పైనరుడెవ్వడో భావింపలేక
నరసింగుపీడనినమ్మి చిత్తమున
తమకంబుచేవాని తలతెగగోసి 120

తనచేతబట్టుక తమతండ్రికడకు
బాలుడువిచ్చేసె ప్రజ్వరిల్లుచును
సమరరంగముచూడ చక్కగనుండె
ఘనమైననెత్తురు కాల్వలైనిలిచె
తెగిపడ్డగజములు దీవులైయొప్పె
నరకినతురగముల్ నక్రంబులాయె
పొర్లాడుశిరములు బుద్బుదపటలి
(టెక్కెముల్ గొడుగులు డిండీరవితతి)
కలిగినపుచ్ఛముల్ కచ్ఛపరాజి
మేటినేత్రంబులు మీనవారంబు 130

దీర్ఘశిరోజముల్ తీరైననాచు
మెదడునుమాంసంబు మించినబురద
తరచైనయీటెలు దర్వీకరాళి
పొడియైనభూషణ పుంజంబులెల్ల
సైకతనిచయంబు సరవివర్ణింప
ఇటువంటిరణరంగ మీక్షించికొనుచు
చనుదెంచిసోపాన సంయుక్తమైన

మేడమీదికినెక్కి మేటివిక్రముడు
బాలుడాశిరమును బ్రహ్మకర్పించె
నాయకావలిజూచి నాయుడిట్లనియె 140

చెలువైననరసింగు శిరమిదికాదు
రహివెంపుశిరమాట గ్రహియింపలేక
చనుదెంచెనేమయ్యె జగదీశుతమ్ము
డైనట్టినరసింహు డన్నదగ్గరకు
తరలెనుబలముల తాదెత్తునంచు

తెలియలేవైతివి ధీరాగ్రగణ్య
అనిపల్కగాబాలు డాగ్రహమంది
వీరులకెల్లను వినతిగావించి
కడువేగమునవచ్చి కలిసెశమ్మలను

(ఇరుపక్షములవారు సంకుల
సమరంబొనర్చుట.)

అటమున్నెనరసింహు డధికబలమ్ము 150
తెచ్చుకమొనచేసె ధీరతనెదుట
మదగజంబులపైకి మత్తసింహంబు
లరుదెంచువిధమున ఆశ్చర్యలీల
పౌజుపైనడచిరి బాలురార్వురును
వసుధేశుతమ్ముడు వారలజూచి

తనవారికెల్లను తాసైగజేసె
క్రమ్మిరివిలుకాండ్రు ఘనులపైనపుడు
బాలుడుమొదలైన బాలవీరులను
నారులవిండ్లను నలినలిచేసి
తొనలునుబాణముల్ తునుకలుచేసి 160

వెరవకయుండిరి వీరులపైకి
కదిసిమూకలువచ్చి కదనమధ్యమున
సాంద్రవంశాటవి చందముదోప
క్రమ్మిరిసాధ్వస కరముగనపుడు
తలకకవారలు ధైర్యంబునొంది
చేగదల్ త్రిప్పుచు చెలగిఆర్చుచును
కొక్కెరగుంపుపై కుప్పించియురికి
సాళ్వంబుడీకొన్న చందముగాగ
కరులపైసింహంబు కదిసినరీతి
వ్యాఘ్రంబుగోవుల వడిదాకినట్లు 170

సేనలపైకేగి చెండాడిమరియు
చెక్కులముక్కుల చేతులమెడల
కన్నులవెన్నుల గడ్డాలతలల
ఘనమైనకత్తుల ఖండించిమించి
కుంతములంబొడ్చి కూలంగత్రోసి
చక్రసంఘముచేత చక్కగాజేసి
రెదురెవ్వరునులేక యీతీరుసల్ప
చాపకట్టుగగూలె సకలబలంబు
అంతకంతకుయుద్ధ మగ్గలంబాయె
అప్పుడుబాలుడా యనుజులకనియె 180

దళముపైబోకుడి దట్టించిమీరు
కామేశుతమ్ముని కనుగొనివత్తు
అనుచునతడుబోయె నడుగుచురిపుల

(బాలచంద్ర నరసింహభూపతుల
ద్వంద్వయుద్ధము.)

అనుగుభూపతిపుత్రుడా నరసింహు
డెక్కడనున్నవా డేడిరావాడు
బాలచంద్రుడువచ్చు పటిమవీక్షించి
ధాకకుభయపడి డాగెనోలేక

పందతనంబున సారెనో చెప్ప
దనివిచారించుచు అపుడుబాలుండు
గజముపైసింగంబు గమకించురీతి 190

పర్వతమ్మునబిడ్డ పడ్డట్లుగాను
తగగంతుగొనె కాము తమ్మునిమీద
చుట్టున్నవారలు శూరతనపుడు
ఘనపరాక్రమముచే కదియంగజూచి
గరిమబ్రహ్మానపట్టు ఘనకుంతమునకు
ప్రతివచ్చు * సామంత రాగోలపట్టి
కటియందుగట్టిగ కానెబిగించి
ఆంజనేయునిభంగి అటచౌకళించి
కిలకిలనార్చుచు కేరళవిభుని
పొడిచిత్రోసెనువేగ భూమిపైబడగ 200

కర్ణాటభూమీశు కలనిలోజంపె
మాళవమహినేలు మనుజేశుశిరము
చిదిమినట్లుగద్రుంచె చిత్రంబుగాగ
బర్బరధరణీశు బాహులనరికి
సమవర్తికడకంపె శౌర్యంబువెలయ
కరిపైనినుండిన ఘనునరసింగు
పైబడెసాహస పాటవమొప్ప
దంతినికవియించె ధరణీశ్వరుండు
బాలచంద్రుడు కోపభరముతో పిదప
తండ్రినిబోలిన తనయుండుగాన 26/10

కడుఉన్నతంబైన కరిపైకివడిగ
నుప్పించిదుమికి ఆకుపలయేశ్వరుని
బుజమునపొడిచెను భూమీశుడలిగి
ఐతాంబపుత్త్రుని అసిధారగొట్టె
తప్పించికొనియంత ధరణీశునేసె
నరసింగరాజును నాయునిసుతుడు
కర్ణుండువిజయుండు కలహించినట్లు
వృత్రుడునింద్రుండు పెనగినభంగి
రామరావణులు పోరాడినరీతి
హెచ్చియుద్ధముచేసి రిరువురుజాము 20

విక్రమస్ఫూర్తిమై వెలయబాలుండు
కామునితమ్ముడు కదిసియావేళ
అంకుశంబునపొడ్చె అదిబాలచంద్రు
ఛేదింపబైటికి ప్రేవులువెడలె
బాలచంద్రుడురోష పాటవమెసగ
సామంతరాగోల చక్కగబట్టి
వక్షఃస్థలంబున వడితోడగ్రుచ్చె
గాడివీపునవెళ్ళె గ్రక్కున అలుగు
మొగలిపూభంగిని మొనచందమమర
అప్పుడు నరసింహు డాత్మనిశ్చలత 30

మాచెర్లచెన్నుని మదిలోనదలచి
అనుగుభూతలనాథు నాత్మలోనెంచి
శీలమ్మనాయుని చింతించిపొగడె
ఊర్ధ్వమార్గంబుల నొయ్యననెక్కి
బ్రహ్మరంధ్రంబున ప్రాణంబులేగె
కుంభికుంభముమీద కూలెనారాజు

(బాలచంద్రుఁడు నరసింహభూపతి
తలగోసికొని తండ్రియొద్దకేగుట)

కనిబాలచంద్రుడు కడుదుఃఖమొంది
వలగొనిముమ్మారు భక్తితోమ్రొక్కి
అనుగుభూవరపుత్ర అంగజగాత్ర
ఉర్వీశతనయ అయోధ్యనివాస 40

* 1 ఆయుధ విశేషము.

మానదుర్యోధన మైలమ్మసుతుడ
ఓతండ్రినరసింహ ఓరాజవిభుడ
అపరాధిగాను నే నపకారిగాను
పాపమించుకలేదు పట్టపురాజ
మిమ్ముగట్టంద్రాళ్లు మీరెతెచ్చితిరి
మీ పాలిమృత్యువు మెలతనాగమ్మ
అలరాజుజంపిన అపగదీర్ప
పట్టిచంపితిగాని పాపంబెరుంగ
అనిఖేద మొందుచు ఆయత్తపడుచు
కత్తితో తలగోసి కరములబట్టి 50
అనుజులతోనిట్టు లప్పుడువచించె
నరసింగుతలనిత్తు నరనాథునెదుట
ఇచ్చోటనిల్వుడి యెచటికిపోక
అనిచెప్పితమ్ముల నచ్చటనిలిపి
ఒకచేత ప్రేవుల నొయ్యనఎత్తి
సామంతరాగోల చంకనబెట్టి
తనతండ్రి తావుకు తలగొనిపోయి

(నరసింహుని శిరస్సునుకనుఁగొని
నాయకులు విలపించుట.)

సోపానముల మేడ చులకగనెక్కి
నాయుండుగనిలేచి నయముకన్పట్ట
రసింగువచ్చెను నాయకులార 60
యెదురుకొందమటంచు నేతెంచిభక్తి
నరసింగుశిరమును నమ్రతగొనియె
తపనీయపీఠిపై తలయుంచిమంచి

గంధముకస్తూరి కలయంగఁలది
తగటుపచ్చడముపై తలయుంచిపిదప
కొలువెల్లమ్రొక్కిరి కోపంబులణచి
బ్రహ్మన్నయుంచు మ్రొక్కి వాక్రుచ్చెనిట్లు
బావలజూచితే ప్రాణంబువిడిచి
మరదులజూచితే మరణంబునొంది
తమ్ములజూచితే దైవముగలసి 70

ఘనదేవభవనముల్ కట్టించినట్టి
ధర్మసేనుండు మీతండ్రిపాదముల
కడకేగమీకిట్లు కారణమాయె
* అనుచుశోకమునొందె అనఘుడుబ్రహ్మ
విలపించు ఆతని విధమువీక్షించి
తనమదిఖేదంబు తాబట్టలేక
నరసింగుశిరమును నయముగబట్టి
కన్నులఅశ్రువుల్ గడ్డానజార
ప్రబలశోకముపొందె బాదన్నరాతు
తండ్రిచచ్చినవెన్క దంటయేకూర్మి 80

ఉండమిక్కొన్నినా ళ్లుర్వీశతనయ
వెగటుమృత్యువుమన వెంబడిబడియె
చెన్నుడుకులమును చెల్లించెనేటి
కనిబాదరాహుత్తు డడలెచింతించి
కొమ్మరాజుపగచె కొలువెల్లనడలె
సుంకర్లువగచిరి శూరులేడిచిరి
గండువారలవంత ఘనమయియుండె
కమ్మవారందరు కడుచింతపడిరి

---

* [రావణమృతిప్రకరణంలోని
"शोकवेगपरीतात्मा विललाप विभीषणः"
"मरणान्तानि वैराणि"
అనే రామాయణోక్తులు ఇట్లాటిసందర్భాన్నే తెలుపుతున్నవి.]

(బ్రహ్మనాయుఁడు బాలచంద్రుని
కృత్యంబులఁ దెగడుట.)

నాయఁడా తరిమూర్తి నందరుఁజూచి
రమ్మనినిను పిల్వ రాజంపలేదు 90
వచ్చియూరకయున్న వాఁడవు కావు
చూరకొంటివి సేన శూరుఁడవగుచు
చెల్లెబోసీవిట్లు చేసిన క్రమము
విభునకు సేనకు విధివైతివకట

(బాలచంద్రుఁడు బ్రహ్మనాయుని
కపటకార్యంబుల నెన్నుట.)

అనిపల్కవినిబాలుఁ డతులరౌద్రమున
పలికెనందరువిన బ్రహ్మన్నతోడ
వెడవెడయేడ్పులు వేగచాలింపు
కొల్వులోమామామకొమ్మభూపతికి
అలరాజుపగకయి అప్పగించితివి
నీస్వభావంబింక నేవివరింతు 100

పోగొట్టితివికోడి పోరునభూమి
నినునమ్మివచ్చిన నీమేనమరది
ప్రాణంబుకొన్నట్టి పాపాత్ముకుడవు
చెలఁవుచూడగబంప చెవులరాయనను
చండకర్ముడవయి చంపించితీవు
ఘనువేంకజోదును కలనికిబంపి
మందలోఁచంపితి మాయయొనర్చి
యింటువంటినీచేష్టలెన్ని వర్ణింతు
అనినమాటలు బ్రహ్మ కలఁగులైతోచి
బాలచంద్రునికనె ప్రకటముగాగ 110

వెన్నిచ్చివచ్చితి వివతులకీవు
వెన్నిచ్చివచ్చెదు వీరుడగాను
సుమ్మనిపల్కిన శూరవాక్యములు
విదితమైతోచెను వీరులకిప్పు

(బాలచంద్రుఁడుమగిడిరణంబునకేగి
అనుజులతోఁగలనిలోనొరగుట.)

దనబాలచంద్రుడ హంకారగరిమ
తెంపుచేకలనికి తిరిగిధైర్యమున
రయముగనేతెంచి రణములోనిలిచె
అప్పటిరణకర్మ మలవియేపొగడ
వాణీశుడైనను వర్ణింపలేడు
కమ్మరకాచన్న కడుశౌర్యఘనుఁడు 120

కాంతకించీతనపాలి కామాక్షిదలచి
పరదళంబులమీద వ్రాలిఖండించి
కడసారిమృతినొంది కలనిలోగూలె
శత్రుసైన్యమునకు సమవర్తియైన
మంగలకులమల్లు మహితవిక్రముడు
తురగసంఘంబును తునుకలుచేసి
కదనంబులోబడి కాలునిజేరె
కోరాడుచుండిన కుమ్మరపట్టె
విశ్రుతంబుగజాత వేదుసిబోలి
పరదళవిపినంబు భస్మంబుచేసి 130

గురుదేవతలమది గూర్చిప్రార్థించి
హతశేషభటులచే అనిలోనమ్రొగ్గె
చాకలచందన్న సాహసాఢ్యుండు
పాతాళగంగను భావమందుంచి
ప్రకటధైర్యవిలయ పవనునిచేత
దుష్టశత్రువులను తూలికలట్లు
ఆకాశపథమున కరుగంగజేసి
బవరంబులోవ్రాలి ప్రాణముల్విడిచె
సమరంబులోజొచ్చి చలనంబులేక
బాలునిఅనుజుడ బాహుబలుండ 140

అనిచెప్పికొంచు బిట్టదరిరోషమున
పేరైనదళముల పెల్లుగబొడిచి
గడలమూకలజొచ్చి ఖండముల్ చేసి
బల్లెపువారిని భంగంబొనర్చి
తురగాలిపైకేగి తుమురుగాగొట్టి

మదదంతిచయముల మరణమొందించి
తరచుగాయంబుల తాళగలేక
మాచెర్లచెన్నుని మదిలోదలంచి
వెలమలదోర్బ్నడు విడిచెప్రాణంబు
తమ్ములపాటంత తప్పకచూచి 150

బాలుడురోషంబు పట్టగలేక
చండవిక్రమమున సాహసంబెసగ
వ్రేలాడుప్రేవులు వేగమెపెరికి
గంగధారంగల్పి కలనికివచ్చి
తమ్ములదలచుక తావిలపించి

మిముబాసియుండుట మేరయెనాకు
నాదురాకడమది నమ్ముడిమీర
లనిచాటిచెప్పుచు ఆయుద్ధభూమి
నిర్భయవృత్తిచే నిలిచెబాలుండు
కనుగొనిపరసేన కడుభీతినొంది 160

మృత్యువుతరుముక మీదికివచ్చె
ఎట్లుజీవించెద మీతనియెదుట
అనిపారిపోయెడు నాసేనజూచి
పోవద్దుభటులార పుణ్యకాలంబు
చనుదెంచెదేవేంద్ర సభకేగవలెను

మీరెల్లనిలువుడి మేలిమిగనుడి
అనిపల్కవారలో నధికవిక్రములు
చొక్కచువ్వలవారు శూరులైమించి
వచ్చుటగనుగొని వడిమీరనెదిరి
ప్రబలయుద్ధముచేసి బాలచంద్రుండు 170

చాపకట్టుగగూల్చె సకలసైన్యంబు
ఆసమయంబున అతులసాహసులు
కుంతంబులంబూని కోయనియార్చి
గదలువంచుకవచ్చి కదిసిరిబాలు
వెనుకద్దువేయక విక్రమాధికత

అలుగులపైవ్రాలె ఐతాంబసుతుడు
గ్రుచ్చిపట్టిరియెత్తి గురుశౌర్యఘనుని
వేంచేసిదివియందు వీరులగలసె
అంతటభాస్కరు డస్తాద్రికేగ
సాంద్రమైచీకట్లు జగమునగ్రమ్మె 180

జంగమస్థావర సకలవస్తువులు
కాటుకపట్టిన కైవడినొప్పె
సత్యంబుగా చరాచరమైనజగము
విష్ణుమయంబన్న వేదవాక్యంబు
నిశ్చయంబాయెను నీలిమనంది

శివుడేడి కైలాసశిఖరంబునేది
సోముడువృషభంబు సురనదియేడ
యెక్కడికేగెనో యెరుగరాదంచు
సంశయస్వాంతయై శైలజవెదకె
ఇభముఖుగాక యింద్రుడువెదకె 190

వాణిని వెదకెను వనజాసనుండు
తెలియకయీరీతి దేవతలెల్ల
చెలగిరి విభ్రాంతచిత్తులై అపుడు
అతులముదంబున ఆసమయమున

(యుద్ధరంగమున పిశాచగణములు
స్వేచ్ఛావిహారములు సల్పుట.)

ఘన భూత భేతాళ గణములుగూడి
సమరరంగముఁజూచి సంభ్రమమంది
తగవిచారించిరి తమమానసముల
ఎక్కడియుద్ధంబిదేమిచోద్యంబొ
యింత కాలంబయ్యె నెరుగమెయహహ
అని వెరగందుచు నాశ్చర్యపడుచు 200

కలనుగాచుకయున్న కాళినిజూచి
మీదయ చేతనే మేముతనియగ
అధికభోజనమాంస మబ్బెనుమాకు
అని మ్రొక్కి తేన్చుచు ఔత్సుక్యమడర
బాలుడుమనపాలి పరమేశ్వరుండు
చేయుంగ ఆతడిట్లు సిద్ధించెమనకు
అనికొందరాడినా రానందగరిమ
నాయకురాలైన నాగమ్మనుండి
మనకాంక్షతీరెను మాటలకేమి
అనికొందరాడిరి హర్షంబుమీర 27/10

నిబ్బంగి మెచ్చుచు నింతులుతమరు

*చల్లులాడుచురక్త సాగరమందు
మునుగుచునీదుచు మూకలుగట్టి
జలకమాడిబెదరి చౌకళింపుచును
కుప్పించిదుముకుచు గొబ్బునమునిగి
దూరాన దేలుచు దూగివచ్చుచును
మదమెక్కి సోలుచు మరి స్రుక్కిపడుచు
ఎవ్వరురామీద నెక్కినవారు
దిగిరారతులువ మర్దించెద నిన్ను
అనివెక్కిరించుచు హాస్యమొనర్చి 20

భటకళేబరములు పట్టుకవచ్చి
చచ్చినగజముల సాధించినిల్పి
కదనమాడుమటంచు కత్తులబొడిచి
పడియున్నగజముల పైనిగూర్చుండి
అంకుశంబులతోడ నదలించువారు

వాజిశవంబుల వడిమీరనెక్కి
చబుకులగొట్టుచు చనుమనువారు
గజములవాజుల కాలిమానుసుల
పట్టుకవచ్చి ఆపాథోధియందు
ఘనమైన సేతువు కట్టుదమంచు 30

---

* [యుద్ధరంగపు రక్తాదులందలి సక్తిని రాక్షసికి రాక్షసుడికి ఈతీరుగానే

"अरे रुधिरप्रिय, ईदृशोऽपिनाम हतनरगजतुरङ्गमशोणितवसासमुद्रदुःसञ्चरे समरे परिभ्रंस्त्वं पिपासितोऽसीत्याश्चर्यमाश्चर्यम् ॥" (वे.) (छा.)

"रुधिरप्रिय, गृहाणैतद्धस्तिशिरःकपालसञ्चितमग्रमांसोपदंशम् । पिब शोणितासवम् ॥" (वे.) (छा.)

అని మొదలైనమాటలతో భట్టనారాయణుడు తననాటకంలో ప్రవేశకంలో కన
రుస్తాడు.]

సంతోషమొందెడుశాకినీగణము
గుండెలునములుచు గుంపులుగూడి
పెల్లుగపాడెడు పెద్దఢాకినులు
ఎదురుమాకెవ్వారలీయుద్ధభూమి
మిగిలినదళముల మీరిమర్దింప

క్రొత్తునెత్తురుమాకు కూడునటంచు
బొబ్బలువెట్టుచు బొందుగల్ దినుచ
హుంకారమండెడు హాకినీచయము
దిక్కులనంతట తేజంబుహెచ్చ
మిణుగురుల్ రాల్చుచుమింటికిజనుచు

కూడిపర్వులువెట్టు కౌరవిదయ్యములు
పోరిపోరి ఆయుద్ధభూతలమందు
విహరించియీగతి వేడుకకొలది
తమనెలవులుచేర తామేగిరపుడు
సకలజనంబులు సంతసమంత
భానుండుపూర్వాద్రి పైకేగుదెంచె
ఘనుడైనశ్రీనాథ కవిరాజరాజు
చెన్నునికృపచేత చిత్తముప్పొంగి
బాలునివిక్రమప్రావీణ్యమెల్ల
జయులకువివరించె సక్తితోదీని 50

పాటించి చదివిన వ్రాసినవినిన
బంధులు పుత్రులు పౌత్రులు హెచ్చ
(సకలశుభంబులు సమకూరుచుండు)
శ్రీయుఁ ఆయుస్సును స్థిరముగాగలుగు. 54

# బాలచంద్రయుద్ధము

## సమాప్తము.



# ద్వితీయభూమికయందలి సంజ్ఞావాచకాదుల అనుక్రమణిక.

---

అ.



ఆ.

ఇ.



ఈ.



ఉ.



ఊ.



ఋ.



ఐ.



ఓ.



క.

ఖ.



గ.

ప.



బ.

## య.

ర.



ల.



వ.

శ.



ష.



స.

హ.





## ॥ द्वितीयभूमिकास्थसंज्ञावाचकादीनामनुक्रमणिका ॥

# INDEX

OF

## Importnnt words in the Second Preface.



C

# శుద్ధిపత్రం.



| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 2 | 42 | 43 |
| 2 | 1 | ఇక | హీనం |
| 25 | 1 | చూచి | చూచిన |
| 30 | 12 | ఒకటిగను | ఒకటిగసుకను |
| 37 | 4 | వాఙ్మయాశాఖ | వాఙ్మయశాఖ |
| 50 | 10 | నికృష్టదాస్యం | నికృష్టదాస్య |
| 50 | 14 | సయితంప్రతిని | సయితం |
| 55 | 12 | पण | पण्य |
| 56 | 16 | कृणवाहै | कृणवावहै |
| 57 | 4 | ल | लम् |
| 58 | 5 | रुद्ध | रुद्धां |
| 59 | 12 | भण्ड | भङ्ग |
| 88 | 25 | ఇల్లాటి | ఇట్లాటి |
| 77 | 17 | యిట్లా ఈతీరున | ఈతీరున |
| 60మూలం | 25 | చతుర్థాద్యాయములో | హీనం |

# శ్రీ ఉమాకాన్తవిద్యాశేఖరులవారి కృతులు



| | | రూ. | అ. |
|---|---|---|---|
| | **సాహిత్యం.** | | |
| 1 | భాషాకావ్యప్రకాశం, ముద్రితమవుతున్నది | | |
| 2 | రఘువంశం, వృత్తిసహితం ,, | | |
| 3 | నేటికాలపుకవిత్వం | 2 | 8 |
| 4 | చన్ద్రాలోకవివరణం | 0 | 8 |
| 5 | రూపకభాష్యం | | |
| 6 | రసమీమాంస | | |
| | **ధర్మశాస్త్రం.** | | |
| 7 | తెలుగుదేశమందలి చండాలురు | 0 | 8 |
| | **వ్యాకరణశాస్త్రం.** | | |
| 8 | సంస్కృత వ్యాకరణప్రదీపం (కారకంవరకు) | 0 | 8 |
| 9 | పాణినీయం సాంధ్రవివరణం 9 సంచికలసంపుటం గట్టిబైండు | 3 | 8 |
| 10 | వ్యాకరణసిద్ధాన్తభాష్యం | | |
| 11 | భాషావ్యాకరణం వృత్తిసహితం | | |
| | **ఛందస్సు** | | |
| 12 | భాషాచ్ఛందః, సాంధ్రవృత్తి | | |
| 13 | కారెంపూడి సాహిత్యమహాసభోపన్యాసం (యతిస్థానం వళిప్రాసావశ్యకతాఖండనం) | 0 | 8 |
| | తెలుగుపద్యం | 0 | 8 |
| | **విమర్శలు.** | | |
| 14 | నైషధతత్త్వజిజ్ఞాస | 0 | 8 |
| 15 | శ్రీరామాయణ మహాభారత విమర్శవిచారణ | 0 | 8 |

| | | |
|---|---|---|
| 16 విష్ణుచిత్తీయసభ, వరూధినీ ప్రవరాఖ్యుల రతిపరామర్శం | 0 | 8 |
| 17 గజడదబల గసడదవల విచారణ, ఆంధ్రజాతికి రాష్ట్రభాష హిందీ భాషగాదు, స్మరణాలు | 0 | 8 |
| 18 శాసనాలు, మనుచరిత్ర రేవణ | 0 | 8 |

కథలు, చరిత్రలు, నవలలు.

| | | |
|---|---|---|
| 19 పల్నాటివీరచరిత్ర, శ్రీనాథకృతి సభూమికం, సలఘుటీకం ఫెదర్వెయిటు | 3 | 8 |
| ,, సాధారణకాగితం | 2 | 8 |
| 20 అరవదేశమండలి ఆంధ్రవాఙ్మయం | 0 | 8 |
| 21 శ్రుతిరంజని | 0 | 8 |
| 22 Foreign connection of Buddha | 1 | 0 |
| 23 పల్నాటివీరులకథలు | 0 | 8 |
| 24 షేక్స్పియరు నాటకకథలు | 1 | 8 |
| 25 త్రిలింగ చిన్నకథలు | 0 | 8 |
| 26 టిప్పుసుల్తాన్ | 1 | 4 |

తర్కశాస్త్రం.

| | | |
|---|---|---|
| న్యాయదర్శనం - శ్రీలక్ష్మణరాయకృతి (ప్రథమాధ్యాయం) | 1 | 8 |
| వైశేషికదర్శనం - శ్రీ మేడేపల్లి వెంకటరమణాచార్యకృతి (ప్రథమాధ్యాయం) | 1 | 8 |

మేనేజరు:—వాఙ్మయసమితి,

గుత్తికొండ, పిడుగురాళ్లపోస్టు, గుంటూరుజిల్లా.

మొదటసారి ముద్రితమైన

## పలాటివీరచరిత్రనుగురించి:—

గవర్నమెంటు తెలుగు ట్రాన్స్లేటరు శ్రీగోటేటి కనకరాజుపంతులుగారు,
బి. ఏ., బి. ఎల్., చెన్నపురి. (61-9-11)

ఆంధ్రమున విమర్శకగ్రంథములు లేవు. శ్రీనాథుని కవితావిశేషముం గూర్చి మీరు వ్రాసిన పీఠికలోని భాగమునుబట్టి యీ మహాకవినిగూర్చి విపుల విమర్శనమును వ్రాయుటకు మీరు తగినవారని తోఁచుచున్నది. పండితజనాదరణీయమగు విమర్శకు మీపీఠిక దారిచూపుచున్నది.

మైసూరుమహారాజుగారి సర్వకళాశాలయందు హిస్టరీప్రొఫెసర్
శ్రీ క. రామలింగారెడ్డిగారు, ఎం. ఏ., (M. A. Cantab)
మైసూరు, (29-10-11).

వీరరసభరితంబును, బామరులకు సయితము సులభవేద్యమును, అత్యంతరసవంతంబును, అనన్యసామాన్య మహాద్భుత స్వభావ వర్ణనాచమత్కృతియుతంబును, రసికులకుఁ జరిత్రకారులకు సమానాదరణీయమును అయిన యీ కావ్యంబు యెల్లరకుఁ దెల్లమగుట మీకరుణాతిశయంబునను, బాండిత్య ప్రభావంబునం గాన మీరెల్లభంగుల వందనీయులును, గృతార్థులును అయితిరనుటకు సందేహింపఁ బనిలేదు. నాకుంజూడ భావనాశక్తిని, రసపోషణమున నీ వీరచరిత్రంబు భారత తుల్యంబని తోఁచెడిని. ఎంతకాదన్నను నైషధమను చరిత్రాదికావ్యంబులకన్న నుత్కృష్టంబ.

ప్రెసిడెన్సీకాలేజి తెలుఁగుపండితులు
శ్రీవావిలికొలను సుబ్బారావు పంతులుగారు, చెన్నపురి.

మీ పల్నాటివీరచరిత్రమును వందనములతో నందుకొంటిని. నామమాత్రావశిష్టముగ నెంచఁబడిన దీనినిఁ బ్రచురించి ఆంధ్రభాషకు నిజమైన సేవచేసితిరి. ఉపోద్ఘాతముకూడ నమూల్యమైనది.

మనోరమా పత్రికాధిపతులు శ్రీచిలకమర్తి లక్ష్మీనరసింహం
పంతులుగారు, రాజమహేంద్రవరం.

దీనిని సంపాదించి మీరు తెనుఁగుదేశమున కుపకారము చేసినారు. ఇందుకు మేమందఱము మీకు వందనములఁ జేయుచున్నాము. మీపీఠిక మిక్కిలి హృదయరంజకముగ నున్నది.

ప్రెసిడెన్సీ మేజస్ట్రేటు.
శ్రీజయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. యల్., చెన్నపురి.

ఆంధ్రవాఙ్మయము నభివృద్ధిచేయుటయందకాక, జాతీయ శౌర్య పరాక్రమముల శాశ్వతస్థాయులఁ జేయుటయందుఁగూడ నీగ్రంథ మమూల్యమైనదిగ నున్నది. దీనిని బ్రచురించి మీరు దేశోపకారము సల్పియున్నారు.

బందరులో ప్రకటించబడే మాసపత్రిక "ఆంధ్రభారతి":—

ఇదివఱకు వెలువడినగ్రంథములవలననే శ్రీనాథునికీర్తి యాంధ్ర కవితాప్రపంచమున నగ్రస్థానము వహించియున్నది. కాని, యిట్టి యీ కీర్తినిఁ బల్నాటివీరచరిత్రము ద్విగుణీకృతముచేయుచు స్థిరస్థాయినిఁ జేసినదనుటకు సందియము లేదు. ఇది శ్రీనాథునిగ్రంథములలోఁ గట్టకడపటిదియగుటచే రసపోషణమునందును, స్వాభావికవర్ణనములందును, భావగాంభీర్యమునందును మిన్నయై సత్కవులకును మార్గద్యోతకముగ నున్నది.

ఉత్తరార్కాడుజిల్లాలోని చిత్తూరునందు ప్రకటితమవుతుండిన పత్రిక "దివ్యజ్ఞానదీపిక."

ఈగ్రంథరాజము వీరరసప్రధానమై, పండిత పామరజనరంజకముగ ద్రాక్షాపాకమున వ్రాయఁబడినది. ఈగ్రంథమునందలి పదసౌష్ఠవము, అర్థగాంభీర్యము, రసపుష్టి చదివి యానందింపవలెనుగాని చెప్పనఁవీలుకాదు. తేట తెలుఁగు మాటలఁ దేనెలొలుక వ్రాయఁబడినది. లోక సామాన్యములగు నుపమలచే ముద్దులు గుల్కుచున్నది.

---

# పాణినీయం (అష్టాధ్యాయి) సాంధ్ర వివరణం.

మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రులుగారు, విజయనగరం:—తమరు పంపిన యాంధ్రవివరణోపేతమైన పాణినీయము యొక్క మాదిరిపత్రములు చూచితిని. తమయుద్యమము మిగుల శ్లాఘనీయము. ఆన్ధ్రభాషాభిజ్ఞు లెల్లరకును బాణినీయవిషయకజ్ఞానమును జేకొనుట కియ్యది సులభోపాయము........."

డాక్టరు కె. రామానుజాచార్యులుగారు, ఎం. ఏ., బి. యల్.,
ప్రిన్సిపాల్ మహారాజావారి కాలేజి, విజయనగరం.

"ఆన్ధ్రవివరణోపేత పాణినీయముయొక్క మొదటి సంచికను జూచితిని. మీయుత్సాహ ప్రయత్నములు మిగుల స్తవనీయములు."

వేరి కాశీనాథశాస్త్రులుగారు, వ్యాకరణాధ్యాపకులు, మహారాజావారి సంస్కృతకళాశాల, విజయనగరం.

"परिश्रमं हि भवतो दृष्ट्वा मोमोद्मि सांप्रतम्" ॥

పురుషుల్ల రామశాస్త్రులుగారు, కొవ్వూరు సంస్కృత విద్యాశాల యందలి వ్యాకరణాధ్యాపకులు:—

పాణినీయసూత్రములకుఁ దెలుగర్థము వ్రాయుచున్నారు. ఇది సకల జనోపయోగముగను విద్వజ్జనమనోహరముగను నున్నది.......
................ ఉమాకాన్తనామమును మీ తలిదండ్రు లుంచిరి. ఆనామమును దమరు సార్థకమును జేసితిరి. తమయుద్యమము నెరవేరఁ గలదు.

> यो वेदप्रथिताखिलाक्षरसमाम्नायैकमूलो बृह-
> त्सूत्रस्कन्धनिरूढवार्तिकवचश्शाखोपशाखान्वितः ।
> गोनर्दीयवचःप्रसूनभरितो वाक्साधुताधीफल-
> स्सोयं व्याकरणामरक्षितिरुहस्सद्भिस्सदा सेव्यताम् ॥

మీజన్మ మిక్కిలి సార్థకమైనది. నాకీపని చాల మంచిది అని తోఁచినది. మహాభాష్యార్థమును వ్రాయుచున్న తమరు సర్వసమర్థులని యూహించుచున్నాను......మీరు విరమింపక యీపని నెరవేర్పఁగలరని నేను దలంచుచున్నాను.

> "तज्ञाप्रगडसम्भूतसूर्यनारायणाश्रयः ।
> चकास्ति गोष्पदक्षेत्रे रामसूरि र्हरिं स्मरन्" ॥

మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, ప్రధాన సంస్కృత పండితులు మహారాజావారి కళాశాల, విజయనగరం:—"తాము దయతోఁ బంపిన సాంధ్రవివరణపాణినీయము నిన్నటిదినమందే నాకుఁ జేరినది. ఆ మూలాగ్రముగఁ జదివితిని. చిరకాలమునుండి యిట్టిగ్రంథము ఆంధ్రభాషలో లేకుండుటవలనఁ గలిగినలోప మిన్నాళ్లకుఁ బూర్తి యయినదని నాకు మిక్కిలి ఆనందము కలిగినది."

సుదర్శిని:—ఇంతకాలమునకు చూడవలసిన దానిని చూచితిమి. ఈమాత్రము కీలకము కనిపెట్టి యొక్కరైన నాంధ్రలోకమున కీమాత్రపు టుపకారము చేయఁజాలరైరి,........ఆంధ్రుల యుదాసీనత సర్వంకషమైనదని యనుభవపూర్వకముగా నెరిగియుండుటచే నీసదుద్యమము కొనసాగవలెనుగదా యనుజంకు మనసున బాధించుటచే "మాట దక్కనై యున్న"దని కొనయుంచి వ్రాయవలసివచ్చినది. ఈ సత్కార్యము కడవరకు నెరవేరినచో నిఁక భాషాకాంతకు ఇటీవల సంప్రాప్తమయిన మహాకష్టవ్రణబాధ చాలవరకు నివారణము కాఁగలదని నమ్ముచున్నాము. శబ్దముయొక్క స్వరూపమెట్టిదో కడ్డాయమును దెలియక యెవరికిఁ దోఁచినట్లు వారు అపశబ్దశస్త్రములను బ్రయోగించుచు భాషాకాంత దేహమును గాఢముగ వ్రణపఱచుచుండు నీకాలమున నిది యాంధ్ర గీర్వాణభాషాజిజ్ఞాసువులకు మహాజ్యోతివలె నంధకారమును బోకార్చఁగలదు. అవసరస్థులకు దీనిని విలువ యింతింతని చెప్పఁజాలము. కావున బడిలో చదువుకొన్న రెండుమూఁడు తెలుఁగు పొత్తములతోడనే పండితులమయితిమని సంతసించి బొల్లిపొత్తములు వ్రాయు కవితాభిలాషులందఱు నంతతోడనే తృప్తిపడి పరిహాసపాత్రులు గాక యీ సంచికలను దెప్పించుకొని చక్కఁగఁ జదువుకొని భాషాస్వరూపమును దెలిసికొందురు గాక."

పాలవూడి నరసింహశాస్త్రులుగారు పండితులు, బోర్డు హైస్కూలు, బళ్లారిజిల్లా, హరపనహల్లి:—

"ఇయ్యుద్యమము బహుశ్రమవ్యయసాధ్యమై యపారమహోదధి తరణప్రాయమై యున్నందు కావంతయు సందియము లేదు. పూర్వ ముమాకాంతునిచేతనే సనకాదులకు చతుర్దశసూత్రరూపమున నను గ్రహింపఁబడియె. ఇప్పుడును నయ్యుమాకాంతులగు మీచేతనే యస్మదాదులకుం దదనుబద్ధమగునట్టి యష్టాధ్యాయియొక్క యాంధ్ర వివరణరూపమై ప్రసాదింపఁ బడుచున్నది. చూడఁగా నిది యనితర సాధ్యమనుట యొకయరుదా?

దొడ్ల వెంకటరామరెడ్డిగారు, కావలి:—

"మీవివరణము గురుజనానపేక్షముఁ జేయుచున్నది. ఈ మీ యుద్యమంబునఁ జేసి యాంధ్రభాషాభిజ్ఞులు పాణినీయంబున సులభముగా నిపుణత్వమును సంపాదింతురు. సంస్కృతము జీవభాష యగు కాలము వచ్చినది కాఁబోలు. సంస్కృతముమాట యటుండనిండు. ఆంధ్రంబునకును సంస్కృతభాషాజ్ఞానము అత్యంతావశ్యకము గాన ఈ మీయుద్యమము తెలుఁగుభాషకును మిక్కిలి మేలొనరించునదిగా నున్నది. భగవదనుగ్రహంబునను, భాషాభిమానుల ప్రోత్సాహంబునను మీ ప్రయత్నము నిర్విఘ్నముగా నెఱవేఱుఁ గాక. వ్యయప్రయాసములఁగాని లభింపని యీ శాస్త్రజ్ఞానమును, జనసామాన్యమునకుఁ గొంగుబసిఁడిగా జేయుచున్న మీకు ఆంధ్రులెల్లరుఁ గృతజ్ఞతాబద్ధులగుదురు గాక."

స్వధర్మప్రకాశికా ప్రవర్తకులు, కనుపర్తి మార్కండేయశర్మగారు, గుంటూరు:—

सन्तुष्यामस्तमां वयममुना श्रीमतां समुत्साहेन नूनं नास्तीदृशम् ॥

రాజమహేన్ద్రవరం గవర్నమెంటు కళాశాలయందలి ఉభయ భాషాపండితులు, కల్లూరు వేంకటరామశాస్త్రులుగారు:—

"स्वस्त्यङ्गिराजुवंश, श्रीमदुमाकान्तकृतिमणीकृतये ।
पेशलरचनागतये, भोभूयात्पाणिनीयमतनिधये ॥ १

यन्माहेश्वरसूत्राण्याधारीकृत्य पाणिनिश्शाब्दम् ।
शास्त्रं चक्रे तदुमाकान्तोपज्ञं हि पाणिनीयमभूत् ॥ २

वैयाकरणबुधाः के चिज्जाग्रत्येव भारतीभाजः ।
वाचंयमत्वमेते, सेवन्ते स्वोपकारमात्रपराः ॥ ३

लोकोपकारकृदुमाकान्तो यत्पाणिनीयमान्ध्रयति ।
तत् ख्यातिमुमाकान्तोपज्ञत्वेनान्ध्रपाणिनीयमियात् ॥ ४

आकरतस्सारांशः, प्रदीपसन्दीप्तविवरणाग्रसरः ।
क्रोडीकृत्याम्बुनिधेस्सुधेव मथितादहो ! समग्रांहि ॥ ५

प्राज्ञाकान्तो रत्नाकरसारांशं रसं बुधेभ्योऽदात् ।
अद्योमाकान्तार्यस्सरसाकरसारसर्पयत्यूहे ॥ ६

गीर्वाणपाणिनीयमिवान्ध्रीकृतपाणिनीयमेतदपि ।
यदुमाकान्तोपज्ञं, तज्जीयाद्यावदिन्दुतारार्कम्" ॥ ७

"नासूया कर्तव्ये"ति "पङ्क्ति" सूत्रस्थभाष्यमास्थाय ।
स्वच्छन्दः कल्लूय न्वयवेङ्कटरामशास्त्रिणाऽदायि" ॥ ८

---

## FOREIGN CONNECTION OF BUDDHA



Prof. Dr. Richard Schmidt, Munster, Germany, April 6th, 1925:—

"………Interesting paper on Foreign Connection of

Buddha." श्रीरस्तु तत्रभवतो महापण्डितस्य

* * * *

Dr. A. Moffat, M.A.B.S.C.L.L.D., F.R.S.E., Madras, December 27th, 1924.

"It is a very interesting paper."

* * * *

Mrs. D B. Spooner, Agra, 14-2-25 & 28-2-25:—

"Through the kindness of Dr. Modi of Bombay, I have a copy of your valuable lecture. I am so amazed that conformation coming from such a source as yourself should have succeeded to my late husband's (Dr. Spooner's of the Archaelogical Department, Delhi) views……………It would have gratified him beyond measure. Only it came one day too late. Influenza had carried him off the day before. I now write to ask if there are more copies of this address "Foreign Connection of Buddha" available… I should be most grateful if you would send me at least 25 copies……Dr. Spooner was convinced that Buddha was of Magian Origin…………And now the Archaelogical finds at Harappa are surprising and the Summarian remains so clearly proven by Prof. Sayce link up the Babylonian, Assyrian and Persian evidence so clearly shown with Pataliputra…………I am now sending copies of your paper to the learned Sanskritists of Paris and London by this week's mail."

**Kashmir Times, Srinagar, Kashmir 12—1—1937**

"The Literary evidence concerning Buddha's foreign connections has been admirably mentioned. The author believes that the downfall of India began with the rise of Buddha. It is a scholarly treatise which should be seriously read as the idea expressed is apt to raise controversy but whatever has been said has been substantiated with quotations from authorities."

BETTY HEIMANN, Professor, School of Oriental Studies, London :—

5th July 1938.

...."Interesting article of Foreign connection of Buddha. There are many doubts for me too acording to the Buddha-legend about Buddha's Rājāship. In my book, Indian and Western Philosophy,...and in my former German written books I hinted to that problem. And especially the fact of the decay of Buddhism in former centuries in India and its finding room in other cuntries out side India is still for me a problem not yet dssolved."



# సంస్కృతగ్రంథములు.

## వేదాంతగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| శివగీతా, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 1 | 0 |
| శంకరవిజయము, సవ్యాఖ్యానము | ... | 2 | 8 |
| వివేకచూడామణి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 1 | 0 |
| హఠయోగప్రదీపిక, సాంధ్రతాత్పర్యము | ... | 3 | 0 |
| ద్వాదశోపనిషత్తులు, తెనుఁగువచనము | ... | 3 | 8 |
| షడుపనిషద్భాష్యమ్, ఆనందగిరిటీకాసహిత శ్రీశాంకరభాష్యేణ, విశిష్టాద్వైతభాష్యేణ చ సంయోజితాః | ... | 8 | 0 |
| తైత్తిరీయోపనిషద్భాష్యము (సంస్కృతము) | ... | 2 | 8 |
| బృహదారణ్యకోపనిషత్తు, భాష్యము | ... | 8 | 0 |

## కావ్యములు.

| | | | |
|---|---|---|---|
| కుమారసంభవము, సవ్యాఖ్యానము | ... | 1 | 0 |
| ,, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 1 | 12 |
| కాదంబరి, చక్కనిప్రతి | ... | 1 | 8 |
| గీతగోవిందము, (అష్టపది) సటీక | ... | 2 | 0 |
| దశకుమారచరిత్రము, చక్కనికూర్పు | ... | 1 | 0 |
| నైషధము, సవ్యాఖ్యానము, 6 సర్గలు | ... | 1 | 4 |
| భర్తృహరిసుభాషితము, తాత్పర్యము | ... | 1 | 4 |
| ,, వ్యాఖ్యానప్రతిపదాంధ్ర టీకాపద్యతాత్పర్యసహితము | | 3 | 8 |
| భారవి, సవ్యాఖ్యానము, 9 సర్గలు | ... | 1 | 0 |
| భారవి, ఆంధ్రటీకాతాత్పర్యవ్యాఖ్యానసహితము, 3 సర్గలు | | 2 | 8 |
| భోజచరిత్ర, ఆంధ్రటీకాతాత్పర్యము | ... | 1 | 8 |
| మేఘసందేశము, సవ్యాఖ్యానము | ... | 0 | 8 |
| ,, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 1 | 0 |
| మాఘము, సవ్యాఖ్యానము, 6 సర్గలు | ... | 1 | 4 |
| ,, 3 సర్గలు, సమాసతాత్పర్యసంస్కృతాంధ్రవ్యాఖ్యాన సహితము | ... | 2 | 8 |
| రఘువంశము, 10 సర్గలు, సవ్యాఖ్యానము | ... | 1 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| రఘువంశము, ప్రథమసర్గటీకాతాత్పర్యము, పాతప్రతి | | 1 | 8 |
| విక్రమార్కచరిత్రము, సటీక | ... | 1 | 4 |

### నాటకములు.

| | | | |
|---|---|---|---|
| ఉత్తరరామచరిత్రము, సవ్యాఖ్యానము | ... | 1 | 8 |
| వేణీసంహారము ,, | ... | 1 | 8 |
| శాకుంతలనాటకము ,, | ... | 2 | 8 |

### చంపూగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| భారతచంపు, సవ్యాఖ్యానము | ... | 3 | 0 |
| రామాయణచంపు ,, | ... | 3 | 8 |
| విశ్వగుణాదర్శము, మేలుప్రతి | ... | 1 | 8 |

### వ్యాకరణము, అలంకారములు.

| | | | |
|---|---|---|---|
| అభినయదర్పణము, సాంధ్రతాత్పర్యము | ... | 1 | 4 |
| అథర్వణకారికావళి, టీకాతాత్పర్యము | ... | 1 | 8 |
| ఆంధ్రీకృతన్యాయదర్శనము, ప్రథమభాగము | ... | 1 | 4 |
| చంద్రాలోకము, సటీక | ... | 0 | 12 |
| తర్కసంగ్రహము, సవ్యాఖ్యానము | ... | 1 | 4 |
| ప్రతాపరుద్రీయము ,, | ... | 2 | 4 |
| లఘుకౌముది, సటిప్పణము | ... | 1 | 0 |
| ఆంధ్రీకృతలఘుసిద్ధాంతకౌముది | ... | 3 | 0 |
| న్యాయకుసుమాంజలి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 3 | 0 |

### స్తోత్రములు.

| | | | |
|---|---|---|---|
| కృష్ణకర్ణామృతము, సాంధ్రతాత్పర్యము | ... | 2 | 0 |
| శ్రీకృష్ణలీలాతరంగిణి, సటీక | ... | 2 | 0 |
| రామకర్ణామృతము, సాంధ్రపద్యతాత్పర్యము | ... | 2 | 0 |
| లక్ష్మీస్తోత్రరత్నత్రయము, సాంధ్రటీకాతాత్పర్యము | ... | 1 | 0 |
| శివానందలహరి, ఆంధ్రటీకాతాత్పర్యము | ... | 1 | 0 |

### సహస్రనామములు నామావళీసహితము.

| | | | |
|---|---|---|---|
| శ్రీలలితాసహస్రనామస్తోత్రము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | | 3 | 4 |
| శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము ,, | ... | 2 | 8 |
| సహస్రనామకదంబము, నామావళీసహి | ... | 1 | 0 |